# ఘంటారావం

## (THE HUNCHBACK OF NOTRE DAME)


మూలం:

విక్టర్ హ్యూగో

Victor Hugo

అనువాదం:

సూరంపూడి సీతారామ్



ఆంధ్ర గ్రంథమాల,

మదరాసు-1

# ఘంటారావం

**1482** జనవరి 6 వ తేదీ. ఆనాడు ప్రభాతవేళ పారిస్ నగర వాసులు నగరం నలుమూలలనుండీ వినవచ్చిన దేవాలయ ఘంటారవానికి మేలుకొన్నారు. అరుణోదయ సమయానికే నగరం కోలాహలంతో సంచలితమయింది. అయితే ఈ కోలాహలానికి చరిత్రకెక్కిన హేతు వేదీలేదు. తిరుగుబాటూ జరగలేదు. దాడీ జరగలేదు. ఫ్లాండర్స్ నించి రాయబారులు వచ్చినది రెండు రోజులక్రిందట. ఫ్రెంచి రాజకుమారునికి ఫ్లాండర్స్ రాకుమార్తెతో వివాహం ఏర్పాటు చేయడానికొచ్చారు రాయబారులు. మహారాజుముఖంచూసి, ఫ్లాండర్స్ రాజవంశం పట్లగల జుగుప్సను లోలోపలే అణచుకొని, బోర్బోన్ కార్డినల్ రాయబారులకు హోరుమని వర్షంకురిసేసమయంలో విందుచేశాడు. కాని నేటి కోలాహలానికి ఆ రాయబారం కారణంకాదు.

పారిస్‌నగరవాసులకు ఈరోజున రెండువిధాల పండుగ: క్రీస్తుదేవుడు అవతరించిన శుభవార్త మేజై దివ్యజ్ఞానులకు తెలియవచ్చినది జనవరి 6 వ తేదీని. రెండోది బికారుల పండుగ. బికారులందరూ చేరి 'మూర్ఖాగ్రేసరుడు' ఒకణ్ణి ఎంచుకుని ఉత్సవం జరుపుకుంటారు. ఈరోజున గ్రీవ్ మైదానంలో బాణసంచా కాలుస్తారు. న్యాయస్థానప్రాంగణంలో నాటక మొకటి ప్రదర్శిస్తారు.

ఉదయమే ఇళ్లు, అంగళ్లు మూసి నగరవాసులు వీధులలో సంచరించ నారంభించారు. గ్రీవ్ మైదానం, న్యాయస్థాన ప్రాంగణం కిటకిటలాడుతున్నాయి. నాటకానికి ఫ్లాండర్స్ రాయబారుల్ని ఆహ్వానించారని తెలియవచ్చింది. అక్కడే మూర్ఖాగ్రేసరుని ఎన్నిక కూడా జరుగుతుంది. అందువల్ల ప్రజలు ఎక్కువగా అక్కడే మూగుతున్నారు.

న్యాయస్థానభవనంలో ఒక పెద్ద సభామందిరం ఉంది. ఇంత పెద్దమందిరం ప్రపంచంలో మరెక్కడా లేదని ప్రతీతి. అయినా ఈరోజున ఆమందిరం ప్రవేశించడం అతికష్టం. మేడలపై కిటికీలలోనుంచి చూసేవారికి అక్కడి జనసమూహం, ఒక మహా సాగరంలా కనపడుతుంది. అయిదారు విశాల మార్గాలగుండా వచ్చి చేరేజనాన్ని చూస్తే, అయిదారు సజీవనదులు మహాసాగరంలో కలుస్తున్నట్లనిపిస్తుంది. ఎప్పటికప్పుడు కొత్తగా వచ్చిపడుతున్న జనప్రవాహంతో సాగరం కల్లోలితమై తరంగాలు జనించినట్లు జన సమూహాలు కదలాడుతున్నాయి. ఈ సాగరతరంగాలు స్తంభాల నొరసికొని కుడ్యాలను తాకి, సోపానాలను చుట్టి ఉబుకుతు న్నాయి. పురాతన శిల్ప ప్రాభవాన్ని ఎల్లెడలా ప్రదర్శిస్తున్న సభామందిరం మధ్యభాగంలోకల సోపానపంక్తులనుండి సరస్సు లోని కురికే జలపాతాలవలె జనం దిగుతున్నారు. ఆ విశాల మందిరంలో ఉద్భవిస్తున్న జనఘోష అపారం. మధ్యమధ్య ప్రభుత్వసైనికులు జనసందోహాన్ని అరికట్టడానికి వృధా యత్నాలు చేస్తున్నారు.

ప్రతి గవాక్షం, ప్రతి ద్వారం, ప్రతి అవకాశం, మిద్దెలు, ఇళ్లకప్పులు అన్నీ జనంతో నిండిఉన్నాయి. పైనుండి అందరూ విభ్రాంతులై ప్రజాసమూహాన్ని గమనిస్తున్నారు. కన్నులు చెదరి పోతున్నాయి. చెవులకు ఒకే ఒక్క ఘోష తప్ప మరేమీ విన రావడంలేదు.

సభామందిరమంతటా బ్రహ్మాండమైన ఏడు స్తంభా లున్నాయి. నాలుగు స్తంభాలకు చుట్టూ తళతళ మెరిసే ఆభర ణాలతో నిండిన అంగళ్ళున్నాయి. మూడు స్తంభాలవద్ద అరిగి పోయిన బల్లలూ కుర్చీలూ వున్నాయి. గోడల పైన ఆదినుంచి నేటివరకూ ఫ్రాన్సుదేశాన్ని పరిపాలించిన మహారాజుల చిత్రాలూ శిల్పాలూ అలంకరించబడి ఉన్నాయి. కిటికీల తలుపులు ఊర్ధ్వ గవాక్ష ఫలకాలు అనేక వర్ణాలలో మెరిసిపోతున్నాయి. మందిర కుడ్యాలు, చిత్రాలు, స్తంభాలు అన్నీ స్వర్ణనీల వర్ణాలలో మేళ వించబడినాయి.

ఆనాడు విభ్రాంతి కలిగించిన ఈ మహామందిరం నేడు (రచ యిత జీవితకాలానికి, అనగా 19 వ శతాబ్దానికి) లేదు. 1618 లో

ఇది దగ్ధమైపోయింది. ఇందుకు కారణం నాలుగో హెన్రీ హత్య. ఆ హత్య జరిగివుండకపోతే, హత్యా నేరవిచారణకు సంబంధించిన పత్రాలు ఈ మందిరంలో పదిలపరచవలసిన అవసరం లేకపోయేది. అవి ఇక్కడే పదిలపరిచినందువల్ల ఆ పత్రాలను నాశనం చేయ గోరినవారు 1618 లో మందిరాన్ని అగ్నికాహుతి చేశారు. "అడుగు వెడల్పు, అడుగున్నర పొడవూ కల ఒక అగ్నిశిఖ ఆకాశాన్ని చీల్చుకొని వచ్చిపడింద"ని, అందువల్ల మందిరం దగ్ధమైపోయిందని కొందరంటారు. ఏమైతేనేం, ఇప్పుడు ఆ మందిరం లేదు. తిరిగి దాన్ని పునరుద్ధరించడానికి అనేక యత్నాలు జరిగాయి. కాని పూర్వశోభను ఎవరూ పునరుద్ధరించలేకపోయారు. మందిరంతోపాటు చరిత్ర ఘట్టాలను జ్ఞప్తికి తెచ్చే అనేక శిల్పాలు, వేదికలు ఇప్పుడు లుప్తమైపోయినాయి.

చతురశ్రాకారం కల ఈ మందిరంలో ఒక చివర పెద్ద పాలరాతితిన్నె ఉంది. ఇది ఏకశిలాఖండం. మరొక చివరగోడ నానుకుని ఎత్తున కట్టిన ఒక పెద్దవేదిక ఉంది. ఈ వేదికకు వెనుక చిన్నద్వారం. ఈ ద్వారంగుండానే అతిథులువచ్చి వేదిక నలంకరిస్తారు.

పాలరాతి తిన్నెపై నాటకప్రదర్శనం జరుగుతుంది. తిన్నె వెనుకభాగంలో చెక్కలతో కట్టి పరదాలతో కప్పి చిన్నగది ఒకటి తయారుచేశారు. ఎత్తైన ముందుభాగం రంగస్థలం. గదిలోనుంచి రంగస్థలానికి రాకపోకలుమాత్రం బహిరంగమే. మధ్య నిచ్చెన వెయ్యబడి ఉంది.

పన్నెండుగంటలకుగాని నాటకం ప్రారంభం కాదు. రాయబారులరాక ఆలస్యమౌతుంది. అందువల్ల జాప్యం జరుగుతుంది.

మందిరంలో చేరిన వేలాది ప్రజలు ఉదయంనుంచి వేచి వున్నారు. కొందరు తెల్లవారకముందే చలిలో గజగజలాడుతూ వచ్చి మందిర ప్రాంగణంలో కాచుకున్నారు. క్షణక్షణానికీ సమూహం పెరుగుతూనేవుంది; జరుగుతున్న జాప్యానికి ప్రజల విసుగుదల హెచ్చుతూవుంది. సహనం తగ్గి తగవు లెక్కువ కాసాగినాయి. అల్లరి పెరుగుతూ వుంది. మధ్యమధ్య అందరూ పొలికేకలు పెడుతున్నారు. ఫ్లాండర్స్ రాయబారులపట్ల దూషణతిరస్కారాలు

వినరాసాగినాయి. మధ్యమధ్య నడయాడుతున్న విద్యావంతులు నిరసనతో నవ్వుతున్నారు. సామాన్యజనం మొరటుహాస్యాలకు దిగుతున్నారు. ఒకడు ఒక కిటికీనెక్కి గాజుతలుపు బద్దలుకొట్టి సుఖాసనం ఏర్పరచుకున్నాడు. అతడిని చూసి మరికొందరు కిటికీలనెక్కారు. కిటికీల నెక్కినవారు ఇటు మందిరంలోనివారితోనూ, అటు ప్రాంగణంలో నిలిచిపోయినవారితోనూ నవ్వుతూ పేలుతూ సంభాషణ సాగిస్తున్నారు.

"ఓహో నువ్వప్పుడొచ్చావోయ్! కాళ్ళు ఎక్కడానించావ్?"

"అబ్బ! నాలుగు గంటలనించి నిలబడుతున్నానిక్కడ. నా పాదాలు దేనిమీద ఆనుకున్నాయో నా కిప్పుడు తెలియడం లేదు."

"కిందటి తడవ నాటకం మీరు చూశారా? అందులో పాటలెంత చక్కగా ఉన్నాయి!"

"అవునవును. రాజుగారు డబ్బు సంచులు దిమ్మరించారు."

"అవును. డబ్బు దిమ్మరించ కేంచేస్తారు? మన సొమ్ము..."

"దైవప్రార్థనకోసం వేలు గుమ్మరించలేదా?"

"వేలు గుమ్మరించకపోతే రాజుగారి ఆరోగ్యం ఎల్లా కాపాడ్డం?"

పకాలున కొందరు పరగబడి నవ్వారు.

ఇలాగ ప్రసంగాలు సాగుతున్నాయి. ఇంతలో అతికాయుడైన ఒకడు ముఖమల్ దుస్తులు ధరించి తచ్చాడుతూ కనపడగానే కొందరు చేతులెత్తి చూపుతూ గలిచేశారు. అతడు తప్పించుకుని గుంపులో కలిసిపోయాడు.

"అబ్బబ్బ! చదువుకున్నవాళ్లుకూడా అందరితో సమానంగా పేలిపోతున్నారే."

"ఓ హో హో" అంటూ జనం పగలబడ్డారు.

తిన్నెవద్ద బాండ్ మోగింది.

"ఎవరో"

"పుస్తకాలమ్మే వాళ్లు"

"వీళ్ళ పుస్తకాలు తగలబెట్ట"

"నోరుముయ్యండి"

"ఛప్"

కోలాహలం మితిమీరుతోంది.

"ఇవాళకూడా ఈ మంత్రాలేనా?"

"మన పండగరోజునికూడా వీళ్ళ గొడవేమిటి—తన్ని తగి లెయ్యక."

"బల్లలన్నీ పోగుచేసి చలిమంట పెట్టాలి"

"పిదపకాలం వొచ్చింది"

"అడుగో ఫాదరీ"

"రాత్రి ఎన్ని బుడ్లు ఖాళీచేశాడో"

"జూదంలో ఎంత కడిగేసుకున్నాడో."

"ఫిరంగులు పుట్టాయి. ఇంకా లోకమేమిటి! అంతానికే వొచ్చింది."

గడియారం పన్నెండు కొట్టింది. అంతటా నిశ్శబ్దం ఆవ రించింది.

అందరి తలలూ సింహద్వారంవైపు తిరిగాయి. తరవాత అతిథులవేదికవైపు చూశారు. అక్కడ ద్వారం మూసేవుంది. వేదిక నిర్జనంగానే ఉంది. రంగస్థలంకూడా ఖాళీగా ఉంది. ఇంక ప్రజ లకు ఓర్పు నశించింది. "నాటకం! నాటకం!" అని కేకలు వేయ నారంభించారు.

"సిపాయిని తన్నండి ముందు" అన్నారు కొందరు.

"అవును. పట్టుకోండి. ముందు కాపలావారల పని పట్టిం చండి."

ఘోష మిన్ను ముట్టింది. కాపలాదార్లు ప్రాణభయంతో గోడలమూల నక్కారు.

ఇంతలో రంగస్థలంవద్ద చలనం కలిగింది. తెర తొలగించు కుని ఒకడు రంగస్థలంమీదికి వచ్చి నిలబడ్డాడు. మళ్ళీ మందిరంలో నిశ్శబ్దం ఆవరించింది. రంగస్థలంపైన నిలిచిన పురుషుడు గజగజ వణుకుతూ వొంగివొంగి ప్రేక్షకులను అభివాదం చేశాడు. ముఖానికి తగని పెద్దగడ్డం, గడ్డం మూసివేయగా మిగిలిన ముఖంలో

ఎర్రనిరంగూ, జూపిటర్ వేషం చూసేసరికి ప్రజలు ప్రశాంతు లైనారు. సిపాయిల ప్రాణాలు దక్కాయి.

## 2

వేషం చూడగానే తృప్తిచెందిన జనానికి అతడి మాటలు వినే సరికి తిరిగి ఆవేశం పుట్టింది. "రాయబారులు రాగానే నాటకం ప్రారంభమాతుంది" అని అతడు ప్రకటించాడు.

"వీల్లేదు. వెంటనే మొదలెట్టాలి" అని కేకలు చెలరేగాయి.

"జుపిటర్‌ని దిగలాగండి. తన్నండి" అని కేకలు వేశారు. జుపిటర్ వేషధారి భయంవల్ల తడబడ్డాడు. ఏమి చెప్పాలో తోచ లేదు. నాటకం ప్రారంభించకపోతే ప్రజలు చీరేస్తారు; ప్రారం భిస్తే కార్డినల్ క్షమించడు.

ఇంతలో ఒకడు రంగస్థలాన్ని సమీపించి వేషధారిని పిలిచాడు.

"జూపిటర్ నాటకం మొదలెట్టు. కార్డినల్ కోపగించ కుండా నేను చూస్తాను. భయంలేదు. జనం కోరిక మన్నించి మొదలుపెట్టు" అని బిగ్గరగా చెప్పాడు. వేషధారి ఒక్క నిశ్వాసం విడిచి "అయితే నాటకం ప్రారంభమాతుంది" అని ప్రకటిం చాడు. వెంటనే మందిరమంతటా చప్పట్లు మారుమ్రోగాయి. వేషధారి పరదాలోకి తప్పుకున్నాడు.

ముందుకువచ్చిన పురుషుడు తిన్నెకింద నిలబడి జనాన్ని కలయచూశాడు. ముందు బల్లలవద్ద కూర్చున్నవారు అతనివంక చూసి ఏదో మాట్లాడుతున్నారు. అది గమనించి అతడు మెల్లిగా వారిని సమీపించాడు. ఇద్దరు స్త్రీలు మాట్లాడుతున్నారు.

"ఈ నాటకం కథేమిటో."

"జూపిటర్ వేషం వొచ్చిందిగా, ఏదో గ్రీక్ దేవతలకి సంబంధించిన కథ కాబోలు."

"నిరుడు వేసిన నాటకం బాగుంది."

అతడు ధైర్యంచేసి మాట కలిపాడు "ఇది కూడా బాగుం టుంది."

"నిజంగా?" •

"అవునండి. ఇదో కొత్తరకం నాటకం. బలేగా ఉంటుంది"

"ఇందులో ప్రేమపాట లుంటాయా?"

"అబ్బే! అలాటిది కాదు. ఇది నీతి బోధిస్తుంది."

"ఇంతే!"

"అయితేం! బాగుంటుంది. ఇది నేనే రచించాను"

"ఆ!" ఇద్దరు స్త్రీలూ ఒక్కసారి అన్నారు ఆశ్చర్యంతో.

కవీశ్వరుడు వెన్ను విరుచుకుని ఒక్కసారి చూశాడు.

"మీ పేరు?"

"పీర్ గ్రింగైర్"

జూపిటర్ పరదాలోకి తప్పుకుని ఇంకా రాలేదు. ఇంతకు ముందే నాటకంకోసం అల్లరిచేసినజనం ప్రారంభమౌతుందని తోచేసరికి కిమ్మనకుండా ఊరుకున్నారు. కాని ఎంతసే పూరుకుంటారు. మళ్ళీ అక్కడక్కడ కొందరు కేక లారంభించారు. "జూపిటర్! తెరయెత్తి ఊడిపడవోయ్" అని అరుస్తున్నారు.

"నాటకం! నాటకం" అని మళ్లీ కేక లారంభంకావడంతో వెంటనే తెర లేచింది. రంగులు పూసుకొని నలుగురు పరదాలో నించి వచ్చారు. వరుసగా నిలబడి ప్రేక్షకులకు వొంగి వొంగి అభివాదం చేశారు. ప్రజలు హర్షధ్వానం చేశారు.

వెనుకనుంచి వాద్యసంగీతం ఆగిపోయింది. నాటకం ప్రారంభమయింది. నటులు నాందికి ఉపక్రమించారు. కాని వినేదెవరు? అందరికీ వారి దుస్తులపైనే దృష్టి. నలుగురి దుస్తులూ సగం తెలుపురంగులోనూ సగం పసుపు పచ్చని రంగులోనూ ఉన్నాయి. అయితే ఒకరి దుస్తులనిండా బ్రొకేడ్ అలంకరణ ఉంది. ఒకరిదుస్తులు పట్టువి. ఒకరివి ఉన్ని దుస్తులు. మరొకరివి లినెన్‌తో తయారైనవి. ఇద్దరుస్త్రీలు, ఇద్దరు పురుషులు. ఒకరి కుడిచేతిలో కత్తి, ఒకరి చేతిలో బంగారు తాళపు చెవులగుత్తి, మరొకరి చేతిలో త్రాసు, ఇంకొకరి చేతిలో త్రవ్వుపార ఉన్నాయి. ఇంకా ఎవరి దేవేషమో బోధపడకపోవచ్చునని కాబోలు వారివారి దుస్తులపైన ఇలా పెద్దపెద్ద అక్షరాలు కుట్టించు

కున్నారు: "నా పేరు సామంతరాజరికం;" "నా పేరు మత ప్రచారం," "నా పేరు వాణిజ్యం," "నా పేరు కృషి." మతం, కృషి పురుషులు; రాజరికం, వాణిజ్యం స్త్రీలు. పురుషుల దుస్తులు మోకాటివరకున్నాయి. స్త్రీల దుస్తులు పాదాలనంటుతున్నాయి. వాణిజ్యంతో కృషి, మతప్రచారంతో రాజరికం చేతులుకలిపి ప్రస్తావన పలుకుతున్నారు. నలుగురిమధ్యా ఒక 'బంగారు చేప' ఉంది. భువిలోకెల్ల సుందరిఅయిన యువతి కీ 'బంగారు చేప'ను బహూకరించాలని వారి ఆశయం. నలుగురూ విశ్వమంతా చుట్టి భువనసుందరికోసం గాలిస్తున్నారు. దేశదేశాల రాకుమార్తెలు, సుందరీమణులు వచ్చారు; కాని వారెవ్వరూ నచ్చలేదు. చివరకు విసిగి వేసారి, అలసిపోయి నలుగురూ ఒకచోట విశ్రాంతి తీసుకుంటున్నారు.

కథ నడక బాగానే వుంది. కవిత, ప్రసంగవిధానం, ఉత్ప్రేక్షలు, అలంకారాలు ప్రవాహంలా దొర్లిపోతున్నాయి. అయితే ప్రేక్షకసమూహం అంతలోకీ గ్రింగైర్ చూపుతున్నంత శ్రద్ధ మరెవ్వరికీ లేకపోయింది. కన్నార్పక గూసి చెవులొగ్గి తదేకంగా ఆలకిస్తున్నాడు. నాటకారంభంలో ప్రేక్షకుల హర్షధ్వానాలు అతడి చెవులలో మార్మోగుతున్నాయి. నటీనటుల పలుకులలో తన భావాలుమందిరమంతటా వ్యాపించడం చూసేసరికి కవీశ్వరుడు తన్మయుడౌతున్నాడు.

కాని కవీశ్వరుని తన్మయానందం ఆట్టేసేపు నిలవలేదు. ఒక బికారి గుంపులోనుంచి చెదిరివచ్చి అతిథుల వేదిక పీఠానికి క్రింద వ్రేలాడుతున్న ఒకానొక శిల్పవిశేషంపై నెక్కి కూర్చున్నాడు. కూర్చుని ప్రేక్షకుల తలలమీదనుంచి చేతులుచాపి "అయ్యా భిక్షం, బాబూ భిక్షం" అని అరువ నారంభించాడు. కవీశ్వరుని కవిత్వ సౌందర్యం గ్రహించలేక నటులవైపు చూస్తోన్న ప్రేక్షకుల దృష్టి బికారివైపు మళ్లింది. నటీనటుల ప్రసంగం నిలిచిపోయింది. బికారిని గూసి ప్రేక్షకులు నవ్వ నారంభించారు. పక్షి సంతతి గూడు గూడిన వృక్షంపైకి తుపాకి పేల్చినట్లయితే సంభవించే కల్లోలం చూసినవారికి ఇప్పుడా మందిరంలో పరిస్థితి సులువుగా బోధపడుతుంది.

"అరె వీడీమాటు చేతికి కట్టుకట్టాడే."

"నిన్న కాలికి తగిలిన దెబ్బ ఇవాళ చేతిమీద కెక్కిందోయ్."

ఈరీతిగా కొనసాగిన ప్రసంగాలలో అందరూ నాటకాన్ని మరిచిపోయారు. ఒక డొక్క కొసు విలాసంగా పైకి విసిరాడు. కట్టుకట్టుకున్న చేతితోనే బికారి నేర్పుగా అందుకున్నాడు.

కవీశ్వరుడు ఇంతలో తేరుకున్నాడు. "ఎందు కాపడం? కానివ్వండి" అని బిగ్గరగా అరిచి నటులకు సౌజ్ఞ చేశాడు. నటులు ఈమారు గొంతుచించుకుని 'చదవ' నారంభించారు. కవి నెవరో భుజం తట్టినట్లయింది. వెనుతిరిగి చూశాడు.

"ఇంకావుందా నాటకం?"

"అయిపోయిందా?"

కవికి రోషం వచ్చింది. పళ్లు పటపట కొరికాడు. నటుల కంఠధ్వనులు బిగ్గరగా వినరావడంవల్ల ప్రేక్షకులు అటు తిరిగారు. కాని అప్పటికే అందరికీ కథలో ఆసక్తి నశించింది. అయినా నటులు విశ్రాంతినుంచి లేచారు. 'బంగారుచేప' నెవరి కివ్వాలి అని తర్కించారు. 'బంగారు చేప' గుణగణాలను ప్రశంసించి అర్హులెవరై ఉంటారని యోచించారు. నటులకు ఇంత వ్యవధి పట్టుతున్నదే కాని చివరికి వా రెవరిని నిర్ణయిస్తారో ప్రేక్షకు లప్పుడే గ్రహించారు. ఆమె ఫ్లాండర్స్ రాకుమారి! అయితే నాటకం ఇంకా అంతవరకూ సాగలేదు. మధ్యలో మరొక అవాంతరం వచ్చింది. అతిథులవేదిక వెనుకద్వారం తెరుచుకుంది. బోర్బన్ కార్డినల్ ఠీవిగా ప్రవేశించారు. ప్రతీహారి బిగ్గరగా ప్రకటించాడు. ప్రేక్షకులందరూ వేదికవైపు తిరిగారు. నటులు ఆగిపోయారు.

# 3

పియర్ గ్రింగైర్ కి పాపం తలపై పిడుగుపడినట్లయింది. నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. అంటే కార్డినల్ పట్ల అతడికి భక్తి విశ్వాసాలు లేవని అర్థం కాదు; భీతి అనీ కాదు. గ్రింగైర్ సహజంగా ఓర్మి కలవాడే. ఉన్నతుల సముఖంలో ఒదిగి నడుచుకోడం అతడికి తెలుసును. రచయితలకు సమాజంలోకల ఉన్నత స్థానంవల్ల భయపడవలసిన కారణం లేదని అతడికి తెలుసు. తన కవిత్వం కార్డి

నల్ చెవిలో పడాలనే అతడూ కోరేది. శ్లేష ద్వారా, వ్యంగ్యం వల్ల ఫ్రాన్స్ రాజవంశాన్నీ, రాజబంధువుల్నీ, మతాధికారుల్నీ ప్రశంసిస్తూ అతను వ్రాసిన కవిత్వం వింటే కార్డినల్ ఉప్పొంగు తాడని గ్రింగైర్ భావన. అయితే స్వార్థాశయం ఒక్కటే కవుల రచనకు ఆధారమని చెప్పడంలేదు. ఒకపాలు స్వార్థాశయం ఉంటే తొమ్మిదిపాళ్ళు స్వాతిశయం ఉంటుంది. ఇంతమంది ప్రజ, ఇటువంటి ఉన్నతాధికారులు తను రచించిన నాటకాన్ని ఆసక్తితో వీక్షించడం అతడికి గర్వకారణమే.

అయితే అకస్మాత్తుగా మధ్యలో నాటకప్రదర్శనం నిలిచి పోవడం, నటీనటులు నటన మాని రంగస్థలంపైన నిలబడిపోయి నోళ్లు తెరుచుకుని చూడ్డం నాటకకర్తకు అశనిపాతమయింది. కార్డినల్ ప్రవేశంతో రసవత్తరమైన ఘట్టానికి అంతరాయం కలి గింది. అందరూ తలలెత్తి వేదికవైపు చూస్తున్నారు.

బోర్బోన్ కార్డినల్ రూపసి. కార్డినల్ ఫ్రెంచి మహారాజు బంధువు. అధికారదర్పం అతడి ముఖంలో ఉట్టిపడుతూ ఉంటుంది. ఉత్సాహవంతుడు, విలాసపురుషుడు. చుట్టూ ఎప్పుడూ పరివారం ఉంటారు. ఇతడిపట్ల ప్రజలకు కొంత ప్రశంసాభావం లేకపోలేదు. కార్డినల్ రాకముందే నాటకం ప్రారంభమైనప్పటికీ అతడు కోపించలేదు. ప్రజలు తమ ఆధిక్యం మన్నించబడినందుకు తృప్తిచెందారు.

కార్డినల్ వేదికముందుకు వచ్చి ప్రసన్నభావంతో ప్రేక్ష కుల నొకసారి కలయచూశాడు. కార్డినల్ వెంట రకరకాల దుస్తులు ధరించిన మతాధికారులు, రాజబంధువులు వచ్చారు. వారితో నే ప్లాండర్స్ రాయబారులు ప్రవేశించారు. ప్రేక్షకులు వీరిపట్ల నిర్లక్ష్య భావం చూపకపోలేదు. ఈరోజు బికారులూ సామాన్యజనంతో పాటు విద్యార్థులు, గుమాస్తాలు, చిల్లరవర్తకులు, యువకులు అందరూ సభ్యత, నియమాలు గౌరవమర్యాదలకు తిలోదకాలిచ్చి విశృంఖల ప్రవర్తనకులోనై పండుగలో పాల్గొంటారు. నేటి ఉత్సవంలో అవినీతి, నిషేధం అనేవి పాటించనవసరం లేదు. ఇంక మతాధికారిని మన్నించాలనే నిర్బంధంకూడా అన వసరమే. ఎవరేమి అన్నా, ఎవరు దూషించినా ఇటువంటిరోజున అధికారులు కనీ విననట్లు, తప్పించుకు తిరుగుతారు.

కార్డినల్ తన అతిథుల సత్కారం గమనించడంలో నిమగ్ను డైనాడు. ఈ అతిథుల ప్రవర్తన చూసి రెండురోజులుగా కార్డినల్ విసుగుచెంది ఉన్నాడు. అధికారంలో కాని సామాజిక వ్యవస్థలో కాని అతిథులు కార్డినల్‌తో పోల్చడానికి అర్హులుకారు. వారిని సత్కరించడం అతడికి బాధ కలిగించింది. అతిథివర్గంలో రకరకాల వారున్నారు. చివరికి ఫ్లాండర్స్ రాజుగారి దర్జీకూడా అతిథిగా రావడం మరింత చిరాకు కలిగించింది. ప్రతీహారి అతణ్ణి మొదట అటకాయించాడు. తరువాత ప్రధానరాయబారి కోపించగలడనే భయంతో దర్జీనికూడా రానిచ్చారు. ఇతడిపేరు జాక్ కోపెనోలా.

అతిథులందరూ ఆసీనులైనారు. కోపెనోలా ఒకసారి ప్రేక్షకులవంక చూశాడు. ఇతడు పారిస్ నగరంలో సామాన్య జనులకు పరిచితుడే. వారిలో ఒకడుగా ఇంతకాలం సంచరించిన కోపెనోలా రాజమర్యాద లందుకోవడం కొందరికి హర్షం కలిగించింది; కొందరు అపహాస్యం చేశారు. సిపాయిలను చూసి తప్పుకు తిరగవలసిన సామాన్యుడొకడు నేడు కార్డినల్ ఆతిథ్యం పొందాడు. కార్డినల్ అవమతి ఇంతటితో అంతం కాలేదు.

కోపెనోలా సగర్వంగా కార్డినల్‌కి అభివాదం చేసి నిలబడ్డాడు. వేదిక ముందుకు వచ్చి క్రింద ప్రేక్షకులను పరికించాడు. ఈసమయానికి వేదిక క్రింద వేలాడుతున్న బికారి పైకి చూశాడు. కోపెనోలా అతణ్ని తట్టి "క్లోపెన్" అని పలుకరించాడు. బికారి ముఖంలో హర్షం వెల్లివిరిసింది. మిత్రుని గుర్తించాడు. ఇద్దరూ సంభాషణ కుపక్రమించారు. సభామందిరంలో గుసగుసలు, ఆక్షేపణలు అధికమైనాయి. కార్డినల్ ముఖంలో రోషం కనపడింది; పెదవులు కొరికాడు; కాని అతిథుల నవమానించలేదు.

రంగస్థలం నిశ్చలంగాఉంది. కవి ముఖం పాలిపోయి ఉంది. సద్దుమణిగిన తరవాత నాటకం కొనసాగించడానికి కవి అనుమతి కోరాడు.

"వొద్దు వొద్దు" అన్నారు కొందరు.

"కానివ్వండి" అన్నాడు కవి.

"అప్పుడే మొదలుపెట్టేశారా?" అన్నాడొక అతిథి.

కార్డినల్ పకాలున నవ్వాడు: "అయిందల్లా మంచిదే. కొంత తలనొప్పి తప్పింది" అన్నాడు.

"తిరిగి ఆరంభించమంటారా?"

"మిగిలిందే కానివ్వండి" అన్నాడు కార్డినల్.

నటులు తిరిగి సంభాషణ ప్రారంభించారు. కవీశ్వరునికి తిరిగి ఆశ మొలకెత్తింది. కాని ఈమారుకూడా ఆశాభంగం కలగ డానికి ఆట్టేసేపు పట్టలేదు. అతిథులనుసరించిన గుసగుసలు సభలో చెలరేగాయి. రంగస్థలంమీదికి సౌందర్యాధిదేవత అయిన 'వీనస్' వచ్చింది - 'బంగారుచేప' తనకు చెందాలని ఆమెవాదం. ఇంతలో బంగారు నగిషీలు పొదిగిన తెల్ల ముఖమల్ దుస్తులు ధరించిన ఒక చిన్నబాలిక వచ్చింది. ఫ్లాండర్స్ రాకుమార్తె కీమె ప్రతినిధి అన్నమాట.

బంగారుచేపకోసం - అనగా ఫ్రెంచి రాకుమారునికోసం - వీనస్‌కీ, ఫ్లాండర్స్ రాకుమారికీ తగవు తీరలేదు. ఇంక క్రీస్తుదేవుని తల్లి - మేరీకన్య - తీర్పు చెప్పవలసిందే. తీర్పు రాకుమారిపరం గానే జరిగిపోయిందని అందరికీ తెలుసు.

ఇంత జరుగుతున్నా ప్రేక్షకులు ఆసక్తి చూపలేకపోతు న్నారు. కవీశ్వరుని గుండె వ్రయ్యలౌతోంది.

ఇంతలోనే మరొక అంతరాయం సంభవించింది.
కోపినోలా లేచి వేదికపైనుంచే ప్రేక్షకుల్ని సంబోధించి ఉప న్యసించ నారంభించాడు. ప్రేక్షకుల కోలాహలంలో ఉపన్యాసం కొంత వినపడలేదు. కోలాహలం తగ్గగానే ఇలా చెప్పాడు: "అక్కడ రంగస్థలంమీద ఏం జరుగుతోందో ఏం తెలియడంలేదు. అక్కడ వాళ్ళెందుకు కీచులాడుతున్నారో తెలియదు. పోనీ కొట్టుకోనైనా కొట్టుకోరు. ఇంతకంటె కుస్తీలు చూడ్డం మేలు. అసలివాళ ఇక్కడ జరిగే దేమిటి. ఇవాళ పండగ ప్రజలందరిదీ. మూర్ఖాగ్రేసరుని ఎన్నిక జరగాలి. ఆ నాటకం ఆపేసి, అసలు పండగ చేసుకోడం మంచిది. ఈ పండగ మా దేశంలో విచిత్రంగా జరుగుతుంది. ఇక్కడ ఈ పూట అదే పద్ధతిని ఎన్నిక జరుపుదాం. జనంలోనించి ఒక్కొక్కళ్ళే వచ్చి తెరలోనుంచి ముఖాలు

చూపాలి. అందరిల్లోకీ వికృతిరూపి యెవడో వాణ్ని మూర్ఖాగ్రే సరుడిగా ఎంచుకుంటాం. ఏమంటారు? ఈ పద్ధతి బాగుందా లేదా?"

జనం చప్పట్లు కొట్టి సమ్మతి తెలిపారు. గ్రింగైర్‌కి మూర్ఛ వచ్చినట్లయింది. ఒక స్తంభాన్ని ఆనుకుని నిలబడలేక నిలబడ్డాడు. నటీనటులు రంగస్థలంమీద చిత్రప్రతిమల మాదిరి నిలబడిపోయారు. కవీశ్వరునికి మాట పడిపోయింది.

కన్ను మూసి తెరిచేటంతలో కొందరు రంగస్థలంమీది కెగ బడ్డారు. నటీనటులు పరదాలోకి పారిపోయారు. ప్రేక్షకులు కొందరు మధ్య పెద్ద రంధ్రం ఏర్పడేలాగ తెర చించివేశారు.

కార్డినల్ ఇంక భరించలేక లేచాడు. రాచకార్యాలు మించి పోతున్నాయనే వంకతో నిష్క్రమించాడు. అతనివెనుక కొందరు నిష్క్రమించారు. రాయబారవర్గం మాత్రం వేదికపై మిగిలారు. కోపెనోలా ప్రేక్షకు లందరికీ నాయకుడైనాడు. వేదికపైనుంచే ఆజ్ఞ లిచ్చి ఏర్పాట్లు చేయిస్తున్నాడు. జనమంతా అటూ ఇటూ కదిలిపోతున్నారు.

ముఖాకృతుల పరీక్ష ప్రారంభమయింది. తెరమధ్యలోనుంచి రకరకాల ముఖాలు ఒకటి వెంట ఒకటి కనపడి అదృశ్యమౌతు న్నాయి. ఒక్కొక్క ముఖాన్ని చూసి ప్రేక్షకులు గొల్లుమని నవ్వుతున్నారు. ఉన్మత్త ప్రలాపాలు చెలరేగుతున్నాయి. ప్రపం చంలో మనుష్యులు ఎంత వికృతాకృతి ధరించగలరో ఇక్కడ బోధపడుతున్నది. రోష ద్వేష భీభత్సాది సకలభావాలూ ఆకృతి ధరించి ప్రత్యక్షమౌతున్నాయి. పిన్న వయస్కుల మొదలు శత వృద్ధుల వరకూ అందరూ పోటీ చేస్తున్నారు. నక్క మూపులు, తోడేలుకోరలు, వరాహమూర్తులు అన్నీ కొనవస్తున్నాయి. అంత టంతట ప్రజల ఉన్మాదం మితిమీరుతున్నది. మందిరమంతా అయోమ మయంగా ఉంది. అకస్మాత్తుగా ఒక్కసారి అందరూ ఏక కంఠంతో అరిచారు. తెరలో చూసేసరికి కొందరు ఉలికిపడ్డారు. 'మూర్ఖాగ్రేసరుడు' ఎన్నుకోబడ్డాడు. తెర వెనుకనుంచి అతడిని తీసుకు వచ్చారు.

ఇంతకంటె వికృతాకారం, భీకరాకారం ఉండబోదు.

దంటే నమ్మడం కష్టం. అతడితో ఎవరూ పోటీ చెయ్యలేరని అందరూ అంగీకరించారు. పైకి వొంగి ముఖానికి అతికినట్లున్న పెద్ద బండ ముక్కు, గుర్రపుడెక్క వలెనున్న మూతి, కనుబొమ్మల దట్టపు వెంట్రుకలలో మూసికొనిపోయిన ఒక కన్ను, గోగ్గిపళ్ళు, పెదవులు దాటి చొచ్చుకుని వచ్చిన ఒక కోరపన్ను, జీవంలేనట్లు కిందికి వేలాడుతున్న కింది తట్టు పెదవి, వెనక్కు తోసుకుపోయిన గడ్డం, అన్నిటికీ మించి జుగుప్స, ఆశ్చర్యం, విషాదభావాలు మిళితమై ఉట్టిపడే ముఖకవళిక చూసేవారికి భయోత్పాతం కలిగించింది. వికటాట్టహాస మనుకున్న అతడి ముఖభంగిమ సహజస్థితమైనదేనని తెలిసినప్పుడు ప్రజలు ఆశ్చర్యచకితులైనారు. అసలు మనిషి ఆకారమే ఒక వికృతిహాసం. శరీరానికి తగనంత పెద్ద తల; తల నిండా ఎర్రని జుట్టు అట్టలు కట్టివుంది. తలకంటె ఎత్తైన గూని, గడ్డాన్ని తాకి ముందుకు చొచ్చుకు వచ్చిన ఛాతీ, కొడవళ్ళవలె వంగిన దొడ్డి కాళ్లు, పెద్దపెద్ద పాదాలు, వంకర తిరిగినా ఇనుమును వంచగల బలిష్ఠమైన చేతులు—ఈ ఆకారాన్ని చూసి స్త్రీలు, శిశువులు కెవ్వుమన్నారు. అందరినీ విదలించి నిలబడ్డాడు ఒంటి కన్ను రాకాసి. ఇంత వికృతాకారంలో ఇంతటి మహాశక్తి ఎలా వున్నదో ఆశ్చర్యకరమైన విషయం. ఒక మహాశక్తి సంపన్నుడైన దానవుని ముద్దగా పోగుచేసి మనిషి ఆకారంలో పోతపోసినట్లున్నాడు.

చాలమంది అతణ్ని గుర్తుపట్టారు. "క్వాసిమోడో, క్వాసిమోడో" అని కేకలు మిన్నుముట్టాయి.

"చర్చిలో గంటలు కొట్టేవాడు."

"నాటర్ డామ్ చర్చిలో తిరిగే గూనివాడు."

"ఒంటికన్ను రాకాసి."

స్త్రీలు కళ్లు మూసుకొన్నారు.

"అబ్బ! ఎంత భయంకరంగా ఉన్నాడు."

"సైతాన్ భూమికి పంపిన రాక్షసుడు."

"సైతాన్."

"రాత్రివేళ నాటర్ డామ్ చర్చి ప్రక్క ఇళ్లే కప్పులమీద తిరుగుతూవుంటాడు."

"ఆనుక్య ఒకరాత్రి మా ఇంటి కప్పుమీదనించి వొంగి ఇంట్లోకి తొంగిచూశాడు. మొదట మని షనుకోలేదు. భయపడి పోయాను."

"మా యింటిమీద ఒకసారి చీపురుకట్ట వొదిలేసి వెళ్ళాడు."

"మంత్రకత్తెలకి గురు వనుకుంటాను."

"చేతబడి చేస్తాడట."

"దయ్యాలతో భూతాలతో వీడికి స్నేహంకూడా."

ఈమాదిరి వర్ణనలకి అంతులేదు. క్వాసిమోడో రంగస్థలంపైన నిలబడ్డాడు. ఒకడు అతణ్ని సమీపించి తిన్నగా ముఖంలోకి చూసి ముఖంమీద నే పకాలున నవ్వాడు. క్వాసిమోడో ఒక్క మాటైనా మాటాడకుండా అతణ్ని ఒక్క చేత్తో నడుంపట్టి ఎత్తి పదిఅడుగుల దూరానికి విసిరివేశాడు. "అమ్మో" అంటూ వాడు ఎముకలు విరిగి ఏడవ నారంభించాడు.

కోపెనోలా ఆశ్చర్యానికి అంతులేదు. గబగబ వేదిక దిగి వెళ్ళి క్వాసిమోడో మూపు తట్టాడు. క్వాసిమోడో కదలలేదు. "నీవంటి బలవంతుణ్ని ఎక్కడా చూడలేదోయ్! మనం కుస్తీ పడదామా ఒకసారి?" అన్నాడు.

క్వాసిమోడో జవా బివ్వలేదు.

"ఏమిటి? నీకు చెముడు కూడానా?" అన్నాడు ఆశ్చర్యపోయి.

క్వాసిమోడో నిజంగా బధిరుడు. కోపెనోలా మరొకసారి మూపు తట్టాడు. గిరుక్కున తిరిగాడు క్వాసిమోడో. వెంటనే వెనక్కు దూకాడు కోపెనోలా. అందరూ ఎడమిచ్చారు. క్వాసిమోడో చుట్టూ పదిబారల దూరం తప్పుకున్నారు జనం.

"చెవిటివాడు పాపం" అన్నది ఒక వృద్ధవనిత.

కోపెనోలా తేరుకుని అన్నాడు: "ఇంక వీడికి లేని వికారమేమిటో!"

"దొడ్డికాళ్లు—అయినా నడుస్తాడు. ఒంటికన్ను-అయినా మనకంటె చురుగ్గా చూస్తాడు. మాట్లాడాలంటే చెవుడు అడ్డు. ఎలా వీడితో?"

"తల్చుకుంటే మాట్లాడగలడు. గుడిగంటలు వాయించడం వల్ల చెవుడొచ్చింది. మూగవాడు కాదు."

"మూగతనం కూడా ఉంటే అక్కడికి పూర్తి అవును."

"ఓ కన్ను ఎక్కువ కూడా వుంది."

ఈలోగా కుంటివాళ్ళు, గుడ్డివాళ్ళు, బికారులు, జేబు దొంగలు మొదలైన ప్రవీణులందరూ చుట్టుప్రక్కల వెదికి, అట్ట లతో 'కిరీటం' తయారుచేసి, బల్లచెక్కల పల్లకీ ఒకటి తెచ్చారు. 'మూర్ఖాగ్రేసరు'నికి కిరీటం ధరింపచేశారు. క్వాసిమోడో అడ్డు పెట్టలేదు. పల్లకీ అనే బల్లమీద ఠీవిగా కూర్చున్నాడు. పన్నెండు మంది 'మూర్ఖులు' పల్లకీ నెత్తారు. ఈలికేకలతో బొబ్బలతో జన మంతా మూర్ఖాగ్రేసరుని ఊరేగింపుతో నగరవీథులవెంట బయలు దేరారు.

# 4

ఇది జరుగుతున్నంతసేపూ గ్రింగ్వార్ నిశ్చేష్టుడై చూస్తూ ఉండి పోయాడు. కొంతసేపటికి సభామందిరం ఖాళీ అయి పోయింది. "పీడా పోయిందిలే" అని చేతులు విదల్చుకున్నాడు. రంగస్థలం వెనుక చూశాడు. బాండ్ మేళం లేదు; వాద్యాలతో సహా మేళం ఊరేగింపులో కలిసిపోయారు.

కవీశ్వరుడు మందిరంనుంచి బైటపడ్డాడు. ఇక్కడ నలుగు రైదుగురు విద్యార్థులు చేరి మాట్లాడుకుంటున్నారు:

"గ్విలామ్‌కి ఒక పెద్ద భవనం ఇచ్చారుట ప్రభుత్వం."

"ఎవరు? చరిత్ర రచించేవాడేనా?"

"అవును. నెలకి వెయ్యి ఇస్తారుట."

"అబ్బా!"

కవీశ్వరుడు చెవులు నిక్కబొడుచుకు విన్నాడు. "అంత డబ్బే!" అనుకున్నాడు.

"అదుగోరా ఆ అమ్మాయి."

"ఎవరు?"

"ఎమరాల్డా".

"ఎమరాల్డా!"

ఈ మాటలకి అక్కడక్కడ చేరిన జనం అందరూ అటూ ఇటూ చూడ్డం మొదలెట్టారు.

"ఎమరాల్డా? అంటే?" అన్నాడు గ్రింగర్. "ఇదేదో ఈజిప్టునించి వొచ్చిన పేరుకాబోలు" అనుకున్నాడు.

# 5

జనవరిమాసంలో ఇట్టే చీకటి పడిపోతుంది. గ్రింగర్ సభామందిరం దాటి బైటపడేసరికే చీకటి పడుతోంది. అప్పుడే చీకటిపడ్డం అతడికి అనుకూలంగానే తోచింది. మనుష్యుల పొడ కానరానిచోటు కావాలి అతడికి. ఎవ్వరూ రాని ఏ చీకటి గొందిలోనో కూర్చుని తత్వవిచారంతో కాలక్షేపం చేసి హృదయాఘాతానికి చికిత్స చేసుకోవాలని కవి కోరిక. అతడికి తుది ఆశ్రయం తత్వవిచారం. తలదాచుకోడానికి ఆశ్రయం లేదు. తన నాటకం భంగపడిన తరువాత ఇంక తన నివాసానికి తిరిగిపోలేడు. నాటకం చూసి అధికారులు సంతసించి బహుమతి ఇస్తే బసకు ఉన్న ఆరు మాసాల అద్దెబాకీ తీర్చాలనుకున్నాడు. కాని ఫలితం విపరీతమయింది. ఇప్పుడతనికి మిగిలినదల్లా ఒంటినున్న దుస్తులే. జేబులో చిల్లిగవ్వ లేదు.

కొంతసేపు దగ్గరి వీథులు సంచారం చేశాడు. ఏ ద్వారం ముందు, ఏ మూరుకిందవిశ్రమించాలో తెలియక వెతికాడు. సభామందిరం ప్రక్కన ఒకచోట తిన్నె ఉన్నదని అతడికి గుర్తొచ్చింది. తిన్నెపైనే మరొక చిన్న రాతిపలక ఉన్నట్లు అతనికి తెలుసు. అది బిచ్చగాడికే కాదు కవికికూడా తలగడకింద పనికొస్తుంది. వెంటనే సభామందిరం వైపు మరలాడు.

సభామందిరం అంతదూరంలో ఉందనగానే 'మూర్ఖాగ్రేసరుని' ఊరేగింపు అతడి కెదురయింది. పెద్ద కాగడాలతో ఊరేగింపు వస్తోంది. పాలిబొబ్బలు వినబడుతున్నాయి. దగ్గరికి వెళ్లాడు. తన నాటకంలో బాండ్ మేళం కనపడింది. తిరిగి తన నాటకానికి

జరిగిన అవమానం అతడికి జ్ఞప్తికివచ్చింది. అతడు లోలోన ఆక్రోశించాడు. వెనుతిరిగి కాలికి బుద్ధిచెప్పాడు. బికారుల్ని, 'మూర్ఖాగ్రేసరుని' తలుచుకుంటే అతడు నిలువెల్ల కంపించి పోతున్నాడు.

ప్రక్క వీధిలో ఆకతాయి పిల్లలు బాణసంచాతో చెరలాడుతున్నారు. మరొక వీధి దాటాడు. అక్కడొక వంతెన ఉంది. వంతెన దిగువను పెద్ద కాన్వాస్ గుడ్డలపైన ఫ్రాన్స్ మహారాజు, రాకుమారుడు, ఫ్లాండర్స్ రాకుమార్తెల చిత్రాలు కనపడ్డాయి. దీపాల వెలుగులో కొందరు నిలబడి చిత్రాలను పరిశీలిస్తున్నారు. "చిత్రకారుడు అదృష్టవంతుడు" అనుకున్నాడు గ్రింగైర్. వంతెన దాటగానే ఒక చీకటిసందు కనపడింది. ఈపైన నదిపై పెద్ద వంతెన. వంతెన దాటాడు. ఇంక ఇక్కడికి ఉత్సవాలు దూరమే అనుకున్నాడు. కొన్ని వీధులు మలుపులు తిరిగాక నదిలో చిన్న ద్వీపఖండం కనపడింది. అక్కడ నదిని దాటించే బోటు ఉంది. బోటువాడు బోటులోనే నిద్రపోతున్నాడు: "ఆహా! ఎంత నిశ్చింతగా నిద్రపోతున్నాడు! ఇతడికి ఏ వైభవంగురించిన కలలూ లేవు! మహారాజుల వంశాలలో వివాహాలతో ఇతడికి నిమిత్తం లేదు. నేనో! కవిని! నాకు మిగిలేది ప్రజల అవహేళన. ఛీ!" అనుకున్నాడు నదీ తీరం సమీపించాడు. నీళ్ళవద్ద నిలిచాడు. "అబ్బ! ఈ నదిలో మునిగిపోతే ఏ బాధా ఉండదు కదా! కాని—నీళ్లు మరీ చల్లగా ఉన్నాయి" అనుకున్నాడు. ఇంతలో దగ్గరలోనే ఏదో పేలిన శబ్దం వినవచ్చింది. బాణసంచా! "ఇక్కడ కూడా ఇదేనా?" అని విసుగుచెందాడు.

ఇంక ఎక్కడకు వెళ్ళినా ఈ ఉత్సవాలు, ఈ కోలాహలం తనను వెంటాడకమానవు. ఇదపనిగాదనుకున్నాడు. ఊరేగింపులోనే కలిసిపోవాలని నిశ్చయానికొచ్చాడు. అక్కడ చలిమంటలేనా ఉంటాయి. వెచ్చగా ఉంటుంది! గ్రీవ్ చౌకు దిక్కుగా తిరుగు ముఖం పట్టాడు. అక్కడ రొట్టికూడా దొరకవచ్చునేమో!

గ్రీవ్ చౌకు నిర్జనంగా ఉంది. చుట్టూ పెద్దపెద్ద కట్టడాలు, చిన్నచిన్న ఇళ్లు దట్టంగా ఒదిగి ఒదిగి పోగుపోసినట్లున్నాయి. పగటివేళ చూస్తే మధ్యయుగాల శిల్పం, కొత్తగా చేర్చిన ఇళ్ళు, మధ్యరకం భవనాలు అంతా అయోమయంగా కనపడతాయి. ఒకవైపున నదీతీరం ఉంది. పూర్వ శతాబ్దాలలో గుర్రపు సాలలు,

పరిచారకుల నివాసాలీ వీధికివైపున ఉండేవి. ఇప్పుడలా కాదు. ధనవంతుల ఇళ్ళు వెనక్కి తిరిగి వీధిముఖమైనాయి.

చౌకు చివర మూడు పెద్దభవనాలున్నాయి. ఒకటి పూర్వ రాజభవనం, ఒకటి చర్చి, మరొకటి స్తంభాల సావిడి. సావిడి ప్రక్కగదిలో తుపాకులుంటాయి. చర్చిలో దేవుణ్ణి ప్రార్థించినా పొందలేని స్వత్వాలను ప్రజలు తుపాకులు చేతబట్టి సాధించుకోడంకోసం కాబోలు; ఎవరికీ చెందనట్లు అక్కడ దాచబడినాయి తుపాకులు.

రాత్రి వేళ చీకటి రాక్షసులు పొంచి కూర్చున్నట్లు కనపడుతున్నాయి ఆ యిళ్లన్నీ. చౌకు చూస్తే దుస్స్వప్నంవలె భయంకరమైన ఆనాటిచరిత్ర జ్ఞప్తికి వస్తుంది. మైదానం మధ్యలో "న్యాయమూ, నిచ్చెనా" ఉన్నాయి. అంటే ఒకటి ఇనపచక్రం, మరొకటి శాశ్వతంగా రాతితో నిర్మించబడిన ఉరిస్తంభం. ఇక్కడఅనేకమంది ప్రజలు హింసించబడ్డారు; అనేకమంది నిండు ప్రాణాలు నిలువునా తీయబడ్డాయి. రెండూ ప్రక్కప్రక్కనే ఉన్నాయి. ఆనాడు సామంతరాజులు, మతాధికారులు, నగరాధికారుల నిరంకుశ పరిపాలనలో నిర్విఘ్నంగా కొనసాగిన దారుణ హింసాప్రక్రియ, అమానుష వినోదాలు నేడు బహిష్కరించబడుతున్నాయి. సామంతుల నిరంకుశపాలన (ఫ్యూడలిజమ్) తో పాటు, ఆ అమానుష ప్రవృత్తికూడా అంతరించింది.

# 6

చౌకు చేరేసరికి గ్రింగొర్ శరీరమంతా చలిలో బిగుసుకుపోతోంది. రాజవీధులు తప్పించుకునే వచ్చాడు. కాని మతాధికారుల మిల్లులలోనుంచి నీటి జల్లులువచ్చి అతిడి దుస్తులు తడిపివేశాయి. "మతాధికారులికి మిల్లులెందుకో! అధికారం ఉంటేడి తే ఆర్జన మిగుల్తుందని కాబోలు" అనుకొన్నాడు. చౌకు మధ్యలో వెలుగుతున్న భోగిమంటలను సమీపించాడు. దూరానికి పల్చగా కనపడిన జనం దగ్గరలో పెద్దగుంపుగా కనపడ్డారు. మంటచుట్టూ దూరంగా ఒదిగి నిలబడ్డారు జనం. అంతమంది అక్కడేం చేస్తున్నారు? చలి కాగడానికే?

దగ్గరికి వెళ్ళిచూసేసరికి చలికాగడంకోసం కాదని తెలిసింది. అక్కడొక యువతి నాట్యం చేస్తోంది.

తత్వవేత్త, పండితుడు, వ్యంగ్యకవితలో నిధి అయిన గ్రింగోర్‌కి అనుమానం తగిలింది. ఆమె అప్సరసా? దేవకన్యా? మనుష్యాంగనా? అపురూపసుందరిని చూసేసరికి కవి కళ్లు జిగేల్‌మన్నాయి. సన్ననైనందువల్ల పొడగరిగా కనిపించినా, ఆమె అట్టే పొడగరి కాదు. శిల్పి చేత మల్చబడినట్లున్న శరీరాంగాలు, లతవలె స్వాధీనం తప్పని తనువు, బంగారు తనుఛాయ, చిన్ని పాదాలు, ప్రసన్న వికాసమైన ముఖకాంతి—ఆమెను చూసి కవి విభ్రాంతుడైనాడు.

అందరి దృష్టులూ ఆమెపైనే లగ్నమై ఉన్నాయి. చినిగిన పాత పారసీతివాచీపైన ఆమె నాట్యంచేసి తిరుగుతున్నపుడు ఆమె నల్లని నేత్రాల కాంతి మెరుపులవలె అందరిపైనా మెరుస్తున్నాయి. రెండుచేతులతో తంబుర తల పైకెత్తి వాయిస్తూ ఆమె నాట్యం చేస్తోంది. ముడతలులేని బంగారువన్నె చొక్కా, ఆచ్ఛాదనంలేని భుజాలు, ఆమె పాదచలనంలో పొంగి ఉరకలువేస్తున్న చుక్కల పరికిణి, నేలనంటే అంటనట్లున్న ఆమె చక్కని చిన్నపాదాలు, నల్లని శిరోజాలు అన్నీ చూడగా ఆమె మానవకాంత కాదని తోచింది కవికి.

“ఓహో! దేవకన్య! సాగరకన్య! అప్సరాంగన! ఎవరో కదా!” అని ఆశ్చర్యపడ్డాడు. ఇంతలో ఏదో కిందపడింది. ఆమె వంగి అది అందుకుంది. అది ఆమె తలపిన్ను. అదిచూసి ‘ఓ! ఈమె జిప్సీ కాబోలు’ అనుకున్నాడు. (జిప్సీలు అంటే నిలకడైన నివాసం లేక సంచారం చేసే జాతివారు.)

ఆమె తిరిగి నాట్యం చెయ్యనారంభించింది. రెండు బాకులు తీసుకుంది. మొనలను నుదుటిపై ఆనించి బాకులు నిలుపుతూ నాట్యం చేసింది. బాకు లొక దిక్కుగా తిరిగితే ఆమె మరొక దిక్కుగా తిరుగుతోంది. ఇంక ఈమె జిప్సీ అని నిర్ధారణ చేసుకున్నాడు. ఏ దేవకన్యా కాదని తెలిసిన తరువాత కూడా ఆమె సౌందర్యానికి అతడు ముగ్ధుడైనాడు.

ప్రేక్షకులవంక చూశాడు. ఒక వ్యక్తి ఆమెవంక తన్మయుడై చూస్తున్నాడు. గుంపులో అతని దుస్తులు తెలియడంలేదు.

వయస్సు ముప్ఫైఅయిదుకి మించదు. కాని బట్టతల స్పష్టంగా కనబడుతోంది. కణతలవద్దకు జారిన కొద్ది జుట్టూ నెరిసింది. విశాలమైన నుదుట ముడతలు, లోతైన కళ్లు చూపెగా దీక్షకు లోబడిన వ్యక్తివలె తోచాడు. అతడి ముఖంలో ఏదో అసాధారణమైన ప్రతిభ, తేజస్సు గోచరిస్తున్నాయి. నిశితమైన అతని దృక్కులు, ఉల్లాసం వెల్లివిరియింప చేస్తున్న పదహారేళ్ల యువతిని చూస్తున్న కొద్దీ తీక్షణ మౌతున్నాయి.

చివరి కా యువతి ఆయాసంతో నాట్యం నిలిపివేసింది.

"డాలీ" అని పిలిచింది జిప్సీ. చలాకీ మేక ఒకటి చెంగున లేచి ఆమెవద్దకు వచ్చింది. మేక గిట్టు కొమ్ములు, గిట్టు డెక్కలు, గిట్టు మెడపట్టి మంట వెలుగులో తళతళలాడాయి.

"డాలీ! ఇంక నీ వంతు" అంది జిప్సీ. మేక వద్ద కూర్చుని తంబుర వాయించడం మొదలు పెట్టింది.

"డాలీ! ఇదే నెలో చెప్పు" అంది జిప్సీ. తంబుర ముంగుకు చాచింది. మేక ముందుకాలొక టెత్తి డెక్కతో తంబురపైన ఒక తడవ తట్టింది. ఇది సంవత్సరంలో మొదటి నెల.

"డాలీ! ఇప్పు డెన్ని గంటలయిందీ?"

డాలీ ఏడుసార్లు తంబుర తట్టింది. అప్పుడే టవర్ గడియారం ఏడు కొట్టింది. జనం ఆశ్చర్యభరితులైనారు.

"ఇదేదో మంత్రం పెట్టింది" అని ప్రేక్షకులలో ఒకడు అరిచాడు.

"ఇది మంత్రకత్తె" అన్నాడు మళ్ళీ. అరిచినవాడు బట్టతల వ్యక్తి. జిప్సీ యువతి ఉలిక్కిపడింది. అటు తిరిగి చూసి పాలిపోయింది. భయంతో ముఖం తిప్పుకుంది. ప్రేక్షకులు హర్షధ్వానం చేశారు. ఈ ప్రశంసలో ఆమె భయం మరిచిపోయింది. తిరిగి మేక వంక చూసింది.

"డాలీ! మన కెప్టెన్ రెమీ సిపాయిలముందు ఎలా నడుస్తారో చెప్పు" అంది.

డాలీ వెనుక కాళ్ళు రెండింటిపైనా లేచి నడిచింది. 'మే' అని అరిచింది. అందరూ పగలబడి నవ్వారు.

జిప్సీకి ధైర్యం చిక్కింది. "డాలీ! మన ఫాదర్ శామో ఎలా ఉపన్యసిస్తాగో చెప్పు."

మేక వెనక్కు చతికిలబడి కూర్చుని ముందు రెండు కాళ్లూ ఎత్తి, విచిత్రంగా ఆడిస్తూ, తల ఎగరేస్తూ "మే! మే!" అని అరిచింది. భావమేమిటో నిజంగా ఫాదర్ శామో తల ఎగరేస్తూ చేతులు ఊపుకుంటూ ఉపన్యసిస్తున్నట్లే ఉంది. జనం మరింత నవ్వారు.

"ఘోరం! అపచారం!" అంటూ అరిచాడు బట్టతల మనిషి. జిప్సీ అటు తిరిగి చూసింది. "ఓ! తాతగారి కోపం వచ్చింది", అంది. నాలుక చూపి వెక్కిరించింది. గిరుక్కున వెనక్కు తిరిగి ప్రేక్షకులు విసరిన డబ్బు పోగుచేసి తంబురలో పోసుకుంది. అందరివద్దా తంబుర చూపుతోంది. పండి, రాగి నాణేలు పడుతున్నాయి. గ్రింగైర్ వద్దకు వచ్చింది. జేబులో చూశాడు. ఆమె ఆగింది. కవి తెల్లబోయాడు. జేబులో ఏంలేదు. తంబుర చాపి అతడివంక ఆమె విశాల నేత్రాలతో చూసింది. కవీశ్వరునికి ముచ్చెమటలు పటాయి. అతడి కౌతుకంలో ఎంతటి అమూల్యమైన వస్తువు లభించినా ఆమె కిచ్చేసేవాడే. కాని ప్రస్తుతం అతను నిరుపేద.

వెనుకనుంచి కఠోరస్వరం వినవచ్చింది. "ఇక్కడనుంచి పోతావా లేదా. నువ్వో మాయలాడివి."

జిప్సీయువతి కలవరపాటుతో అటూ ఇటూ చూసింది. ఈమారు కంఠస్వరం పురుషునిది కాదు; స్త్రీది. అందరూ వెనుదిరిగి చూశారు.

"రోలండ్స్ టవర్‌లో ముసిల్ది" అన్నారు తెలిసినవాళ్లు.

"రాత్రి తిండి దొరకలేదు కాబోలు."

అదును చూసుకుని కవి జారుకున్నాడు. తను కూడా రాత్రి పస్తు ఉన్నట్లు అతడికి గుర్తొచ్చింది.

"రొట్టె తెచ్చి పెడదాంరా ముసిల్దానికి" అంటూ పిల్లలు కొందరు పరుగారంభించారు. తనకూడా దొరుకుతుందనే ఆశతో కవి వాళ్ళవెంటపడ్డాడు. కాని వాళ్ళు కుర్రవాళ్లు. వాళ్ళతో పరుగెత్తలేకపోయాడు కవి. కొంతదూరం వెళ్లిన తర్వాత కుర్రవాళ్ళ జాడ కనిపించలేదు. నిస్పృహతో నిలబడి

పోయాడు. రాత్రి చీకటివలె లేమి చుట్టూ అతడి నావరించింది. లేమి ఇంత క్రూరమైన దేమా, అనుకున్నాడు.

అసలు దేవుని కెవరిమీదనో కక్షపుట్టి ఈ మానవజాతిని సృష్టించాడని కవి ఊహించాడు. తత్వవేత్త జీవించినంత కాలం అతడి తత్వాన్ని నిగ్గించడానికి నైమిత్తికాలు ముట్టడి చేస్తూనే వుంటాయి. గ్రింగైర్ జీవితంలో ఇప్పుడు ముట్టడి నిజంగా దిగ్బంధంగా పరిణమించింది. ఇంత కఠిన పరీక్ష అతని కెన్నడూ తటస్థపడలేదు. ఆకలి అతణ్ని నిర్బంధించింది. ఉదాత్తమైన తత్వాన్ని జయించడానికి కరువు తలపడ్డం ఆక్రమమన్నాడు కవి.

కవి ఆలోచనానిమగ్నుడైనాడు. ముసిరివచ్చిన యోచనలకు అకస్మాత్తుగా అంతరాయం కలిగింది. దాపులోనే మధురగీతం వినవచ్చింది. కవి ఆలోచనలనుంచి మేలుకొన్నాడు.

పాడుతున్నది జిప్సీ యువతి. ఆమె రూప సౌందర్యంవలె, నాట్యంవలెనే ఆమె కంఠధ్వని అవ్యక్త మధురం. మయూర క్రేంకారంవలె ఆ కంఠస్వరం ఆకాశవీధులలో తేలియాడుతున్నది. ఒక్కొక్కప్పుడు ఝరీపాతంవలె, ఒక్కొక్కప్పుడు గుసగుసలవలె, సర్పరోషావేశంవలె, మరొకప్పుడు సమతలమందు జలప్రవాహంవలె గానవైభవం శోభిల్లుతున్నది. మంజుల స్వనాలు, మధ్య మధ్య పరుష స్వనాలతో ఆరోహణావరోహణక్రమాల నియమంతో శ్రావ్యము, అమలమైన ఆ సంగీతమాధుర్యం విని కవి తన్మయుడైనాడు. పాటలోని సొగసులతోపాటు ఆమె సుందర వదనం ఒకప్పుడు దివ్యావేశం, మరొకప్పుడు మహోరాజ్ఞీ దర్పం ప్రతిబింబిస్తున్నది.

పాటలోని భాష కవికి అపరిచితం. ఆ భాష ఆమెకైనా తెలుసునో లేదో తెలియదు. పాటలోని భావాలను ఆమె వ్యక్తీకరించకపోవచ్చును. కాని ఆమె పాడగా వింటున్న కవికి ఒక క్షణంలో ఉత్సాహం, మరొక క్షణంలో కరుణ, ఆపైన ఆనందం అనుభూతమౌతున్నాయి.

ఆ రాత్రివేళ నిర్జనమైన ఆ ప్రదేశంలో,విహంగంవలె నిశ్చింతగా ఉత్సాహంతో పాడుతూ వస్తున్న ఆ సుందరిని చూసేసరికి కవి ఆకలి మరచిపోయాడు. సర్వం మరచి పాట వింటున్నాడు.

ఇంతలో పాట ఆగిపోయింది. కటువైన దూషణ వాక్యాలు వినవచ్చాయి. "ఓసి మాయలాడీ! నీ మాయ లింక కట్టిపెట్టు."

భోగి మంటలవద్ద నాట్యం ఆపుచేసిన వృద్ధవనిత కంఠం అది. జిప్సీయువతి ఆగిపోయింది. కవికి కోపం వచ్చింది. వృద్ధ వనిత నుద్దేశించి దూషించాడు: "శకునపక్షీ! నువ్వెక్కడ దాపురించావ్ ఇవాళ? ఎంత చక్కని పాట!"

వెనుక సందడి వినవచ్చింది. భోగి మంటలవద్ద జనం ఇటు వస్తున్నారు. "ఈ ముసిలెక్కడనించొచ్చిందోయ్! తన్ని తరిమెయ్యండి." అని కొందరు కేకలు పెట్టారు. కొంద రామె నంట పడ్డారు. అంతలోనే అల్లంతదూరాన ఊరేగింపు కానవచ్చింది. వృద్ధవనిత ప్రాణాలు దక్కాయి. ఊరేగింపు కాగడాలతో పెద్ద వీధులన్నీ తిరిగి గ్రీవ్ చౌకువద్దకు వస్తున్నది. తిరిగితిరిగి వచ్చేసరికి ఊరేగింపులో జనం రెట్టింపయినారు. పారిస్ నగరంలోని బికారులు, యాచకులు, చోరులు, త్రాగుబోతులు అందరూ ఊరేగింపులో కలిశారు.

బికారిమూకల నాయకుడు ముందున్నాడు. ఒక గుర్రమెక్కాడు. రకరకాల చినిగిన దుస్తులు, కట్లు అలంకరణలతో జిప్సీలు స్త్రీ పురుషులు, పెద్దలు పిన్నలు అందరూ చేరి నడుస్తున్నారు. అందరూ అధికారదర్పంతో ఠీవిగా నడుస్తున్నారు. వంచకశ్రేష్ఠులు, చోరశిఖామణులు, హస్తలాఘవ ప్రవీణులు మొదలైనవారందరూ భీతి మరిచి స్వేచ్ఛగా వీధులలో విహరిస్తున్నారు. ఈ ఊరేగింపులో ఏ వృత్తివర్గాని కెవరు నాయకులో తెలియడం కష్టం. కాని, అన్ని వృత్తులవారూ కలిసికట్టుగా వ్యవహరిస్తున్నారనేది స్పష్టమే. వీరికొక చక్రవర్తి ఉంటాడు; రాజు లుంటారు, సామంతు లుంటారు, భటులుంటారు. నాయకులనంటి పరివారం ఉంటారు. అందరి మధ్యా, "సింహాసనం"పైన మూర్ఖాగ్రేసరుడు క్వాసిమోడో కూర్చుని ఊరేగుతున్నాడు.

ఊరేగింపులో చిత్రవిచిత్రాలైన వాద్యాలున్నాయి. జిప్సీల కంజిరాలు, తంబురాలు, ఆఫ్రికన్ల డప్పులు, కొమ్ముబూరాలు, పాతడబ్బాలు, రేకులు అన్నిరకాలూ పనికివచ్చాయి.

క్వాసిమోడో ముఖంలో విలసిల్లిన గర్వం తీవి వర్ణించ నలవి కాదు. అతడు జన్మలో ఆత్మాభిమానం, అహం చవిచూసి నది ఇదే మొదటిసారి. ఇంతవరకు తన స్థితికి నిస్పృహ, తన రూపానికి జుగుప్స, ఆత్మనింద మాత్రమే అతి ఎరుగును. ఇత రుల నిరాదరణ, నిర్దాక్షిణ్యం మాత్రమే అతడికి అనుభవం. అందు వల్ల బధిరుడైనప్పటికీ ఇప్పుడతడు ప్రజల ప్రశంసలకు పొంగిపోతు న్నాడు. ప్రశంసిస్తున్న ప్రజలు చోరులు వంచకులే కావచ్చు; అయినా అందరూ తన ఆధిక్యాన్ని అంగీకరించారు ఈరోజున. ప్రశంసలలోని అపహాస్యం, స్తోత్రాలలోని వ్యంగ్యదూషణలు అతడికి వినరావు. వారి ఉత్సాహమే అతడికి స్తోత్రపాఠం.

అతడి ఆకారమే కాదు, మేధస్సుకూడా వికృతి చెందింది. మేధస్సు కూడా బధిరమైనట్లుంది. అతడి ప్రస్తుతానుభూతి ఎటువంటిదో అతడికే బోధపడదు. ఏదో అవ్యక్తమైన ఉత్సాహం, ఆనందం మాత్రం అనుభూతమవుతున్నాయి. ఎప్పుడూ దైన్యం, దుఃఖం ఆవహించి ఉండే ఆ ముఖంలో, ఇప్పుడు ఆనందం వెల్లి విరుస్తోంది.

ఊరేగింపు వీధిమలుపు తిరుగుతోంది. హఠాత్తుగా ఒక వ్యక్తి గుంపులోనుండి తోసుకువచ్చి పల్లకీ ఎదుట నిలిచాడు. ఆ వ్యక్తి కోపంతో కుతకుతలాడిపోతున్నాడు. ఒక వంచకుని చేతిలో బికారి పతాకను గుంజి లాక్కున్నాడు. ఇతడికి బట్టతలఉంది. ఫ్రోగి మం టలవద్ద జిప్సీయువతిని చూసి మంత్రకత్తె అని అనుమానించినవాడే. క్రైస్తవ మతాచార్యునిదుస్తులుధరించాడు. గుంపులోనుంచి గ్రింగైర్ అతణ్ని గుర్తుపట్టాడు. "అరె! క్లాడ్ ఫ్రొలో! నాటర్ డామ్ చర్చి అధికారి ఇలా వచ్చారే!" అన్నాడు. ఫ్రొలో పల్లకి నిలిపి వేశాడు. గ్రింగైర్ భీతి చెందాడు: "ఇతని ఆయువు మూడింది! ఆ రాక్షసి నలిపి చంపేస్తాడు" అనుకున్నాడు.

క్వాసిమోడో పల్లకీ మీదినుంచి లంఘించాడు. చుట్టూ అందరూ కెవ్వుమని అరిచారు. ఏదో అకృత్యం జరుగ తుందోనని భీతిచెంది స్త్రీలు ముఖాలు కప్పుకున్నారు. ఒక్క అంగలో క్వాసిమోడో మతాధికారిముందుకు వచ్చాడు. ఫ్రొలో ముఖంలోకి చూశాడు. వెంటనే మోకరిల్లాడు. శిరస్సు

వంచుకున్నాడు. చేతులు జోడించాడు. ఫ్రాలో కోపావేశంతో పళ్ళు కొరికాడు. క్వాసిమోడో చలించలేదు. ఆపైన వారిద్దరి మధ్యా సంకేతాలతో మూగ సంభాషణ నడిచింది. ఇద్దరూ పెదవులు కదిపి మాటాడలేదు. ఫ్రాలో అధికారపూర్వకంగా ఆజ్ఞాపించాడు. క్వాసిమోడో వినయపూర్వకంగా అతడి భావాలను గ్రహిస్తున్నాడు.

చివరకు ఫ్రాలో సంజ్ఞలు చేయగా క్వాసిమోడో లేచి నిలిచాడు. ఫ్రాలో దారి తీశాడు, క్వాసిమోడో మౌనంగా అనుసరించాడు.

అవమానానికి లోనైన "మూర్ఖాగ్రేసరుని" కోసం మతాధికారితో తగవుకు సిద్ధమైనారు "మూర్ఖప్రజ". అందరూ ఫ్రాలోను చుట్టుముట్టారు. కాని క్వాసిమోడో ప్రజల నడ్డగించి, మతాధికారికి రక్షకుడై నిలబడ్డాడు. ప్రజలు నిశ్చేష్టులైనారు. కోపావిష్టుడైన ఆ వికృతమానవుని చూసి ప్రజలు వెరపు చెంది తొలగిపోయారు. భీతి చెందిన ఫ్రాలో తిరిగి గంభీరభావంతో ముందు నడిచాడు.

వారిద్దరినీ కొద్దిమందిమాత్రం దూరదూరంగా అనుసరించారు. క్వాసిమోడో గిరుక్కున వెనక్కు తిరిగాడు. పళ్లు కొరుకుతూ మృగరాజువలె ఘూర్ణించాడు. అటు పైన ఇటు తిరిగి వెనుకగా నడువనారంభించాడు. కొంతసేపటికి ఇద్దరూ చీకటిలో కలిసిపోయారు.

"చిత్రంగా ఉన్నదే! అద్భుతంగా వుంది" అనుకున్నాడు కవి. కాని ఇంతలోనే జ్ఞప్తికి వచ్చింది. "అరె! మరి రొట్టె మాటేమిటి?" అని ప్రశ్నించుకున్నాడు!

గ్రెంగోరె ఒక నిశ్చయానికి వచ్చాడు. ఏది ఎటువచ్చినాసరే జిప్సీ సుందరిని అనుసరించాలి. మేకను వెంటబెట్టుకుని ఆమె ఒక వీధిలోకి మరలడం గమనించాడు. కవి ఆ వీధి వెంట నడిచాడు. "ఏం? ఇందులో తప్పేముంది?" అనుకున్నాడు దారిలో.

పారిస్ వీధుల్లో బ్రతుకుతత్వం తీక్ష్ణంగా అవగాహన చేసుకున్న గ్రింగ్వార్, తెన్నూ తెరువూ లేకుండా ఒక సుందరిని వెంబడించడం కంటే, ఊహాస్వప్నాలు అల్లుకోడానికి మేలైన ఆలంబనం కొకటి లేదని గుర్తించాడు. ఇట్టి యోచన విసర్జనావస్థలో, వర్ణనాతీతమైన ఒక అనుభూతి—సంపూర్ణ స్వేచ్ఛకూ అంధానుకరణకూ అతీతమైన చిత్ర పరిస్థితి, బానిసత్వమూ విశృంఖలతా లేని ఒక స్థితి—కవీశ్వరునికి ఆహ్లాదం కలిగించింది. సహజంగానే గ్రింగ్వార్ తత్వం అతిచంచలమైనది, చప్పున ఏ నిర్ణయానికీ రాలేడు. ఎప్పుడూ ఆవేగ ఉద్వేగాలకు లోనై క్షణక్షణం చిత్తచాంచల్యంతో బాధపడతాడు. తరంగపాత కృశాంకురంవలె అతడు హర్షోద్వేగాల మధ్య ఊగిసలాడుతున్నాడు.

నిరాశ్రయుడైన కవి అపూర్వసుందరిని నగరవీధుల్లో అనుసరించాడు. సుందరి గమనవేగం క్రమక్రమంగా హెచ్చుతున్నది. మేక చెంగు చెంగున గంతులు వేస్తూ ఆమె వెంట పరుగు తీస్తున్నది. వీధులలో అంగళ్లు తలుపులు మూతలు పడుతున్నాయి. గవాక్షాలలో దీపాల వెలుగు ఆరిపోతున్నది. సుందరి గబగబ అడుగులు వేస్తున్నది.

“ఆమె కెక్కడో నివాసం ఉండకపోదు” అనుకున్నాడు కవి. “జిప్సీలు స్వతః చాలా మంచివాళ్లు. ఏమో మనకి...” తరవాత ఊహ అతడికి కితకితలు పెట్టినట్లయింది. లోలోన నవ్వుకున్నాడు.

క్రమంగా వీధులు నిర్జనమౌతున్నాయి. అక్కడక్కడ చెదురుగా కొందరు ఇళ్ళగుమ్మాలలో నించుని ప్రసంగం సాగిస్తున్నారు.

“అబ్బ చలెంతెక్కువగా ఉందో చూశావా?”

“ఇప్పుడేముంది? మూడేళ్లనాడుంది చలి అంటే. అప్పుడు కట్టెలు బంగారంలాగ కూచారు.”

“నిజం?”

“నిజమేమిటి? మంత్రిగారి ఊటకలంలో సిరా పేరుకుపోతేను!”

మరి కొంతదూరంలో—ఒక ఇంట్లో చలికి కొవ్వొత్తి దీపాలు కరకరమంటున్నాయి.

"మీఆయన చెప్పలేదూ?"

"ఏమిటది?"

"గుర్రంమీంచి పడ్డాట్ట పోలీసు"

"గుర్రం కాలు జారిందా?"

"అబ్బే! ఫ్లెమిష్ రాయబారుల్ని చూసి గుర్రం బెదిరిందిట"

"నిజం?"

"నీతోడు!"

ఇద్దరూ పకపక నవ్వుకున్నారు.

కవి భావసూత్రం తెగింది. అయితే కాస్సేపటికి మళ్ళీ అంతదూరంలో సుందరి కనపడేసరికి మళ్లీ ఊహల్లో పడ్డాడు. చెంగుచెంగున గంతులువేస్తున్న సుందరి మేకను పోలినట్లు ఒక సారి, మేకకూడా నృత్యంచేస్తున్నట్లుఒకసారి అతడు భావిస్తున్నాడు.

వీధులన్నీ చీకటిమయమైనాయి. ఎక్కడా జనసంచారం లేదు. ఎన్నివీధులు, సందులు, గొందులు తిరగాడో, నగరంలో తానెక్కడున్నాడో కవికి తెలియలేదు. చిక్కుపడిన దారంవలె అల్లుకొనిపోయిన వీధులలో చిక్కుకొని పోయాడు.

"అబ్బ ఈ వీధులికొక పద్ధతీ పాడూలేదు. పేలికలు పోగు చేసుకునే పిచ్చివాడెవడో ఈ నగరం నిర్మించాడు" అనుకున్నాడు. జిప్సీమాత్రం అన్నీ తెలిసినట్లు చకచకా సాగి పోతున్నది.

జిప్సీ తనవెనుక అడుగులు ఇప్పటికి విన్నది. తత్తర పాటుతో మాటిమాటికీ వెనుతిరిగి చూస్తున్నది. ఒకచోట ఒక గుమ్మంలోనుంచి వీధిలోకి వెలుగుపడుతున్నది. ఆ వెలుగులో, ఆమె ఆగిపోయింది, వెనక్కు తిరిగి కవినిచూసి నాలుక చాచి వెక్కిరించింది.

దీని కర్థం కవికి బోధపడలేదు. వెక్కిరింత ముద్దుగానే వుంది. అందులో రోషం, రోత లేకపోలేదు. అందువల్ల అతడు తలవంచుకుని అడుగులు లెక్కపెట్టుకుంటూ నడక మందగింపచేశాడు. ఒక

వీధి మలుపు చేరేసరికి హఠాత్తుగా చెవులు చిల్లులు పడేటట్లు ఆర్త నాదం విని ఉలిక్కిపడ్డాడు. వీధి బొత్తిగా చీకటిగా ఉంది. ఒక చివర చిన్న దీపంవల్ల గుడ్డివెలుగు మాత్రం కనపడుతోంది. ఇద్దరు పురుషులు ఆమెను పట్టుకున్నారు. ఆమె గిజగిజలాడుతోంది. ఆమెనోరు నొక్కడానికి పురుషులు ప్రయత్నిస్తున్నారు. మేక అరుస్తున్నది.

"ఆగు! ఆగు!" అని అరిచాడు గ్రింగోర్. ముందుకు లంఘించాడు. జిప్సీని పట్టుకున్న యిద్దరిలో ఒకడు వెంటనే ఇటు తిరిగాడు. గుడ్డివెలుగులో అతడి ముఖం చూసి కవి కంపించిపోయాడు. అతను వికృతరూపి, క్వాసిమోడో. కవి కదలలేకపోయాడు. క్వాసిమోడో ఒక్క అడుగులో వచ్చి కవిముఖాన పిడికిలితో ఒక్క ప్రహారమిచ్చాడు. కవి గిరగిర తిరిగి నేలపై కూలిపోయాడు. క్వాసిమోడో వెనక్కు తిరిగి జిప్సీని ఒక చేతిపైన పట్టుగుడ్డవలె వేసుకుని చీకటిలో మాయమైనాడు. రెండవ పురుషుడుకూడా అతడివెంట పారిపోయాడు. మేక వారివెంట పడింది.

"చంపేస్తున్నారు బాబో!" అని కేకలువెయ్యనారంభించింది జిప్సీ.

ఇంతలో "ఆగండి! ఎవరది?" అని గంభీర కంఠధ్వని వినవచ్చింది. అశ్వారూఢు డొకడు వారిముందు ఆగాడు. అతడు మహారాజు సంరక్షకబృందానికి అధిపతి. కత్తిదూసి ఝళిపించాడు. గుర్రంపైనుండే జిప్సీని ఒక చేతితో అందుకుని గుర్రంపైన కూర్చోపెట్టుకున్నాడు. క్వాసిమోడో నిశ్చేష్టుడై నిలిచాడు. కొన్ని క్షణాలకు తేరుకుని గుర్రంపైకి లంఘించబోతున్న సమయంలో పదిపన్నెండుమంది అశ్వికులు వచ్చి అతణ్ని చుట్టుముట్టారు. ఆరాత్రి ఈ సిబ్బంది గస్తీ తిరుగుతున్నది.

క్వాసిమోడో బంధితుడైనాడు. కాని అత డూరుకోలేదు. దిక్కులు బద్దలౌతున్నట్లు బొబ్బలు పెట్టసాగాడు. నురగలు కక్కుతూ బంధనాలు తెంచుకోడానికి గుంజుకున్నాడు. కాళ్లు తన్నుకుంటున్నాడు. అందినవారిని కరిచి పోగులు పెడుతున్నాడు. అదే పగలైతే అతడి భీకరాకారం చూసి అశ్వికుల అశ్వాలు బెదరవలసిందే. ఈ సంఘర్షణలో అతడి మిత్రుడు చీకటిలో జారుకున్నాడు.

జిప్సీ ఒయ్యారంగా ఒళ్ళువంచి గుర్రంపైనే వెనక్కు తిరిగి కెప్టెన్‌వంక చూసింది. రెండు చేతులతో అతడి భుజాలు పట్టుకుని ముఖాన్ని పరిశీలించింది. అతని ముఖవర్చస్సు చూసి ముగ్ధురాలయింది. కృతజ్ఞత ఆమె ముఖంలో నాట్యమాడింది. మాధుర్యం ఒలకబోస్తూ అడిగింది "మీ రెవరో?"

"కెప్టెన్ ఫీబస్," అన్నాడతడు ఛాతీ విరుచుకుని.

"నన్ను రక్షించారు. మీ మేలు మరువరానిది" అన్నది.

కెప్టెన్ ఫీబస్ దర్జాగా మీసంమీద చెయ్యివేసుకున్నాడు. జిప్సీ గుర్రంమీదినుంచి జారింది. జారి చీకటిలో మాయమయింది.

## 8

గ్రింగైర్ వెల్లకిల పడిపోయాడు. కొంతసేపటికిగాని తెలివి రాలేదు. తెలివి వచ్చేసరికి స్వప్నంలో తేలిపోతున్నట్లనిపించింది. ఆ స్వప్నమాత్రపు స్మృతిలో జిప్సీ సుందరి, మేక దృగ్గోచరమైనారు. తరువాత క్వాసిమోడో భయంకరాకారం గుర్తు వచ్చింది. చెంప తడువుకొన్నాడు.

తరవాత వెన్నంతా చలిలో గడ్డకట్టినట్లు తోచింది. అప్పుడతనికి తానేస్థితిలో ఉన్నాడో తెలిసి వచ్చింది. "ఇంత చలెల్లా వచ్చింది?" అని ప్రశ్నించుకున్నాడు. చుట్టూ చూశాడు. "అరె! ఇది కుక్కలకూడులా వుందే!" అనుకున్నాడు.

"పీడి చేతులు పడిపోను" అని తిట్టుకున్నాడు. లేవడానికి ప్రయత్నించాడు. కాని ఒళ్ళంతా పచ్చి పుండుగా వుంది. ఒక్క చెయ్యిమాత్రం కదపగలిగాడు. కాని లాభంలేదు. ఆ చేతో ముక్కు రాచుకొంటూ అలా పడుకుని వుండిపోయాడు.

"ఇది పారిస్ బురదోయ్ బాబు!" అనుకున్నాడు కవి. ఈ రాత్రికింక ఈ కుక్కకూడే తన తల్పం కాబోలనుకున్నాడు. "ఇంత ఘోరమైన కంపు ఇంక ఏ వూరు బురదకీ వుండదు. ఇందులో ఏవి శేషం ఉందో తెలియదు. శాస్త్రజ్ఞులే ఒప్పుకున్నారు..."

శాస్త్రజ్ఞుల పేసరికి స్వర్ణయోగం జ్ఞప్తికి వచ్చింది. స్వర్ణయోగంతో క్లాడ్ ఫ్రొలో జ్ఞప్తికి వచ్చాడు. మళ్లీ ముక్కుపై

దెబ్బ గుర్తుకు వచ్చింది. వెంటనే సుందరి అపహరణయత్నం, సంఘర్షణ గుర్తువచ్చాయి. క్వాసిమోడో ప్రక్కన ఒకడుండాలి. జిప్సీ యువతిని పట్టుకున్నది ఇద్దరు. ఫాదర్ ఫ్రాలో ఆకారం, ముఖంలోని పరుషభావం కళ్లకు కట్టినాయి. ఇది చాలా చిత్రంగా ఉందే! అనుకున్నాడు. దీనిపైన ఊహలు అల్లుకో నారంభించాడు. ఈ ఊహలతో మరొక్క తెరచలివెన్నులో పొడిచినట్లయింది. "హరి దేవుడా!" అనుకున్నాడు.

చలి అంతకంతకు అధికమౌతోంది. కుక్కగూటిలో తేమ అతడి శరీరంలో ఉష్ణాన్ని జివ్వున పీల్చివేస్తున్నది. శరీరం మొద్దుబారిపోతున్నది. అంతలో కోలాహలం వినవచ్చింది.

పారిస్ నగరం పుట్టినది మొదలు నేటివరకూ నగరవీథుల్లో నిత్యపరిచయమైన దృశ్యం అతడికి గోచరించింది. సన్నగా చిక్కి, ఆచ్ఛాదనంలేని కాళ్ళు మురికి, బురద తేడా తెలియకుండా పరుగులమీద వస్తున్నాయి. ఆకతాయి పిల్లల గుంపొకటి వచ్చి పడింది. తమ లాగులమాదిరి చిరగని లాగులు ధరించిన పిల్లల్ని చూస్తే వీరికి కోపం. రాళ్లు విసిరికొడతారు. వీలైతే పట్టుకుని చితకగొడతారు.

ఆకతాయి పిల్లలు కేరింతలు గొడుతూ, కుక్కగూటిని సమీపించారు. నివాస భోగం కలవారి నిద్ర కలతచెందుతుందనే భీతి వారి కనవసరం. పొలిబొబ్బలు పెడుతున్నారు. పిలల కొయ్య చెప్పుల టకటకలకు వచ్చినవారు గోరీలనుండి ఉలిక్కిపడి లేవాలి. నగం మాత్రమే వచ్చిపడిఉన్న గ్రింగౌర్ కొద్దిగా తలెత్తి చూశాడు.

"ఓరే! ఆమూల ఇనపకొట్టువాడు వచ్చిపోయాడురోయ్. ఇవ్వాళేరా. వాడి పీచుపరుపుతో చలిమంట కాచుకుందామా?" అన్నాడొకడు.

"చూస్తారేం ఇంకా! నడవండి" అన్నారు కొందరు.

మళ్ళీ పరుగు లారంభమైనాయి. ఒక పక్కకువెళ్ళి మళ్ళీ వచ్చారు. పీచుపరుపొకటివచ్చి అమాంతంగా కవిపైన పడింది. వారు కవిని చూడలేదు. ఒకడు పరుపులోనుంచి కొంతపీచు లాగి పరుగెత్తాడు. వీధిమొగలో నున్నదీపం వద్ద నిప్పు ముట్టించాడు.

"అరెరె!" అన్నాడు గ్రింగైర్ తబ్బిబ్బవుతూ. "ఇదేమిటి? నాకే నిప్పంటుకుంటోందేమిటి?"

కింద తేమకీ, పైన మంటకీ మధ్య అతడికి ప్రమాదం ఆసన్నమయింది. లేవడానికి విశ్వప్రయత్నం చేశాడు; చేసి లేచి నిలిచాడు. పీచుపరుపు పక్కనున్న పిల్లలపైన పడిపోయింది. గ్రింగైర్ కాలికొద్దీ పరుగెత్తాడు.

"అరెరెరె! ఇనపకొట్టువాడి దెయ్యంరోయ్!" అంటూ పిల్లలందరూ పరుగు లంకించుకొన్నారు!

మరునాడు నగరమంతా గుప్పుమంది. పీచు పరుపులో దాగిన ఇనపకొట్టువాడి దయ్యం పరుపుని చర్చిముందుకు తీసుకువెళ్లేసరికి రూపంధరించి లేచి పారిపోయిందని చెప్పుకొన్నారు. తరువాత ఆ చర్చిలో ప్రత్యేక ప్రార్థనలు, ఉత్సవాలు జరిగాయి.

# 9

కాలో పినంతసేపు దిక్కు తెన్నూ కానక పరుగెత్తాడు కవి. వీధిమలుపుల గోడలకు తల కొట్టుకొని, వాననీటి గుంటలలో తడబడుతూ, సుడులు మెలికలు తిరుగుతూ వీథులవెంట ప్రాణభయంతో పరుగెత్తాడు. పరుగెత్తి పరుగెత్తి చివరి కాయాసంతో ఒకచోట నిలిచాడు. నిలిచి ఊపిరి తీసుకున్నాడు. తరువాత మనస్సులో ఒక యోచన తోచింది. "ఇదేమిటోయ్! మాస్టర్ పీర్ గ్రింగైర్! ఇలా చేశావేమిటి?" అనుకున్నాడు తనలో తానే. ఒక వేలితో ముక్కు తాటించి ఇలా అనుకున్నాడు: "ఎంత మందమతివైనావు! ఎందుకీ పారిపోవడం? నువ్వెంత భయపడ్డావో, నిన్ను చూసి ఆ కుర్రకుంకలంతకంటె ఎక్కువ భయపడ్డారని తెలీయదూ? నువ్వేమో ఉత్తరపు దిక్కుకి పరుగెత్తితే, కుర్రవాళ్ళు దక్షిణానికి పరుగుతీశారు. వాళ్ళు పారిపోయారే అనుకో—అంటే ఆ పీచుపరుపు పక్కనే ఉందన్నమాట. అంటే—మేరీకన్యను స్తోత్రం చేస్తూ నువ్వు రాసిన అద్భుతగీతాల కామె ప్రసన్నురాలై నీకు పాన్పు పంపింది విశ్రాంతికోసం. ప్రొద్దుటినుంచీ దేనికోసం వెదకులాడుతున్నావో, అది నీకోసం అక్కడ ఏర్పరచబడివుంది. వాళ్ళు పారిపోలేదే అనుకో. అప్పుడు వాళ్ళు దానికి నిప్పు పెట్టి

ఉంటారు. ఇప్పుడు, నీకు ముఖ్యంగా కావలసింది చలిమంట. కాబట్టి చలిమంటగా ఉపయోగపడినా, పాన్పుగా వినియోగపడినా ఆ పీచుపరుపు నీకు దేవతాప్రసాదం అని తెలుసుకో. నీకోసమే మేరీకన్య ఇనప అంగడివాడికి పరలోకప్రాప్తి కలిగించి ఉంటుంది. పోలీసుని చూసిన దొంగ మాదిరిగా కాలికి బుద్ధి చెప్పడం మాత్రం అవివేకం. కాబట్టి వెనక్కి తిరుగు."

గ్రింగైర్ వెనక్కి తిరిగాడు. చీకటిలో కన్ను పొడుచుకు చూస్తూ, చెవులు నిక్కబెట్టుకుని వింటూ నడిచాడు. పీచుపరుపు కోసం వెతుక్కుంటూ గబగబ అడుగులు వేశాడు. కాని అతడి యత్నం వ్యర్థమయింది. కవి గమ్యానికి వీధిమలుపులు, ఇరుకు విరోధాలౌతున్నాయి. ఒక్కొక్కప్పుడు అయిదువీధులు, ఆరువీధులు కలిసేచోట నిలబడి ఏదారీ నిర్ణయించలేక విసుగుచెందాడు: "ఈ నగరం నిర్మించిన బుద్ధిహీను డెవడో నాకు పరమశత్రువు."

తిరిగితిరిగి ఒక కూడలిలో నిలిచి చూశాడు. ఒకవీధి కావలి చివర చిన్నమంట, గుడ్డి వెలుగు కానవచ్చాయి. "ఆ! అదే! అదిగో నా పరదేవత!" అన్నాడు. పరదేవత అని మేరీకన్యనే స్తుతించాడో, అగ్నిశిఖనే స్తుతించాడో తెలియదు. వెంటనే ఆబాట ననుసరించాడు.

ఆవీధిలో కొద్దిదూరం వెళ్ళినంతలో అతడికి చిత్రవిచిత్రమైన ఆకారాలు గోచరించాయి. నడిచినకొద్దీ ఆవీధిలో బురద అధిక మయింది. దారి పల్లమౌతున్నది. ఒక ఆకారమంటూ లేని నల్లని పెద్దపెద్ద ముద్దలేవో గునగున నడిచిపోతున్నాయి. ఆ ఆకారాలన్నీ వెలుగువైపుకే పోతున్నాయి.

నిర్ధనుడైనవాని సాహసానికి అంతుండదు. గ్రింగైర్ గబగబ నడిచాడు. అకస్మాత్తుగా అతడికి ఎవరివో మాటలు వినవచ్చాయి. కిందికి వంగి చూశాడు. సుమారు మూడడుగుల ఎత్తుగల ఆకారం తొన్నె ఎత్తి ఏదో అన్నది. "ఇది ఇటాలియన్ భాష కాబోలు! ముష్టివధవ!" అనుకున్నాడు. ముష్టివాడు రెండుచేతులమీదా గెంతుతూ పోతున్నవాడు ఆగి భిక్షమడిగాడు.

"ఆ దేభాషో నాకు తెలియదు" అంటూ గ్రింగైర్ ముందుకు నడిచాడు. మరొక ఆకారం దారి కడ్డువచ్చి నిలిచింది. చేతులూ కాళ్లూ వంకరైన అవిటివా డతడు. "ఓహో! విశ్వకర్మ ముక్కాలి

పీటలాగున్నాడు!" అన్నాడు కవి. ముక్కాలిపీట గౌరవ సూచకంగా టోపీతీసి అభివాదం చేశాడు. టోపీ గ్రింగైర్ గడ్డంకింద చూనిపి ఏదో వాగాడు: "ఇది స్పానిష్ కాబోలు" అన్నాడు గ్రింగైర్ "నాకైతే నువ్వు చెప్పిందేమీ బోధపడటంలేదు కాని నీకైనా తెలుస్తుందా?" అన్నాడు. పక్కకు తప్పుకొని నడవబోయాడు. ఇంకొక ఆకారం అడ్డు తగిలింది. ఈ ఆకారానికి పెద్ద గడ్డం ఉంది. గుడ్డివాడు. ఒక కర్ర చేతబట్టి తెడ్డుతో నావ నడుపుతున్నట్లు బాటలో ఈదుతున్నాడు. వెనక ఒక పెద్ద కుక్క ఉంది. అది అతణ్ని ముందుకి గెంటుతూవుంది. అతడేదో గొణిగాడు: "ఈ భాష తెలుస్తోందిలే. ఇది ఫ్రెంచిభాష, అమ్మయ్య! ఏమిటన్నావ్? ధర్మమా! బాగా అడిగావ్. నాకు మిగిలిన ఆఖరి చొక్కా అమ్మేసి వారంరోజు లయిందప్పుడే. ఇప్పుడు నాజేబు ఖాళీ."

గుడ్డివాడిని తప్పించుకు నడిచాడు గ్రింగైర్. గుడ్డివాడు కన్నులున్నవాని మాదిరిగానే అతడివెంటపడ్డాడు. మిగిలిన ఇద్దరూ గునగున నడిచివచ్చారు. గ్రింగైర్ పాదాలనంటి పరుగుతియ్యనారంభించారు. ముగ్గురూ మూడుభాషల్లో ప్రార్థిస్తున్నారు.

కవి చెవులు మూసుకున్నాడు: "అబ్బబ్బ! ఇదెక్కడి చెవిటిదర్బారు?" అని విసుక్కున్నాడు.

గ్రింగైర్ శక్తికొద్దీ పరుగెత్త నారంభించాడు. గుడ్డివాడు పరుగెత్తాడు. కుంటివాడు పరుగెత్తాడు. ముక్కాలిపీట పరుగెత్తాడు. ఆ పైన అనేకమంది మరుగుజ్జులు, వికలాంగులు, కుష్ఠరోగులు కవిని చుట్టుముట్టారు. చీకటికోణాలలోనుంచి అప్పటికప్పుడు పుట్టుకొచ్చినట్లు బిలబిలమంటూ అసంఖ్యాకంగా వచ్చిపడ్డారు భిక్షుకగణం. అరుస్తున్నారు, మొరుగుతున్నారు, ఓండ్రపెడుతున్నారు. రకరకాల ధ్వనులు చేస్తూ కవిని వెంటాడించారు.

గ్రింగైర్ విభ్రాంతుడై పరుగెత్తాడు. భిక్షుకు లడ్డుపడ్డారు. గ్రింగైర్ చుట్టూ కలయచూశాడు. పారిపోవటం కష్టమనిపించింది. కళ్లుమూసుకుని పరుగెత్తాడు. వీధి-చివర విశాలమైన ప్రదేశం కానవచ్చింది. ఆ మైదానంలో అనేక దీపాలు గుడ్డివెలుగు ప్రసరిస్తూ రెపరెప లాడుతున్నాయి. అదృశ్యమంతా పాడుకలవలె

గోచరించింది. కాళ్ళముందున్న వికలాంగుల్ని పడగొట్టి ముందుకు పాగాడు. ముక్కాలిపీట అమాంతంగా కాళ్లు సాచి లేచి నిలబడ్డాడు. గ్రింగ్రర్ నిశ్చేష్టుడైనాడు. మామూలుమనిషి ముక్కాలి పీటా ఎలా కాగలిగాడు ? ఇనపదొన్ని తీసి కవి నెత్తిమీద బోర్లించాడు. గ్రుడ్డివాడు పెరిగి నిలబడి కవిముఖంలోకి తీక్షణంగా చూశాడు.

"అరె! ఇదేమిటి? నే నెక్కడున్నా నిప్పుడు?" అన్నాడు కవి.

"మాయానిలయం."

"మాయ! నిజం! ఇక్కడి గుడ్డివాళ్ళు చూడగలరు; కుంటివాళ్ళు పరుగెత్తగలరు. నిజంగా మాయే!"

దీనికి వికటాట్టహాస మొక్కటే జవాబు వచ్చింది.

పాపం కవి దీనంగా చుట్టూ చూశాడు. నిజంగా నే వంచకుల మధ్యకు వచ్చిపడ్డాడు. పారిస్‌లో పసుపుగలవా రెవ్వరూ ఈ చోటికి రారు. అర్ధరాత్రి సమయంలో ఈ చోటు నెవ్వరూ చూడ లేదు. సాహసించి ఈ వ్యూహంలో అడుగు పెట్టిన పోలీసులు, అధికారులు యెవ్వరూ బ్రతికి బైటపడలేదు. ఇది దొంగలకు నిలయం. పారిస్ నగరానికి కళంకం. దుర్వ్యసనపరులు, వంచకులు, చోరులు, జారులు, దుష్టులు, భిక్షుకులు అందరూ ప్రతి ఉదయం ఇక్కడినుంచే నగరంమీదికి వరదలా వ్యాపిస్తారు. మురికి కాల్వలన్నీ ఒకేలక్ష్యానికి ప్రవహించినట్లు తిరిగి రాత్రికి అందరూ, అన్ని వీధులగుండా ఇక్కడికే వచ్చిపడతారు. చౌర్యం, దోపిడి, దౌర్జన్యాలవల్ల రాబట్టిన సకలవస్తుసముదాయం రాత్రికి ఇక్కడ చేరుతుంది. జిప్సీలు, వివిధదేశాలనుంచి బహిష్కృతులు, అన్యజీవనాధారంలేక వంచక శిల్పంపైనే బ్రతుకు గడిపేవారు, పగలు ముష్టి అడుక్కుంటూ రాత్రి దొంగతనాలు చేసేవారు, సర్వస్వం కోలుపోయి నగరంలో ముఖం చూపలేక పారిపోయినవారు, క్రైస్తవులు, యూదులు, మహమ్మదీయులు మొదలైన సకలమతస్థులూ, స్పానిష్, జర్మన్, ఇటాలియన్ మొదలైన అన్ని జాతులవారూ ఇక్కడే చేరతారు. విధివంచితుల కిది ఆశ్రయం. చోరహత్యా వ్యభిచారాల మహానాటకానికి పాత్రధారులు వేషాలు మార్చే నేపథ్యమిది.

అక్కడక్కడ చలిమంటల ముందు వింత వింత ఆకారాల వ్యక్తులు గుమిగూడి ఉన్నారు. అరుపులు, పెడబొబ్బలతో ఆ ప్రదేశమంతా అల్లకల్లోలంగా వుంది. మొరటు నవ్వులు, పిల్లల యేడ్పులు, స్త్రీల కేకలతో రణగుణ ధ్వనులతో చెవులు గింగుర్లెత్తుతున్నాయి. రెపరెపలాడే మంటల వెలుగులలో మనిషిని పోలిన కుక్క, కుక్కను పోలిన మనిషి తిరుగాడడం కనపడుతుంది. ఇక్కడ జాతిమతవివక్షత లేదు; స్త్రీపురుష భేదం లేదు. ఆ గుడ్డి వెలుగులోనే పాత కొంపలు, పాడుపడిన యిళ్ళు, పూరిళ్ళు కనపడుతున్నాయి. అక్కడక్కడ పీచు జుట్టులతో ముసలమ్మల ఆకారాలు దయ్యాలవలె తచ్చాడుతున్నాయి.

ఈదృశ్యం చూసేసరికి గ్రింగైర్‌కి వణకు పుట్టింది. అతడిని ముష్టివాళ్లు విడిచిపెట్టలేదు. మతిపోతున్నది. అతని యోచనా శక్తి హీగిపోయింది; తాను చూస్తున్నది కలా నిజమా అని నిర్ధారణ చేసుకోలేని స్థితిలో ఉన్నాడు. తన కళ్లను తాను నమ్మలేక పోతున్నాడు. "నేను నిజమా? ఇదంతా నిజమా? ఏది నిజం?" అని ప్రశ్నించుకున్నాడు.

ఇంతలో గంభీరకంఠధ్వని ఒకటి వినవచ్చింది.

"మహారాజువద్దకు తీసుకురండి వాణ్ణి."

"ఇక్కడొక మహారాజా! తీరా ఏ మేక మహారాజౌతుందో!" అని గొణుక్కున్నాడు కవి.

కవిమీద విరుచుకుపడ్డారు వికలాంగులు. కాని ముందున్న ముగ్గురూ కవిని గట్టిగా పట్టుకుని మిగిలినవారందరినీ అడ్డగించి, "విడిచిపెట్టండి. వీడు మావాడు. మేం పట్టుకున్నాం" అని హెచ్చరించారు.

అసలే చినిగిన అతనికోటు ఈమారు పేలికలయింది. ముగ్గురూ అతణ్ణి లాక్కుపోయారు.

ముగ్గురి చేతులలో గట్టిగాచిక్కిన కవికి ఈమారు ఇది కలగాదని తెలిసివచ్చింది. క్రమక్రమంగా జాగ్రదవస్థలోకి వచ్చాడు. క్రమంగా చుట్టూ పరిస్థితులు బోధపడుతున్నాయి. తానున్నది మరోలోకం కాదనీ ఈలోకమేననీ, తనచుట్టూ ఉన్నవారు భూతాలూ రాక్షసులూ కారనీ దొంగలనీ, తన ఆత్మ నరకంలో

పడలేదనీ ప్రాణానికిమాత్రమే ముప్పువున్నదనీ తెలిసి వచ్చింది. అతడిప్రాణానికి నిజంగానే ముప్పు వచ్చింది. ఈ ముప్పునుండి కాపాడగల పణం అతనివద్ద లేదు.

అతణ్ని గుహవంటి ఒక యింటిలోనికి లాక్కువెళ్లి నిల బెట్టారు. అక్కడ దృశ్యంచూచేసరికి కవికల్పనాశక్తి హరించి పోయింది.

అక్కడొక పెద్ద నెగడి మండుతున్నది. ఉన్నతున లేస్తున్న మంటల వెలుగులలో అమరికలేని మేజాలు, కుర్చీలు కనపడు తున్నాయి. వడ్రంగిపనితనం రుచిచూడని బల్లచెక్కలతోనూ కర్ర ముక్కలతోనూ నిర్మించబడిన మేజాలు కుర్చీలూ చిత్రమైన ఆకారాలలో ఉన్నాయి. కొందరక్కడ కూర్చుని మద్యం సేవిస్తు న్నారు. ఉత్తుత్తిగాయంపై కట్టువిప్పుకుంటూ కుంటెంతి పాటుగల వాడొకడు ఈలపాట పాడుతున్నాడు. అతడివెనుక ఒక దొంగ సోదరీ కూర్చుని బూతుపాటలు పాడుతున్నాడు. ఒకచోట ఒక బాలుడు ఎలా మూర్ఛపోవాలో నేర్చుకుంటున్నాడు. చిన్న సబ్బు ముక్క నమిలి నోటచివర నురుగెలా తెచ్చుకోవాలో వాడికి పెద్దవా డొకడు ప్రమాణసహితంగా నేర్పుతున్నాడు. ఆ సాయం కాలం దొంగిలించితెచ్చిన ఒక పసిబిడ్డకోసం నలుగురు స్త్రీలు ఒక చోట కొట్లాడుతున్నారు. ఇట్టి 'మాయానిలయం' ఫ్రెంచినాట కాలలో కెక్కిందంటే ఆశ్చర్యంలేదు.

నలుమూలలా మొరటు నవ్వులు, బూతుపాటలు, దౌర్జన్య పూరిత కంఠధ్వనులు వినవస్తున్నాయి. ఒక పెద్దకుక్క నిప్పుల ముందు కూర్చుని దీర్ఘాలోచన చేస్తున్నది. ఇక్కడ బాలబాలికలు కూడా అనేకమంది ఉన్నారు.

నెగడి సమీపంలో బోర్లించిన ఎత్తైన ఒక తొట్టిపైన 'మహా రాజు' ఠీవిగా కూర్చున్నాడు. తొట్టి అతడిసింహాసనం. గ్రింగైర్ అక్కడ నిలబడ్డాడు. క్షణంసేపు అంతటా నిశ్శబ్దం వ్యాపించింది. గ్రింగైర్‌కి కన్నెత్తిచూసే ధైర్యంలేదు. అతణ్ణితీసుకువచ్చిన ముగ్గురి లోనూ ఒకడు స్పానిష్‌భాషలో ఏదో సమాధాన మిచ్చాడు. వెంటనే అతడి నెత్తిపైనున్న టోపీ ఎగరవేశాడొకడు.

"ఎవడురా ఈదాసుడు...?" అన్నాడు 'మహారాజు...'

గ్రింగైర్ తలెత్తి చూశాడు. ఉదయం న్యాయ సభామందిరంలో అతిథి వేదిక క్రింద ఒక కమ్మీపైనెక్కి కూర్చుని యాచించిన వాడే ఈ 'మహారాజు.' పేరు క్లోపిన్. అయితే మహారాజు దుస్తులు మారలేదు. ఉదయం ఎలా ఉన్నాడో ఇప్పుడూ అలానే ఉన్నాడు. చేతి మీద గాయం మాత్రం ఇప్పుడు లేదు. చేతిలో ఒకతోలు కొరడా ఉన్నది. ఆరోజుల్లో జనసమూహాలను అరికట్టడానికి రాజభటులు ఉపయోగించేవారీకొరడాలు. అతడొక చిత్రమైన టోపీ ధరించాడు. అది పసిబిడ్డల కుచ్చుటోపీయో, రాజులకుచ్చుకిరీటమో చెప్పడం కష్టం. రెండూ సుమారు ఒకే పోలికనుంటాయి.

'మహారాజు'ను సుర్తించగానే ఎందుకో కవికి కొంతలో కొంత ఆశ జనించింది.

"అయ్యా! దేవరా! మహాప్రభూ! తమరినెల్లా సంబోధించాలో తెలియడంలేదు" అన్నాడు కవి.

"మహాప్రభూఅన్నా సరే, భాయీ అన్నా సరే, ఏదో ఒకటి చెప్పదల్చుకున్నది గబగబా చెప్పెయ్యి. నీ నేరానికి నువ్వేం సమర్థించుకుంటావో త్వరగా తేల్చెయ్యి." అన్నాడు మహారాజు.

"సమర్థించుకోవడమా! నాలాటివాడు......ప్రొద్దుట అంత గొప్ప నాటకం..."

"అపవోయ్ అపు. నీ పేరేమిటి? ఇటుచూడు. నువ్వెవరి సమక్షంలో ఉన్నావో తెలుసా? వంచక రాజ్యాధిపతిని నేను. ఇప్పుడు నీ నేరం విచారించడానికి న్యాయనిర్ణేతలు ముగ్గురం. నేనుగాక ఇంకొకడు జిప్సీలకు రాజు; మరొకడు సకల దేశాల అశ్లీల భాషానుశాసకుడు. అన్యరాజ్యానికిచెందిన పౌరుడవు నువ్వు మా అనుమతి లేనిదే మా రాజ్యం ప్రవేశించావు. మా నగర శాసనాల నతిక్రమించావన్నమాట. నువ్వు శిక్షకు పాత్రుడవు. దొంగతనం, జేబుదొంగతనం, దోపిడి, వంచన, ముషి మొదలైన వృత్తులలో ఆరితేరినవాడవైతే నీకేం భయం లేదు. నీ గుణగణాలేమిటో, నీ ప్రజ్ఞ లేమిటో తెలియపరుచుకో."

కవి నిస్పృహచెందాడు. "అయ్యో! నా కంతటి అదృష్టం, గౌరవం లేవే! నేను కవిని మాత్రమే!"

"చాలింక ఆపు!" అని అరిచాడు క్లోపిన్. "నీకు ఉరిశిక్ష విధించాం. ఇది మా న్యాయం విధించిన శిక్ష. మీ రాజ్యంలో మా ప్రజల కెటువంటి న్యాయం జరుగుతోందో, మా రాజ్యంలో మీకు సరిగ్గా అదే న్యాయం జరుగుతుంది. బికారులూ చోరులకోసం ఎటువంటి శిక్షలు మీరు నిర్ణయించారో, మీకూ మా రాజ్యంలో అటువంటి శిక్షలే లభిస్తాయి. దీనికి తిరుగులేదు. నీకు పడిన శిక్ష ఇంత క్రూరంగా ఉందంటే కారణం మీరే. ఉరితాళ్ళలో బిగిసి చచ్చేది ఎప్పుడూ మేమే అయితే బాగుండదు. అప్పుడప్పుడు నీలాంటి పెద్దమనుషులు, పరువుగల నాగరికులు కూడా చిక్కుకుంటే గాని ఉరి స్తంభానికి గౌరవం మన్నా లభించవు. ఊ! సిద్ధపడు. మర్యాదగా ముందే నీ దుస్తులు తీసి ఇక్కడవాళ్ళకి పంచిపెట్టు. నీ జేబులో డబ్బు తియ్యి. మద్యం కొని వీళ్ళందరికీ ఇయ్యి. తర వాత నిన్ను ఉరితీస్తుంటే వీళ్ళంతా చూసి వినోదిస్తారు. పారిస్ నగరవీధుల్లో మావాళ్ళని ఉరితీసేటప్పుడు ఎంతమంది జనం మూగి అల్లరి చేస్తారో చూశావా? మా ప్రజలు అంతమంది ఇక్కడ చేర లేకపోవచ్చును. కాని అంత అల్లరిజేసి అంతకంటె అధికంగా వినో దించగలరు. ఉరితీసేముందు దైవప్రార్థన ఏదేనా గొణుక్కోవలసి వుంటే కింద సామానుగదిలోకి పో! చర్చిలోనించి ఎత్తుకొచ్చిన రాతిసిలువ ఉంది అక్కడ. నీ దేవుడితో వ్యవహారం ముగించు కోడానికి నీకు నాలుగు నిమిషాలు వ్యవధి ఇస్తాం. పో."

గ్రింగైర్ నోరు మెదపక, కన్నార్పక చూసి విన్నాడు.

వెనుక చప్పట్లు వినపడ్డాయి "ఒహో హో! ఏమి అద్భు తంగా ఉపన్యసించావోయ్ క్లోపిన్! రోమ్ చర్చి సర్వాధికారి పోప్‌లాగా మాట్లాడావ్!" అన్నాడు సంశితుడైన అశ్లీల భాషానుశాసకుడు.

గ్రింగైర్‌కి అమాంతంగా రసావేశం పుట్టుకువచ్చింది. "ఓ మహాచక్రవర్తీ! పొరపాటు అనేది ఎరగని మీ రెలాగో పొరపడ్డా రీమాటు. నా పేరు పీర్ గ్రింగైర్! ఇవాళ ఉదయం న్యాయసభా మందిరంలో ప్రదర్శించబడిన నాటకం నాచే రచించబడింది. వినండి..."

"ఓ! నేనూ ఉన్నానక్కడ" అన్నాడు క్లోపిన్. "పొద్దున్న

అక్కడ నీనాటకంతో మనుష్యుల్ని విసిగించింది చాలక ఇక్కడ కూడా బాధ పెట్టదల్చుకున్నావా? లాభంలేదు. నీ కీర్తి ఊరి తప్పదు."

"అరె! ఎలాగిప్పుడీఉచ్చులోనుంచి బైటపడ్డం?" అని ఆలోచించాడు గ్రింగైర్. మరొకసారి ప్రయత్నం చేశాడు.

"అయ్యో నా దొకమనవి! కవీశ్వరుల్ని కూడా బికారులకింద ఎందుకు జమగట్టకూడదో తెలియదు. ఇతిహాసకర్త హోమర్ ముష్టివాడు. చిత్ర కథానిర్మాత ఈసోప్ బికారి. మహావక్త మెర్క్యురీ చోరుడు."

"ఆపు ఆపు" అన్నాడు క్లోపిన్. "మమ్మల్ని మోసం చెయ్యాలని చూస్తున్నావ్! ఇదేంసాగదు. ఆట్టే అల్లరి చెయ్యక నడు ఉరి స్తంభందగ్గరికి."

"క్షమించండి మహారాజా! ఒక్క క్షణం వినండి! అసలింత శిక్ష నావంటివాడికి తగునా అని నా మనవి! అహహా! వినండి నా సమర్థన వినకుండా నే శిక్ష..."

కాని కవిమాట వినేదెవరు? అందరూ కోలాహలం చేస్తూ లేచారు. ఒక బాలుడు నిశ్చింతగా మేజాపైన గీకుతూ చప్పుడు విని ఆనందిస్తున్నాడు.

క్లోపిన్ కొంతసేపు, 'పండితుని'తోనూ, జిప్సీల రాజుతోనూ సంప్రదింపులు సాగించాడు. "అల్లరి చేయకండి" అని అరిచాడు జిప్సీలరాజు. అందరూ నోళ్లు కట్టుకున్నారు. కాని ప్రక్కన మరుగుతున్న నీళ్లు, పెనంపైన మాంసంముక్క రాజాజ్ఞ మన్నించ లేదు. మహారాజుకి కోపంతో మొఖం ఎర్రబడిపోయింది. సింహాసనంమీదినుంచి ఒక్క ఉదుటున దుమికి నీళ్ళగిన్నెనూ, పెనాన్ని ఒక్క తాపు తన్నాడు. దగ్గర మేజాపైకూర్చున్న బాలుడు కిందపడి ఏడువ నారంభించాడు. పెనంపైన మాంసంముక్క నిప్పులోపడి పోయింది. తరువాత శాంతించి మహారాజు సింహాసన సమధిష్ఠించాడు.

మహారాజు సంజ్ఞ చేశాడు. సామంతులు అతని చుట్టూ మూగారు. అందరికీమధ్య గ్రింగైర్ నిలబడే ఉన్నాడు. వికృత

ముఖాలు, క్రూరదృష్టులు, పేలికలైన దుస్తులు, ఆచ్ఛాదనలేని చేతులు, కాళ్లు, చిక్కి శల్యాలైన దేహాలు, తుప్పుపట్టిన విరిగిన కత్తులు, ఇనుపముక్కలు ఇవన్నీ చూసేసరికి కవి భయభీతుడైనాడు. అందరిమధ్యా మహారాజఠీవితో క్లోపిన్ అధికారం వెలగబెడు తున్నాడు. మహారాజుముఖంలో క్రౌర్యం, దౌర్జన్యం మూర్తీభ వించినాయి.

క్లోపిన్ తన వంకరగడ్డాన్ని మొరటువేళ్లతో తాటిస్తూ గ్రింగైర్ వంక చూసి ఇలా అన్నాడు: "ఒరే! నిన్నెందుకు ఉరి తియ్యకూడదో నాకు కారణం కనపడదు. నీకిది బొత్తిగా రుచిం చడంలేదని తెలుస్తూనే వుంది. అది సహజమే. పారిస్‌లో నీవంటివాళ్లెప్పుడూ ఇటువంటివి రుచి చూడలేదు. మీకు ఉరి అంటే మరీ భయం ఎక్కువ. ఇంతా చేస్తే మాకు నీమీద్దేమీ కోపంలేదు. ఇందులోనించి తప్పించుకోడానికి నీకొక్కటే ఉపాయం ఉంది. నువ్వు మాలో చేరిపోతావా?"

ఉపాయం లేదనుకున్న గ్రింగైర్ చెవులకీ మాటలు అమృ తంలా సోకాయి. వెంటనే అంగీకరించాడు.

"తప్పకుండా! ఓ! తప్పకుండా చేరిపోతాను" అన్నాడు తడబడుతూ.

"అయితే నువ్వొప్పుకున్నావన్నమాట! మా వృత్తులవలంబించి మా శాసనాలకి తలొగ్గుతున్నావు!"

"తప్పకుండా! నేను మీలో ఒకణ్ణి."

"బికారివి?"

"బికారిని"

"దొంగవు?"

"దొంగని"

"వంచకుడివ్?"

"వంచకుణ్ణి."

"మనస్ఫూర్తిగా?"

"మనస్ఫూర్తిగా"

"భేష్! అయినా సరే నీకు ఉరి తప్పదు."

"అదేమిటి మళ్ళీ?"

"అంటే, అప్పుడే నిన్ను ఉరి తియ్యాషం లేదు. ఈమాటు పారిస్ నగరంలో పరువుగలవారిమధ్య బహిరంగంగా పారిస్ పోలీసుల సహాయంతో నగరాధికారుల అజమాయిషీలో తలారిచేత ఉరి తియ్యబడతావ్!"

"ఓ అదా! అందుకు సిద్ధమే!"

"అది కొంత నయమేకదా! ఇంతే కాదు. పారిస్ నగరవాసుల మాదిరిగా పన్నులు చెల్లించే బాధ నీకింక లేదు."

"మరీ మంచిది. నేనూ ఒక భికారినే. అసలు ఇంతకుముందే నేను భికారిని. తత్వవేత్త తత్వమే అటువంటిది."

"తత్వం చాలదోయ్" అన్నాడు క్లోపిన్. "సాహసం అన్నం ముందుకి రాదు. మాలో చేరాలంటే ఏదో ఒక వృత్తి నీకు చేత నవునని చూపించుకోవాలి. ఏదీ జేబు లెల్లా కొట్టగలవో మచ్చుకి చూపించు."

క్లోపిన్ సంజ్ఞ చేశాడు. సంజ్ఞ గమనించి ఇద్దరు రెండు పొడవైన పదురు కర్రలు తీసుకువచ్చారు. రెండు కర్రలకూ కింద చెక్కలు నాటబడి ఉన్నాయి. చెక్కలపైన నాటని నిలబెట్టారు. పై చివరలు రెండింటినీ కలిపి ఒక కర్ర అమర్చారు. తన కళ్ళెదుట అమర్చబడుతున్న ఈ యేర్పాటు గ్రింగైర్ కి ఉరిస్తంభంలా కనపడింది. పై కర్రకొక ఉచ్చు వ్రేలాడతీయబడింది. అంతా క్షణంలో ఏర్పాటయిపోయింది. దిష్టిబొమ్మనొకదాన్ని తెచ్చి ఉచ్చులో వ్రేలాడతీశారు. దిష్టిబొమ్మనిండా చిన్న చిన్న గంటలు కట్టబడ్డాయి. త్రాడు ఊపు ఆగి గంటల గణగణ మ్రోగడానికి కొంతసేపు పట్టింది. దిష్టిబొమ్మ కింద ఎత్తైన ఒక ముక్కాలిపీట ఉంచబడింది.

క్లోపిన్ ముక్కాలిపీటవంక చూపుతూ అన్నాడు "అదెక్కు. ఊఁ!"

"ఆ పీట కాళ్ళు సరిగా లేవు. చాల ఎత్తుగా ఉంది. దాని మీదనించి కింద పడితే మెడ విరుగుతుంది" అన్నాడు గ్రింగైర్.

"ఎక్కరా ముందు" అని బెదరించాడు క్లోపిన్.

గ్రింగైర్ ముక్కాలిపీటఎక్కి నిలబడ్డాడు. ముక్కాలిపీట ఊగిసలాడింది. పడిపోకుండా నిలవడాని కతడికి కొంతసేపుపట్టింది.

"ఆ! ఇప్పుడు. కుడికాలెత్తి ఎడమమోకాలికానించు. ఎడమ కాలి బొటనవేలిమీద నిలబడాలి. ఊఁ" అని ఆజ్ఞాపించాడు క్లోపిన్.

"ఓయ్ భగవంతుడా! ఇంక నేను పడిపోక తప్పదన్నమాట. నాకు కాలో చెయ్యో విరక్కుండా వీల్లేదన్నమాట"

"వీల్లేదు" అన్నాడు క్లోపిన్ విసుగుతో. "ఇదిగో ఇటువిను. నీవాగు డెక్కువగా ఉంది. పనికిరాదు మాదగ్గిరది. రెండు ముక్కల్లో చెప్తున్నాను. ఎడమకాలి బొటనవేలిమీద నిలబడి దిష్టిబొమ్మ జేబు నందుకోవాలి నువ్వు. ఆ జేబులోఉన్న పర్సు లాగాలి. అగంటల్లో ఒక్కటి మోగకుండా నువ్వు పర్సు తీశావా, సరే. నువ్వు మాలో చేరిపోవచ్చు. అప్పుడు నీకు వారంరోజులు శిక్షణ ఇస్తాం—ఒళ్లు చితకబొడిచి."

"బాగుంది! నామాట వినకుండా అగంటలు మోగితేనో?" అని అడిగాడు గ్రింగైర్.

"ఏముంది! నిన్ను ఉరితీసేస్తాం. అంతే! తెలిసిందా?"

"ఉహూ! తెలియలేదు."

"అయితే మరోసారి చెప్తున్నా విను. ఆ దిష్టిబొమ్మ జేబులో పర్సు కొట్టెయ్యాలి నువ్వు. గంటలుమోగితే మట్టుకు అక్కడికక్కడే నిన్ను ఉరితీసేస్తాం. నువ్వు పీటదిగవలసిన పని లేదు. ఇప్పుడు తెలిసిందా?"

"ఇదేం తెలియటం? నన్ను ఉరైనా తీస్తారు, లేకపోతే ఒళ్లు చితకబొడుస్తారా?"

"చితకబొడుస్తాం! మారాజ్యంలో స్వేచ్ఛగా బికారినౌతావ్ అది చాలదూ నీకు? నీకోసమే నిన్ను చితగ్గొట్టాలి తెలుసా. పారిస్‌లో రక్షకభటులు ఇంక ఎంత చితగ్గొట్టినా ఫరవాఉండదు."

"అవును ఫరవాలేదు" అన్నాడు గ్రింగైర్. అవ లేమనాలో అతడికి తెలియలేదు.

"ఊఁ కానీ! కాలెత్తు" అన్నాడు క్లోపిన్ గద్దిస్తూ. "ఇది మర్చిపోకు; ఒక్క చిన్న గంట గణగణమన్నా సరే, దిష్టిబొమ్మచోట్లో నువ్వు వేళ్ళాడతావు!"

క్లోపిన్ పలుకులకు అతడి ప్రజ హర్షధ్వానాలు చేశారు. హర్షధ్వానాలు నక్కలు మొరిగినట్లు, అపవిమ్మృగా లరచినట్లుఉన్నాయి. కవి హాస్యాస్పదుడైనాడు. సర్కస్ చూసినట్లు చూసి బికారులు వినోదం పొందుతున్నారు. కవికి హృదయంలో శూలం గుచ్చుకున్నట్లయింది. చింతించాడు. బికారులు తొందర పెట్టసాగారు. గ్రింగైర్ కి ఇదే ఆశాలేశం. గంటలు మ్రోగకూడదు.

దిష్టిబొమ్మ నొకసారి చూసి చేతులుజోడించి ప్రార్థించాడు. దిష్టిబొమ్మ ఒంటినున్న చిరుగంటలు సర్పజిహ్వాలవలె అతడికి గోచరించాయి తాను చెయ్యెత్తితే చాలు కాటువెయ్యగలవన్నట్లు భీతిచెందాడు. కాని తప్పదు. "ఒక్క చిన్న గంటలో నా ప్రాణం ఇమిడివుందా!" అని విచారించాడు. అతడి కొక ఊహ వచ్చింది.

"ఒకవేళ గాలివిసురొకటి వచ్చి గంటలు మోగితే?" అని అడిగాడు.

"అయినా నీకు చావు తప్పదు" అని గర్జించాడు క్లోపిన్.

ఇంక గత్యంతరం లేదని రూఢి అయింది. మెల్లిగా కుడికాలెత్తి ఎడమ ముంగాలి నానించాడు. కుంటి ముక్కాలిపీట గజగజలాడింది. అయినా కాలు దించలేదు. కొంతసేపటికి ఎత్తుపీట నిలకడకు వచ్చింది. మెల్లగా చెయ్యి చాచాడు. కాని చెయ్యి దిష్టిబొమ్మను తాకగానే ముక్కాలిపీట కదలాడ నారంభించింది. నిలకడ చెడింది. పడిపోతాననే భయంతో అతడు బొమ్మను గట్టిగా పట్టుకున్నాడు. గంటలన్నీ కూడబలుక్కున్నట్లు ఒక్కసారి గణగణలాడాయి. గణగణలు వినేసరికి కవికి మతిపోయింది. నేలపైన కుప్పగా కూలిపోయాడు. దిష్టిబొమ్మ ఉచ్చులో గిరగిర తిరిగింది. తరువాత స్తంభాల మధ్య సవిలాసంగా ఊయలలూగ నారంభించింది.

బోరగిలపడిన గ్రింగైర్ చచ్చిపడినట్లు చలించలేదు. అయితే పైన చిరుగంటల గణగణలు, ప్రక్కన దాక్షిణ్యహీనులైన బికారుల కేరింతలు అతడి చెవులలో గింగుర్లెత్తుతున్నాయి.

"జుట్టుపట్టుకు లేవతీసి ఉరితియ్యండి వాణ్ణి" అని అరిచాడు క్లోపిన్."

గ్రింగొర్ అమాంతంగా లేచి నిలబడ్డాడు. అప్పుడే ఉచ్చులోనుంచి దిష్టిబొమ్మ తీసివెయ్యబడింది. కొందరు జుట్టు పట్టుకొని కొందరు రెక్కలుపట్టుకొని అతణ్ణి బికారులు లేవ తీశారు. ముక్కాలిపీటపై నిలబెట్టారు. క్లోపిన్ స్వయంగావచ్చి కవి మెడకు ఉచ్చు తగిల్చాడు. భుజంమీద తట్టి "పాపం! వీడుకోలిస్తున్నాను నీకు. నువ్వింక తప్పించుకోలేవు. నిన్నెవ్వడూ రక్షించలేడు."

గ్రింగొర్ చేతులు జోడించాడు. "దయ చూపండి..." ఇంక ఆపైన మాటలు పెగిలిరాలేదు. చుట్టూ చూశాడు, తాను భూతిపరు లెవరూ లేరా అని. ఎవరూ లేరు. అందరూ ఎగతాళి చేస్తున్నారు.

ఒకడు చరచర పాములాగ ఒక కర్రనెక్కి చివర కూర్చున్నాడు. గ్రింగొర్ భీతితో తలెత్తి చూశాడు.

"నేను చప్పట్లు కొట్టగానే ముక్కాలిపీట తన్నెయ్యండి. ఒకడు వాడి కాళ్ళుపట్టుకు వేళ్ళాడాలి, ఒకడు వాడి భుజమెక్కి కదంతొక్కాలి, అంతా ఒక్కసారి జరిగిపోవాలి, తెలిసిందా" అని అరిచాడు క్లోపిన్.

గ్రింగొర్ నిలువునా కంపించిపోయాడు.

"అందరూ సిద్ధమేనా?" అన్నాడు క్లోపిన్.

"ఆ"అన్నారు ముగ్గురూ.

క్లోపిన్ క్షణం ఆలోచించాడు. ఏదో గుర్తుకువచ్చింది. "ఆగండి! మరిచిపోయాను. మన ఆచారం మర్చిపోయాను. ఆడవాళ్ళ నడగందే గడ్డిపోచనికూడా మనం ఉరితియ్యం. ఎవత్తికైనా వీడు కావాలా? కవిగారూ! ఇదే మీ ఆఖరిఉపాయం."

గ్రింగొర్ ఊపిరి విడుచుకున్నాడు. అరగంటలో అతడికి రెండోసారి ప్రాణం లేచివచ్చింది.

క్లోపిన్ మళ్ళీ తన సింహాసనమెక్కి కూర్చున్నాడు. దర్జాగా, ఉదారబుద్ధి ఉట్టిపడుతూ చేయిచూపుతూ స్త్రీలను పిలిచాడు.

"ఇటురండి. ఈ బానిస మీ కెవరికేనా కావాలా? ముందుకు వచ్చి వాణ్ని చూసుకోండి. గవ్వ ఖర్చు లేకుండా వరుడొస్తున్నాడు. ఎవరికాం కావాలి?"

గ్రింగైర్ స్త్రీల నాకర్షించలేని అతిదీన దుర్భరపరిస్థితిలో ఉన్నాడు. స్త్రీలందరూ ముక్కాలిపీటవద్దకువచ్చి అతడివంక తేరి పారచూశారు. ఎవరిముఖంలోనూ ప్రసన్నభావం గాని, జాలి గాని కానరాలేదు. ఒకరివెంట ఒకరు వచ్చి చూసి పెదవి విరిచి వెళ్లిపోవడం దీనంగా గమనిస్తున్నాడు కవి. "అక్కర్లేదు. ఉరి తియ్యండి వాణ్ని. ఆ వినోదం చాలు" అంటున్నారు.

ముగ్గురు స్త్రీలు తటపటాయించి చూశారు అతడివంక. ఒకామె అతడి చొక్కా పట్టుకొని చూసింది. తరవాత లాగు తాకిచూసింది. భుజాలెగురవేసింది. "ఒట్టి పేలికలు. లాభం లేదు" అని గొణిగింది. "నీ కోటేమయ్యింది?" అని అతణ్ని అడిగింది.

"పోయింది"

"నీ టోపీ?"

"లాక్కున్నారు."

"కాలిజోళ్ళు?"

"అడుగులు అరిగిపోయాయి."

"పర్సు?"

"అసలు లేనే లేదు."

"అయితే నోరుమూసుకుని చావు."

రెండో ఆమె వృద్ధురాలు. పీక్కుపోయిన ముఖం, చీపురు వలె జుట్టు, వికృతంగా ఉంది. ఆమె గ్రింగైర్ చుట్టూ తిరిగి పరిశీలించింది. ఆమెను చూసి గ్రింగైర్ భీతి చెందాడు. 'ఈమె నాపైన మోజుపడదు గదా' అనుకున్నాడు. ఆమె మోజుపడలేదు. "ఒంటిలో గుప్పెడు మాంసం లేదు" అని పెదవి విరిచిందామె.

ఈమారు ఒక యువతి వచ్చి చూసింది. ఈ సమాజంలో కొత్తగా చేరినట్లుంది. అంత మొరటుగా లేదు. ఆమెను చూసి దీనంగా అర్థించాడు గ్రింగైర్: "అమ్మా! నన్ను రక్షించు! నీకు బానిసనౌతాను." జాలితో ఒకసారి అతడిని పరికించింది యువతి.

తరువాత కళ్లు దించింది. క్షణంసేపు ఎటూ నిర్ణయించుకోలేక నిలబడింది. ఆమె నతిశ్రద్ధగా పరిశీలించాడు కవి. ఇదే తుది ఆశ. "లాభం లేదు" అన్నదామె పెదవి విరిచి, జాలిగా. "లాభం లేదు. మా కుంటివాడు నన్ను బతకనివ్వడు" అని ఆమె కదిలి గుంపులో కలిసిపోయింది.

"ఏమోయ్? నువ్వు దురదృష్టవంతుడివ్" అన్నాడు క్లోపిన్. సింహాసన మెక్కి నిలబడ్డాడు. ఏలంపాట పాడుతున్నట్లు బిగ్గరగా అరిచాడు: "ఎవ్వరూ లేరా? పందెం ఒడ్డి ఎవరూ నీణ్ని తీసుకోలేరా? ఒకటోసారి! రెండోసారి! మూడోసారి! ఉహూఁ! లాభం లేదు. ఇంక పని పూర్తి చెయ్యండి."

ఇంతలో ద్వారంవద్ద బిగ్గరగా మాటలు వినవచ్చాయి. "ఎసురాల్దా! ఎసురాల్దా వచ్చింది" అన్నారు కొందరు. గ్రింగోర్ భీతితో ద్వారంవంక చూశాడు. బికారులు దారి యిచ్చారు. ఎసురాల్దా అంటే జిప్సీయువతి.

"ఎసురాల్దా!" అని గొణిగాడు గ్రింగోర్. జిప్సీ యువతిని చూడగానే అతడి కారోజు సంఘటనలన్నీ స్మృతికి వచ్చాయి. ఆ అపురూపసుందరిని చూడగానే అతని శరీరంలో విద్యుత్తు ప్రవహించినట్లయింది. ఆమె పేరు వినగానే బికారుల మధ్య సంచలనం బయలుదేరింది. ఆమె సౌందర్యం బికారులపైన ఆమెకు అధికార మిచ్చింది. ఆమె ప్రభావం ఆమె సముఖంలోనున్న వారందరికి అనుభూతమౌతున్నది.

ఆమెను చూడగానే కవి నాటి తన బాధలన్నిటినీ మరచిపోయాడు. అందరూ గౌరవంతో తప్పుకుని ఆమెకు దారి యిచ్చారు. కఠోరం, వికృతమూ అయిన బికారుల ముఖాలలో ఆమెను చూసినంతనే ప్రసన్నత ద్యోతకమయింది. గాలిలో తేలుతున్నట్లున్న పదగమనంతో ఆమె ముక్కాలిపీటవద్దకు వచ్చింది. అప్పటికి యాతనలతో అతను ప్రాణ ముడిగిపోయున్నాడు. అతణ్ని చూసింది.

"ఇతణ్ని ఉరితీస్తున్నారా?" అని అడిగింది.

"అవును చెల్లీ" అన్నాడు పండితుడు. "నువ్వు తీసుకు పెళ్లి చేసుకుంటే తప్ప" అన్నాడు క్లోపిన్.

పెదవి కరుచుకుని ధ్యానించింది. "నేను తీసుకుంటాను" అన్నది.

ఉదయంనుంచీ ఏదో స్వప్నలోకంలో నే ఉన్నట్లు భావించాడు గ్రింగైర్. ఇది వాస్తవం కాదని నిర్ధారణకు వచ్చాడు. ఆ స్వప్నమే ఇంకా జరుగుతున్నదని ఊహించాడు.

సుందరివచ్చి తనను రక్షించడంతో అతడికి మతి భ్రమించింది. ఉచ్చు తాడు తొలగించబడింది. అతనికి కాలుచేతు లాడ లేదు. ముక్కాలిపీటపైనే చతికిలపడ్డాడు.

జిప్సీరాజు ఒక మట్టి కూజా తీసుకువచ్చాడు. దాని నందుకుని జిప్సీ యువతి గ్రింగైర్ చేతికిచ్చింది. "నేలమీద పడెయ్యి" అంది. గ్రింగైర్ అది పడవేశాడు. కూజా నాలుగు ముక్కలయింది. జిప్సీరాజు ఇద్దరి భుజాలపైనా చేతులుంచాడు. "అబ్బాయి. ఇకనించి ఆమె నీభార్య. అమ్మాయి, ఇతను నీభర్త. నాలుగేళ్ళవరకు మిమ్మల్ని విడిచి పెడుతున్నాను. వెళ్ళండి" అన్నాడు.

# 10

జిప్సీ యువతి ననుసరించాడు కవి. ఇద్దరూ కలిసి ఒక చిన్న గది ప్రవేశించారు. గదిలో వెచ్చగా వుంది. ఈ ఆశ్రయం అతడికి నచ్చింది. ఇంక ఆకలి తీర్చుకోడాని కేదైనా ఆహారం, తరవాత సుందరితో ముచ్చటగా ప్రసంగిస్తూ గడపడంకంటె మించి కోరదగిం దేదీ లే దనుకున్నాడు కవి. జరిగినదంతా ఇంద్రజాలంలా సుఖస్వప్నంలా ఉందతనికి. ఏ దేవతల కథలోనో తాను కథానాయకుడైనట్లు ఊహించుకున్నాడు. ఊహించుకోడమే కాదు నమ్ముతున్నాడు. భూలోకంనుంచి ఈ స్వర్గలోకంలోకి ఎలా వచ్చానా అని ఆలోచించసాగాడు. దేవతలు పంపిన దివ్యవిమానం ఎక్కడుందా అని చుట్టూ చూశాడు. కాని అంతలోనే జేబుల్లో చేతులు పెట్టుకు చూసుకోగానే యధార్థంలో పడుతున్నాడు. కలకూ వాస్తవానికీ మధ్య కవి ఊగిసలాడుతున్నాడు.

జిప్సీ యువతిమాత్రం అతని ఉనికిని గమనించనట్లు ఉంది. గదిలో వస్తువులు సర్దుతూ అటూ ఇటూ తిరుగుతోంది. మధ్యమధ్య

తన మేక 'డాలీ'తో మాట్లాడుతోంది. కొంతసేపైనతరవాత మేజా దగ్గ ఒక కుర్చీలో కూర్చుంది. ఆమెను శ్రద్ధగా పరికించ టానికి తనికి వీలు చిక్కింది.

చిన్నతనంలో సీతాకోకచిలుకల్ని వాటి రంగుల రెక్కల్ని తన్మయులై చూడ్డం అందరికీ సహజమే. అవి ఎగిరివచ్చి ఎగిరిపోతుంటే కౌతుకంతో చూస్తూ ఉండిపోతారు. ఒక పువ్వుపై వాలి నిల్చి కొద్దిగా రెక్కలాడించి నప్పుడు, అంతలోనే ఈ అందమైన స్వప్నం మాయమౌతుందేమో నన్నట్లు చూస్తారు. గ్రింగైర్ సరిగ్గా అదే తన్మయత్వంలో జిప్సీ సుందరిని చూడనారంభించాడు, ఆమెను చూస్తూవుంటే రాత్రి పాట, నృత్యం జ్ఞప్తికి వచ్చాయి. ఆమెను తదేకంగా చూస్తున్న గ్రింగైర్ ఊహాలోకంలో విహరించ నారభించాడు. "ఎమరాల్డా అంటే ఈ అలౌకిక సుందరే కాబోలు. అప్సరసలా ఉంది! ఈ సౌందర్యం ఊహాకందనిది. అయితేం! ఈమె కేవలం వీధుల్లో యాచనకై నృత్యంచేసే జిప్సీమాత్రమే! ఎంతచిత్రం! ఇవాళ రాత్రి నా ప్రాణాలు కాపాడింది ఈమే! నన్ను పెండ్లిచేసుకోడాని కంగీకరించిందంటే, నాపైన మక్కువ కలిగిందన్నమాట ఈ అపురూపసుందరికి! ఎంత వింత!" ఇంతలో ఏదో ఊహ తట్టింది. తట్టి అదిరిపడిలేచాడు "ఎంతవింత! ఎలా సంభవించిందో బోధపడదు. కాని ఇప్పుడీమె భర్తను నేను!"

ఈయోచనతో అతనికళ్లు తళతళ మెరిశాయి. ఆమెపై దృష్టి నిలిపి మెల్లిగా సమీపించాడు. ఆమె లేచి వెనుకంజ వేసింది? "ఏమిటి? ఏం కావాలి?" అని అడిగింది.

"అలా అడగవచ్చా నువ్వు?" అతని కంఠస్వరంలో నిగ్రహించలేని ఆవేశం ద్యోతకమయింది. తన కంఠధ్వని విని తనే చకితుడైనాడు.

జిప్సీ యువతి తన పెద్దకళ్లను మరింత పెద్దవిచేసి చూసింది! "అంటే? నాకు తెలియడంలేదు" అంది.

"అంటేనా? అంటే! తెలియదూ?" అని విస్తుపోయాడు. "నేను నీవాడిని కానా? నువ్వు నాదానవు కావా?" అంటూ ప్రీతితో ఆమె భుజంపైన మృదువుగా చెయ్యివేశాడు. కాని చేతి కాన

కుండా ఆమె భుజం మెల్లిగా జారింది. ప్రక్కకు తప్పుకుని చప్పున కైజారు తీసింది. ఆమె ముఖం ఎర్రబడిపోయింది. కన్నులు ఎర్రనైనాయి కోపంవల్ల ఆమె భుజాలు కిందికీ పైకీ ఊగుతున్నాయి. మేక ఆమెవద్ద నిలబడి కొమ్ములు చూపింది — అవసరమైతే పొడవడానికి సిద్ధంగా ఉంది. కవి నిశ్చేష్టుడైనాడు. జిప్సీ వంకా, మేకవంకా తెల్లబోయి చూశాడు. "అమ్మో! పులిపిల్లల్లే ఉన్నారే?" అని గొణిగాడు.

"నీ కెంత పొగరు!" అంది జిప్సీయువతి రోషంతో.

"క్షమించాలి. కాని నన్ను భర్తగా ఎందుకెంచుకున్నావు?"

"లేకపోతే ఉరి తియ్యనియ్యాలనా?"

కవి ఆశాభంగం చెందాడు. నిట్టూర్పు విడిచాడు: "అయితే ఉరి తప్పించడమే తప్ప నన్ను పెళ్ళి చేసుకోడానికి మరో ఉద్దేశమే లేదా?"

"మరో ఉద్దేశం ఏముంటుంది నాకు?"

గ్రింగైర్ పెదవి కరుచుకున్నాడు. "ఇంతే నీ కర్మ!" అని తనను తాను నిందించుకున్నాడు. "ప్రేమవ్యవహారాల్లో నువ్వూహించుకున్నంత తెలివి నీకు లేదు. ఇంతా చేస్తే ఆ కూజా ఎందుకు బద్దలు కొట్టినట్టు?"

ఎమరాల్డా చేతిలో కైజారు అలాగే పొంచిఉంది. మేక కొమ్ములు కూడా గురిపెట్టే ఉన్నాయి. ఇది గమనించి గ్రింగైర్ ఇలా అన్నాడు:

"సరే అయితే! నీ ఉగ్రరూపం ఇంక ఉపసంహరించుకో ఎమరాల్డా! నువ్విలా కత్తి చేతబట్టుకుని ఉండిపోడం మంచిది కాదు. ఇది నగర శాసనాలకు విరుద్ధం. ఇలా కత్తి చేత్తో పట్టుకుని వీధుల్లో తిరిగినందుకు వారం రోజుల క్రిందట ఒకడికి జరిమానా విధించారు నీకు తెలుసుగా. అయినా అదికూడా నా కెందుకు? ఇకనించి నీ సమ్మతి లేనిదే నిన్ను తాకబోనని ప్రమాణంచేసి చెప్తున్నాను. కాని కాస్త రొట్టె ఉంటే పెట్టు; నీకు పుణ్యం ఉంటుంది."

వాస్తవానికి గ్రింగైర్ శృంగార వ్యవహారాలంటే అంత మోజు లేనివాడు. రాజవంశస్థులు, సైనికాధికారుల

మాదిరిగా బలకంతాన. యువతులను అపహరించేటంత మోహం, సాహసం అతనికి లేవు. ఇతర విషయాలలో మాదిరిగానే శృంగారంలో కూడా సాహస ప్రదర్శనకంటె సౌమ్యభావం మేలని అతని భావం. ప్రస్తుత పరిస్థితిలో సుందరి సమర్పించే ఆహారం స్థిమితంగా భుజించడం శ్రేష్ఠమని భావించాడు.

జిప్సీ జవాబివ్వలేదు. తలెగరవేసి బిగ్గరగా నవ్వింది. చేతిలోని కైజారు మాయమయింది. ఆమె దానినెక్కడ, ఎలా దాచిందో కవికి తెలియలేదు.

క్షణంలో రొట్టె, మాంసం, పళ్లు, ఒక కూజానిండా మద్యం తెచ్చి మేజాపైన పెట్టింది. మోహమంతా ఒక్కసారిగా ఆకలిగా మారిపోయినట్లు కవి అతిలోభంతో గబగబ తిననారంభించాడు. జిప్సీ అతని కెదురుగా కూర్చుని అతన్ని పరికించసాగింది. మేక వచ్చి ఆమెవద్ద కూర్చుంది. జిప్సీ మధ్యమధ్య చిరునవ్వులతో ఏదో ఊహించుకుంటూ మేకను మోకాళ్ల మధ్య కూర్చోబెట్టి తల నిమురుతోంది. గదిలో కొవ్వొత్తిదీపం వెలుగు కదలాడుతోంది.

ఆకలిమంట కొంత చల్లారగానే పళ్లెరంవంక చూశాడు. అందులో ఒక్క పండు మాత్రం మిగిలివుంది. తన ఆలోచన లేమికి తనే సిగ్గుపడ్డాడు. "నువ్వేమీ తినవా ఎమరాల్డా?" అని అడిగాడు. జిప్సీ తల అడ్డంగా తిప్పింది. ఆమె గది కప్పువంక చూస్తూ యోచిస్తోంది.

"ఏమాలోచిస్తోందో?" అనుకున్నాడు గ్రింగైర్. ఆమె చూస్తున్నవైపు చూశాడు. అక్కడ వికృతమైన శిరస్సు ఆకారం ఒకటి చిత్రించబడి ఉంది. "ఆ వికృతమైన శిరస్సులంటే ఆమె కిష్టమా? ఆ బొమ్మకంటె నేను మెరుగేకదా!" అనుకున్నాడు.

"ఎమరాల్డా!" అని పిలిచాడు. ఆమె పలకలేదు. మళ్లీ మరింత బిగ్గరగా పిలిచాడు. అయినా ఆమె వినిపించుకోలేదు. ఆమె మన స్సెక్కడో ఉంది. ఆమెను గ్రింగైర్ పిలుపు మేల్కొలుపలేకపోయింది. ఇంతలో మేక కదలనారంభించింది. ఆమె గౌను అంచులుపట్టి లాగడం మొదలుపెట్టింది.

"ఏంకావాలి?" అంది జిప్సీ, నిద్రనుంచి మేలుకున్నట్లు ఉలిక్కిపడి.

ప్రసంగావకాశానికి ఉత్సాహం కలిగింది కవికి. "దానికి ఆకలివేసింది." అన్నాడు.

ఎమరాల్డా చిన్న రొట్టెముక్క తీసుకుని నలిపింది. ఆమె అరచేతిలోనుంచే అందుకుని మేక తింటున్నది. తిరిగి ఆమె ఊహా స్వప్నంలో పడిపోకముందే అందుకున్నాడు గ్రింగొర్: "అయితే నన్ను భర్తగా అంగీకరించదన్నమాటేనా?"

జిప్సీ ఒకసారి అతనివంక పరీక్షగా చూసింది. "ఊహుఁ" అంది తల అడ్డంగా తిప్పుతూ.

"పోనీ ప్రియునిగా అంగీకరిస్తావా?"

జిప్సీ మూతి ముడుచుకుంది. "వీల్లేదు" అంది.

"పోనీ స్నేహితునిగా?"

మళ్లీ అతనిపై దృష్టి నిలిపి చూసింది. క్షణంసేపు ఆలోచించి అంది. "అదప్పుడే చెప్పలేను."

తత్వవేత్తలైనవారికి ఈమాట చాలు. దీనితో గ్రింగొర్కి ధైర్యం కలిగింది. "స్నేహంఅంటే ఏమిటో తెలుసా?"

"తెలుసు" అంది జిప్సీ. "స్నేహంఅంటే అన్న చెల్లెళ్ళవలె ఉండడం. అంటే మనస్సు లొక్కటికావు. రెండు వేళ్లవలె ఒక దానికొకటి తాకుతూ ఉంటాయి అంతే."

"ప్రేమ అంటే?"

"ప్రేమా?" ఈమారు ఆమెమాటలో అనురాగం, కళ్లలో మెరుపూ గోచరించాయి. "మనస్సు లొకటైపోవడం. ఉండేది యిద్దరే. స్త్రీ, పురుషులు. ఇద్దరిమనస్సులూ ఏకమైతే దేవత లవుతారు."

ఈమాటలంటున్నప్పుడు జిప్సీసుందరిముఖంలో మరింత సౌందర్యం కనపడింది. ఆమెవాక్కులోనూ, ముఖంలోనూ మాధుర్యం చిప్పిలుతున్నది. గులాబిరేకులవంటి ఆమె పెదవులపై చిరుహాస్యం తోచింది. ప్రశస్తమైన నుదుటిపై అప్పుడప్పుడు నీలిఛాయలు కన పడుతున్నాయి. రాఫేల్ ప్రశస్త చిత్రాలలో కన్య, మాతృ మూర్తి, దేవకన్యల వర్చస్సులను ఒకేమారు స్ఫురింపచేసే ముఖబింబం ఆమెముఖంలో తోపింపచేసింది. కవి ముగ్ధుడైనాడు.

మెల్లిగా మళ్లీ అన్నాడు! "నిన్ను ఆకర్షించడానికి ఎలా ఉండాలి."

"మగవాడై ఉండాలి."

"మరి నే నెవర్ని?"

"అసలైన మగవాడికి చేతిలో కత్తిఉంటుంది. తలకో కిరోటం ఉంటుంది. గుర్రంపై స్వారిచేస్తాడు."

"ఓహో! గుర్రం ఎక్కనివాడు మగవాడే కాడన్నమాట! సరే! అలాటి మగవా ణ్నెవరి నేనా ప్రేమించావా నువ్వు?"

క్షణంసేపు ఆమె ధ్యాసలో మునిగింది. తరవాత మెల్లిగా అంది. "అదీ త్వరలో నే తెలుస్తుంది."

"నేను పనికిరానా?"

జిప్సీ అతనివంక సూటిగా చూసింది: "నన్ను రక్షించలేని మగవాణ్ని నే నెన్నడూ ప్రేమించలేను."

గ్రింగోర్ లజ్జపడ్డాడు. ఆమె తన నెత్తిపొడిచిందను కున్నాడు. క్వాసిమోడో చేతులనుండి ఆమెను రక్షించ డానికి తానుచేసిన ప్రయత్నం ఆమె మరిచిపోలేదనికూడా అనుకున్నాడు. అది జ్ఞప్తికి రాగానే నిస్పృహతో తలకొట్టు కున్నాడు: "మందమతినైపోయాను. ఆ సంగతి ముందే నిన్నడిగి ఉండవలసింది. క్వాసిమోడో చేతులనించి ఎలా తప్పించు కున్నావ్?"

ఈ సంఘటన గుర్తుకురాగానే జిప్సీ కంపించింది. "అబ్బ! గూనివా డెంత భయంకరంగా ఉన్నాడు!" అని రెండుచేతులతో ముఖం మూసుకుంది.

"భయంకరమే" అన్నాడు గ్రింగోర్. "కాని ఎలా తప్పించు కున్నావ్.?"

ఎమరాల్డా నవ్వింది. తరవాత నిట్టూర్పువిడిచి మౌనం వహిం చింది.

"అసలు నిన్నెందుకు పట్టుకున్నాడో తెలిసిందా?" అని మళ్ళీ అడిగాడు.

"తెలియదు. కాని నువ్వుకూడా నన్ను వెంటాడించావుగా! నువ్వెందుకు వెంటాడించావు?"

"అవును. నాకూ తెలియదు కారణం". అన్నాడు గ్రింగైర్.

ఇద్దరూ కొంతసేపు మౌనంగా ఉండిపోయారు. గ్రింగైర్ కి ఏమీ తోచలేదు. జేబులో చాకుతీసి బల్లపైన గీరడం మొదలు పెట్టాడు. యువతి చిరునవ్వు నవ్వింది. ఆమె దూరపుచూపులకు గోడ అడ్డు నిలవలేదు. ఉన్నట్టుండి పాట మొదలు పెట్టింది. అంతలోనే ఆపివేసింది. ఆపి మేకను దగ్గరకు తీసుకొని గారంగా దాని ఒళ్లు దువ్వింది.

"మేక చక్కగా ఉంది" అన్నాడు గ్రింగైర్.

"ఇది నా చెల్లాయి."

"నీకు ఎమరాల్డా పేరెలా వచ్చింది?"

"నేను చెప్పలేను."

"అహాఁ. నిజం చెప్పు."

ఎమరాల్డా జాకెట్ లోపలినుంచి ఒక చిన్న సంచి తీసింది. అది మెడలోని పూసలహారానికి చివర కట్టబడిఉంది. అది పైకి తియ్యగానే కర్పూరపువాసన గుప్పున వచ్చింది. సంచి ఆకుపచ్చని పట్టుగుడ్డతో కుట్టినది. మూతివద్ద 'పచ్చ'ను పోలిన గాజుపూస ఒకటి ఉంది.

"ఈ పచ్చవల్ల నాకా పేరు పెట్టిఉంటారు" అంది జిప్సీ. [ఎమరాల్డా అంటే 'పచ్చ'.]

గ్రింగైర్ అది అందుకోడానికి చెయ్యి చాపాడు. ఆమె వెనక్కు లాక్కుంది. "ఇది ముట్టుకోకు. ఇది మంత్రించిపెట్టిన తాయెత్తు. ముట్టుకుంటే దీని మహత్తైనా పోతుంది. లేకపోతే నీకు ముప్పు కలుగుతుంది."

కవికి కుతూహలం అధికమయింది. "అది నీ కెవ రిచ్చారు?"

ఆమె పెదవులపై వేలుంచి వారించింది. తాయెత్తు దాచి వేసింది. తిరిగి తిరిగి దానినిగురించి ప్రశ్నించాడు. కాని ఆమె జవా బివ్వలేదు.

"ఎమరాల్డా అంటే ఆ పేరు నీ కెందుకొచ్చింది?"

"ఏమో నాకు తెలియదు."

"మీది ఏ భాష?"

"జిప్సీ."

"అయితే ఫ్రాన్సు నీ జన్మభూమి కాదన్నమాట."

"నాకు తెలియదు."

"నీ తలిదండ్రులు బ్రతికున్నారా?"

"మేము విహంగాలం! ఎవరికెరుక! నా రెక్కలతోనే ఎగిరి సముద్రాలు దాటుతాను."

"నువ్వు ఫ్రాన్సు వచ్చేసరికి నీ వయస్సెంత?"

"చాల చిన్నతనంలో వచ్చాను."

"పారిస్ ఎప్పుడొచ్చావు?"

"నిరుడు."

ఈ ప్రసంగంతో గ్రింగైర్ ఉత్సాహవంతుడైనాడు.

"నీకు జోస్యం చెప్పడం వచ్చా?"

"రాదు" అంటూ ఆమె తిరిగి ఆలోచనలో పడింది.

"మహారాజు అంటే మీ జిప్సీల కందరికీ నాయకుడా?"

"అవును."

"మరి అతనే మనిద్దరికీ పెళ్ళి చేశాడే!"

మళ్ళీ ఆమె మూతి ముడుచుకుంది. ఆమె మూతి ముడుచుకున్నప్పుడల్లా గులాబీ మొగ్గవలె కనపడుతుంది. అది కవికి చూడ ముచ్చటయింది.

"నాకు నీ పేరైనా తెలియదు." అంది ఎస్మరాల్డా.

"నా పేరు తెలుసుకోడాని కేముంది? అడిగితే చెప్పనా! నా పేరు పీర్ గ్రింగైర్"

"ఇంతకంటె మంచి పేరు తెలుసు నాకు"

"నీది రాతిగుండె" అన్నాడు కవి. "అయినా సరే నువ్వు నాకు కోపం తెప్పించలేవు. నన్ను బాగా అర్థం చేసుకున్నప్పుడు ప్రేమించగలుగుతావేమో. నిన్ను గురించి అంతా దాపరికం లేకుండా చెప్పావు. మరి నన్ను గురించికూడా దాపరికం లేకుండా చెప్తాను విను.—

"నా పేరు పీర్ గ్రింగైర్ అని చెప్పాను. నాతండ్రి ఈదేశంలోనే ఒకనగరంలో అధికారిగా ఉండేవాడు. బర్గండియను

దాడిచేసినప్పుడు నాతండ్రిని ఉరి తీశారు. పారిస్ ముట్టడిలో మా అమ్మని చంపేశారు. అది ఇరవైఏళ్లకిందట. అంటే ఆరేళ్ళకే ఆధారం లేనివాణ్ణయాను. పారిస్ నగరవీధులే అప్పుడు నాకు ఆశ్రయమైనాయి. అప్పుడు పదేళ్లు ఎలా గడిపానో నాకే తెలియదు. ఏ పళ్లఅమ్మే అమ్మనో అడిగి ఒకపండు తీసుకు తినేవాణ్ణి. ఏ దుకాణదారో నా మొహాన్ని ఇంత పాతరొట్టె గిరవాటు వేసేవాడు. రాత్రివేళ పోలీసులదారి కష్టంగా పడిపోయినట్లు నటించేవాణ్ని. వాళ్లు నన్ను ఖైదులో పెట్టి తాళం వేసేవాళ్లు. అక్కడ రాత్రి పడుకునేందుకు పీచో గడ్డో దొరికేది. ఇంత దీనంగా బతికినా పొడుగ్గా ఎదిగాను. చలికాలంలో ఎండతప్ప ఒళ్ళు వెచ్చబరుచుకోడానికి మరో ఆధారం లేదు. పదహారేళ్ళకి ఏదో వృత్తి నేర్చుకుని జీవనాధారం ఏర్పరచుకోవాలని తోచింది. అన్నివృత్తులూ ప్రయత్నం చేశాను. సిపాయినైనాను, కాని నా సాహసం చాలలేదు. క్రైస్తవ భిక్షుకునైనాను; కాని అంత పవిత్రుణ్ణి కాలేకపోయాను. చివరికి వడ్రంగం నేర్చుకోవాలని చూశాను; కాని నా బలం చాలలేదు. ఉపాధ్యాయవృత్తి అవలంబించాలనుకున్నాను; కాని నాకు చదవనైనా రాదు. కొంతకాలానికి బోధపడింది; నాలో ఏలోపముందో, ఏవృత్తికీ పనికిరాలేకపోయినాను. అందువల్ల చిట్టచివరికి కవినైనాను. కవివృత్తి చాలా చిత్రమైనది. బికారిఅయినవాడు తేలిగ్గా ఈవృత్తి అవలంబించవచ్చు. దొంగతనంకంటె ఇది కొంతపరువైనదే. నా స్నేహితులు చాలామంది దొంగతనానికి దిగడం మంచిదని చెప్తున్నారనుకో. ఒకరోజున నా అదృష్టవశంవల్ల నాటర్ డామ్ చర్చికి మతాధికారిఅయిన డామ్ క్లాడ్ ఫ్రాలో పరిచయభాగ్యం లభించింది. ఆయనకు నాపట్ల అవ్యాజమైన అనురాగం కలిగింది. ఈ రోజున నేను చదువుకుని పండితుడినైనానంటే అది ఆయన ప్రసాదమే. గ్రంథాలు చదివాను, శాస్త్రాలు పఠించాను, కవిత్వం నేర్చాను. ఇవాళ ఉదయం న్యాయసభాభవనంలో ప్రదర్శించబడిన నాటకం నేను రచించినదే. ఆ నాటకానికి జనం లెక్కలేనంత మంది వచ్చారు. భవనం పట్టలేదు. ఆ మధ్య కనపడిన తోకచుక్కని గురించి ఆరువందల పేజీల గ్రంథం ఒకటి వ్రాశాను. తూర్పుచావిలో ఒక ఫిరంగి ఉంది చూశావా? ఎల్లా పేలుతుందో

చూడాలని ఒకసారి కాల్చారు—అప్పుడు ఇరవైనలుగురు చచ్చి పోయారు. ఆ ఫిరంగి నిర్మాణంలో నా చేతకూడా కొంత ఉంది. నేనూ అంత తీసిపోయినవాణ్ని కాను. నాకూ కొన్ని గారడీలు తంత్రాలు చేతనౌను. పారిస్ బిషప్‌ని ఎలా అనుకరించాలో, ఇంకా పెద్దపెద్దవాళ్ళ నెలా వెక్కిరించాలో నీ మేకకి నేర్ప గలను. నా నాటకాలు ప్రదర్శిస్తే నాకూ బోలెడు ధనం లభిస్తుంది. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే, నేను నీ కనుసన్నల్లో మెలగ డానికి సిద్ధంగా ఉన్నానని తెలియపరుస్తున్నాను. నా విజ్ఞానం నా పాండిత్యం పూర్తిగా నీకోసం వినియోగపరుస్తాను. నువ్వు ఎలా కోరుకుంటావో అల్లా నీతో ఉండడానికి సిద్ధంగా ఉన్నాను.—భార్యాభర్తలుగానైనా సరే, అన్నచెల్లెళ్ళలాగైనా సరే—సిద్ధమే."

గ్రింగైర్ ఆగాడు. తన ఉపన్యాసం ఆమెపైన ఎలా పని చేసిందో అని పరిశీలించాడు. ఆమె దృష్టులు నేలపై నిగిడ్చి ఉన్నాయి.

"ఫీబస్" అంది జిప్సీ—తనలో తాను మాట్లాడుకుంటున్నట్లు. "ఫీబస్ అంటే అర్థం ఏమిటి?"

తన ఉపన్యాసానికీ, ఫీబస్ అనే మాటకీ ఏమి సంబంధమో తెలియక కొంతసేపు కవి తబ్బిబ్బులైనాడు. అయితే తనపాండిత్యం చూపుకోడానికి అవకాశం దొరికినందుకు సంతోషించాడు.

"అది లాటిన్ మాట. దాని అర్థం సూర్యుడు." అని చెప్పాడు.

"సూర్యుడా!" అంది జిప్సీ.

"అవును. పురాణంలో ఒక దేవుడు. మంచి విలుకాడు."

"ఒక దేవుడు!" అని గొణిగింది జిప్సీ. ఆ మాటలో పరధ్యాస స్పష్టంగా కనపడింది.

ఈసమయంలో ఆమె చేతికున్న గాజులలో ఒకటి వదులై నేలపై పడింది. గ్రింగైర్ వెంటనే వొంగి అందుకోబోయాడు. అతడు లేచి చూసేసరికి జిప్సీలేదు, మేక లేదు. తలుపులకు గొళ్లెం పడిన చప్పుడుమాత్రం వినపడింది.

"పోనీలే! వెళ్ళిపోతేపోయింది. పడుకోడానికి పడక దొరి కింది." అనుకున్నాడు తత్త్వవేత్త. గదిఅంతా ఒకసారి తిరిగి పరిశీ

లించాడు. కాని ఎక్కడా పడక అనేది కనపడలేదు. ఒకమూల ఒక పెద్ద కర్రపెట్టె మాత్రం కనపడింది. పైమూతపై బొడిపెలు ఉన్నాయి. దానిపైన మెల్లిగా నడుము వాల్చాడు. అంపశయ్యపైన పడుకున్నట్లుంది. అయినా విశ్రాంతి కోసం అల్లాడుతున్న కళ్లు అలాగే సర్దుకుని పడుకున్నాడు. పడుకుని తనలో ఇలా అనుకున్నాడు:

"ఇందుకు చింతించి ప్రయోజనం లేదు. అయినా ఇది పెళ్లి జరిగిన మొదటిరాత్రి అనుకోడానికే వింతగా ఉంది."

## 11

పారిస్‌లో నాటర్ డామ్ చర్చి నేటికీ (రచయిత కాలం నాటికి) అద్భుత శిల్పసృష్టే. కాని ఇంతకాలం స్వీయసౌందర్యం నిలుపుకున్నప్పటికీ, ఈ అపూర్వనిర్మాణం పట్ల కాలమూ మానవుడూ చేసిన అపచారానికి క్లేశం కలగకమానదు. ఫ్రెంచి చక్రవర్తుల ఆధ్వర్యంలోనే నిర్మించబడినప్పటికీ ఈ క్రైస్తవ దేవాలయంపట్ల ఫ్రెంచి దేశస్థులు శిల్పకారులు అంతగా భక్తి గౌరవాలు ప్రదర్శించలేదు. క్రైస్తవ దేవాలయాలన్నిటిలో మేటి అనదగిన ఈ సుందర శిల్పం ముఖాన వార్ధక్య రేఖలతోపాటు ఆఘాతచిహ్నాలు కూడా అనేకం కానవస్తాయి. కాలం గుడ్డిది; మానవుడు మూర్ఖుడు.

నాటర్ డామ్ చర్చివంటి మహోన్నత గంభీర నిర్మాణాన్ని, అక్కడి శిల్ప వైభవాన్ని చూసి ఆశ్చర్యపడనివారుండరు. దేవాలయ ప్రాంగణంలో ముందుగా మూడు 'బహిర్ద్వారాలు' కనిపిస్తాయి. ఈ మూడింటి గోడలలో ఫ్రెంచి రాజవంశీయుల మూర్తిశిల్పాలుండేవి. ఆ శిల్పాలిప్పుడేమైనాయో తెలియదు. ఇప్పుడక్కడ శూన్యగహ్వరాలు మాత్రం మిగిలిఉన్నాయి. మూడు ద్వారాల మధ్యనూ రంగుల అద్దాలమర్చిన మూడేసి కిటికీలు, సన్నని స్తంభాల పైభాగంలో శిల్పవిశేషాలు, మూడు బహిర్ద్వారాల పైనా రెండు గాలిగోపురాలూ ఉన్నాయి. ఇక్కడి ఉదార శిల్పసృష్టి ప్రపంచంలోనే అరుదు. అడుగడుగునా శిల్పవిశేషాలతో బహిః

ప్రాంగణం ముచ్చట గొలుపుతుంది. శిల్పాలు లెక్కలేనన్ని ఉన్నప్పటికీ ప్రేక్షకులకు విసుగు పుట్టదు. సమశ్రుతిలో స్వరాలు మేళవించినట్లున్న శిలా శిల్పసంపద ఈ దేవాలయంపై దివ్యగీతం వినిపిస్తున్నట్లుంటుంది. శిల్పకారుల అపార పరిశ్రమ శిల్పకళతో మేళవించి, ప్రతి శిలాఖండానికీ ఒక విశిష్టత చేకూర్చింది. ఈశిల్పసృష్టి ఈశ్వర సృష్టిలా పరాకాష్ఠ అందుకుంది. కాని ఆధునిక శిల్పకారుల జోక్యంవల్ల సమశ్రుతి చెడి కళాపిపాసువుల కిప్పుడు కొంత మనోవ్యథ కలిగిస్తుంది. బహిఃప్రాంగణాని కెంత అపచారం జరిగిందో, మొత్తంమీద దేవాలయాని కంతటికీ అదే అపచారం జరిగింది; మధ్యయుగానికి చెందిన క్రైస్తవ శిల్పానికీ, దేవాలయాలకూ అదే అపచారం జరిగింది. పారిస్ నగరం విస్తరిస్తూనే క్రమంగా నేలమట్టం పెంచుకుంటూ వచ్చింది. దేవాలయప్రవేశానికేర్పాటయిన పదకొండు సోపానాలు కాలక్రమేణా ఒక్కొటొక్కటిగా నేలమట్టంలో కలిసిపోయాయి; తరువాత దిగువశిల్పాలుమాయమైనాయి. కాలప్రభావంవల్లనే సోపానాలు అంతరించి ఉండవచ్చును. కాని కాలకృతమైన అపచారం తక్కువే. పైగా కాలం దేవాలయానికి ఒక పురాతన శోభ కూడా ప్రసాదించింది. కాని మానవులు చేసిన అపచారం మాత్రం అత్యధికం. శిల్పాలు తొలగించడంతో వారు తృప్తిపడలేదు. మధ్యయుగ శిల్పానికి చెందిన ఈ కట్టడంలో ఆధునిక శిల్పాలు అతికించి కొన్ని వికృతమైన మార్పులు చేశారు. కళా కాంతీ లేని దారు కవాటం ఒకటి సింహద్వారానికి తగిలించారు.

ప్రాంగణం దాటి దేవాలయంలో ప్రవేశిస్తే ఎత్తైన ఒక శిలాప్రతిమ కనపడేది. అది ఇప్పుడక్కడలేదు. మందిరంలో ప్రతి స్తంభంపైనా, కుడ్యాలలోనూ నిర్మించబడిన శిలాకృతులు లేవు. గోథిక్ శిల్ప విశిష్టత ఉట్టిపడే ప్రార్థనా వేదికమీద యెవరో కుప్పతిప్పలుగా ఆధునిక శిల్పాలు మలిచారు. గోడల పై గవాక్షాలలో రంగురంగుల అద్దాలకు బదులు రంగులేని 'తెల్ల' అద్దాలమర్చారు. పైగోడలకు పసుపు పచ్చనిరంగు పూసి వర్ణసమ్మేళనం భగ్నపరిచారు. నేటి క్రైస్తవ మతాధికారులకు పసుపుపచ్చని పూతలపట్ల ఇంత మోజెందుకు పుట్టిందో తెలియదు. పూర్వం హంతకుల గృహాలపై ఈ రంగుపూసే

వారు! ఇంతేకాదు. ఎత్తైన గాలిగోపురం ఫడగొట్టి, పైన మూత బోర్లించినట్లు ఒక అర్ధచంద్రాకారపు లోహఖండం అమర్చారు.

మధ్యయుగ శిల్పానికి ప్రతిదేశంలోనూ ఇదేవిధంగా అపచారం జరిగింది. దీనికి కాలమే కాదు; రాజకీయ విప్లవాలు, మత కల్లోలాలుకూడా కారణాలే. విప్లవావేశంలో మానవులు మంచి చెడ్డల మాట తలపెట్టరు. రాజులకు మతాధికారులకు సంబంధించిన శిల్పాలు కూడా నిలువలేదు. ఇంక ఆధునిక కళాకారులమాట చెప్పనక్కరలేదు. కాలమూ విప్లవాలూ కొంత నిష్పక్షపాతబుద్ధితోనైనా ప్రవర్తించాయి; కాని ఆధునిక శిల్పులు కేవల పక్షపాతబుద్ధితో గోథిక్ శిల్పానికి అన్నివిధాలా భ్రష్టస్వరూపం కల్పించారు. (ఫ్రాన్సులో 12 వ శతాబ్దంలో ఆరంభమై వ్యాపించి 16 వ శతాబ్దంలో అంతరించింది గోథిక్ శిల్పం. దీనినే మధ్యయుగాల అనాగరిక శిల్పం అని అధిక్షేపించే వారు కూడా.)

నాటర్ డామ్ చర్చి ఏ ఒక్క విశిష్టకళా విధానానికీ చెందినది కాదు. అన్నికాలాలకూ చెందిన శిల్పాలు అక్కడ గోచరిస్తాయి. అది రోమన్ చర్చీ కాదు; గోథిక్ చర్చీ కాదు, ఆధునికమూ కాదు, పురాతనమూ కాదు. అది సంధియుగపునిర్మాణం. దేవాలయ నిర్మాణ ప్రారంభంలో శాక్సనులు మొట్టమొదటి స్తంభాలు నిర్మించారు. తరువాత మత యుద్ధాల అనంతరం గోథిక్ శిల్ప ప్రభావం కనపడుతుంది. అయితే ఇదికూడా పూర్తిగా నిలవలేదు. అందువల్లనే నాటర్ డామ్ చర్చి నిర్మాణంలో పాశ్చాత్య శిల్ప కళాపరిణామచరిత్ర స్పష్టంగా గోచరిస్తుంది. శ్రద్ధగా పరికించే వారికి ఫ్రాన్సుదేశచరిత్ర, శిల్పచరిత్ర సక్రమానుక్రమణికలో గోచరిస్తాయి.

ఈజిప్టులో పిరమిడ్సు, భారత దేవాలయాలు, యూరప్‌లోని ప్రసిద్ధ క్రైస్తవ మందిరాలు ఏ ఒక్క శిల్పి నిర్మించినవి కావు. అవి జాతీయ కళాసంపదకు దర్పణాలు. తరతరాల కళాసంపదను సమన్వయించి తీర్చిదిద్దిన సంపుటాలివి. కళా పరిణామంలో కూడా సహజపరిణామధర్మమే వర్తిస్తుంది. మొదట రోమన్ కళా విశిష్టత, తరువాత గోథిక్ శిల్పవిధానం, ఆపైన గ్రీక్—రోమన్ మిశ్రమవిధానం ఒకదానివెంట ఒకటి ఈ మంది

శాలలో సువ్యక్తమౌతాయి. వీని నిర్మాణం శతాబ్దాలకొద్దీ సాగడమే ఇందుకు కారణం. (అయితే ఒక్కొక్క శిల్పవిధానానికి చెందిన మందిరాలూ లేకపోలేదు.) ఈరీతిగా యూరప్‌లో ప్రసిద్ధ మందిరాల నిర్మాణం ఆరు శతాబ్దాలపాటు నిరాఘాటంగా కొనసాగింది. ఇటువంటి మందిరాలలో పారిస్‌లోని నాటర్‌డామ్ చర్చి ఒకటి. ఇంతమాత్రాన ఇవి దైవప్రార్థన కనుకూలం కావనుకోకూడదు. లోపలి మందిరాల విభాగం ప్రార్థనా వేదికల ఏర్పాటు మొదలైనవి అన్నిటా ఒకేరీతిగా ఉంటాయి. వృక్షు కాండాలొకే తీరున ఉన్నప్పటికీ శాఖోపశాఖలు, పత్ర పుష్ప ఫలసముదాయాలు వేర్వేరు తీరుపైనట్లు, దైవమందిరాల ఏర్పాటు ఒక తీరునే ఉండి, పై పైభాగాలు కళానైవిధ్యమూ, రీతినైవిధ్యమూ వెల్లడిస్తాయి. ఇది పదిహేనో శతాబ్దంనాటి నాటర్‌డామ్ చర్చిని గురించిన చరిత్ర. ఇంక పారిస్ నగరం ఎలా ఉండేది?

గోపురాలెక్కి పారిస్ నగరాన్ని చూస్తే ఒక అద్భుత దృశ్యం కనపడుతుంది. సీన్ నది మధ్యలో ఉయ్యాల ఆకారంలో ఉన్న ఒక చిన్న ద్వీపంలో ప్రారంభమైంది పారిస్ నగర చరిత్ర. ఇప్పుడా ద్వీపభాగాన్ని సిటే అంటున్నారు.

ప్రారంభదశలో సీన్ నదీ జలాలే పారిస్ నగరానికి పరిఖలు. చిరకాలం ఈ ద్వీపంలోనే సుప్తావస్థలో గడిపింది పారిస్. ద్వీపానికిరువైపులా నదిపై రెండే వంతెనలుండేవి. నగరంలోకి ఈ వంతెనలమీదనించే ప్రవేశం ఈ వంతెనలే శత్రువుల దాడి నుంచి నగరాన్ని కాపాడ్డానికి పెట్టని గోడలుగా ఉండేవి.

కాలక్రమేణా జనసంఖ్య పెరగనారంభించింది. ద్వీపం ఇరుకై కదలడానికి చోటులేక పారిస్ ఇంక నదిదాటింది. ఇప్పుడు వంతెనల కవశల గృహరక్షణకోసం ప్రాకారాలు గోపురాలు వెలిశాయి. (వీని శిథిలాలు పద్దెనిమిదో శతాబ్దంవరకూ కనపడేవి. తరువాత అవి అంతరించిపోయాయి.)

జనావాసయోగ్యమైన ఈ ప్రదేశం ఇంకా విజృంభించ నారంభించింది. వందలకొద్దీ కొత్త గృహాలు లేచాయి. చివరికి స్థలం చాలక ప్రాకారం దాటి విస్తరించాయి. ఫిలిప్ ఆగస్టీన్ కొత్తదుర్గాలు నిర్మింపచేశాడు. పారిస్ నగరాన్ని ఆ వలయ పరిమితిలో నిర్బంధించడానికి ప్రయత్నించాడు. దగ్గరదగ్గరలోనే ఇళ్లు

లేచాయి. చోటు చాలక అంతస్థు లెక్కి ఆకాశాని కెగబ్రాకడం మొదలు పెట్టాయి. ఒకదానిని మించి మరొకటి ఉవ్వెత్తుగా పైకి పెరిగాయి. వీధులు సన్ననై చీకటికోణా లయినాయి. అయినా చాలలేదు. ఇంక నిగ్రహించలేక ఫిలిప్ ఆగస్టస్ కోటగోడలు దూకి విస్తరించాయి. కారాగారపు గోడలు దూకి విడివడిన బందీలవలె కోటగోడల కవతల జనావాసాలు యథేచ్ఛగా విస్తరించాయి. ఈమారు తోటలూ, దొడ్లూ అమునిగ్చురుని సుఖావాసాలయినాయి. తిరిగి 1367 వ సంవత్సరానికి కొత్త పరిధు లవసరమైనాయి. తిరిగి అయిదో చార్లెస్ కొత్తగా గిరిగీశాడు. కాని ఈ గిరి దాటడానికి పారిస్‌కి ఆట్టే కాలం పట్టలేదు. ఇంక పారిస్ మరింత వేగంతో విజృంభించ నారంభించింది.

ఇటువంటివే దేశాలకు రాజధానులు కాగలిగిన నగరాలు. ఆ దేశంలోని రాజకీయ, సాంఘిక, నైతిక విజ్ఞానిక వాహినులు ఇటువంటి నెలవుకే చేరగలవు. అయితే వీనిలో కొత్త నీటితోపాటు పాత నీరుకూడా చేరడం మానదు. యుగయుగాల నాగరిక ప్రవంతు లిటువంటి స్థావరంలోనే చేరి రాణింపుకు వస్తాయి.

పదిహేనో శతాబ్దం ఆఖరుదశలో పారిస్ తుది నిర్బంధాలను కూడా సహించి వ్యాపించింది. వ్యాపించి నిరోధించి నిలిచిన ప్రాకారా లన్నిటినీ నేలమట్టం చేసింది. వరద ముంచెత్తినప్పుడు మైదానంలో అక్కడక్కడ చెట్లు తలెత్తి చూసినట్లు ఈ మహా నగరంలో అక్కడక్కడ కోటల శిథిలాలు తల చూపుతూ ఉంటాయి.

పదిహేనో శతాబ్దానికే పారిస్‌కి ఒక విశిష్టమైన ఆకారం ఏర్పడింది. ఎత్తైన గోపురమెక్కి చూస్తే—యౌవనవతులైన ఇద్దరు పుత్రికలమధ్య నిలిచిన వృద్ధమాతవలె, మూడు ప్రత్యేక నగరాలుగా, కనబడుతుంది. సీన్ నదిమధ్య ద్వీపానికి పరిమితమైనది సిటీ; సీన్‌నది దాటి దక్షిణానికి పెరిగినది యూనివర్సిటీ; ఉత్తరానికి పెరిగినది విల్. మూడింటిలోనూ అతివిశాలమైనది విల్.

ఈ మూడు ప్రాంతాలకూ ప్రత్యేక లక్షణా లున్నాయి. సిటీలో (మధ్య ద్వీపభాగంలో) క్రైస్తవ మందిరా లధికం. విల్, అంటే ఉత్తరభాగంలో రాజ హర్మ్యాలూ, ధనవంతుల భవ

కాలూ అధికం. యూనివర్సిటీలో (దక్షిణభాగంలో) విద్యాలయాలు హెచ్చు—ప్రసిద్ధ న్యాయసభా భవనం, నాటర్ డామ్ చర్చి సిటీలో ఉన్నాయి.

అంటే పారిస్‌లో ఉత్తరాన ధనవంతుల దర్పం, మధ్య సిటీలో బిషప్ అధికారం, దక్షిణాన విశ్వవిద్యాలయాధికారి ప్రభావం అధికమన్నమాట. వీరందరిపైనా రాజనియామితుడై ప్రవోస్ట్ అధికారి. ఈ ప్రవోస్ట్ పారిస్ పురపాలకాధికారి కాడు, రాజుకు బాధ్యుడు.

దక్షిణాన విద్యార్థులు నేరాలు చేస్తే సిటీలో విచారణ జరిపి, ఉత్తరభాగంలో శిక్ష విధించేవారు. మహారాజు దుర్బలుడైతే విద్యాలయాధికారులు జోక్యం కలిగించుకొని విద్యార్థుల్ని ఉరితీసే అధికారం తమకే ఉన్నదని దబాయించి, తమ విద్యార్థుల్ని తమ విశ్వవిద్యాలయాలవద్దే ఉరితీసేవారు. ఇటువంటి అసందర్భపు అధికారాలే కాకుండా సవ్యమైన అధికారాల్ని కూడా ప్రజలు సాధించుకోవాలంటే విప్లవాలూ దొమ్మీలే సాధనాలు. బలవంతాన కాకపోతే మహారాజులు ఎన్నడూ ఏ వర్గానికీ ఎటువంటి అధికారాలనూ ధారాదత్తం చెయ్యలేదు.

మూడు నగరాలలోనూ వీధులు, బాటలు అల్లిబిల్లిగా అల్లుకుపోయినట్లుంటాయి. కాని శ్రద్ధగా పరికిస్తే ఈ చిక్కుదారులలో కూడా తీరు తెన్ను ఉన్నట్లు బోధపడుతుంది. మూడు నగరాల మధ్యనుంచీ, పారిస్‌కి ఈ చివరనుంచి ఆ చివరకు ఉత్తర దక్షిణాలుగా రెండు రహదారులున్నాయి. మళ్ళీ మూడునగరాలలోనూ ఒక్కొకదానిలో మూడేసి వీధులు తూర్పు పడమరలకున్నాయి. ఆకులో ఈనెలకు ఈనెలల్లుకున్నట్లు ఈ ప్రధాన మార్గాలనుంచి చిన్నచిన్న రోడ్లు పారిస్ అంతటా అల్లిబిల్లిగా అల్లుకుని ఉన్నాయి.

గోపురం పైనుంచి చూస్తే సిటీ నేలకెక్కిన ఓడవలె ఉంటుందని ఒక రచయిత అన్నాడు. యూనివర్సిటీ దాదాపు చతుర్భుజాకారంలో ఉంటుంది. విల్ ఉత్తరానికి విస్తరించిపోయింది. మందిరగోపురాలు, భవనాల అంతస్తుల వెనుక నగర

నిర్మాణం కనపడదు. ఆకాశాని కెగిరిచూస్తే పారిస్ విశిష్టరూపం గోచరించవచ్చునేమో !

నాటర్ డామ్ చర్చి గోపురంనుంచి చూస్తే లెక్కలేనన్ని మందిరాలు, వాని గోపురాలు కనపడతాయి. దూరాన విశ్వవిద్యాలయం, ఇటు రాజభవనాలు, అక్కడక్కడ ఉరిస్తంభాలు, నేరస్థుల శిక్షకోసం నిర్మించబడిన ఇనపచక్రాలు దూరాన పొట్టి గుడిసెలు, దుబ్బులుకల మైదానం, మాయనిలయంకూడా గోచరిస్తాయి.—అంతటా రోమన్, గోథిక్, గ్రీక్—రోమన్, ఆధునిక రీతులన్నీ గోచరిస్తాయి. ఈ నగరంలో ఫ్రెంచి దేశచరిత్ర శిలాశిల్పంతో రచించినట్లు కళ్లకు కట్టినట్లగపడుతుంది. దాదాపు ఫ్రెంచిరాజు లందరి ఛాయలూ ఏ నిర్మాణంలోనూ కనపడక మానదు. వివిధ కాలాల స్మృతిచిహ్నాలను పోగుచేసినట్లు కనపడుతుంది.

పారిస్ నగరశోభను చూడాలంటే ఏ పండుగ రోజునో ప్రభాతసమయంలో గోపురమెక్కి చూడాలి. అప్పుడే దైవ మందిరాలలో గంటలు మేలుకొంటాయి. సూర్యభగవానుని పతాక తూర్పున సంకేతమివ్వగానే చర్చి గంటలు ఒక్కటొక్కటిగా మేలుకొంటాయి. వాద్య ప్రవీణుడు మొదట శ్రుతి పరిశీలించినట్లు మొట్టమొదట అక్కడక్కడ ఏ ఒకటిరెండు మందిరాలలోనో గంటలు మోగడం ప్రారంభిస్తాయి. ఎక్కడో ఆకాశంనుంచి వినవస్తున్నట్లుండే ఈ ధ్వనులకూ రూపం సిద్ధించినట్లనిపిస్తుంది. తరువాత ఉన్నట్టుండి అకస్మాత్తుగా అన్ని మందిరాలనుంచీ వేలాది చర్చిల ఉపరిభాగాలనుంచి గంటలన్నీ గణగణ మ్రోగుతాయి. అయితే ఈ ధ్వనులలో అపశ్రుతి రాదు. ప్రతి ఘంటానినాదం ఒక్కొక్కటే బయలుదేరి ఆకాశాని కెగసి అక్కడ క్రమక్రమంగా అన్నీ మేళవిస్తాయి. అప్పటికా సమ్మిళిత ధ్వని తరంగాలు నగరం నలుమూలలా వ్యాపిస్తాయి. అదిమొదలు ఘంటారవం మందిరాలలో జనించి భూమ్యాకాశాలను నిరంతరాయమై మధురస్వరంతో నింపివేస్తుంది. ఈ స్వరసమ్మిశ్రణంలో వివిధ స్వరాలు కూడా ప్రత్యేకించి వినపడుతూనే ఉంటాయి. కొన్ని స్వరాలు సన్నవై తీక్షణంగా ఉంటాయి. కొన్ని మందరస్థాయిలో

గంభీరమై అంతర్వాహినివలె ప్రవహిస్తాయి. రాజమందిరాలలోని ఘంటలు అధికార దర్పంతో మ్రోగుతాయి. మధ్యమధ్య నాటర్ డామ్ చర్చిలోని గంట గంభీరస్వరం అన్నిటినీ మించి నగరాన్ని దద్దరిల్లచేస్తుంది. మొత్తానికి సప్త స్వరాలనూ పలికిస్తాయి పారిస్ దైవమందిరాలలోని గంటలు. ఈ ఘంటా నినాదాల తరంగాలలో పారిస్ నగరం మేలుకొంటుంది.

పారిస్ నగరంలో పగటివేళ వినవచ్చే ధ్వని సముదాయం నగర సంభాషణవలె ఉంటుంది; రాత్రివేళ నగరం ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విడుస్తున్నట్లుంటుంది. కాని పర్వదినాలలో ప్రభాత సమయంలో వినవచ్చేది నగరగానం అనవచ్చు. ఈ నగరగానం క్రమక్రమంగా ఆకాశంలో వ్యాపించి తరువాత నగరంపైకి మెల్లి మెల్లిగా దిగి లక్షలాది ప్రజల రణగుణ ధ్వనిలో లయమైపోతుంది. నగరం నాలుగు దిశలా ఆకాశం నాలుగు జంత్రవాద్యాలతో జంత్రగానం వినిపిస్తున్నట్లుంటుంది. పారిస్ నగరం ఒక జంత్రవాద్య సమ్మేళనం. ప్రభాత ఘంటా నినాదం ఒక అద్భుతగాన విశేషం. ఇటువంటి అద్భుతమైన నగరం ప్రపంచంలో అరుదు.

# 12

ముందు ప్రకరణాలలో వివరించబడిన చరిత్రకు సరిగ్గా పదహారు సంవత్సరాల ముందు మాట — అది ఈస్టర్ పండుగ గడిచిన మొదటి ఆదివారం. (దీనినే లో సన్ డే అనీ క్వాసిమోడో లేక గ్రీకు ఉచ్చారణప్రకారం కొజిమదో సన్ డే అనీ అంటారు.) ఆరోజు ఉదయమే నాటర్ డామ్ చర్చి ఎడమప్రక్క ద్వారంవద్దనున్న కొయ్యపడకపైన ఎవరో ఒక శిశువును విడిచిపెట్టేశారు. తల్లిదండ్రులచే విడువబడి అనాథులైన బిడ్డలను ఇక్కడ విడిచిపెట్టడం ఆచారం. కోరినవారు బిడ్డను తీసుకుపోయి పెంచుకుంటారు. కొయ్యపడకముందు రాగిదొన్నె ఒకటుంది. వచ్చిపోయే వారిలో ధర్మాత్ములు అందులో డబ్బులు వేసి వెడతారు.

ఆరోజు ఉదయం, అంటే 1467 వ సంవత్సరం ఈస్టర్ తరువాతి మొదటి ఆదివారంనాటి ఉదయం, ఆ కొయ్యపడకపైనున్న

బిడ్డను చూసినవారందరూ ఆశ్చర్యచకితులౌతున్నారు. అసలక్కడ చేరినవారిలో అత్యధికులు స్త్రీలు; వారిలోనూ వయసుమీరిన వారెక్కువ.

గుంపులో ముందు నలుగురు క్రైస్తవ సన్యాసినులున్నారు. నలుగురూ పూర్వసువాసినులే. నాటర్ డామ్ చర్చి ప్రార్థనల్లో పాల్గొనడానికి వచ్చి అక్కడి శిల్పసౌందర్యాన్ని తిలకిస్తూ ఇక్కడికి వచ్చి నిలబడిపోయారు. నిలబడిపోవడంతో పోలేదు. కొన్ని పూర్వనియమాల నుల్లంఘించారు; మౌనవ్రతం విడిచిపెట్టారు.

"ఇదేమిటి సిస్టర్!" అంది సిస్టర్ ఏగ్నెస్—ఇన్ని కొత్త ముఖాలు చూసి పసిబిడ్డ గొంతెత్తి బిగ్గరగా ఏడవడం మొదలు పెట్టాను.

"ఎంత పిదపకాలం వచ్చింది! ఎలాటిపిల్లలు పుడుతున్నారో చూడు!" అంది సిస్టర్ జెహాన్.

"పిల్లలు పుట్టుకమానేటేమో నాకు తెలీదు కాని, ఇటువంటి పిల్లల్ని చూడ్డం మాత్రం మహాపాపం" అంది సిస్టర్ ఏగ్నెస్.

"ఇది మనిషిబిడ్డ కాదే సిస్టర్! కోతిపిల్ల."

"కాదు రాకు.సి"

"ఎంతగొంతుకో చూడు? చెవులు చిల్లులు పడుతున్నాయి!"

"ఏమో! క్రైస్తవుల పిల్లవాడు కాడు. అసలిక్కడెందుకుంచారో - నదిలో పారెయ్యక!"

"ఎవరు పెంచుకుంటారులే పిణ్ణి"

"ఎవరూ తీసుకోకపోతే అనాథ శరణాలయంవాళ్లు ఆస్పత్రిలో పడేస్తారు."

"అబ్బ! అక్కడ నర్సులెల్లా పాలిచ్చి పెంచుతారే పిణ్ణి!"

"ఇంకా పాలేమిటి? నాలుగేళ్లుంటాయి! నూడు ఎంతున్నాడో! అందిస్తే రొట్టె మాంసం తినేసేట్టున్నాడు."

కొయ్యపడక పైనున్న దాన్ని పసిబిడ్డ అనకూడదు; ఆకారం లేని మాంసపుముద్ద అనాలి. ఒళ్లంతా కప్పారు. తల, ముఖం చూస్తే భయంకరంగా ఉన్నాయి. తలనిండా ఎఱ్ఱటి జులపాలు; ఒకే కన్ను ఉన్నాయి. పళ్లుకూడా పెరిగాయి. ఒంటికన్ను నుంచి

నీళ్లు కారుతున్నాయి. నోరు విలపిస్తోంది. పళ్ళు ఏవైనా దొరికితే కరవాలని చూస్తున్నాయి. ఒళ్లుమాత్రం కప్పబడిన సంచిలో గిలగిల తన్నుకుంటోంది.

కొద్దిసేపటిలో క్రైస్తవ మతాధికారి ఒకడు వచ్చాడు. ముందుకి వొంగిచూసి వెంటనే వెనక్కి తగ్గాడు. "దీన్ని నరకం నించి కొట్టుకొచ్చినట్టున్నారే?" అన్నాడు.

ప్రక్కనోకామె అంది "ఒక్కకన్నే ఉంది. రెండోకన్ను కంతిలో మూసుకుపోయినట్లుంది"

"అది కంతికాదు" అన్నాడు మతాధికారి. "మరో పిశాచాన్ని పొదుగుతున్న గుడ్డు. అందులో మరోటి, మళ్లీ అందులో ఇంకోటి వుంటాయి."

"నిజం?"

"తప్పకుండా. నాకు తెలుసు"

"ఏమండీ. ఇదేమిటంటారు? దుశ్శకునమా?"

"దుశ్శకునమే! దుర్భిక్షం తప్పదు."

"ఇంగ్లీషువాళ్లు దాడిచేస్తారని పుకార్లు పుట్టాయి; ఇందుకే కాబోలు" అన్నాడొకడు, ముందుకువచ్చి.

"వర్తకం దెబ్బతినెయ్యలేదండీ అప్పుడే!"

"దీన్ని ఇక్కడ ఉంచకుండా చితిమీద పడేస్తే అందరికీ మేలు."

ఈ సంభాషణ వింటూ వెనుకనే ప్రియయువకుడైన ఒక మతాధికారి నుంచున్నాడు. విశాలమైన నుదురు; నిశితమైన చూపులు గంభీరమైన ముఖభంగిమ గల అతణ్ణి చూడగానే అందరికీ గౌరవించాలని తోస్తుంది. మాట్లాడకుండా అందరినీ తోసుకుంటూ ముందుకువచ్చి బిడ్డను పరిశీలించాడు.

"నేను పెంచుకుంటాను" అని ప్రకటించాడు వెంటనే.

మెల్లిగా పసిబిడ్డను చేతుల్లోకి తీసుకున్నాడు. అందరూ విభ్రాంతులై మతాధికారిని పరికించారు. తరువాత అందరి ముఖాలలోనూ జుగుప్స జనించింది. ఏగ్నెస్ జెహాన్ వంకతిరిగి చెవిలో చెప్పింది! "నేను చెప్పలేదే సిస్టర్! క్లాడ్ ఫ్రాలో మంత్ర తంత్రాలు నేర్చినవాడని చెప్పలేదూ?"

# 13

క్లాడ్ ఫ్రోలో సామాన్యుడు కానిమాట నిజం. అతడు ఫ్రాన్స్‌లో ఒక ఉన్నత వంశానికి చెందినవాడు. పెద్ద ఎస్టేటుకు యజమాని. పారిస్‌లోనే కాక దేశంలో కూడా అతనికి చాల భవనాలున్నాయి.

చిన్నతనంనుంచీ అతణ్ని క్రైస్తవమతానికి సంబంధించిన విద్యల్లోనే తల్లిదండ్రులు ప్రవేశపెట్టారు. లాటిన్ నేర్పారు; నేలవంకనే దృక్కు లుంచాలని బోధించారు; మెల్లిగా స్థిరవచనాలతో సంభాషణ నేర్పారు. బాల్యంలోనే తలిదండ్రులను విడిచి విద్యాభ్యాసంకోసం పారిస్ వచ్చాడు. చదువులో విశేష పరిశ్రమ చూపాడు. చిన్నతనంలోనే మతగ్రంథాలను, ఆచార సంప్రదాయాలు, విధి శాసనాలను గురించి క్షుణ్ణంగా పఠించాడు. ఆపైన వైద్యశాస్త్రం అభ్యసించి, చికిత్స నేర్చాడు. తరువాత గ్రీక్ హిబ్రూభాషలు నేర్చి అనేక గ్రంథాలు పఠించాడు. జ్ఞానార్జనే అతనికి జీవితపరమాశయమైంది.

ఇలా వుండగా **1466** లో దేశమంతటా ప్లేగ్ వ్యాపించింది. త్వరపడి ఊరు వెళ్లేసరికే ప్లేగ్ వాతబడి తలిదండ్రు లిద్దరూ మరణించారు. ఇంక అతనికి ప్రపంచంలో చిన్న తమ్ముడొక్కడు తప్ప ఆప్తులు కాని బంధువులు కాని ఎవ్వరూ మిగలలేదు. పసివాడైన తమ్ముణ్ని తీసుకుని వెంటనే పారిస్ వచ్చాడు. ఇంతకాలంగా జ్ఞానసముపార్జనలో అణగారి ఉన్న అనురాగం అతనిలో ఒక్కసారి పొంగిపొర్లింది. తమ్ముణ్ని అత్యంత ప్రేమతో పెంచి పెద్దచేశాడు. గ్రంథపఠనమే జీవితపరమావధిగా ఎంచిన ఫ్రోలో తన ఏకాగ్రతను తమ్ముణ్నిపైకి మరల్చాడు. ప్రపంచంలో ఏకాకి కాగానే అతడు పుస్తక ప్రపంచంనుంచి మేల్కొని ఒక్కసారి వాస్తవ ప్రపంచంలో పడ్డాడు. ఒక భ్రమనుంచి మేలుకొని మరొక భ్రమలో పడ్డాడు. తమ్ముణ్నికోసం తాను వివాహం మానుకున్నాడు. క్రైస్తవ సంఘం అతణ్ని ప్రశంసించింది. సన్మానించి పిన్నవయసులోనే ఉన్నతపదవి నిచ్చింది. త్వరలోనే నాటర్ డామ్ చర్చి అధికారులలో ముఖ్యుడైనాడు. అదిమొదలు అతనికి తమ్ముణ్ని పెంపకం, గ్రంథపఠనం తప్ప జీవితంలో మరొక వ్యావృత్తి లేకపోయింది.

కాని గారాబుగా పెరిగిన తమ్ముడు జెహాన్ విలాస జీవనానికీ, విశృంఖల వర్తనకూ అలవడ్డాడు. అయితే తమ్మునిపట్ల జుగుప్సలోపాటు క్లాడ్ ఫ్రొలో హృదయంలో జాలి, అనురాగం కూడా సమానంగా వృద్ధి అయినాయి.

నాటర్ డామ్ చర్చి ప్రాంగణంలో కొయ్యపలక పైనున్న బిడ్డను చూసేసరికి అతడికి జాలి కలిగింది. అక్కడివారి ప్రసంగ ధోరణి విన్నాక అతని హృదయంలో అనురాగం పెల్లుబికింది. వికృతరూపి అయిన ఆ బిడ్డను చూడగానే తన తమ్ముని పూర్వస్థితి సుర్తుకువచ్చింది. తను చేరదీయకపోతే తమ్మునిగతి కూడా ఇంతే కదా అని తోచిందతనికి. వెంటనే ఆ పసిబిడ్డను పెంచాలని నిశ్చయించుకున్నాడు.

ఎత్తుకుని కప్పబడిన వస్త్రం తొలగించి చూశాడు. ముఖమే కాక శరీరం కూడా వికృతంగా ఉంది. కంఠం కనపడనంతగా తల భుజాలలోకి చొచ్చుకుని ఉంది. ఛాతీ ప్రక్కలకు వ్యాపించి ఉంది. కాళ్లు వంకరగా ఉన్నాయి. బిడ్డ నెత్తుకోగానే బరువుగా ఉన్నట్లు తెలుసుకున్నాడు ఫ్రొలో. బిడ్డ పుష్టిగా, ఆరోగ్యంతో ఉన్నాడు. వికృతాకారం అతనికి జుగుప్స కలిగించలేదు. జాలే కలిగింది. దుర్వర్తనకు లోనైన తమ్మునికి ముమ్ముందు భగవంతుని దాక్షిణ్యం లోపించవచ్చుననే భీతితో, భగవంతుని మెప్పు సంపాదించడంకోసం ఈ బిడ్డను పెంచి పెద్దచేయాలని భావించాడు.

ఈస్టర్ తరువాత మొదటి ఆదివారంనాడు (క్వాసిమోడో ఆదివారంనాడు) దొరికినందువల్ల బిడ్డకు 'క్వాసిమోడో' అని పేరు పెట్టాడు.

# 14

కథాకాలంనాటికి (1482 వ సంవత్సరానికి) క్వాసిమోడో పెరిగి పెద్దవాడైనాడు. క్షురకర్మ ప్రావీణ్యం చూపి మహారాజు మెప్పుపొందిన ఒలీవియర్ సహాయంవల్ల పారిస్ బిషప్ పదవి పొందిన లూయీబోమాంట్ దయచేత నాటర్ డామ్ చర్చి సర్వాధికారిగా నియమింపబడిన క్లాడ్ ఫ్రొలో, తన చర్చిలో గంట మోగించడానికి క్వాసిమోడోను నియమించాడు.

క్రమేణ క్వాసిమోడోకి నాటర్ డామ్ చర్చిపట్ల అసాధారణమైన అనురాగం జనించింది. తలిదండ్రు లెవరో తెలియని వికృతరూపి అయిన అతను సంఘానికి దూరమైనాడు. మానవుల సాహచర్యం అతనికి పూర్తిగా లోపించింది. అందువల్ల అతను చర్చి ఆవరణలో బందీయైనాడు. అతనికి గృహం, దేశం, ప్రపంచం యావత్తూ అదే అయింది. పసితనంలో ఈ మందిరంలో శిల్పాల మధ్య స్వేచ్ఛగా పాకి తిరిగి ఆడుకునేవాడు. మధ్య యుగ శిల్పాలలో ఒకటి ప్రాణం పోసుకుని లేచి మందిరంలో తిరుగుతున్నట్లుండేది. వయసొచ్చినతరువాత గంట మోగించడానికి వేలాడగట్టిన తాడు పట్టుకుని లాగేవాడు. గంట మోగేసరికి నవ్వి ఉల్లాసంతో గంతులు వేసేవాడు. అతని ప్రజ్ఞచూసి ఫ్రాలో మురిసిపోయేవాడు. ఆ మందిరంలోనే రాత్రింబగళ్లు గడిపి పెరిగిన క్వాసిమోడోకి మందిరంతో ఒకవిధంగా తాదాత్మ్య భావం కలిగింది. ఎదిగినకొద్దీ అతనికి చర్చిలో ప్రతివారూ, ప్రతి శిల్పం, ప్రతిమూలా పరిచయమైనాయి. అతనికి చర్చిలో ఎక్కలేనిచోటు లేదు. ఈ భవనం అతణ్ణి తన బిడ్డగా తనలో ఒకనిగా చేసుకుంది. అతని బుద్ధికూడా ఆ పురాతనమందిరంవలెనే మల్చుకుంది. ఆ మందిరంవలెనే అతని అంతరంగంకూడా ఏమూల ఏమున్నదో తెలియరానిదయింది. మాధ్యమిక యుగ శిల్పాకారాలవలెనే అతని హృదయం ఎట్లా వికృతిపొందిందో చెప్పడం కష్టం. కాని ఆ శిల్పసముదాయంలోనే అతని వ్యక్తిత్వం రూపొందిందనేదిమాత్రం రూఢి.

అతనికి మాటలు నేర్పడానికి ఫ్రాలో విశేషంగా శ్రమపడవలసివచ్చింది. కాని క్వాసిమోడో జీవితంలో ఎక్కడో విధి విపత్యయం సంభవించింది. పధ్నాలుగో యేటనే చర్చిలో గంట మోగించే ఉద్యోగం పొందిన క్వాసిమోడోకి ఉన్న వైకల్యం చాలదన్నట్లు మరొకటి సంభవించింది. నాటర్ డామ్ చర్చి గంట చాల పెద్దది. దాని నినాదం మేఘ గర్జనం వంటిది. దీనితో క్వాసిమోడోకి బధిరత్వం ప్రాప్తించింది. అతనికీ ప్రపంచానికీ మధ్య సన్నిహిత సంబంధం సమకూర్చిపెట్టగల మిగిలిన ఒక్క సాధనం కూడా వమ్మయిపోయింది. ఇంక క్వాసిమోడో లోకంనుంచి పూర్తిగా వేరైపోయినాడు. అసలే తమోనిబద్ధమైన అతని ఆత్మ పూర్తిగా బహిఃప్రపంచంనుంచి వేరై మహాంధకారకూపంలో పడి

పోయింది. అంగవైకల్యంవలెనే అతని ముఖంలో మూక విషాద భావం స్థిరపడింది. నేర్చిన కొద్ది పలుకూ మరిచిపోకపోయినప్పటికీ చెవుడువల్ల కొంత మూగతనమబ్బింది. ఒంటరిగా ఉన్నప్పుడు మాత్రం తనలో తానేదో ప్రసంగించుకుంటాడు. కాని తన మాటలే తనకు వినపడవు. అందువల్ల ఇతరుల సమక్షంలో మాట్లాడవలసినప్పుడు తడబడతాడు; నత్తి వస్తుంది.

అతని అంతర్యం గ్రహించడం దుర్ఘటమైన పని. బహిరింద్రియాల వైకల్యంవల్ల ఏర్పడిన నిరోధాల నధిగమించి చూసినట్లయితే, అతని ఆత్మ ప్రజ్ఞలుడిగిన చిరకాల నిర్బంధితునివలె ఉన్నట్లు బోధపడుతుంది.

రూపం వికృతమైనప్పుడు ఆత్మ శోషిస్తుంది; దృష్టి వక్రిస్తుంది. వక్రించిన దృష్టికి చుట్టూ లోకమంతా వక్రగతినే గోచరిస్తుంది. ఈ కారణంవల అతనికి లోకంపట్ల మాత్సర్యం జనించింది. దీనికి లుప్తప్రజ్ఞ తోడై అతనిలో పాశవిక ప్రవృత్తి విజృంభించింది. అన్యమానవుల వ్యక్తిత్వ పరిణామంలోవలెనే అతని వ్యక్తిత్వ పరిణామంలో కూడా ప్రకృతి ధర్మం రీతిబద్ధమై గోచరిస్తుంది. లోకంపట్ల అతని క్రోధం అకారణం కాదు. మనుష్యుల పట్ల అతనికీ మొట్టమొదట మమత లేకపోలేదు. కాని కన్ను తెరిచినప్పటినుంచీ అతనికి ఎదురైనది నిరసన మాత్రమే. చుట్టూ లోకమంతా అతడిని ఘృణాభావంతో చూసినప్పుడు అతడదే భావాన్ని లోకంవద్దనుంచి గ్రహించి, తనపై లోకం ఏ ఆయుధం ప్రయోగించిందో, అదే ఆయుధాన్ని లోకంపై ప్రయోగించాడు.

లోకంతో ఇప్పుడతనికి నిమిత్తంలేదు. నాటర్ డామ్ మందిరమే అతనికిచాలు. మందిరంలో శిలాకృతి పొందిన రాజులు, మతాచార్యులు, మృగరాజులు, దేవతలే అతనికి మిత్రులైనారు. అక్కడి రాక్షసులకు కూడా అతనిపట్ల నిరసనలేదు. అందరూ అతడిని చిరునవ్వుతో పలకరించి ఆదరిస్తారు, పవిత్రపురుషు లతన్ని దీవిస్తారు, రాక్షసరూపులు అతనితో చెలిమిచేసి రక్షిస్తారు, అతడు మూకభాషలో వారందరితో ప్రియసంభాషణ సాగిస్తాడు. మందిరమే అతనికి సర్వప్రపంచం. అక్కడి లిఖితచిత్రాలే వృక్షలతాదులు; అవే పుష్పఫలాలు. ఆ పుష్పాలు నిత్యయౌవనాలు. ఆ

గోపురాలే పర్వతాలు, గోపురం పైనుంచి కన్పడే పారిస్ నగరమే మహాసాగరం.

మనుష్యులెవరైనా కనపడితే అతను పారిపోతాడు. ఈ విశాల మందిరంలో ఏ శిలామూర్తులపంచ దాగిపోతాడో అతడిని కనుక్కోడం మనుష్యమాత్రునికి సాధ్యపడదు.

ఈ చర్చిలో కెల్ల అతనికి ప్రియతమమైనవి గుడిగంటలు. వాని శరీరాలను మృదువుగా స్పృశిస్తాడు; వాని వెన్ను దువ్వుతాడు; వానితో మాట్లాడతాడు. వాని భావాలు అతనికే తెలుసు. ఘంటానినాదం అతని చెవులకు మధుర సంగీతం. అతని చెవులకు వినపడేవి ఈ గంటల గణగణలు మాత్రమే. ఉన్న పదిహేనుగంట లన్నిటిలో పెద్దగంట ఒక్కటే ఈ ప్రపంచంలో అతనికి ప్రియమిత్రం. దీని నతడు మేరీ అని ముద్దుగా పిలుస్తాడు...

ఫ్రొలో ఆజ్ఞ ఇవ్వగానే అతని ఉత్సాహానికి అంతుండదు. ఉపతమాదిరిగా కన్నుమూసి తెరిచేలోపల నిచ్చెనలెక్కి గంట లందుకుంటాడు. క్షణంసేపు ప్రీతిపూర్వకంగా మేరీవంక పరికిస్తాడు. మెల్లిగా దాని వీపుతట్టి పలకరిస్తాడు. పాపం గొంతెత్తి నినాదం చెయ్యవలసినందుకు గంటను చూసి జాలిపడతాడు. తరువాత కింద పగ్గాలు లాగేవాళ్లకి ఆజ్ఞ ఇస్తాడు. వాళ్ళు పగ్గాలు లాగడం మొదలు పెడతారు. గంటలు మెల్లిగా ఊగ నారంభిస్తాయి. తరవాత అన్నీ ఏకకంఠంలో మోగుతాయి. "వహ్వా! భేష్" అని క్వాసిమోడో ప్రశంసిస్తాడు. నినాదం వృద్ధి అవుతున్నకొద్దీ అతడు ఆనందపరవశుడౌతాడు. ముందుకీ వెనక్కీ పరుగులు పెడతాడు. గోపుర శిఖరంతోపాటు అతనుకూడా ఆనందోద్వేగంతో కంపించిపోతాడు. గంటలతో పాటు క్వాసిమోడో నాట్యం చేస్తాడు. ఉన్నట్టుండి అకస్మాత్తుగా మేరీపై కురుకుతాడు. ఆ గంట పార్శ్వభాగాన్నంటి పెట్టుకుని గంటతోపాటు వినువీధిని ఊయలలూగుతాడు. ఇంక పగ్గంతో పనిలేకుండా తానే ఊగి మేరీని మోగిస్తాడు. గంటతో కంఠం కలిపి బిగ్గరగా కేకలు వేస్తాడు. అప్పు డతని నేత్రాలలో నిప్పులు కురుస్తాయి. ఈ ఆవేశం ఆనందజనితమే అయినప్పటికీ అప్పటి అతనిస్థితి క్రోధానికీ సంతోషావేశానికీ అతీతమై భీభత్సంగా పరిణమిస్తుంది. అప్పుడు మ్రోగేది గంటకాదు; ఆ కేకలు మానవ

మాత్రునివి కావు; అదొక ఝంఝామారుతం; అతీత శక్తులను తోపింపచేసే మహాఘోష; ఘోర ఘంటారావం. అక్కడున్నది గంట కాదు; మనిషి కాదు; మానవాకారం ఘంటాకారం కలిసిన రాక్షసాకారం.

వికృతరూపి వికృతాత్మ మందిరమంతటా ఆవరించినట్లు, ఆవహించినట్లుంటుంది. నాటర్ డామ్ మందిరంలోని మధ్యయుగ వికృతశిల్పం సజీవమై మందిరాన్ని లోబరుచుకున్నట్లనిపిస్తుంది. మందిరమంతా ఘంటారావంతో మానవ కంఠనాదం మిళితమైన ఒక విచిత్రఘోషతో మారుమోగుతుంది; మందిరమంతా కంపించిపోతుంది.

మందిరంలో క్వాసిమోడో ఉనికితో సకల శిల్పాలూ సజీవమై మేలుకొన్నట్లనిపిస్తుంది. మందిర మంతటికీ అతడు ప్రాణంపోస్తున్నాడనిపిస్తుంది. అతడు మందిరాన్ని ఆవహించాడు. మందిరం అతడి నావహించింది. మందిరంలో సర్వత్ర అతడే వ్యాపించాడు. అతనిలో మందిరం మూర్తీభవించింది.

నేడు చూసేవారికి క్వాసిమోడో లేని నాటర్ డామ్ చర్చి, ప్రాణవాయువు లెగసిపోగా మిగిలిన శవంవలె గోచరిస్తుంది.

# 15

మనుష్యులపట్ల క్వాసిమోడో ద్వేషభావం ఒకే ఒక్క వ్యక్తిపట్ల మాత్రం లోపించింది. తనపట్ల జాలిచెంది శైశవంనుంచి పెంచి పెద్దచేసిన క్లాడ్ ఫ్రోలోపట్ల క్వాసిమోడోకి అపరిమిత భక్తిభావం ఏర్పడింది. ఇది సహజమే. చిన్నతనంలో ఇతర బాలురు వెంటతరిమి కొట్టవచ్చినప్పుడు, కుక్కలు తన్ను చూసి మొరిగి తరిమినప్పుడు క్వాసిమోడో పరుగెత్తివచ్చి క్లాడ్ ఫ్రోలో కాళ్ళచాటున దాగేవాడు. క్లాడ్ ఫ్రోలో అతనికి మాట్లాడను, చదువను, వ్రాయను నేర్పాడు. నాటర్ డామ్ చర్చిలో గంటలు మోగించే ఉద్యోగానికి నియమించాడు.

యజమానిపట్ల క్వాసిమోడో భక్తివిశ్వాసాలు అనుపమానమైనవి. పెంపుడు తండ్రి ఎల్లప్పుడూ అధికారం అహంకారం

ఉట్టిపడుతున్నట్లు అతనితో మాట్లాడినప్పటికీ క్వాసిమోడోకి కోపం రాదు. అతని కృతజ్ఞతాభావంలో అన్ని భావాలూ, అహమూ, ఆవేశాలూ అంతరించిపోయాయి. ఆ మతాధికారికి కూడా క్వాసిమోడోవంటి విశ్వసనీయుడైన బానిస మరొకడు లేడు. క్వాసిమోడోకి చెవుడు ప్రాప్తించిన తరవాత ఇద్దరూ సంకేతాల సహాయంతో ప్రసంగించేవారు. ఆ మూకభాష వారిద్దరికే తెలియాలి కాని మరొకరి కర్థంకాదు.

వారిద్దరిమధ్యా స్థిరపడిన బాంధవ్యంతో పోల్చదగినది ప్రపంచంలో ఏదీలేదు. క్లాడ్ కనుసన్న చేస్తే చాలు, అతని ప్రీతి కోసం క్వాసిమోడో నిప్పులోనికైనా ఉరకడానికి వెనుదియ్యడు. అతీత బలసంపన్నుడైన ఈ వికృతరూపి తన యావచ్ఛక్తినీ దుర్బలుడైన ఒక వ్యక్తికోసం ఈవిధంగా ధారపోయడం అపూర్వమైన విషయం.

కథా కాలంనాటికి క్వాసిమోడో వయస్సు ఇరవై; క్లాడ్ ఫ్రాలో వయస్సు ముప్ఫైఆరు. ఒకడింకా ఎదుగుతున్నాడు, మరొకడు వృద్ధుడౌతున్నాడు. ఇంతేకాదు. క్లాడ్ ఫ్రాలో జీవితంలో పరిణామంకూడా వచ్చింది. జ్ఞానసముపార్జనకై భౌతిక విజ్ఞాన శాస్త్రాధ్యయనం అతడు మానలేదు. తాత్విక సంపద ఎంత ఆర్జించాడో మూర్ఖత్వమంత సంపాదించాడు. చలించని గంభీర వదనముద్ర ఒక ఏర్పడింది. అతడిని చూసి క్రింది అధికారులూ గుమాస్తాలు పరిచారకులూ చేతులు కట్టుకుని అధోముఖులౌతారు.

అతనికి శాస్త్రపఠనంపట్ల ఎంత శ్రద్ధో, తమ్ముని విద్యాభ్యాసంపట్లకూడా అంత శ్రద్ధ. కాని అతనికి రెండువిధాలా జీవితంలో ఆశాభంగమే ఎదురయింది. తమ్ముడు జెహాన్ ఫ్రాలో విద్యాభ్యాసం పూర్తిగా వ్యర్థమయింది. విద్యకు తిలోదకాలిచ్చి దుర్నడతల కలవడ్డాడు. విలాస జీవనంకోసం అన్న ధనాన్ని విచ్చలవిడిగా ఖర్చుపెడుతున్నాడు. తమ్ముని విశృంఖలవర్తన అన్నకెంత మనోవ్యథ కలిగిస్తున్నదో, అన్న మనోవ్యథ చూస్తే తమ్మునికంత ఉత్సాహం కలుగుతోంది. తమ్ముని కూర్చోబెట్టి గంటలకొద్దీ అన్న నీతిగరిపేవాడు. అతి శ్రద్ధతో ఉపన్యాసమంతా విని లేచివెళ్ళిన తరువాత తమ్ముడు పొట్టపగిలేటట్లు నవ్వుకునే

వాడు. వికారులతో చేరి జూదంలో దొంగతనాలలో పాల్గొనే, వాడు. పోలీసులకు చిక్కి అన్న సహాయంతో విడుదలయేవాడు.

తమ్మునివల్ల ఆశాభంగం, వ్యధ అధికమైనకొద్దీ విజ్ఞాన శాస్త్రం పట్లక్లాడ్ ప్రీతి వృద్ధయేది. కాని అతని విజ్ఞానం వృద్ధయిన కొద్దీ గాంభీర్యం, విధినిర్వహణలో కాఠిన్యం, హృదయంలో చీకటి వృద్ధిఅవుతున్నాయి.

క్లాడ్ ఫ్రాలో పఠన తృష్ణకు శాస్త్రాలు, గ్రంథాలు చాల లేదు. పాము తనతోక తానే కొరుక్కుంటున్నట్లు తంత్రశాస్త్రంలో చిత్రించబడింది. అది భౌతిక విజ్ఞానానికి చక్కగా వర్తిస్తుంది. క్లాడ్ విషయంలో ఇదే సంభవించింది. క్రైస్తవ మతాధికారి అయిన క్లాడ్ ఫ్రాలో తంత్ర శాస్త్రాభ్యాసంలో పడి ఆత్మకు ముప్పు తెచ్చుకున్నాడు. భౌతిక విజ్ఞానశాస్త్ర మొకవంక, తాంత్రికశాస్త్ర మొకవంక అభ్యసించడంలో నిమగ్నుడైనాడు. రాత్రి వేళ ఎవరికంటా పడకుండా తంత్ర శాస్త్రజ్ఞుల గృహాలకు వెళ్ళేవాడు. నాటర్ డామ్ చర్చిలోని మధ్యయుగశిల్పాకారాల లోని నిగూఢసంకేతం గ్రహించడానికి యత్నించేవాడు. క్రమంగా ఈ మందిరంలోని విచిత్రశిల్పాలపట్ల క్లాడ్ ఫ్రాలోకికూడా అపరిమితమైన శ్రద్ధాభక్తులు జనించాయి.

ఒక గోపురం మిద్దెలో ప్రత్యేకం తనకొక గుప్తమైన గది నిర్మింపచేసుకున్నాడు క్లాడ్ ఫ్రాలో. ఆ గదిలోకి క్లాడ్ తప్ప మరొక రెవ్వరూ ప్రవేశించరు. ఆ గదిలో ఏముంటుందో ఎవరికీ తెలియదు. కాని రాత్రి వేళ వెనుక కిటికీలోనుంచి ఎర్రని వెలుగు ఆరిపోతూ వెలుగుతూ చాలామందికి కన పడేది. అది కొలిమి ఊది నప్పుడు వచ్చే మంటవెలుగువలె ఉండేది. అంతయెత్తు గోపురంలో చీకటిరాత్రులలో ఈ వెలుగుచూసి కొందరు భయపడే వారు. అదిమంట వెలుగని నిరూపించడానికి పొగకూడా కనపడేది.

కాని ఆదినుంచీ మంత్రతంత్రాలు నేర్చినవారిని కఠినంగా శిక్షించడంలో నాటర్ డామ్ చర్చిఅధికారులను మించినవా రెవ్వరూ లేనిమాట నిజం. క్లాడ్ ఫ్రాలో అందరినీ మించి మంత్రకర్తల్ని శిక్షింపచేసేవాడు. దొంగే గుంపులో కలిసి 'దొంగదొంగ' అని అరిచినట్లు, క్లాడ్ ఫ్రాలో మంత్రతజ్ఞులను వేటాడిపట్టి శిక్షిం

చడంలో ప్రముఖుడైనాడు. క్లాడ్ తన మంత్రప్రజ్ఞవల్లనే నాటర్ డామ్ చర్చిలో క్వాసిమోడో అనే రాక్షసుణ్ణి సృష్టించాడని కొందరు నమ్మేవారు. చివరికి పని తీరిపోగానే ఆరాక్షసి క్లాడ్ ఆత్మని లంకించుకుని నరకానికి వెళ్ళిపోతుందని వాళ్ళ నమ్మకం. అందువల్ల ఎంత ఉన్నతిలో ఉన్నప్పటికీ నాటర్ డామ్ చర్చి అధికారి అయిన క్లాడ్‌పట్ల శిష్టులైన క్రైస్తవులందరూ నిరసన భావంతో ఉంటారు.

వయస్సు మీరుతున్న కొద్దీ అతని బుద్ధితోపాటు హృదయం కూడా మలినం కాసాగింది. లోని మాలిన్యపు నల్లని ఛాయలు అతని ముఖంపైన స్పష్టంగా కనపడేవి. నిత్యం గాఢ నిశ్వాసాలు విడుస్తూ ఆలోచనలో మునిగిపోతూ వుంటాడు. మధ్య మధ్య విషం కక్కుతున్నట్లు వికృతమైన మందహాసం చేస్తూఉంటాడు. ఏ దుష్టభావాలో అతని ముఖంలో భీభత్సరేఖల్ని తోపింపచేస్తూ ఉంటాయి. అతని చిన్న కళ్ళు ఎప్పుడూ నిప్పులు కక్కుతూ ఉంటాయి. అతన్ని ఒంటరిగా చూసిన బాలబాలికలు బెదరి ప్రాణ భీతితో పరుగెత్తేవారు. ప్రసంగవశంలో అతడు లోలోన గొణుక్కోవడం పళ్ళు పటపటలాడించడం గమనించి సాటి మతాధికారులు విస్మితులయ్యేవారు. ఒక్కొక్కప్పుడు గోళ్ళతో చీరివేసినట్లున్న అతని దుస్తులను చూసినవారు కొందరున్నారు.

కాని మతవిషయకమైన విధ్యుక్త ధర్మంలో అత నెన్నడూ ఎట్టి లోపం చెయ్యలేదు. స్త్రీల నెన్నడూ అతను దరిచేరనివ్వలేదు. ఇంతే కాదు జిప్సీలు, యూదులు, తంత్రజ్ఞులు, మంత్రకత్తెలపట్ల అతని వైరం పారిస్ నగరమంతటా ప్రసిద్ధికెక్కింది.

క్లాడ్ ఫ్రొలో, క్వాసిమోడో — ఇటువంటి ఇద్దరు విచిత్ర మానవుల అధీనంలోఉన్న నాటర్ డామ్ చర్చిపట్ల పారిస్ నగరవాసులకు భీతి, శంక జనించాయి.

# 16

పారిస్ ప్రధాన న్యాయమూర్తి రాబర్ట్ ఎస్టూట్విల్ చాల పుణ్యం చేసుకుని పుట్టాడని చెప్పాలి. మన కథా కాలం నాటికి ఆయన అధికారం రాబడీకూడా అపారం. ఆ పదవిలో

చేయవలసిన పనికంటె అధికార దర్పం అధికం. అప్పటికి పదహా రేళ్ళనించి ఆయన ఆ పదవిలో ఉంటున్నాడు. ఈ పదహారేళ్ళ లోనూ ఎంతమంది మంత్రులో, ఉన్నతాధికారులో మారాడు. ఉన్నతపదవుల్లో ఎంతమందో మారిపోయారు కాని రాబర్ట్ అధికా రానికి చలనం రాలేదు. ఇంతేకాదు. తన తరవాత ఆ పదవి తన కుమారునికి సంక్రమించే ఏర్పాటుకూడా చేసుకున్నాడు. ఆయనకి పెద్ద జీతం వస్తుంది. ఇతరత్రా పెద్ద రాబడిఉంది. ఇదిగాక ఆడం బరంతో తళతళలాడే దుస్తులు ధరించి పెద్ద ఊరేగింపుల్లో గుర్ర మెక్కి ముందు దారితీస్తాడు. పారిస్‌లోని జైళ్ళన్నిటిమీదా అధి కారం ఆయనదే. అడుగడుగునా ఆయనకు ప్రణమిల్లి ఆజ్ఞలు శిరసా వహించే ఉద్యోగులనేకమంది ఆయన అధీనంలో ఉన్నారు. పారిస్‌లో నేరస్థుల్ని విచారించి శిక్షిస్తాడు; ఉరి విధిస్తాడు, హింసించడానికి ఆజ్ఞలిస్తాడు. రాజుగారు స్వయంగా శిక్షలు విధిం చిన ముద్దాయిలుకూడా ఆయన చేతులమీదుగానే ఉరి స్తంభాలకు వెళ్ళాలి. ఇంక ఇంతికంటె ఏంకావాలి మనిషికి? కొన్ని పెద్ద తలకాయలుకూడా, అంటే రాజవంశస్థులు, ధనాఢ్యులు కొందరి తలలు రాబర్ట్ హయాంలోనే ఎగిరిపోయాయి.

సంపూర్ణమైన సంతృప్తితో రోజురోజూ జీవితం వెళ్లబుచ్చడా నికి ఏంకావాలి? అయినా ఆరోజుని, అంటే 1482 వ సంవత్సరం జనవరి 7 వ తేదీ ఉదయం రాబర్ట్ ఎందుకో అతిచికాగ్గా ఉన్నాడు. చికాకెందుకు కలిగిందో అతనికే తెలియదు. ఆరోజు మబ్బుపట్టలేదు. ఆయన పొట్టపటకా మరీ బిగిసిం దేమో? తన్ని చూసికూడా తలవొంచుకోకుండా బికారు లెవరైనా తిరస్కారభావంతో తలెగరవేసి వెళ్ళిపోయుండవచ్చు. ఏమో! ఇటువంటి వన్నైనా కారణాలుండవచ్చు కాని ఏదో ఎవరూ చెప్పలేరు. మొత్తానికి చికాగ్గా మాత్రం ఉన్నాడు.

అది పండుగ గడిచిన మరుచటిరోజు. అంటే ఆ రోజుని న్యాయమూర్తులికి పనెక్కువే ఉంటుందన్నమాట. జడ్జీలు సాధార ణంగా మనస్సు చికాగ్గా ఉన్నప్పుడే ఇటువంటి నేరాలు విచారిం చడానికి నిర్ణయించుకుంటారు. మహారాజు తరఫున న్యాయశాసనం పేరు చెప్పి నేరస్థులమీద తమ చికాకంతా వెళ్ళబోసుకుంటారు.

రాబర్ట్ ఇంకా న్యాయస్థానానికి రాకముందే మిగతా న్యాయమూర్తులు నేరవిచారణ ప్రారంభించారు. ఇదిక్కడ పరి

పాతే. ఆరోజు పొద్దుట ఎనిమిది గంటలనించే న్యాయస్థానం క్రిక్కిరిసిపోయిఉంది. అక్కడొకమూల కొంత చీకటిలో డజన్ల కొద్దీ ముద్దాయిలు నిలబడి ఉన్నారు. వారిలో స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు కూడా ఉన్నారు. వీరందరూ నేరవిచారణ చూసి విని ఆనందించడానికి వచ్చినవారే. క్లాడ్ ఫ్రొలో తమ్ముడు జెహాన్ ఫ్రొలో కూడా ఇక్కడికి చేరాడు. సభికీ, న్యాయమూర్తులూ కూర్చునే ఎత్తైన వేదికకీ మధ్య అయిదమనుల కర్రగోడ ఒకటి అడ్డుంది. న్యాయమూర్తుల ఆవరణలో గుమాస్తాలున్నారు. వారిలో ఒకడు తొందరతొందరగా ఏదో వ్రాసేస్తున్నాడు. రాబర్ట్ కూర్చునే పెద్ద కుర్చీ ఒక్కటిమాత్రం ఖాళీగా ఉంది. అక్కడున్న న్యాయాధికారుల్లో మాస్టర్ ఫ్లారియన్ ముఖ్యుడు. ఈయన రాబర్ట్‌కి కుడిచెయ్యివంటివాడు.

ఫ్లారియన్ బధిరుడు. అతని ఉద్యోగానికిది చిక్కు. అయినా అప్పీలు లేని తీర్పులిచ్చేస్తాడు ఫ్లారియన్. వింటున్నట్లు కనపడితే చాలు, న్యాయవిచారణ సాగిపోతుంది. ఫ్లారియన్ అమిత శ్రద్ధతో వింటున్నట్లు నటించేవాడు—ఏ సద్దూ అతడి ఏకాగ్రతను భంగ పరచడం అసంభవం కాబట్టి.

పక్కనున్న మరొక న్యాయమూర్తిని చూసి ఫ్లారియన్ ఇకిలించాడు: "ఇవాళ ఇద్దరు పెద్దమనుషులు కూడా బికార్లలో కలిశారే! ఓ! జూదమాడుతున్నారు కాబోలు. రాజుగారికి నూరు నాణేలొస్తాయి! ఫరవాలేదు. క్లాడ్ తమ్ముడొచ్చాడు. రాకుండా మానడులే. ఈమాటు ఆడవాళ్ళు కూడా చాలామందే ఉన్నారు. చూసిన మొహాలే! వీళ్ళందరికీ ఇదొరకం పండగ. మూర్ఖాగ్రేసరుడు కూడా వచ్చాడు. బాగుంది. ఇప్పుడు సభ నిండుగా ఉంది."

నిజంగానే క్వాసిమోడోని పట్టి తీసుకొచ్చారు. అతన్ని చేతులంటగట్టి పగ్గాలతో కట్టేశారు. క్వాసిమోడో కదలకుండా మెదలకుండా ఊరుకున్నాడు. అప్పుడప్పుడతని ఒంటికన్నులో రోషం కనపడుతోంది. క్వాసిమోడో పైన దోషారోపణకి సంబంధించిన కాగితాలు తీసి చూశాడు ఫ్లారియన్. నేరవిచారణకు ముందు ఫ్లారియన్ పత్రాలు పరిశీలించి జాగ్రత్తపడేవాడు. తన ప్రశ్నలకి ఎలాంటి జవాబులొస్తాయో ముందే ఊహించుకుని నేవాడు.

వీలైనంతవరకూ తన చెవుడు బయటపడకుండా నిర్వహించేవాడు. ఎప్పుడైనా అసందర్భం జరిగినా, అది న్యాయమూర్తి సూక్ష్మ బుద్ధికీ, పరేంగితజ్ఞానానికీ నిదర్శనం అనుకునేవారు. లేదా వార్ధక్యం అనుకునేవారు. మొత్తానికి తనకిగల లోపాన్ని ఇతరులకు తెలియకుండా కప్పిపుచ్చుకో గలిగానని పూర్తిగా నమ్మేవాడు.

పత్రాలన్నీ పరిశీలించిన తరవాత కుర్చీలో వెనక్కి చేరబడి కళ్ళు సగం మూసుకున్నాడు. నిష్పక్షపాతబుద్ధితో శ్రద్ధగా ఆలోచిస్తున్నట్లు కనపడ్డాడు. చెవుడుతోపాటు గుడ్డితనంకూడా అవసరమున్నట్టు కళ్ళు మూసుకున్నాడు—రెండూ ఉంటేకాని న్యాయ నిర్ణేత కాలేడని కాబోలు! సరిగ్గా అలాగే ఉండి ముద్దాయిని ప్రశ్నించడం ప్రారంభించాడు.

"నీ పేరు?

ఇక్కడో పెద్ద చిక్కొచ్చింది; ఇటువంటి చిక్కులో ఏం చెయ్యాలో న్యాయశాసనం ఏమీ చెప్పలేదు. ఒక చెవిటివాడు మరొక చెవిటివాణ్ని ప్రశ్నిస్తున్నాడు.

అసలే చెవిటివాడైన క్వాసిమోడోకి ప్రశ్న వేసినట్లే తెలియలేదు. అందువల్ల న్యాయమూర్తివంక నిదానంగా చూస్తూ ఉండిపోయాడు. ముద్దాయి చెవిటివాడని తెలియని న్యాయమూర్తి తన ప్రశ్నకి సమాధానం వచ్చిందని ఊహించి తన పని మామూలుగానే కొనసాగించాడు.

"ఓహో! అయితే నీ వయస్సు?"

క్వాసిమోడో అదేమాదిరిగా మౌనంగా ఊరుకున్నాడు. మళ్ళీ సమాధానం ఇచ్చాడను ఊహించుకుని న్యాయమూర్తి మళ్ళీ ప్రశ్నించాడు.

"నీ వృత్తేమిటి?"

ఈ తంతు చూస్తున్న సభాసదులు గుసగుసలు మొదలెట్టారు. ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

"అది చాలు" అన్నాడు ఫ్లొరియన్. అని ఇలా మొదలు పెట్టాడు:

"నీమీద మోపబడిన నేరాలు ఏమిటంటే: రాత్రివేళ వీధిలో అల్లరిచేశావు; దురాచారి అయిన ఒక స్త్రీని బలాత్క

రించడానికి ప్రయత్నించావు; తరవాత రక్షకభటుల్ని ఎదిరించి రాజకార్యాన్ని నిరోధించావు. ఈ ఆరోపణలకి నువ్వేం సంజాయిషీ చెప్పకుంటావ్ ?"

గుమాస్తావంక తిరిగి న్యాయమూర్తి ఇలా అన్నాడు:

"ఇంతవరకూ వాడు చెప్పిన జవాబులన్నీ రాసుకున్నావా?"

ఈ ప్రశ్నతో సభలో అందరూ పగలబడి నవ్వారు. గుమాస్తా కూడా అపుకోలేక నవ్వేశాడు. సభలో అందరూ ఏకమై నవ్వినందువల్ల చెవిటివాళ్లిద్దరికీ ఈసారి ఈ నవ్వులు వినపడ్డాయి. నవ్వుల్ని లక్ష్యపెట్టనట్లు క్వాసిమోడో భుజా లెగరేసి ముఖం పక్కకి తిప్పకున్నాడు. ఫ్లారియన్ ఆశ్చర్యపడ్డాడు. ముద్దాయి భుజాలెగరెయ్యడంకూడా గమనించాడు. ముద్దాయి ఏదో తుంటరి జవాబిచ్చి ఉంటాడని ఊహించుకున్నాడు. కొంచెం కోపం తెచ్చుకుని ముద్దాయిని మందలించాడు.

"అటువంటి జవాబిచ్చినందుకు నిన్ను కొరత వేయించవచ్చునని తెలుసా? నువ్వెవరితో మాట్లాడుతున్నావో తెలుసా?"

దీనితో మరింత విరగబడి నవ్వడం మొదలుపెట్టారు జనం. సార్జెంట్లు, గుమాస్తాకూడా నవ్వాపుకోలేకపోయారు. నవ్వకుండా ఉన్నవాడు క్వాసిమోడో ఒక్కడే. ఏం జరుగుతోందో అతనికి తెలియదు. ఫ్లారియన్‌కి కోపం వచ్చింది. ముద్దాయిని గట్టిగా బెదిరిస్తేగాని తుంటరిమాటలు మానడనుకుని ఇలా అన్నాడు:

"న్యాయమూర్తిని న్యాయసభలోనే అవమానించడానికి నీ కింత సాహసం ఎలావచ్చిందిరా? జీతం బత్తెం లేకపోయినా న్యాయసంరక్షణకోసం మహారాజు ఆజ్ఞప్రకారం న్యాయం నిర్వహిస్తున్నానని తెలియదూ? నువ్వెవరితో మాట్లాడుతున్నావో ఒళ్లు తెలియకుండా......"

ఫ్లారియన్ వాగ్ధాటి ఎంతదూరం పోయేదో తెలియదు కాని ఇంక సభాసదులు భరించలేకపోయారు. అంతలోనే సభఅంతటా అకస్మాత్తుగా నిశ్శబ్దం వ్యాపించింది. వెనుక తలుపు తెరుచుకుంది. ప్రధాన న్యాయాధికారి రాబర్ట్ ప్రవేశించాడు. ఫ్లారియన్ లేచి నిలబడి అభివాదంచేశాడు; చేసి నిలబడే కోపంతో ఇలా

అన్నాడు: "న్యాయస్థానంలో మర్యాదగా ప్రవర్తించనందుకు పీడికి కఠినశిక్ష విధించి తీరాలండి."

గుక్క తిప్పుకుని వెంటనే కూచున్నాడు ఫ్లొరియన్. నుదుటిపై చెమట తుడుచుకున్నాడు. రాబర్ట్ కోపంతో ముద్దాయిని చూశాడు.

"నీ నేర మేమిటి?" అని ప్రశ్నించాడు రాబర్ట్.

ఈమారు క్వాసిమోడో తన పేరో న్యాయమూర్తి ప్రశ్నిస్తున్నాడని గ్రహించాడు. అది తన పేరై ఉంటుందని ఊహించుకుని బొంగురు గొంతుకతో జవాబిచ్చాడు.

"నా పేరు క్వాసిమోడో."

ఆ ప్రశ్నకి ఈ జవాబు విని అందరూ మళ్ళీ నవ్వారు. రాబర్ట్ కోపం మితిమీరింది.

"నాతో కూడా పరియాచక మాడుతున్నావురా?" అని ఉరిమాడు.

"నాటర్ డామ్ చర్చిలో గంట వాయించేవాణ్ని" అన్నాడు క్వాసిమోడో. రెండో ప్రశ్న ఇందుకే ననుకున్నాడు.

రాబర్ట్ పొద్దుటినుంచీ చికాగ్గా ఉన్నాడని మొదటే చెప్పబడింది.

"నీ వీపు గంటలా మోగేలా చేస్తాను తెలుసా? నీ తుంటరితనానికి బుద్ధి చెప్పగలను జాగ్రత్త! వినపడుతోందా?"

"నా వయస్సా?" అన్నాడు క్వాసిమోడో. "కొద్దిరోజుల్లో ఇరవై యేళ్లు నిండుతాయి."

రాబర్ట్ కి ఓపిక నశించింది. "ఆ! నన్నే ఎదిరిస్తున్నావా? ఉండు నీ పని చెప్తా. వీణ్ని తీసుకుపోయి గ్రీవ్ చౌకులో గంటసేపు కొఱత వెయ్యండి. ముందు కొరడాలతో కొట్టి తరవాత గంటసెపు కొఱత వెయ్యండి. పారిస్ అంతా చాటించి అందరి సమక్షంలో ఈ తుంటరిని హింసించండి" అని ఆజ్ఞాపించాడు. గుమాస్తా పరపర వ్రాసిపారేశాడు.

"బలే! బలే శిక్ష వేశారు" అన్నాడు జెహాన్ ఫ్రొల్లొ సభలోనుంచి.

క్వాసిమోడో నేరానికి విచారణ ముగిసింది. శిక్ష విధించ

బడింది. ఆ రోజుల్లో శిక్ష విధించడానికి న్యాయశాసనాలాట్టే ఉపకరించేవి కావు. అందువల్ల నేరం విచారించి తీర్పు ఇచ్చి శిక్షలు విధించడం సులువుగా ఉండేది. నేరస్థుల్ని తిన్నగా కొఱతకో, చక్రానికో, ఉరిస్తంభానికో పంపించేవారు. ఏ శిక్ష పడుతుందో ఊరందరికీ ముందే తెలిసేది.

గుమాస్తా కాగితం న్యాయమూర్తికిచ్చాడు. న్యాయమూర్తి ముద్రవేశాడు. లేచి మిగతా న్యాయమూర్తుల పని తనిఖీ చెయ్యడానికి వెళ్ళిపోయాడు. క్వాసిమోడో విరిస్తభావంతో అంతా చూస్తున్నాడు.

పత్రం తీసుకుని ఫ్లారియాన్ పరిశీలించ నారంభించాడు. గుమాస్తాకి ముద్దాయిపట్ల జాలి కలిగింది. మెల్లిగా లేచి న్యాయమూర్తి చెవిలో అన్నాడు: "పాపం! వాడు చెవిటివాడు."

లోపం యిద్దరికీ ఒకటే కాబట్టి ఫ్లారియాన్ దయ తల్చగలడని గుమాస్తా భావించాడు. అసలు గుమాస్తా చెప్పిన మాటల్లో ఒక్క అక్షరం వినపడలేదు. అయినా విన్నట్లు నటించి "ఓ! అల్లాగా! నాకు తెలియలేదు. అయితే ఇంకో గంటసేపు వీపు పెట్లగొట్టమందాం." అంటూ పత్రంమీద తగు మార్పుచేసి సంతకం పెట్టేశాడు.

# 17

ఉదయం పదిగంటలయింది. గ్రీవ్ చౌకు మాస్తే పండుగ గడిచిన మరుచటి రోజని తేటపడుతుంది. వీధులనిండా బాణసంచా కాల్చగా మిగిలిన ముక్కలు, కర్రముక్కలు, రాళ్ళు, చెత్త, చెదారం విరజిమ్మినట్లుంది. కొందరా చెత్త తన్నుకుంటూ నడుస్తున్నారు; కొందరు తప్పుకొనడానికి ప్రయత్నిస్తున్నారు, అంగళ్లు తెరిచారు; వ్యాపారం సాగుతోంది. అక్కడక్కడ కొందరు రాత్రి జరిగిన విశేషాలు చెప్పుకుంటున్నారు.

చౌకుమధ్యలో ఇనపచక్రం, కొఱత, ఉరిస్తంభం ఉన్నాయి. కొఱతదగ్గర గుర్రాలెక్కిన నలుగురు సార్జెంట్లు కాపుదల చెయ్యడంచూసి జనం పోగుబడ్డం ప్రారంభించారు.

సార్జెంట్లు కాపువేశారంటే కొంతలో, ఉరో ఏదో ఒక వినోదం ఉంటుందని ప్రజలకు తెలుసును.

గ్రీవ్ చౌకులో నిలబడి పశ్చిమానికి మాస్తే రోలండ్స్ టవర్ కనపడుతుంది. అక్కడ ముందుభాగంలో గూడు అమర్చి, అందులో పెద్ద బైబిల్ పుస్తకం ఒకటుంచారు. గూడుముందు ఇనపగుంజలు పాతి ఉంచారు. పుస్తకాన్ని ఎవరూ దొంగిలించకుండా రాతి తిన్నెపై ఒక గొలుసుతో బంధించారు. ఇనపగుంజల మధ్యనుంచి చేతులు జొనిపి పుస్తకం పేజీలు తిప్పడానికి మాత్రం వీలుంటుంది. రాత్రి వేళకూడా చదవడానికి వీలుగా లోపల దీపాలు పెడతారు. ఈ గూడుప్రక్కనే ఒక చిన్న కిటికీ ఉంది. ఈ కిటికీకి రెండే ఇనపఊచలున్నాయి. ద్వారమైనా లేని అక్కడి కూపానికి కిటికీకంటే గాలి వెలుగుల కాధారం.

మత యుద్ధాలలో తండ్రి మృతిచెందగా జీవితంపైన రోతపుట్టి మేడామ్ రోలండ్ ఈ టవర్‌లో గోడ పడగొట్టించి అంధకార కూపాన్ని నిర్మింపచేసింది. తనకుగల సర్వస్వాన్నీ బీదలకూ భగవత్కార్యాలకూ సమర్పించి ఈ కూపంలో తనను తాను నిర్బంధించుకుంది. వెనుక ద్వారం ఉన్నచోటు రాళ్లతో పూడ్పించింది. తండ్రి ఆత్మశాంతికోసం రాత్రింబగళ్లు దైవధ్యానం చేస్తూ ఈ కూపంలోనే గడిపింది. కటికరాళ్లపైనే నిద్రిస్తూ నల్లని నారదుస్తులు ధరించి, దారినపోయేవారు దయతలిచి ఇస్తే రొట్టె, నీళ్ళుమాత్రం పుచ్చుకుంటూ ఇరవైయేళ్లు ఈ కూపంలో క్రుంగిపోయి చివరకు ఇక్కడే మృత్యువు నాలింగనం చేసుకుంది. తన అనంతరం తనవలె జీవితంపైన విరక్తి జుగుప్సపొందిన స్త్రీల కఠోర దీక్షకు ఈ కూపం వినియోగపడాలని ఆమె నిర్ణయించింది. పేదలు బికారులు ఆమె జ్ఞప్తికి వచ్చినప్పుడు కంటతడి పెడతారు. ఉన్నత మతాధికారుల ప్రాపులేకపోబట్టి కాని లేకపోతే ఆమె సెయింట్‌గా చరిత్రకెక్కేది. ఆమె స్మృత్యర్థం పారిస్ అధికారులు ప్రక్కనే గూడుకట్టి అందరూ చదవడానికి ప్రార్థించడానికి వీలుగా బైబిల్ నెలకొల్పారు.

మధ్య యుగాలలో ఇటువంటి సమాధులు అరుదుకావు. జనసమ్మర్దంకల ప్రదేశాలలో ఇటువంటివే సమాధులు నిర్మించుకుని ప్రాయశ్చిత్తం చేసుకునేవాళ్ళు విరాగులు, స్త్రీలు, పురుషులు

కఠోరదీక్ష పూనేవారు. కొందరికి గృహజీవితంనుంచి గోరీకి ఈ సమాధి మధ్య మజిలీ అన్నమాట. మానవసమాజంనుంచి విడివడి ఇక్కడికి చేరినవారు దాదాపు చనిపోయినవారితో సమానులు. తైలం హరించిపోతున్నకొద్దీ తమస్సులోకి అంతర్ధానం కావడానికి కొనుకూక్కుతున్న దీపాలవలె ఈ సమాధులలో నిర్భాగ్యులు మృత్యువుకోసం ఎదురుచూస్తూ ఉండేవారు. సమాధిగతజీవి దృష్టి పరలోకంవైపే ఉండేది. ఆ కన్నులలో మరో లోకాల వెలుగు చీకట్లో కనపడేవి. ఆ పంజరంనుంచి విడివడ్డంకోసం ప్రాణి గిజగిజ లాడేది. ఆ ఆత్మకు శరీరం చెరసాల, ఆ శరీరానికి సమాధి చెర సాల. ఆ పంజరానికీ, ఆ కటికరాళ్ళకూ మధ్యపడి నలిగే ప్రాణి విముక్తికోసం ఆక్రోశించేది. ఆ వ్యక్తుల బాధలేవో తెలుసుకోడం కాని వారిపట్ల జాలికాని ఆనాటి ప్రజలకు అనవసరం. వారిని మాత్రం అతిపవిత్రులని ఎంచి పూజించి, వారికోసం ప్రజలు భక్తిభావంతో దైవాన్ని ప్రార్థించేవారు. ఆనాటి దైవభక్తి భావంలో దాక్షిణ్యభావానికి చోటులేదు. దర్శనార్థం వచ్చే యాత్రికులకు సమాధిలోని వ్యక్తికి జీవితంమైన ఎందుకు రోత పుట్టిందో, ఆ బాధ లేమిటో తెలుసుకోవాలనే జిజ్ఞాస ఉండేది కాదు; చూసి దైవాన్ని ప్రార్థించి దీక్షాగతికి ఆశ్చర్యపడి ఊరుకునేవారు. ఆరోజుల కింకా సైన్సుకోసం మైక్రోస్కోప్, తత్త్వ జిజ్ఞాసకోసం తత్త్వశాస్త్రం తయారుకాలేదు.

పారిస్‌లో ఇటువంటి సమాధులు ఆనాటికి చాలానే ఉండేవి. సమాధులు ఎక్కడైనా ఖాళీపడి పశ్చాత్తప్తులు, విరాగులు దొరక్కపోతే చర్చి ఊరుకునేది కాదు. ఎవరూ దొరక్కపోతే కుష్ఠురోగుల్ని తీసుకువచ్చి ఉంచేవారు.

రోలండ్స్ టవర్ సమాధి నిర్మించబడిన మూడు వందల యేళ్లనుంచీ ఎన్నడూ ఖాళీగా ఉంచలేదు. ఇప్పుడు (కథా కాలం నాటికి) సమాధిలో శల్యావశిష్ట అయిన ఒక స్త్రీ ఉంది.

గ్రీవ్ చౌకులోకి వెడుతూ ముగ్గురు స్త్రీలు సమాధి దగ్గర పడు గానే ఆమెనుగురించే మాట్లాడుకుంటున్నారు. వీరిలో యిద్దరు పారిస్ నగరవాసులు; ఒకామె కొత్తగా పారిస్ వచ్చింది. ఈమె చెయ్యిపట్టుకుని ఒక బాలుడున్నాడు. అతనిచేతిలో పెద్ద రొట్టె ముక్క ఉంది. తల్లి మనస్సు ప్రసంగంలో మగ్నమైవుంటే కొడుకు

రొట్టెముక్కని తదేకదృష్టితో గమనిస్తున్నాడు. రొట్టె కొరికెయ్యాలని అతని కెంతో కోరికుంది కాని కొరక్కుండా దానివంక చూస్తూ ఊరుకున్నాడు.

"ఆలస్యమైపోతోందే! త్వరగా నడవాలి మనం."

"పరవాలేదు. రెండుగంటలసేపు కోఅతలో ఉంటాములే. నువ్వెప్పుడేనా కోఅతెనెయ్యడం చూశావా?"

"చూశాను...రీమ్సులో"

"అబ్బే! అక్కడ అదీ ఓ కోఅతేనా?"

"ఏం? పెద్దపెద్ద వాళ్లనుకోఅతేశా రక్కడ. నేను చూశాను. ఒకడు అమ్మనీ నాన్ననీకూడా చంపాట్ట, వాణ్ణి కోఅతెనెయ్యడం నేను స్వయంగా చూశాను."

"అయినా అది పారిస్‌లో మాదిరిగా ఎల్లావుంటుందిలే."

"అదేవిటో? చౌకు అవతల వంతెనమీద? అంతమంది జనం మూగా రెందుకో అక్కడ?"

"తంబుర వినపడ్డంలేదూ? ఎమరాల్డా వచ్చిఉంటుంది. దాని దగ్గిర మేకపిల్ల బలే అభినయం చేస్తుంది. వెళ్లి చూద్దామా?"

"ఎవరో?"

"జిప్సీజాతి."

"ఆ!" అంటూ కొత్తగావచ్చినామె కొడుకుని దగ్గరకు లాక్కుంది భయంతో. "వొద్దొద్దు. అక్కడికి వెళ్ళకు. జిప్సీలు పిల్లల్నెత్తుకునిపోతారు." ఆమె ఇంక కదలకుండా దారి మధ్యలో ఆగిపోయింది.

పారిస్ వనిత లిద్దరూ తెల్లబోయారు. తరవాత నవ్వేశారు. "ఛ! వాళ్ళు పిల్లల్నెత్తుకుపోవడ మేమిటి? ఎక్కడా వినలేదు." అంది ఒకామె.

ఇంకొకామె ఆలోచించింది. "చిత్రం! సిస్టర్ గిల్లా కూడా ఇలాగే అంటుంది సుమా!"

"సిస్టర్ గిల్లా ఎవరు?"

"తెలీదూ? అదుగో అక్కడ చూడు. ఆ సమాధిలో ఉంటుంది, ఆవిడ."

"మనం రొట్టి తీసుకెళ్లేది ఆవిడకోసమే కాదూ?"

"ఆవిడే. తంబుర పట్టుకు తిరుగుతూ జోస్యం చెప్తానంటారు. ఆ జిప్సీల్ని చూస్తే ఆమెకి తగని కోపం. అయితే నీకూడా ఎందుకొచ్చిందా భయం."

రీమ్స్‌నించి వచ్చినవనిత కొడుకుని దగ్గరకు తీసుకుని ఇలా అంది "రీమ్స్‌లో అటువంటి దొకటి జరిగింది."

"ఏం జరిగింది?"

"పారిస్‌లో ఉన్నారు, మీకు తెలియదూ?"

"చెప్పేం జరిగిందో, వడుస్తూ ఉందాం."

"ఆమెకి సరిగ్గా నా యీడే ఉండేది. పేరు పాక్వెత్ శాంటెఫ్లూరీ. చిన్నతనంలో తండ్రిపోతే తల్లే కష్టపడి పెంచేది. కాని తల్లి గారాబం చేసింది. చాల చక్కగా ఉండేది. కాని తెగ నవ్వేది, అంతగా నవ్వితే చేటుని తెలియదు. అసలు పళ్ళు కనపడితే కళ్ళు మెరవ్వట. తెలివితక్కువది. ఇట్టే పాడయింది. భాగ్యవంతుణ్ని పెళ్ళాడాలని ప్రయత్నించేది. దాని అందం చూసి స్నేహం చేసేవాళ్లేకాని పెళ్లిచేసుకు నేవాళ్లు మాత్రం కనపడలేదు. పెళ్ళికాక పిచ్చెత్తినట్టుండేది. చివరికి పెళ్ళి కాకుండానే ఒక ఆడపిల్ల పుట్టింది. సరిగ్గా ఇది జరిగి ఇప్పటికి పదహారేళ్ళవుతుంది. తల్లి చచ్చిపోయింది కాబట్టి బాధ పడేవాళ్లు లేరు. ఆమె పుట్టిన కూతుర్ని చూసుకుని మురిసిపోయేది. ఆ కూతురు తప్ప ఆమె కింక లోకంలో నా అనేవాళ్లెవరూ లేరు. పాపం! అందరూ తిట్టేవాళ్ళు. మొహంమీద ఉమ్మేసేవాళ్లు. తనకి తినడానికి తిండి లేకపోయినా కూతుర్ని అతి ముద్దుగా పెంచుకునేది. ఎప్పుడూ తన పేదరికానికీ పతనానికీ ఏడుస్తూ బిడ్డని గుండెలకి హత్తుకుని ముద్దులు పెట్టుకుంటూ వుండేది. కొందరు ఆమె పిచ్చి దనుకునేవాళ్లు. ఇంక దారిద్ర్యం భరించలేక పడుపు వృత్తితో డబ్బు సంపాదించి బిడ్డని పెంచుకునేది. బిడ్డకి ఏ లోటూ రాకుండా విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెట్టేది. కూతురుకి ఏగ్నిస్ అని పేరు పెట్టుకుంది. శాటిన్ గుడ్డలు తప్ప మరేవీ తొడిగించేది కాదు. బంగారు వగిషీఉన్న బుల్లివి మెత్తని గులాబిరంగు బూట్లు తొడిగించేది. అలాంటి బూట్లు నే నెప్పుడూ చూడలేదు.

రాజుల ఇళ్లల్లో కూడా పిల్లలంత సుకుమారంగా పెరగరు. అలా పెంచేది. పిల్ల పాదాలు మరీ చిన్నవిగా ముద్దొస్తూ ఉండేవి. చూస్తే గాని అంత చిన్నవని నమ్మడం కష్టం. అందుకోసం ఆ బూట్లు స్వయంగా కుట్టిందిట. ఏగ్నెస్‌ని ఏడాది నిండాక చూశాను. అబ్బ! ఎంత చక్కగా ఉండేదనుకున్నారు! మాటల్లో చెప్పలేను. మాతికన్న కళ్లు పెద్దవనుకో. చక్కని నల్లటి జుట్టు ఉంగరాలు తిరిగి ఉండేది. పిల్ల పెరుగుతున్న కొద్దీ తల్లి ఆపేక్ష పెరిగిపోయింది. ఎప్పుడూ ఆ బుల్లిపాదాలు ముద్దు పెట్టుకుంటూ ఉండేది.

"ఒక రోజుని జిప్సీలు తండాలు తండాలుగా వచ్చారు అవూరు. చెయ్యిచూసి జోస్యం చెప్పి డబ్బు పుచ్చుకునేవాళ్ళు. చూస్తే భయంకరంగా ఉండేవాళ్ళు. వాళ్ళు పిల్లల్నెత్తుకుపోతారనీ, జేబులు కొట్టేస్తారనీ, దోపిడి జరుపుతారనీ, మనుషుల్ని చంపి మాంసం తింటారనీ పుకార్లు పుట్టాయి వాళ్ల దగ్గరకు వెళ్లద్దని పెద్దవాళ్లు చిన్నవాళ్లని కోప్పడేవాళ్లు. కాని మళ్ళీ పెద్దవాళ్లే వెళ్లి చేతులు చూపించుకునేవాళ్లు. 'నీ కొడుకు రాజవుతాడు, గొప్ప మతాధికారి అవుతాడు, పెద్దపేరు తెచ్చుకుంటాడు' ఇల్లా జోస్యం చెప్పేవాళ్లు జిప్సీలు. పాపం శాంటె ఫ్లూరీకూడా కూతుర్ని తీసుకెళ్లి చెయ్యి చూపెంచింది. జిప్సీలు ఆ పిల్ల అందం చూసి ఆశ్చర్యపోయారు. పిల్లని చూసి మెచ్చుకుని మహారాణి అవుతుందని చెప్పారట. దాంతో తల్లి ఉబ్బి తబ్బిబ్బైపోయి ఇంటికెళ్లింది. మర్నాడు పొద్దుని పిల్లకి పాలనిండా పాలుపోసి నిద్రపోగొట్టి, పిల్ల అదృష్టాన్ని నలుగురితో చెప్పుకోవాలని తొందరలో తలుపువెయ్యడం మర్చిపోయి పొరుగింటికెళ్లింది. మళ్ళీ తిరిగొచ్చేసరికి పక్కలో పిల్ల లేదు. బూట్లజతలో ఒక్కటి మాత్రం పక్కకింద పడివుంది. పాపం ఇంక ఆ తల్లిగోల చెప్పలేను. జుట్టు పీక్కుని ఏడుస్తూ మొత్తుకుంటూ వీధిని పడింది. ఇరుగూ పొరుగూ చంటిపిల్లమీద మక్కువ కొద్దీ ఊరంతా గాలించారు. తల్లి ఆరోజు ఊళ్ళో తిరగని చోటు లేదు, వెతకని మూల లేదు. ఎవరు కనపడితే వాళ్లని నిలేసి 'నా కూతురు కనపడిందా' అని అడిగేది. అంత చక్కనిదీ ప్రేరిభాషతో ఒక్క పూటలో పూర్తిగా రూపు మాసిపోయినట్లయింది. ఆమె ఏడుపు వింటే అందరికీ కడుపు తరుక్కుపోయింది. 'నా పిల్లని నాకు తెచ్చిపెట్టండి. మీ యింట్లో దాసిగా ఉండి

పోతాను. మీరేం చెప్పినా ఏం చేసినా ఒప్పుకుంటాను' అని అందర్నీ వేడుకుంది. ఆ సాయంకాలం ఎవరో చెప్పారు ఒక చక్కని ఆడపిల్లని జిప్సీలు తీసుకెళ్లడం చూసినట్టు.

రాత్రి ఇంటికి వచ్చింది ఏడుస్తూ. ఇంటిదగ్గర కొచ్చేసరికి ఇంటిలోనించి ఏడుపు వినపడింది. తల్లీ మరికొందరూ కలిసి అదరా బాదరా పరుగెత్తి చూశారు. ఆశ్చర్యం! ఒంటికన్నుతో, గూనితో వికృతంగా ఉన్న ఒక పసిపిల్లాడున్నాడు పక్కలో. తన కూతుర్ని మంత్రించి ఇల్లా చేశారని తల నేలకొట్టుకుని ఏడ్చింది తల్లి. తల్లికి పిచ్చెక్కిపోతుందని భయపడి పక్కవాళ్లు ఆ పసిపిల్లాణ్ని తీసుకుపోయారు. ఇంక తల్లి మిగిలిన ఆ ఒక్క బూటూ తీసుకుని ముద్దుపెట్టుకుంటూ ఒకటే ఏడుపు. ఆ రోజుని ఆ ఊళ్లో కంట తడిపెట్టనివాళ్ళు లేరంటే నమ్మి.

"ఉన్నట్టుండి అకస్మాత్తుగా లేచింది. లేచి జిప్సీలు మకాం చేసిన చోటుకి పరుగెత్తింది. ఆమెవెంట కొందరు వెళ్ళారు. కాని ఏం లాభం! అప్పటికే జిప్సీలు మకాం ఎత్తేసి ఎటో వెళ్లిపోయారు. వాళ్ళు పిల్లను చంపి తినేశారని కొందరనుకున్నారు."

"తరవాతేమైంది?"

"ఏమో! మళ్ళీ ఆ తల్లి కనపడలేదు. చచ్చిపోయిందని కొందరంటారు. కొందరు కాలినడకని పారిస్ వచ్చిందంటారు. ఏది నిజమో ఎవరికీ తెలియదు."

"మరి ఆ పిల్లాడు?"

"పారిస్ పంపించారని విన్నాను. నాటర్ డామ్ చర్చిలో విడిచిపెట్టారట. ఆతరవాత ఏమయిందో తెలియదు."

ముగ్గురూ తరవాత మౌనంగా నడక సాగించారు. ఆలోచనలోపడి రోలండ్స్ టవర్ దాటి చౌకు సమీపించారు.

అక్కడ కొఅలిదగ్గర చేరిన గుంపు చూశారు. సమాధిమాట మరిచిపోయారు. కాని పిల్లవాడికే అంతర్వాణి చెప్పిందో తెలియదు. "అమ్మా! ఇంక నేను తినచ్చా ఈ రొట్టె?" అని అడిగాడు. కాని వాడు తొందరపడ్డాడు. ఇల్లు చేరిందాకా ఊరుకునివుంటే రొట్టె వాడికే దక్కేది. ఇప్పుడు తల్లికి జ్ఞాపకం వచ్చింది.

"అరె! మరిచిపోయాం. ఏదీ ఆ సమాధి చూపించు. రొట్టె ఇచ్చేసివద్దాం" అంది వాడి తల్లి పారిస్ వనితల్లో.

"అవునవును. నడవండి" అని అందరూ వెనక్కి తిరిగారు. సమాధివద్దకు చేరారు.

ముందు ఒకామె కిటికీలోనుంచి తొంగిచూసింది. చూడ గానే ఆమె ముఖంలో జాలి, వ్యధ వ్యక్తమైనాయి. మిగిలిన యిద్దరూ నిశ్శబ్దంగా లోనికి చూశారు.

పట్టపగలే మసకచీకటి ఆవరించివున్న ఆ కూపం చాల చిన్నది. రాళ్ళతో కప్పబడిన నేల. ఒకమూల ఒకామె కూర్చొని ఉంది. చేతులతో మోకాళ్ళను చుట్టికూచుని, మోకాళ్ళపై గడ్డమానించి ఎదురుగా మరొక మూలవంక నిశ్చలంగా చూస్తోంది. తెల్లగా పండిపోయిన జుట్టు చీదరగా చుట్టూ వేలాడుతోంది. నిశ్వాసమైనా విడుస్తున్నట్లు కనపడదు. చలనంలేని ఆ వ్యక్తిని చూస్తే బ్రతికి ఉందనుకోడం కష్టం. ఆ కనుచీకటిలో స్పష్టంగా లేని ఆ ఆకారాన్ని చూస్తే, అది నిజమో, కలో తెలియదు.

ఆ రాళ్లమధ్య అతుక్కుపోయినట్లున్న ఈ ఆకారానికి చలనం కాదుకదా నిశ్వాసంకాని స్మృతి చైతన్యంకాని లేవనిపి స్తుంది. భయంకరమైన ఈ శీతల వాతావరణంలో కూడా చేతులకు కాళ్లకు రక్షణలేదు. ఉన్న ఒక్క కిటికీలోనుంచి చలిగాలి విసుర్లు తప్ప సూర్యకాంతి ప్రవేశించదు. కనురెప్ప వాల్చని ఆమె శిలా ప్రతిమ అని తోచక మానదు. ఆమె దృష్టిని ఆ గదిలో ఒక మూల కేంద్రీకరించింది. కనురెప్పలు వాల్చడంలేదు. ఆ మూల ఏముందో కిటికీ ఇవతలనుంచి చూసేవారికి కనపడదు. రీమ్స్ వనిత ఏదో అనబోయింది. కాని మిగిలిన ఇద్దరూ వారించారు. "ప్రార్థ నలో ఉంది. మాట్లాడకూడదు." అంది ఒకామె.

రీమ్స్‌నించి వచ్చిన వనిత ఏదో తెలియని ఆందోళనతో పరిశీలించసాగింది. "చాల చిత్రంగాఉందే!" అంది.

"ఏమిటి చూస్తోంది?" అని మళ్ళీ అడిగింది. మిగిలిన ఇద్దరూ తప్పుకున్నారు. ఆమె ముందుకువచ్చి కిటికీఊచలమధ్య పీకై నంతవరకు తల దూర్చి ఆ మూల చూసింది. చూడగానే ఆమె

ముఖం ఎర్రబడిపోయింది. పెదవులు కదులుతున్నాయి. కాని నోట మాట రాలేదు. చివరికి ఇలా అంది.

"ఆమె పేరేమిటి?"

"సిస్టర్ గ్వెర్లా."

"కాదు. ఆమె పాక్వెత్ శాంటిఫ్లూరీ."

అందరూ విభ్రాంతులైనారు. రీమ్స్ వనిత పేలితో లోపల ఆ మూల చూపింది. ఇద్దరూ ఒకరి తరవాత ఒకరు ఊచలలో తలదూర్చి ఆమూల చూశారు. ముగ్గురూ నిర్ఘాంతపోయారు. ఆ మూల ఉన్నది గులాబీరంగు బుల్లి బూటు. రంగు కొంత మాసింది.

ముగ్గురూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. ఆమె మాత్రం వీరి ముగ్గురి ఉనికే ఇంతవరకూ కనిపెట్టనే లేదు.

కొంతసేపు ముగ్గురూ మౌనంగా ఉండిపోయారు. తరవాత ఒకామె అతి జాలిగా పిలిచింది: "సిస్టర్ గ్వెర్లా, సిస్టర్"

కాని సిస్టర్ పలకలేదు. ఆమెకి వినపడలేదు. మరొకామె పిలిచింది. మూడోసారి పిలిచింది. కాని సిస్టర్ గ్వెర్లా మేలుకో లేదు.

"చెవుడు కాబోలు"

"గుడ్డిదేమో!"

"అసలు బతికివుందా?"

ఆమె చచ్చిపోలేదు. కాని ఆమె స్మృతి ఎక్కడో ఏ చీకటి మూలనో దాగింది. ఆ చీకటిలోనికాని ఆమె బహిరింద్రియాలు స్పృశించలేవు.

"ఏంచెయ్యాలెం? ఈ రొట్టి కిటికీలో పెడితే ఎవరో ఒకరు ఎతుకుపోతారు."

అంతవరకూ పేధన పడుతున్న బండి చూస్తూ, బండి మాపు దాటిపోగానే పిల్లవాడు తల్లివంక తిరిగాడు. ముగ్గురూ కిటికీలో నించి చూడ్డం కనిపెట్టాడు. "ఎవరే అమ్మా? నన్ను కూడా చూడ నియ్యవే." అన్నాడు.

పసిపిల్లవాని స్పష్టమైన కంఠస్వరంవినగానే సిస్టర్ ఒక్కసారి ఉలిక్కిపడింది. కిటికీవంక తిరిగి ముఖంమీదినుంచి జుట్టు తొల

గించి చూసింది. ముఖమంతా ముడతలు చిక్కులు పడ్డాయి. విభ్రమం, విషాదం ఉట్టిపడే ఆమె కన్నులు, పిల్లవానిపై పడ్డాయి. వెంటనే ఆమె కన్ను లొక్కసారి తళుక్కుమన్నాయి. "అయ్యో దేవుడా! ఇతరుల పిల్లల్నైనా నా దృష్టిలో పడకుండా చెయ్య లేవా?" అంది. సత్తువ పూర్తిగా నశించిన ఆమె మాటలు గుండెలు చీల్చుకు వచ్చినట్లున్నాయి. తరవాత ఆమె శరీరమంతా ఒక్క సారి గాలిలో ఆకువలె గజగజ వొణికిపోయింది. కొద్దిగా తెలె త్తింది. చేతులతో పాదాలు రాసుకుంది. "అబ్బ! ఎంత చల్లగా ఉన్నాయి" అనుకుంది.

"పాపం! లోపల కొంచెం మంట వేసుకుంటారా పోనీ వెచ్చగా ఉంటుంది" అంది ఒకామె.

సిస్టర్ వొద్దన్నట్లు తలూపింది.

"పోనీ పల్చని బ్రాండీ ఉంది తీసుకుంటారా! ఒళ్ళు కొంచెం వెచ్చనౌతుంది" అంటూ ఒక సీసా చూపింది.

సిస్టర్ వొద్దన్నట్లు తలూపింది. "మంచినీళ్లు" అంది.

"ఇంత చలిలో నీళ్ళు తాగకూడదు సిస్టర్. ఇది కొంచెం తీసుకోండి. నీకోసం మంచి రొట్టెకూడా తీసుకొచ్చాం." అని రొట్టె అందించింది.

సిస్టర్ అదీ వొద్దంది. "కొయ్యరొట్టె మాత్రమే" అంది.

"పోనీ ఇదైనా తీసుకోండి" అంటూ పై కోటుతీసి ఇవ్వ బోయింది.

"నారదుస్తులే నాకు" అంది సిస్టర్ ఇదికూడా నిరాకరిస్తూ.

"నిన్న పండగరోజు. ఈపూట కొంచెం మంచి రొట్టె తీసు కోండి."

"పండగ! తెలుసు. అందుకే కొబోలు రెండు రోజుల్నించి నా కూజాలో నీళ్ళు లేవు. అయినా నేను లోకంగురించే ఆలో చించను; నాకోసం లోకు లెందుకు తాపత్రయపడ్డం? మంట ఆరి పోగానే నిప్పులు చల్లబడిపోతాయి."

ఈమాత్రం మాట్లాడినందుకే అలసిపోయినట్లు మోకాళ్లలో తల వాల్చేసుకుంది.

"పోనీ కొద్దిగా చలిమంటైనా వేసుకోండి లోపల."

"చలిమంటా?" అంది సిస్టర్. ఈమాటు ఆమె కంఠస్వరం మారిపోయింది. బొంగురు గొంతుకతో ఇలా అంది: "పది హేనేళ్ల నించి ఎక్కడుందో కళ్ళబడని నా బిడ్డకి మీరు చలిమంట వెయ్య గలరా?"

ఆమె స్వరం వొణికింది. కాలుచేతులు వొణికిపోయాయి. కన్నులలో మరొకసారి మెరుపులా చైతన్యం మెరిసింది. పాలి పోయి ఎముకలు మాత్రం మిగిలిన చెయ్యి చాపి పిల్లవాణ్ని చూపుతూ అంది: "అబ్బాయి నిక్కడనించి తీసుకుపొండి. ఆ జిప్సీది ఇప్పుడీ దారినే వస్తుంది."

మోకాళ్ళలో ముఖం దాచుకుంది. తరవాత కొంతసేపటికి ఆమె కదిలింది. మోకాళ్లపైనా చేతులపైనా పాక్కుంటూ మూలకు వెళ్లిపోయింది. ఇప్పుడామె ముగ్గురు స్త్రీలకూ కనపడ్డంలేదు. మూలనించి మాత్రం ముద్దులూ, గాఢ నిశ్వాసధ్వనులూ వినవచ్చాయి. కిటికీలోనుంచి తలదూర్చి చూసే సాహసం ఎవరికీ లేకపోయింది. తరవాత అణుచుకుంటున్న ఏడుపు, గోడకు తల బాదుకుంటున్న చప్పుడు వినవచ్చాయి. ఆపైన ఒక్కసారి గట్టిగా తలకు దెబ్బతగిలిన చప్పుడు వినపడింది. అంతే ఆపైన నిశ్వాసం కూడా వినరాలేదు.

ముగ్గురికీ ఒళ్లు కంపించింది.

"అబ్బ! తల గోడకేసికొట్టుకుంది. చచ్చిపోయిందేమో!"

తరవాత ఆందోళన పట్టలేక ఒకరివెంట ఒకరు 'సిస్టర్, సిస్టర్' అని పిలిచారు. ఎన్నిసార్లు పిలిచినా ఆమె పలకలేదు.

"ఆగండి నేను చూస్తాను" అంది రీమ్స్ వనిత.

"పాక్వెత్! పాక్వెత్ శాంటిఫ్లూరీ" అని పిలిచింది. వెంటనే ముగ్గురూ వెనక్కి ఒక్కదూకు వేశారు. సిస్టర్ ఒక్క ఉదుటున లేచి నిలబడింది. ఒళ్లంతా గజగజ వొణికిపోతోంది. కళ్ళలో నిప్పులు కురుస్తున్నాయి. ఒక్క అంగలో కిటికీవద్దకు వచ్చి, ఊచలు పట్టుకుని నిలబడి చూసింది. పిచ్చి నవ్వొకటి వికృతంగా నవ్వింది "ఆ! నాకు తెలుసు నన్నెవరు పిలుస్తున్నారో. జిప్సీ! జిప్సీ నన్ను పిలుస్తోంది."

ఇంతలో చౌకులోని కొరత ఆమె కళ్లబడింది. పిచ్చి ఆవేశంతో కేకలు వెయ్య నారంభించింది. చేతులు ఊచలలోనుంచి బైటకు చాచింది. "పిల్ల నెత్తుకుపోతారా? చావండి! మీ కింతే శాస్తి. కొరతెక్కండి." అంటూ వికటాట్టహాసం చేసింది.

# 18

ఆ సమయానికే గ్రీవ్ చౌకులో కొరతవద్దకు పెద్ద గుంపు చేరింది. ఇక్కడికి సార్జెంట్లు వచ్చారంటే చాలు ఆరోజు అక్కడి పారిస్ ప్రజలకి వినోదమన్నమాటే. ఆరోజు ఉరితియ్యడమో, ఇనప చక్రానికి కట్టి తిప్పడమో, కొరతవెయ్యడమో, కొరడాలతో కొట్టడమో, లేక చెవులూడగొట్టడమో జరుగుతుందన్నమాట. గుర్రాలపై సార్జెంట్లు చేత కొరడాలు పుచ్చుకుని అదిలిస్తూ జనాన్ని అదుపులో ఉంచుతున్నారు.

దోషిని ఒక బండిమీద కట్టేసి తీసుకువచ్చి కొరతెక్కించారు. అక్కడ క్వాసిమోడోని గుర్తుపట్టగానే జనం అందరూ ఒక్కసారి గొల్లుమన్నారు. కిందటి రోజు 'మూర్ఖాగ్రేసరుడ'ని ఊరేగించినవాణ్ణే ఇవాళ కొరతవేస్తోంటే చూసి ఆ జనమే వినోదిస్తున్నారు. ఈ విచిత్రతత్వాన్ని విచారించేందుకు కవి గ్రింగైర్ లేకపోయాడు. ఒక పురపాలకాధికారి వేదికనెక్కి నిలబడగానే అంతటా నిశ్శబ్దం అలుముకుంది. దోషికి విధించబోయే శిక్ష బిగ్గరగా చదివి అతను దిగిపోయాడు.

క్వాసిమోడో కదల్లేదు, మెదల్లేదు. చివరి కతని ముఖంలో కోపమైనా కనపడ్డంలేదు. కట్టినగొలుసుల్తో పెనగులాడ్డం వ్యర్థమని గ్రహించాడు. సిపాయిలు గుంజి గెంటినా ఊరుకున్నాడు. కర్రలతో పొడిచినా ఊరుకున్నాడు. ప్రజ్ఞ పూర్తిగా లోపించిన అతని ముఖంలో నిశ్చేష్టభావంతప్ప మరొకటేదీ కనపడదు. అతను చెవిటివాడే కాదు; గుడ్డివాడుకూడా అనిపిస్తుంది. ముందు అతన్ని గొలుసులుతీసి కొరతపక్కన మోకాళ్ళపై నిలబెట్టారు. పైచొక్కా తీసివేశారు. పెద్దమూపు ప్రజలకంట బడింది. మళ్ళీ అతన్ని అలా గొలుసులతో కట్టివేశారు. కాళ్లు పట్టుకు వేలాడదీస్తే తల వేలాడుతుంటే కష్టంతో నిశ్వాసం విడిచిపెట్టేదూడలా గాఢనిశ్వాసం విడుస్తున్నాడు.

"బండరాయిద్దు" అన్నాడు జెహాన్ ఫ్రాలో గుంపులోనుంచి.

ఒకడు వచ్చి గంటలు కొలిచే జంటసీసా కొయ్యి పైన పెట్టాడు. పై సగం సీసానిండా ఎర్రని ఇసుక ఉంది. అది మెల్లి మెల్లిగా కింది సగం సీసాలోకి జారిపడుతోంది. మరొకడు వచ్చి కోటు చేతులు మడుచుకున్నాడు. అతని చేతిలో కొరడా ఉంది. దట్టమైన తోలు పటకాలో సీసపు ముక్కలు అతికించి ఉన్నాయి. మెల్లిగా చక్రం తిరగటం మొదలు పెట్టింది. క్వాసిమోడో భయంతో వొణికాడు. అప్పుడతని ముఖం చూసి జనం విరగబడి నవ్వారు. చక్రంపైన క్వాసిమోడో ఒక చుట్టు తిరిగాడు. తిరిగి వేదికవద్దకు వచ్చేసరికి అతని వీపుపైన కొరడా ఝళిపించింది.

క్వాసిమోడోకి ఒక్కసారి కలలోనుంచి మేలుకున్నట్లయింది. గొలుసులతో పెనగులాడ్డం మొదలు పెట్టాడు. బాధవల్ల అతని ముఖం మరింత వికృతమయింది. తల అటూ ఇటూ తిప్పడం మొదలుపెట్టాడు. చక్రం తిరుగుతోంది. కొరడా ఝళ్లు ఝళ్ళున అతని వీపు బద్దలుగొడుతోంది. వీపుపై వందగాయాలనుంచి రక్తం చిమ్మ నారంభించింది. పాముపడగలవలె కొరడా సీసపు ముక్కలు ఆకాశంలోకి లేచి విసురుగా వీపుపైన పడుతున్నాయి. పైకి లేచినప్పుడల్లా రక్తపు చినుకుల్ని గుంపుపైకి కురిపిస్తున్నాయి.

క్వాసిమోడో పెనగులాట మానేశాడు. నిస్సహాయంగా గొలుసులలో వేలాడుతున్నాడు. కొంతసేపటికి రక్తం భుజాలపై నుండి కాలువలు గట్టింది. గాయాలను మరింత చీల్చుతున్న కొరడా నెత్తురుమయమైంది. బాధ భరింప శక్యం కానిదయింది. తిరిగి ఒక్కసారి ప్రాణాలొడ్డి పెనగులాడాడు. ఈమాటతని కళ్లలో నిప్పులు కురిశాయి. కండరాలు పొంగాయి. రక్తం మరింత చిందింది. గొలుసులు సాగినాయి. కాని ప్రయత్నం వ్యర్థమని తెలిసిపోయింది. నిరాశతో మళ్లీ పెనగులాట మానుకున్నాడు. మత్తు కమ్మినట్లయింది. ఒక్క కన్ను మూసుకున్నాడు. స్పృహ చెడి తలవాల్చేశాడు.

తరవాత అతను కదల్లేదు. కొరడా శరీరాన్ని చీల్చివేస్తోంది. రక్తం కాలవలై ప్రవహిస్తోంది. కొట్టిన కొద్దీ కొరడా రోషం ఎక్కువౌతోంది కాని అతనిలో మాత్రం చలనం రాలేదు.

కొంతసేపటికి కొకడు గంటలుకొలిచే జంటసీసావంక చెయ్యి చూపాడు. కొరడా ఆగిపోయింది. చక్రం నిలిచిపోయింది.

మెల్లిగా దోషి కన్ను తెరిచాడు. ఇద్దరు వచ్చి వీపునున్న రక్తం కడిగివేశారు. ఒకడువచ్చి వీపంతటా మందుపూశాడు. మరొకడు వచ్చి పసుపుపచ్చని గుడ్డఒకటి కప్పాడు. కొట్టినవాడు తోలు పట కాని రెండువేళ్లమధ్య పిండి నెత్తురు కింద దులిపాడు.

ఇంతటితో శిక్ష పూర్తికాలేదు. మరోగంట అతన్ని అల్లా వుంచాలి. అందువల్ల జంట సీసాని తిరగేసిపెట్టారు.

జనసమూహంతత్వాన్ని—ముఖ్యంగా అనాగరికమైన మధ్యయుగాలలో జనం తత్వాన్ని—ఒక కుటుంబంలో పసి కుర్ర వానితో పోల్చవచ్చు. బుద్ధి, నీతీ పరిపక్వం చెందని దశలో దాక్షిణ్యం కరువౌతుంది. పారిస్‌లో అందరికీ క్వాసిమోడో పట్ల అకారణ క్రోధం ఉందని ముందే చెప్పబడింది. కొఅంత వేసినం దుకు అక్కడ చేరిన అందరికీ ఆనందమే కలిగింది. జరిగిన శిక్ష అందరికీ వినోదం కలిగించకెంతో పోలేదు. నిస్సహాయస్థితిలో ఉన్నందువల్ల అతనిపై కోపం హెచ్చయింది.

అందువల్ల అధికారులవంతు శిక్ష పూర్తయిన తరవాత ప్రజల వంతు వచ్చింది. ఇక్కడకూడా ఆడవాళ్ళదే పైచెయ్యి. అందరూ బిగ్గరగా దూషించ నారంభించారు. కొందరు రాళ్లుకూడావిసిరారు.

క్వాసిమోడో చెవిటివాడే కావచ్చు. కాని ఉన్న ఒక్క కన్నుతోనే చూసి పరిస్థితిని సూక్ష్మంగా గ్రహించగలడు. అయితే అతని భావం మాటల్లోకంటె ముఖంలో ఎక్కువ వ్యక్తమౌతుంది. అందరినీ ఒక్కసారి మింగివేసేలా చూశాడు. కాని రాళ్లు మరిన్ని మీదకు వచ్చి పడ్డాయి. గొలుసుల్లో పెనగులాడాడు. చక్రం గజ గజలాడింది. కాని దీనివల్ల ప్రజలకు వినోదమే ఎక్కువ కలిగింది.

పెనగులాడి చేసేదిలేక చివరి కూరుకున్నాడు. ఇటువంటి శిక్షవల్ల ఇతరులకువలె ఇతనికి లజ్జమాత్రం కలగలేదు. క్రోధం అధికమయింది. లజ్జ అంటే ఏమిటో తెలుసుకునే సామాజిక చైతన్యం లేదతనికి. రోషమొక్కటే అతన్ని నిలువెల్లా దహిస్తోంది.

అతనిదృష్టి అప్పుడే వస్తున్న ఒక గుర్రంపైన పడింది. ఆ గుర్రం పైనున్నవాడు క్లాడ్ ఫ్రొలో. అతన్ని చూడగానే క్వాసి మోడో ముఖంలో రోషం అంతరించింది. క్లాడ్ ఫ్రొలో సమీ పించగానే క్వాసిమోడో చిరునవ్వు నవ్వాడు. కాని దగ్గరకువచ్చి

చక్రంపై క్వాసిమోడోని గుర్తించగానే క్లాడ్ ఫ్రొలో తల వంచుకున్నాడు. గుర్రం గుంపులోనుంచి దారితీసింది.

క్వాసిమోడో ముఖంపై నల్లని ఛాయ ఆవరించింది. ఆశాభంగం, నిస్పృహ, విషాదభావాలు అతనిముఖంలో గోచరించాయి.

గంటసేపు ప్రజల అవహేళన, నిర్దాక్షిణ్యవర్తన సహించాడు క్వాసిమోడో. చివరకు భరించలేక మరొకసారి పెనగులాడాడు. "నీళ్లు" అని బిగ్గరగా అరిచాడు. ఇది సింహం గర్జించినట్లుంది. ఈమాట వినగానే ప్రజలకి జాలికిబదులు మరింత వినోదమే కలిగింది. దూషించేవారే కాని నీళ్ళివ్వడానికి ప్రయత్నించినవాళ్లే లేరు. క్వాసిమోడో ముఖం, తలా చెమటలో తడిసిపోయింది. దాహంతో నోరెండి నాలుక చాచి చెమట బిందువులందుకోసం మొదలుపెట్టాడు. ఆయాసంతో గట్టిగా వగరుస్తున్నాడు. ప్రజల ఈ అమానుషవర్తనపట్ల అతనిక్రోధం హద్దులు దాటింది. కంటి నిప్పులు చెరుగుతున్నాడు. గుంపునంతా ఒకసారి కలయచూశాడు. మళ్ళీ ఒకసారి 'నీళ్ళు' అని అరిచాడు. ప్రజలు వెటకారంతో 'నీళ్ళు' అని అరిచారు. ఒకామె పెద్ద రాయి విసిరింది. అది అతని తలకుకొట్టుకు పడిపోయింది. ఒకడు ఓటికూజా విసిరాడు. అది అతని రొమ్ముకు తగిలి ముక్కచెక్కలై పోయింది.

"నీళ్ళు" అని మళ్ళీ బొబ్బపెట్టాడు. ఇంతలో గుంపు దారిచ్చింది. తెల్లని మేకని వెంటపెట్టుకుని ఎస్మరాల్డా వచ్చింది. ఆమె చేతిలో తంబుర ఉంది. క్వాసిమోడో ఆమెని గుర్తించాడు. తను అపహరించడానికి ప్రయత్నించింది ఈమెనే. అందుకే తనకీ శిక్ష కాబోలునని ఇప్పుడతనికి తోచింది. కాని తన శిక్షకి కారణం తనకీ న్యాయమూర్తికీ కూడా ఉన్న చెవుడేనని అతనికి తెలియదు. తనపై పగ తీర్చుకోడానికి ఆమె వస్తోందనుకున్నాడు. ఆమెను జాగ్రత్తగా గమనించాడు. అతని కన్నుల్లో కోపం ఉట్టిపడుతోంది. ఆ కంటికే శక్తి ఉంటే ఎస్మరాల్డా అప్పుడే భస్మమైపోయేది. మెల్లిగా ఆమె అతన్ని సమీపించింది. ఆమెను చూడలేక ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు. ఆమె తన వీపుపై సంచిలోనుంచి ఒక సీసా తీసింది. ఒక్క మాటైనా పల

ఉక్కుండా సీసా అతని పెదవులపై వంచింది. కరకర కాలిపోతున్న అతని నాలుక నీటిని చప్పరించింది. అతని ముఖంలోని భావం ఇట్టే మారిపోయింది. కంటి చివర ఒక పెద్ద నీటిబిందువు నిలిచింది. వికృతమైన ఆ ముఖంపైనుండి మెల్లిగా ఆ బిందువు జారి పడిపోయింది. పెద్దవాడై సత్తువ వచ్చినతరవాత అతను కంట నీరు నించడం ఇదే మొదటిసారి.

కృతజ్ఞతాభావంతో అతను నీరు త్రాగడం మరిచిపోయాడు. ఆమెకు చిరాకు కలిగింది. సీసా అతని నోటి కందించింది. వెంటనే నీరు త్రాగేశాడు. పూర్తిగా కాగానే కృతజ్ఞతాభావంతో ఆమె ముఖమంతెలా న్నొకసారి వీక్షించి తలదించుకున్నాడు. పెదవులు చాచి ఆమె పాదాలు స్పృశించబోయాడు. కాని గడిచిన రాత్రి అనుభవం జ్ఞప్తికివచ్చి కాబోలు ఆమె వెనక్కు అడుగు వేసింది. భయంతో అతని దగ్గరనుంచి తొలగిపోయింది. ఆత్మనిరసన, వ్యథ అతని హృదయాన్ని గాయపరిచాయి.

సరిగ్గా ఇదేసమయంలో సిస్టర్ గ్వర్లా కిటికీలోనుంచి కోటత వద్ద దృశ్యం చూసింది. చూసి జిప్సీ యువతిని శపించ నారంభించింది. కోపంతో పళ్లు పటపటకొరికింది. అదే సమయానికి ఎమరాల్డా గుంపులోనుంచి వచ్చి సమాధి సమీపించింది. సిస్టర్ శాపనార్థాలు వినేసరికి ఆమె హడలిపోయింది. "పిల్లల్ని ఎత్తుకు పోయే పాపిష్టులు! నరకం పాలౌతారు మీరు. నీకూ ఈ కొఱతే రాసివుందిలే" అంటోంది సిస్టర్. ఈ మాటలు ఎమరాల్డా చెవుల్లో గింగురుమంటున్నాయి.

చెదిరి వెళ్ళిపోతున్న జనం సిస్టర్‌ని చూశారు. "మళ్ళీ ఈవిడకి పిచ్చెత్తింది కాబోలు" అన్నారు కొందరు.

శిక్ష పూర్తికాగానే క్వాసిమోడో బంధవిముక్తుడైనాడు. జనం అందరూ వెళ్ళిపోతున్నారు. రీమ్స్‌నించి వచ్చిన వనిత కొడుకుని దగ్గరకు తీసుకుంది. చూసి ఆశ్చర్యపడింది. "అరే చేతిలో రొట్టేదిరా?" అని అడిగింది.

"నువ్వు కిటికీలో ఆవిడతో మాట్లాడుతున్నప్పుడు పెద్ద కుక్కొకటొచ్చిందమ్మా. నాచేతులో రొట్టె అందుకుని సగం కొరికేసింది. ఇంకెందుకని మిగిలింది నేను తినేశాను."

"అంతా తినేశావే?"

"నేను కాదమ్మా! కుక్కే!"

# 19

కొన్ని వారాలు గడిచాయి. అది మార్చి ప్రారంభం. వసంత కాలపు సూర్యకాంతులు పారిస్ వాసులకు ఉల్లాసం కలిగి స్తున్నాయి. నాటర్ డామ్ చర్చి గోపురాలు నీరెండలో ధగధగ మెరుస్తున్నాయి. చర్చికి ఎదురుగా ఒక పెద్ద రాతిభవనం బాల్కనీలో తరుణవయస్కులైన యువతులు కొంతమంది కూర్చున్నారు. ఉల్లిపొరలవంటి వారి పైవస్త్రాలు, రంగురంగుల వెల్వెట్ దుస్తులు, కంఠాలలోని ముత్యాల హారాలు, ఇతర అలంకారాలను బట్టే వారు ఉన్నత వంశస్థులని తెలుస్తుంది. మహారాజు కొత్తకోటలికి చెలికత్తెల్ని ఎంచబోతున్నారని విని ధనాఢ్యులు, ఉన్నత వంశస్థులు తమతమ పుత్రికల్ని పారిస్ నగరం చేర్చారు. చర్చి కెదురుగా ఉన్న ఆ రాతిభవనం ఒక వితంతువుకు చెందినది. ఆమె బంధుమిత్రులు కొందరు తమ పుత్రికల్ని ఆమెవద్దకు పంపారు. అందరూ ఆరోజు సాయంకాలం బాల్కనీలో కూర్చుని ఒక పెద్ద తెరగుడ్డపైన రంగుల దారాలతో బొమ్మలు కుడుతున్నారు.

బాల్కనీ ప్రక్క ఒక విశాలమైన గదిలో వితంతువు కూర్చుంది. ఆమె ప్రక్క కెప్టెన్ హోదాలో సైనికాధికారి దుస్తులు ధరించిన యువకుడొకడు నిలబడి ఉన్నాడు. అతని ముఖంలో సహజ ధైర్యసాహసాలతోపాటు యౌవన సహజమైన చాంచల్యం స్పష్టంగా కనపడుతుంది. అతను పారిస్ యువతులను సులువుగా ఆకర్షించగల రూపవంతుడే. అతని ఉనికివల్ల యువతులు మెల్లిమెల్లిగా ఏవేవో మాట్లాడుతూ—మధ్యమధ్య ఉల్లాసంతో అతి మెల్లిగా నవ్వుతున్నారు. అతను ఇదేదీ గమనించనట్లు అప్పుడప్పుడు తోలుపటకా మెరుగుపెట్టుకుని చూసుకుంటున్నాడు. వితంతువు తన కూతుర్ని అతని కిచ్చి వివాహం చెయ్యాలని సంకల్పించింది.

"అటు చూడవోయ్" అంది వితంతువు వేలితో కూతుర్ని చూపుతూ. "తెరగుడ్డ మీదికి వంగి చూస్తోంది. ఇప్పుడు చూడాలి అమ్మాయిని."

"అవునవును."

"ఆ భుజాలు, ఆ చేతులు, ఎంత చక్కగా వున్నాయో చూశావా?"

"నిజం."

కూతుర్ని గురించి తల్లి పలికిన ప్రశంసా వాక్యాలు అతని కాళ్టే తలకెక్కలేదు. అతని మనస్సెక్కడో మరొకచోట పరిభ్రమిస్తోంది.

"నవుస్తోంటే అచ్చు హంసలా వుంటుందనుకో."

"అవునవును. చూశాను."

"అక్కడికి వెళ్ళి కాస్సేపు మాట్లాడరాదూ? భార్య కాబోతోందని కొత్తగా సిగ్గుకూడా తెచ్చుకున్నావేమిటి?"

"అబ్బే! లేదు లేదు!"

నిజానికతనికి సిగ్గు లేనే లేదు; పరాకు మాత్రమే ఉన్నాడు. మెల్లగా నడిచి పత్ని కాబోయే యువతిని సమీపించాడు. కొంతసేపు నిలబడి తెరగుడ్డపై కుట్టువంక చూస్తున్నట్లు నటించాడు.

"దీనిమీద ఏం పేర్లు కుడుతున్నారు?" అని అడిగాడు.

"ఇప్పటికి మూడుసార్లడిగావు; మూడుసార్లు చెప్పాను" అంది ఆమె, అతనివంక చూడకుండానే. అతని వైఖరి తల్లికంటె కూతురుకే ఎక్కువ తెలుసు. ఆమెతో మళ్ళీ మాట్లాడ్డానికి అతను ప్రయత్నించాడు. కాని ఏం మాట్లాడాలో తెలియలేదు. ఒక యువతి స్నేహపూర్వకంగా అతనికేసి చూసి నవ్వింది. ఈమె పళ్లు ముత్యాల్లా వుంటాయి. అందువల్ల మాటిమాటికీ పలువరుస కనపడేలా నవ్వుతూ ఉంటుంది. ఇంకొకామె నిత్యం నిట్టూర్పులు విడుస్తూ ఉంటుంది. ఆమె ఎందుకు నవ్వుతుందో, ఈమె ఎందుకు నిట్టూరుస్తుందో ఎవరికీ తెలియదు; వాళ్ళకే తెలియదు.

ఇంతలో వీధిలోనుంచి తంబురతీగెలు మీటుతున్న స్వరం వినవచ్చింది. యువతులందరూ కుట్టు విడిచిపెట్టి బాల్కనీ పిట్టగోడవద్దకు పరుగెత్తారు. వసుధకూడా కొంతసేపు తటపటాయించి వారి ననుసరించింది.

యువకుడు రాజుగారి సైన్యంలో కెప్టెన్. ఉన్నతవంశానికి చెందినవాడైనప్పటికీ, అతనికి సిపాయిజీవితం క్రమక్రమంగా మొరటుతనాన్ని అలవరించింది. చాటుగా మద్యసేవకు అలవాటు పడ్డాడు. అతని ప్రసంగంలో తప్పిజారి మొరటు మాటలు దొర్లుతూ ఉంటాయి. వధువుపట్ల అతనికి ప్రీతి లేకపోలేదు. కాని ఈ ఉన్నత వంశాలలో అతిమర్యాదగా ప్రవర్తించడం అతనికి సులభ సాధ్యం కాదు. అందువల్ల ప్రీతి ఉన్నప్పటికీ, ఆమెతో తనకు వివాహం జరుగుతుందని తలుచుకుంటే, అతనికి కొద్దిగా భయం కలుగుతుంది. ఈ సమాజం మధ్య అతను స్వేచ్ఛగా మాట్లాడలేడు. మెల్లిగా వధువు ననుసరించి పిట్టగోడ దగ్గరకు చేరాడు.

వధువు అతనివంక చూడకుండానే అడిగింది "ఒకసారి ఒక జిప్సీ యువతిని ఎవరో అపహరించబోతున్నప్పుడు రక్షించానని చెప్పావు కాదూ?"

"అవును. చెప్పినట్టున్నాను" అన్నాడు కెప్టెన్.

"అయితే ఈమే కావచ్చు. ఇలా దగ్గిరికి వచ్చి చూడు ఫీబస్" అంది వధువు.

తన ప్రవర్తనపట్ల అరుచి కలిగినా, తనతో రాజీపడ్డానికి ఆమె ఇష్టపడుతున్న దనుకున్నాడు. మెల్లిగా ఆమెను సమీపించాడు. వీధిలోకి చూశాడు. "అవునవును. దానిపక్క మేకకూడా నాకు గుర్తే." అన్నాడు.

ఒకామె చప్పట్లు కొట్టింది "మేక ఎంత బాగుందో" అంది.

"దాని కొమ్ములకున్న తొడుగులు అసలు బంగారమే కాబోలు" అంది ఇంకొకామె.

"ఆ చర్చి డాబామీద ఎవరో చూశావా? నిలువెల్లా నల్లటి దుస్తులున్నాయి!" అంది మరొకామె.

అందరూ తలలెత్తి చూశారు. అక్కడ క్లాడ్ ఫ్రొలో నిలబడి చూస్తున్నాడు. అతని దృష్టి వీధిలో గుంపుమీదుంది.

"జిప్సీనర్తకివంక ఎలా చూస్తున్నాడో!" అందొక యువతి.

"జిప్సీలంటే ఆయనకి అసలు పడదు. దీని పని పట్టేస్తాడెప్పుడో."

"అలా చూస్తా డెందుకో! చూడు అదెంత చక్కగా నృత్యం చేస్తోందో."

వధువు కెప్టెన్‌వంక చూసింది. "[illegible] సుగా. ఇక్కడికి రమ్మను; ఒకసారి నాట్యంచెయ్య[illegible]"

"అవునవును" అన్నారందరూ.

"అబ్బే! అదెందుకూ? అయినా అది నన్ను మరిచిపోయుంటుంది. దాని పేరేనా నాకు తెలియదు" అని వధువువంక కొన్నెపు చూశాడు. "అయినా ఫరవాలేదులే. చూస్తాను, వస్తుందేమో" అన్నాడు. పిట్టగోడ మీదినుంచి వంగి వీధిలోకి చూసి చప్పట్లు కొట్టి పిలిచాడు.

నర్తకి నృత్యం ఆపి ఇటు చూసింది. కెప్టెన్ ఫీబస్‌ని చూడగానే ఆమెకళ్ళు తళతళ మెరిశాయి. అతనివంక తదేకంగా చూడసాగింది. రమ్మన్నట్లు అతను చేతితో సంజ్ఞచేశాడు. ఆమె ముఖం ఎర్రబడింది. తంబుర చంకను పెట్టుకుని గుంపులోనుంచి దారిచేసుకుని వీధిదాటి ఇల్లు సమీపించింది. తడబడుతున్న అడుగులతో సింహద్వారందాటి లోనికి వచ్చింది. నౌకర్లు ఆమెను బాల్కనీవద్దకు తీసుకువచ్చారు. ఆమె బాల్కనీ ప్రక్క గది గుమ్మంవద్దకు వచ్చి నిలబడిపోయింది.

ఆమె అందం చూసి యువతులు విభ్రాంతులైనారు. ఫీబస్‌ని ఆకర్షించడంకోసం మొదటినుంచీ యువతులందరూ తమలో తాము పోటీలు పడుతున్నమాట నిజం. అయితే అందరూ అందంలో దాదాపు సమానులే. ఇప్పుడు జిప్సీ అపూర్వ సౌందర్యం చూసేసరికి వారి కళ్లు చెదిరిపోయాయి. వీధిలో చూసినప్పటికంటె అన్ని విధాలా అలంకరించబడిన ఈ గదిలో జిప్సీ యువతి సౌందర్యం ఇనుమడించినట్లు కనపడింది. ఈమాటు తమలో తాము పోటీలు పడ్డం మాని అందరూ ఏకమై జిప్సీయువతిపై కత్తికట్టారని వారి ముఖాలు చూస్తేనే తెలుస్తుంది.

అందరూ ఆమెవంక తిరస్కారభావంతో చూశారు. ఆమెను నిలువెల్లా చూసి, తరువాత ముఖముఖాలు చూసుకున్నారు. జిప్సీకి వీరిని చూసేసరికి దడవచ్చింది. ఆమె నోటివెంట మాటరాలేదు.

కెప్టెన్ ఫీబస్ మర్యాద మర్చిపోయాడు: "అబ్బ! ఎంత చక్కగా వుంది? కాదూ?" అన్నాడు వధువుతో.

"ఫరవాలేదు." అంది వధువు, పెదవివిరిచి. మిగిలిన యువతులు సన్నగా గుసగుసలు ప్రారంభించారు.

వితంతువు సోఫాలోనే కూర్చునివుంది. "ఇల్లా రావే" అని పిలిచింది. జిప్సీ ఆమెవద్దకు వెళ్ళి నిలబడింది.

కెప్టెన్ ఫీబస్ కూడా ఆమెవద్దకు వెళ్ళాడు "నీకు జ్ఞాపకం ఉందోలేదో, ఆరోజురాత్రి..."

"ఆ! ఆ! జ్ఞాపకంఉంది. మీరు గుర్తే" అంది జిప్సీ చిరునవ్వుతో. ఆమె ముఖంలో ఇప్పుడు ఆనందం వెల్లివిరిసింది.

"ఆరోజురాత్రి అంతలోనే జారిపోయావు, నన్ను చూసి కూడా భయపడ్డావా?" అన్నాడు ఫీబస్.

"అబ్బెబ్బే! లేదులేదు."

ఈ ప్రసంగంలో ఏవో ఊహాలు స్ఫురించిన వసువుకి ఆగ్రహం కలిగింది. ఫీబస్ అది గమనించలేదు.

"నీకోసం చూడబోతే ఆ ఒంటికన్ను రాక్షసి కనపడ్డాడు. వాడిపేరేమిటో మర్చిపోయాను. అయినా అలాటివాడికి నీతో పనేమిటో?"

"ఏమో"

"అయినా అలాంటిది ఎంతో ధైర్యసాహసాలు కలవాళ్ళు, రాజవంశస్థులకే చెల్లుతుందికాని, వీడికెందుకో ఆ సాహసం?" చివరికి వాడికి మంచిశాస్తి జరిగిందిలే, వీపు బాగా చిట్లగొట్టారు"

"పాపం" అంది జిప్సీ, కొరతవద్దగర దృశ్యం జ్ఞప్తికి తెచ్చుకుని.

కెప్టెన్ తన పరిసరాలు మర్చిపోయాడు. "వాడిపట్ల జాలేమిటి? ఒట్టి......" అంటూ నాలిక్కొరుచుకుని వెనకనున్న యువతుల వంక ఒకసారిచూసి తలదించేసుకున్నాడు. "క్షమించాలి, మర్చిపోయాను" అన్నాడు.

"ఛ ఛ" అన్నారెవరో యువతులమధ్యనుంచి.

"ఆ వికారాల భాషలోనే మాట్లాడుతున్నాడులే" అంది వసువు, కసితీర్చుకున్నట్టు.

ఫీబస్ మళ్ళీ తన ఒళ్ళు మరిచిపోయాడు. జిప్సీ యువతి పైనే దృష్టి లగ్నంచేసి చూశాడు. "ఎంత అందంగాఉంది!" అనుకున్నాడు.

"దుస్తులే బాగుండలేదు" అంది ఒక యువతి.

"భుజాలు కనపడేలా ఆ దుస్తుల్తో ఎలా తిరుగుతుందో వీధుల్లో?"

"గౌను మరీ మోకాళ్ల దగ్గిరికే పొట్టిగా ఉంది. ఛీ."

ఈరీతిగా సాగిన ప్రసంగం వింటూ నిశ్చేష్టుడై ఉండిపోయాడు ఫీబస్. అతనింతవరకూ ఈ ఉన్నతవంశస్థులైన యువతుల అందమూ సౌకుమార్యమే గమనించాడు. ఇప్పుడు వారెంత అసూయాపరులో, కఠినహృదయులో, లోలోన ఎంత మొరటుతనం దాచుకున్నారో చూడగలిగాడు. వారి అవహేళనకి, వెకిలి నవ్వులకి అంతులేదు. పూర్వం సింహాలు మనుష్యుల్ని చంపి తింటూ ఉంటే చూసి వినోదించిన రోమన్ స్త్రీల సంగతి అతనికి గుర్తుకు వచ్చింది. అందమైన వేటకుక్కలమధ్య లేడిపిల్ల చిక్కిందనుకున్నాడు. జిప్సీ యువతి లోలోన కుతకుత లాడిపోయింది. ఆమె ముఖం ఎర్రబడింది. ఏదో జవాబివ్వబోయి నిగ్రహించుకున్నట్లు పెదవులు కొరుక్కుంది. చివరకు వారి విమర్శలను నిర్లక్ష్యంతో తోసిపుచ్చి ఆమె ఫీబస్ వంక చూస్తూ ఉండిపోయింది.

ఫీబస్ ఆమె పరిస్థితి గమనించాడు. ఇలా అన్నాడు: "వాళ్లిష్టంవచ్చినట్లు వాగనీ. నీ దుస్తులు కొంత బాగుండనిమాట నిజమే, కాని అంతలో నీ అందానికి వచ్చిన లోటేమీ లేదు."

మళ్ళీ గుసగుసలు సాగాయి. "జిప్సీల కళ్ళు చూస్తే సైనికులు పరవశులైపోతారు" అంది ఒకామె.

"ఎందుకు కాకూడదూ?" అన్నాడు ఫీబస్. వెంటనే అందరూ విరగబడి నవ్వారు. వధువుకూడా నవ్వింది; కాని ఆమె ముఖంలో క్రోధం మాత్రం ఎక్కువౌతూనే ఉంది. జిప్సీ యువతికి ధైర్యం చిక్కింది. ఫీబస్ కళ్లలోకి చూస్తూ చిరునవ్వు నవ్వింది.

"ఆ! ఆ! ఇదేమి టెక్కు? ఛీ! దూరంగా ఉండు" అంటూ లేచి నిలబడింది వితంతువు.

జిప్సీయువతికోసం వచ్చిన మేక కొమ్ములు వితంతువు ఒడిలోఉన్న తెరగుడ్డలో చిక్కుకున్నాయి. జిప్సీ మేకకొమ్ములు విడిపించి, మేకను దగ్గరకు తీసుకుంది. మోకాళ్ళపై వంగి మేక తలను చెంపల కానించి గారం చేసింది.

యువతుల మధ్య గుసగుసలు అధికమైనాయి. "ఈ మేక గారడీ చేస్తుందిట! ఈ జిప్సీకి మంత్రతంత్రాలు వచ్చుటకూడా."

ఒకామె ముందుకు వచ్చింది "ఏదీ! నీ మేకచేత గారడీ చేయించు" అని అడిగింది.

"అంటే? నాకు తెలియదండి."

మేక మెడనున్న తోలుసంచి చూసింది ఒకామె. "అదే మిటి?" అని అడిగింది.

జిప్సీ చురచుర చూసింది "అది నా గుట్టు" అంది.

"అదేమిటో కొంచెం చెప్పు" అంది వధువు.

"నువ్వూ నీ మేకా ఏమీ చూపించకపోతే ఇక్కడికెందుకొచ్చినట్టు?" అంది తల్లి.

జిప్సీ గిరుక్కున వెనక్కు తిరిగింది. గబగబ అడుగులు వేసుకుంటూ ద్వారంవద్దకు వెళ్ళింది. అక్కడ ఆగి వెనక్కి తిరిగి ఫీబస్‌ని చూసింది.

వెళ్ళిపోడానికి వీల్లేదు" "వెళ్ళకు. వచ్చి నీ నృత్యం చూపించు. అన్నట్టు నీ పేరేమిటి?" అన్నాడు ఫీబస్.

"ఎమరాల్డా."

చిత్రమైన ఈ పేరు వినగానే యువతులందరూ పక్కున నవ్వారు.

"ఇది మీ అమ్మా నాన్నా పెట్టిన పేరేనా?" అని అడిగింది వధువు తల్లి.

ఈలోగా ఒక యువతి మెల్లిగా మేకను మచ్చికచేసి ఒక మూలకు తీసుకుపోయింది. మేక ఆమెతో ఇట్టే స్నేహం కలిపింది. యువతి మేక మెడలో సంచి తీసి విప్పి బోర్లించింది. అక్షరాలు వ్రాసిన చిన్న చిన్న కొయ్యముక్కలు వొలికాయి. అవి తివాసీ మీద పడగానే మేక వాటిని ముందు కాళ్ళతో గెంటుతూ పేర్చడం మొదలుపెట్టింది. చుట్టూ మరికొందరు యువతులు చేరారు.

"ఇదిగో, మేక ఏదో గుమ్మత్తుచేస్తోంది" అంది ఒక యువతి మెల్లగా.

మేక కొన్ని అక్షరాలు పేర్చి ఒక మాట తయారుచేసింది. ఇలా పేర్చడం మేకకి బాగా అలవాటని తెలుస్తోనే ఉంది. మేక అక్షరాలు పేర్చి చేసిన మాట చూసి యువతులు నిశ్చేష్టులైనారు. ఒకామె వధువును పిలిచి చూపించింది. వధువు అది చూసి కోపంతో దుఃఖంతో గడగడ వణికిపోయింది. మేక పేర్చిన పేరు "ఫీబస్."

"నీ గుట్టేమిటో తెలిసింది" అంది వధువు బిగ్గరగా.

వెంటనే నితంతువు, ఫీబస్ అందరూ వచ్చి చూశారు. మేక చేసిన పని గ్రహించింది ఎమరాల్డా. ఆమె ముఖం పాలిపోయింది. వణికి పోయింది. ఫీబస్ ఆనందానికి మేరలేదు. జిప్సీవంక చూసి చిరునవ్వు నవ్వాడు.

"అమోఘమైన జ్ఞాపకశక్తి నీది" అంది వధువు, జిప్సీవంక రోషంతో చూస్తూ. చేతులతో ముఖం కప్పుకుని వెక్కి వెక్కి ఏడవ నారంభించింది.

కూతుర్ని చూసేసరికి తల్లికి దుఃఖం పొంగివచ్చింది. జిప్సీని బెదిరిస్తూ "నువ్వుపో ముందు. పో అవతలకి." అంటూ అరిచింది. జిప్సీ గబగబా అక్షరాలు ఏరి సంచిలో పోసుకుని మేకకు సైగచేసి పరుగెత్తింది వధువును మరో గదిలోకి చేతులమీద తీసుకుపోయారు. గదిలో ఫీబస్ ఒక్కడే మిగిలాడు. కొంతసేపు ఆ ద్వారం వంకా ఈ ద్వారంవంకా చూసి, తటపటాయించి, తరవాత జిప్సీ వెళ్ళిన దారినే అనుసరించాడు.

# 20

జిప్సీవీధిలో నృత్యం చేస్తున్నప్పుడు నాటర్ డామ్ చర్చిలో ఒక గోపురం ప్రక్క విశాలమైన డాబాపై నిలబడి తదేకంగా చూసినవాడు క్లాడ్ ఫ్రాలో. ఆ గోపురంలో డాబా ప్రక్క అతని కొక రహస్యమైన గదివున్నదని ఇదివరలోనే చెప్పబడింది. అది చాలా చిన్నగది. ఎన్నడూ సంస్కారం ఎరగక బూజుపట్టి చీక టిగా ఉంటుంది గదిలో సాలిపురుగులూ, గబ్బిలాలూ యథేచ్ఛగా సంచారం చేస్తూఉంటాయి. ఇక్కడి ఈగలపాలిట శత్రువులు రెండురకాలు.

ప్రతిరోజూ సూర్యాస్తమయ సమయానికి ఒకగంటముందు క్లాడ్ ఫ్రాలో గోపురం మెట్లెక్కివచ్చి ఈ గదితాళం తీసి లోన ప్రవేశిస్తాడు. తరుచు రాత్రంతా ఇక్కడే గడుపుతూ వుంటాడు. గది తాళంచెవి ఎప్పుడూ అతని మెడలో ఒక పట్టు తాడుకి వేలాడగట్టబడి ఉంటుంది.

ఆరోజు సాయంకాలం తనగదికి వెళ్ళబోతూ, వీధిలో తంబురవిని ఆగాడు. డాబా చివరకు వచ్చినిలబడి వీధిలోకి చూశాడు. జిప్సీనిచూసి అక్కడే నిలబడిపోయాడు. పిట్టగోడకాను

కుని నిశ్చలంగా శిలాప్రతిమవలె ఉండిపోయాడు. పారిస్ నగరమంతా అతని పాదాలదిగువనే ఉంది. చుట్టూ అనేక గోపురాలు, సుందరహార్మ్యాలున్నాయి. కాని అవేవీ అతనిదృష్టి నాకర్షించలేదు. తదేకంగా జిప్సీవంక చూస్తున్నాడు. కన్నులలో నిప్పులు చెరుగుతున్నాడు. కన్నులు తప్ప అతని శరీరం అంతా స్తంభించిపోయింది. ఆ కన్నులలో తీవ్రమైన అశాంతి, తుఫాను చెలరేగుతున్నాయి. అతనిముఖంలో చెరగని వికృత హాసం గోచరిస్తున్నది.

జిప్సీ నృత్యం చేస్తూ చిటికెనవేలిపై తంబుర నిలిపి చుట్టూ తిరుగుతోంది. మధ్యమధ్య తంబుర నెగరవేసి మళ్లీ చిటికెనవేలితోనే అందుకుని నిలబెడుతోంది. ఆమె చుట్టూ గుంపు వృద్ధవుతోంది. మధ్య మధ్య ఒకవ్యక్తివచ్చి జనాన్ని గిరిదాటకుండా అరికట్టుతున్నాడు. అతను పసుపుపచ్చ, ఎరుపురంగులుగల కోటు ధరించాడు. జనానికి ముందు ఒక చివర కుర్చీ వేసుకుని కూర్చున్నాడు. మేక అతని ఒడిలో తల ఉంచి జిప్సీని గమనిస్తోంది.

క్లాడ్‌ఫ్రోలో జిప్సీవంకా కుర్చీపై కూర్చున్న వ్యక్తివంకా చూశాడు. ఒక్కసారి కలలోనుంచి మేలుకున్నట్లు ఉలిక్కిపడ్డాడు. "ఎవరా వ్యక్తి? ఆమె ఎప్పుడూ ఒంటరిగానే వచ్చేది!" అనుకున్నాడు.

గబగబ డాబా దాటి మెట్లు దిగి వీధిలోకి వచ్చాడు. చర్చి ద్వారం దాటి కొద్ది అడుగులు రాగానే వెనక్కి తిరిగిచూశాడు. గోపురం క్రిందిభాగంలో ఒక వికృతశిల్పంవద్ద కూర్చుని గుంపువైపు చూస్తున్న క్వాసిమోడో కనపడ్డాడు. క్వాసిమోడో తన పెంపుడు తండ్రిని చూడనేలేదు. "ఎంత చిత్రం!" అనుకున్నాడు క్లాడ్‌ఫ్రోలో. "వీడూ ఆమెనే చూస్తున్నాడు కాబోలు" అని ఊహించాడు.

వీధిలోకి వచ్చి గుంపులో చూసేసరికి అక్కడ జిప్సీ లేదు. "జిప్సీ ఏమయింది?" అని అక్కడ కొందరి నడిగాడు.

"ఆ యింట్లో ఎవరో పిల్చారు: అక్కడికి వెళ్ళింది" అని జవాబు వచ్చింది. ఆమె నృత్యం చేసినచోట తివాసీ ఉంది. జిప్సీ వెళ్ళిపోగానే రెండు రంగులకోటు ధరించిన వ్యక్తి అక్కడ తన వంతు వినోదం ప్రదర్శిస్తున్నాడు. నడుముపై చేతులుంచి, తల వెనక్కు వంచి, పళ్ల మధ్య కుర్చీ నిలబెట్టి జనం మధ్య తివాసీ

చుట్టూ తిరుగుతున్నాడు. హఠాత్తుగా ఒక ఇంట్లో ఎరువు తెచ్చిన పెంపుడు పిల్లిని కుర్చీచివర కట్టివేశాడు. భయంతో పిల్లి పళ్ళు బైటపెట్టి అరుస్తోంది.

అతన్ని చూడగానే క్లాడ్ ఫ్రొలో ఆశ్చర్యచకితుడైనాడు. "ఓయి దేవుడా! ఇదేం పని చేస్తున్నావు కవి!" అన్నాడు బిగ్గరగా.

ఫ్రొలో కంఠస్వరం విని గ్రింగోర్ తడబడ్డాడు. పిల్లితో సహా కుర్చీ పక్కనున్న జనం పైన పడిపోయింది. కవికి దేహశుద్ధి కావలసిందే; కాని ఫ్రొలో చేసంజ్ఞ చూసి, జనం చేతికి చిక్కకుండా తప్పించుకుని చర్చివంక పరుగెత్తాడు.

ఫ్రొలో వెంట చర్చి ప్రవేశించాడు గ్రింగోర్. చర్చి లోపల చీకటిగా ఉంది. ఆ చీకటిలో అక్కడక్కడ గుడ్డిదీపాలు మినుకు మినుకు మంటున్నాయి. మందిరంలోకి అడుగుపెట్టగానే ఫ్రొలో ఆగిపోయాడు. గిరుక్కున వెనక్కు తిరిగి గ్రింగోర్ వంక తీక్షణంగా చూశాడు. "ఇటురా గ్రింగోర్" అని పిలిచాడు. గ్రింగోర్ దగ్గరకు వెళ్లాడు. "రెండు మాసాలనించే మైనావు నువ్వు? ఇప్పుడీ దుస్తులేమిటి? వీధుల్లో ఈ వినోదమేమిటి?"

"ఏం చెప్పమంటారు?" అన్నాడు గ్రింగోర్ దీనంగా? "నేనీ దుస్తుల్లో ఇలా తిరగడం చాల విచారకరమైన విషయమే. నావంటి తత్వవేత్త, కవి, పోలీసులు వెంటబడి తరిమితే పారిపోవలసిన స్థితి రావడం నా ప్రారబ్ధం. కాని ఏం చెయ్యాను మీరే చెప్పండి? నా పాతకోటు పేలికలై నన్ను విడిచి పోయింది. పూర్వం ఒక గ్రీక్ తత్వవేత్త కోరుకున్నట్లు, మనుష్యులు దిగంబరులై తిరిగేటంతవరకూ నాగరికత అభివృద్ధికాలేదింకా. జనవరిలో చలి ఎంత బాధపెట్టిందో మీకు తెలుసు. అప్పుడే ఈ కోటు దొరికింది. తీసుకున్నాను. ఇంక నా ఒంటి నంటిపెట్టుకుని ఉండడాని కిష్టపడని నా పాత నల్లకోటు తీసి పారేశాను. ఇల్లా వచ్చింది నా ఒంటిమీదికి రెండురంగుల కోటు. ఇది సూర్యునికి గ్రహణం పటినట్లున్నమాట నిజమే. కాని ఏం చేస్తాం? కర్మ! పురాణంలో సూర్యభగవానుడైన ఎపోలో పందులు కాసుకుని కొంతకాలం బ్రతకవలసి వచ్చిందట."

"చివరికి మహా దోషప్రవృత్తి అవలంబించావ్."

"వీధిలో కుర్చీలమీద పిలుల్ని మొయ్యడం కంటె కవిత్వం కట్టడం, తత్వజిజ్ఞాస మేలేనని నేనూ ఒప్పుకుంటాను! అందు వల్లనే మీ గొంతుక వినేసరికి నేను తిలకించుకుపోయాను. నా ముఖం చూపడానికి సిగ్గుపడ్డాను. కాని ఇంకేం చెయ్య మంటారో మీరే చెప్పండి. మనిషైనవాడు గోజా పాటించుకో వాలికదా! కడుపు కాలుతున్నవాడికి మధుర ఛందస్సుకంటె కొయ్య రొట్టె రుచిగా ఉంటుంది. మీరే ఆలోచించండి. నే నెంత గొప్ప నాటకం రాశాను! కాని అగోజున విన్నవాళ్లెవరు, చూసినవా ళ్లెవరు? ఆకలితో మండిచావడానికి సిద్ధంగా ఉన్నప్పుడు నావంటి బలిమి నాకు గుర్తుకువచ్చింది. పళ్లతో కుర్చీలు నిలబెట్టి బువ్వ సంపాదించుకో, అని చెప్పుకున్నాను. బికారులు, ముష్టివాళ్ళు నాకు మిత్రులైనారు. ఇటువంటివి డజను యుక్తులు నేర్పారు. ఈ పళ్లే నాకు రొట్టె సంపాదించిపెట్టి, రాత్రికి నమిలేస్తాయి. నావంటి ప్రజ్ఞకలవాడికీ వృత్తి నీచమైనదని తెలుసును. నాకున్న ప్రజ్ఞ కిది వృత్తికాదని తెలుసును. కాని జీవనోపాధి ఆర్జించు కోవాలికదా!"

క్లాడ్ ఫ్రాంలో మౌనంగా విన్నాడు. కనికల్లలోకి సూటిగా చూశాడు. "కాని ఈ జిప్సీన ర్తకితో కలిసి తిరగడం ఎలా సంభవించింది?"

"అదీ దైవవిలాసమే! ఆమె నా భార్య."

అకస్మాత్తుగా ఫ్రాలోకన్నులలో నిప్పులు కురిశాయి. "ఓరి దౌర్భాగ్యుడా! ఇది నిజమా?" అంటూ గ్రింగైర్ జబ్బ పట్టు కుని గట్టిగా ఊపాడు: "దైవభీతి పూర్తిగా మర్చిపోయావా! దీన్నెలా పెళ్ళిచేసుకున్నావు?"

"క్షమించండి" అన్నాడు గ్రింగైర్ వొణికిపోతూ. "దేవుని సాక్షిగా ప్రమాణంచేసి చెప్తున్నాను. నేనామెకు పరాయి వాణ్నే. ఆమె నన్ను దరి చేరనివ్వదు."

"మరైతే భర్త నంటావేం?"

గ్రింగైర్ బికారుల మధ్య తనకు జరిగినదంతా సంక్షేపంగా నివేదించాడు. ఓటికూజా బద్దలుకొట్టి చేసుకున్న వివాహం తంతు తెలియచెప్పాడు. ఆతరవాత ఆమెతో తాను గడుపుతున్న జీవితం గురించి వివరించాడు. "పరిస్థితులు సహించడం కష్టమే. కాని

ఆమెకి మూఢ నమ్మకాలు కలిగించారా దుర్మార్గులు" అన్నాడు.

"అంటే?"

"సరిగ్గా విశదీకరించి చెప్పడం కష్టం. అనేక మూఢనమ్మకం. నా భార్యను చిన్నతనంలో తల్లిదండ్రులు వదిలేస్తే, వాళ్ళకు దొరికిందని జిప్సీల నాయకుడు చెప్పాడు. ఆమె మెడలో ఒక తాయెత్తుందట. దాని బలంవల్లనే చివరికామె తల్లిదండ్రుల దగ్గరకు చేరగలదంటాడు. అయితే ఆమె శీలం నిలుపుకుంటేనే తాయెత్తు పని చేస్తుందట; లేకపోతే పని చెయ్యదని ఆమెకి నూరి పోశారు."

క్లాడ్ ఫ్రాలో ముఖం కొంత తేటపడింది దిప్పటికి. "అయితే ఇంతవరకూ ఆమె శీలానికి భంగం కలగలేదంటావా గ్రింగర్?"

"మూఢనమ్మకం ముందు మనిషైనవా డెలా నిలవగలడు? ఆమె కది గట్టి నమ్మకం. జిప్సీలలో ఇటువంటి దెన్నడూ వినలేదు. కాని ఆమె సంగతి వేరు. ఆమెకి మూడు విధాల రక్షణ ఉంది: జిప్సీలనాయకుడు ఆమెని తన ప్రాణంగా చూసుకుని కాపాడు తాడు; జిప్సీలందరికీ ఆమె దేవతై కూర్చుంది; నగరంలో అధికారుల శాసనాలున్నా లెక్కపెట్టకుండా ఎక్కడో ఒక చిన్న కత్తి, మహా పదునైనది దాచుకుంటుంది. ఆమె భుజంపైన చెయ్యివేస్తే చాలు, ఛఁగున చేతిలోకి కత్తి వచ్చిఉంటుంది. ఆమె సాహసం ఇంతా అంతా కాదు."

తరవాత ఎమరాల్డాగురించి ఫ్రాలో సర్వం అతన్నడిగి తెలుసుకున్నాడు. ఆమె అమాయకత్వం, శీల సంరక్షణ, స్నేహశీలం అన్నీ తనకు తెలిసినదంతా కవి చెప్పాడు. ఆమె చాల దేశాలు తిరిగింది. అనేకభాషల్లో పాటలు నేర్చింది—వాని అర్థం తెలియక పోయినా. బికారులందరూ ఆమెను దేవతగా కొల్చుకుంటారు.

ఆమెకి పారిస్‌లో ఇద్దరే శత్రువులున్నారని చెప్తుంది. రోలండ్స్ టవర్‌లో సమాధిలోఉన్న ముసలిది ఆమెను చూసి నప్పుడెల్లా తిట్టి శాపనార్థాలు పెడుతుంది. ముసలిదానినిగురించి తల్చుకుంటే ఎమరాల్డా భయంతో కంపించిపోతుంది. రెండో శత్రువొక మతాధికారి. ఆయన చూపులనుంచి తప్పించు కోడానికి ఎమరాల్డా పారిపోతూ ఉంటుంది.

ఆఖరి మాటవినగానే ఫ్రాలో ఉలిక్కిపడ్డాడు. గ్రింగర్ ఇది గమనించలేదు. రెండుమాసాలక్రిందట ఆరోజురాత్రి క్వాసి

మోడ్లో ప్రక్కన ఫ్రొలో కూడా ఉన్నాడన్న సంగతి గ్రింగైర్ మరచిపోయాడు.

ఈ యిద్దరు శత్రువులకీ తప్ప ఎమరాల్డా ఇంక ఈ లోకంలో ఎవరికీ జంకదు. మిగిలిన జిప్సీ స్త్రీలమాదిరిగా జోస్యం చెప్పదు. అందువల్ల పోలీసుల చేతికి చిక్కిపోగలదనే భయంలేదు. అదిగాక అన్నలాగా గ్రింగైర్ కూడా ఉంటూ ఆమెని రక్షిస్తూ ఉంటాడు. ఆమెవల్ల భర్త పొందదగిన సౌఖ్యం తనకు లేకపోయినా, తలదాచుకోడానికి ఆశ్రయమూ ఆహారమూ గ్రింగైర్‌కి లభిస్తున్నాయి. రోజూ ఉదయం ఆమెతో కలిసి బికారుల బసనించి వస్తాడు. వీధులలో ఆమె నృత్యం చేస్తున్నప్పుడు వచ్చే కాసులు అతనే పోగుచేస్తాడు. రాత్రికి ఇద్దరూ కలిసి ఇంటికి వస్తారు. ఆమె తనగదిలో గడియవేసుకొని పడుకొంటుంది. గ్రింగైర్ తన గదిలో తాను సుఖంగా నిద్రపోతాడు. మొత్తానికి గ్రింగైర్ జీవితం సాఫీగా గడిచిపోతోంది. ఎమరాల్డాపట్ల అతనికి వ్యామోహం లేకపోలేదు. మేకఅంటే అతనికీ ప్రాణమే. ఆ మేక చాలా తెలివైనది. దానికీ ప్రజ్ఞలున్నాయి. మంత్రకత్తెలవద్ద ఉండే జంతువులకు సైతాన్ ఆవేశించి ఉండవచ్చు. కాని డాలీ అటువంటిదికాదు. దానికి తంత్రాలు తెలియవు. స్వంత ప్రజ్ఞే దానికి ప్రధానం.

ఇవన్నీ గ్రింగైర్ చెప్పుకుపోతుంటే ఫ్రొలో అతి శ్రద్ధగా విన్నాడు. మేకనిగురించి ప్రశ్నించాడు. మేకకి ఎమరాల్డా నేర్పిన తెలివి తప్ప మరేమీ తెలియదని గ్రింగైర్ ప్రమాణంచేసి చెప్పాడు. "దానికి తెలిసిందల్లా ఒక్కటే. అక్షరాలు ఒకచోట ఉంచితే, వాటితో 'ఫీబస్' అనేమాట కూర్చగలదు" అని చెప్పాడు.

"ఫీబస్! ఆ పేరెల్లా వచ్చింది?" అని అడిగాడు ఫ్రొలో.

"భగవంతుడికి తెలియాలి. ఆ మాటలో ఏదో మహత్తున్నదని ఎమరాల్డా ఊహించిందేమో! ఒంటరిగా ఉన్నప్పుడు ఆ మాటే పలవరిస్తూ ఉంటుంది" అని చెప్పాడు గ్రింగైర్.

"అది ఒట్టి మాటేనా? ఎవరిదైనా పేరా? నీకు రూఢిగా తెలుసా?"

"పేరా? ఎవరి పేరు?"

"ఏమో! నాకేం తెలుస్తుంది?" అన్నాడు ఫ్రాలో నిస్పృహతో.

"నే నూహిస్తున్నది చెప్తాను" అన్నాడు గ్రింగైర్. "జిప్సీలు కొందరు సూర్యుణ్ని ఆరాధిస్తారు."

"ఏమో! నే నల్లా అనుకోను."

"ఏదైనా నాకొకటే. నాకెందుకు మధ్య? ఆమె ఇష్టం వచ్చినట్టు పలవరించ నివ్వండి. ఒకటి మాత్రం రూఢి; డాలీ! ఆమె ఎంతో నేనూ అంతే."

"డాలీ అంటే?"

"మేక!"

కొంతసేపు ఫ్రాలో ఆలోచించాడు. హఠాత్తుగా గ్రింగైర్ వంక తిరిగి ఇలా అన్నాడు "ఆమె నెన్నడూ తాకనైనా లేదని నువ్వు ప్రమాణం చేస్తావా?"

"ఏమిటి? మేకనా?"

"అబ్బ! అది కాదు, ఆ యువతిని."

"ఓ! నా భార్య సంగతా! తప్పకుండా ప్రమాణం చెయ్యగలను."

"తరుచు ఆమెతో నువ్వు ఏకాంతంలో ఉంటున్నావుగా?"

"ప్రతిరోజూ. రాత్రివేళ ఒక గంటసేపు మాట్లాడుకుంటాం."

ఫ్రాలో కనుబొమలు ముడిచాడు. "బైబిల్ ముట్టుకుని ప్రమాణం చెయ్యగలవా?"

"బైబిలేమిటి? ఏది ముట్టుకుని ప్రమాణం చెయ్యమన్నా చేస్తాను. ఆమె కాగడిగోడ అంటే ఎంతో, నేనంత! నన్ను కన్నెత్తయినా చూడదు. అయితే నేనొక టడుగుతాను చెప్పండి. మీకు దీనితో ప్రమేయమేమిటి? నేనామెను తాకడం తాకపోవడం మీకేం పనికొస్తుంది?"

ఫ్రాలో ముఖం ఎర్రబడింది. కొంచెం తికమకపడి ఇలా అన్నాడు: "ఇటు విను గ్రింగైర్. నువ్వు పూర్తిగా పతితుడివై పోలేదు. నిన్ను గురించే నా బెంగ. నువ్వామెను ఒక్కసారి తాకినట్లయితే చాలు, నువ్వింక ఎందుకూ పనికిరాకుండా నాశనమై పోతావు. అంతే. ఇంక వెళ్ళు."

కాని అతని కళ్ళలో ఏదో భీభత్సం గోచరించింది గ్రింగైర్‌కి. వెనక్కి చూసూ నే వెళ్ళిపోయాడు గ్రింగైర్. గ్రాలో తడబడుతున్న అడుగులతో మెట్లెక్కాడు.

## 21

మార్చి నెలాఖరులో ఒకరోజు ఉదయం జెహాన్ ఫ్రాలో జేబు తడువుకున్నాడు. జేబులో గలగల వినరాలేదు. ఇలా అనుకున్నాడు. "చిల్లిగవ్వకూడా లేదు. కాంత, మద్యం, ద్యూతం కుబ్రుపని కనకాన్ని హరించి వేస్తున్నాయి"

అతనికి చింత కలిగింది. లోపీ సర్దుకున్నాడు. తడివి చూసుకున్నాడు. ముందు వెనుకలు తొంగిచూసినాయి. సరిగా పెట్టుకున్నాడు. ఏదో ఆలోచన తట్టింది. అలా నిలబడి ఆలోచించాడు. లాభం లేదనుకున్నాడు. గుస్తులు సరిచేసుకున్నాడు మళ్ళీ అదే ఆలోచన హెచ్చరించింది. "ఇంక లాభం లేదు. అన్న దగ్గరకు వెళ్లాలి. నన్ను కూర్చోబెట్టి ఉపన్యాసమిస్తాడు. ఇవ్వనీ; చివరికి చేతిలో కాసుపడుతుంది" అనుకున్నాడు. విసురుగా గదిదాటి నడిచాడు. పారిస్ వీధులలో చకచక నడక సాగించాడు. అప్పుడప్పుడు ప్రక్కలకు చూస్తున్నాడు. అంగళ్ళలో, హోటళ్ళలో తినుబండారాలు నోరూరిస్తున్నాయి. నిట్టూర్పు విడిచి వేగంగా నడిచాడు.

నాటర్ డామ్ చర్చి ప్రాంగణంలోకి వచ్చి నిలబడ్డాడు. క్షణంసేపు చర్చి గోపురాలవంక చూశాడు. మొదట సందేహించాడు. కొంతసేపు అక్కడే అటూ ఇటూ పచారు తిరిగాడు. "కూర్చోబెట్టి పాఠం చెప్తాడు. ఇంతేకదా! కానీ" అనుకున్నాడు చివరికి. ఒక పరిచారకుడు కనిపించాడు. "అన్న ఎక్కడున్నాడు?" అని అడిగాడు.

"ఆయన రహస్యమందిరంలో. మహారాజు కబురంపినా కదిలిరారిప్పుడు. అక్కడికి వెళ్ళకండి."

"ఆ! ఆ రహస్యమందిరంలో ఏముందో చూడాలి" అన్నాడు, చిటిక వేసి.

లోనికి ప్రవేశించి గోపురం మెట్లెక్కాడు. "గదిలో మంటలవెలుగు కనపడుతుందంటారు; తంత్రప్రయోగాలు చేస్తు

వాన్నాడంటారు. ఇంతా చేస్తే ఆమ్లెట్ వేయించుకుంటున్నా డేమో!"

గదితలుపు తాళం తీసివుంది. మెల్లిగా తలుపు నెట్టాడు. చప్పుడు లేకుండా తెరుచుకుంది. గదిలోకి తొంగిచూశాడు. అంధకారకూపంలా వుంది. గదిమధ్యలో పెద్ద మేజా ఒకటుంది. ప్రక్కన కుర్చీ. మేజాపైన రసాయన శాస్త్రపరిశోధన కుపకరించే సీసాలు, ఆర్పిన స్పిరిట్ దీపాలున్నాయి. గదిపైకప్పునుంచి జంతువుల అస్థిపంజరాలు కొన్ని వేలాడుతున్నాయి. నేలపై చెదరువాటుగా రంగురంగుల ద్రావకాలున్న గాజుపాత్రలున్నాయి. తెరిచిన పెద్ద పెద్దగ్రంథాల పైపుట లెగురకుండా కపాలాలు, ఎముకలు ఒత్తుపెట్టి ఉన్నాయి. అన్నిటినిండా దుమ్ము పేరుకుని ఉంది. గది అంతా సాలెగూళ్ళు, బూజుతో నిండిఉంది. కుర్చీలో కూర్చున్న వ్యక్తి మేజాపైకి వొంగి ఏదో చూస్తున్నాడు. జెహాన్‌కి అతని వీపు మాత్రం కనబడినా, అన్నను గుర్తించాడు.

తలుపు తెరిచిన సద్దు వినపడలేదు. క్లాడ్ ఫ్రాలో తమ్ముని రాక గమనించలేదు. జెహాన్ కొంతసేపు గది నలుమూలలా కలయ చూశాడు. కుర్చీకి ఎడమప్రక్క కిటికీకి దిగువగా కొలిమి ఒకటి కనపడింది. కొలిమిపైన రకరకాల పాత్రలున్నాయి, కాని నిప్పు ఆరిపోయింది. ప్రమాదకరమైన ద్రవ్యాలతో పనిచెయ్యవలసిప్పుడు ముఖాచ్ఛాదనకు పనికివచ్చే గాజుఫలకం గోడ కొకమూల దుమ్ము కొట్టుకు పడిఉంది. అక్కడక్కడ గోడలపై ఏవో లాటిన్, గ్రీక్ మంత్ర వాక్యాలు వ్రాసిన అట్టముక్క లున్నాయి. మొత్తానికి గదంతా చూస్తే క్లాడ్ ఫ్రాలో తన రహస్యప్రయోగాలు కొన్నాళ్ళుగా మానివేశాడని తెలుస్తుంది. ప్రస్తుతం అతడొక పెద్దగ్రంథం ముందుపెట్టుకుని చదువుతూ తనలో తనేదో గొణుగుతున్నాడు. "బంగారం! బంగారం! సూర్యుడు అగ్నిలోనుండి పుట్టాడు. చంద్రుడు సూర్యుని పుత్రుడు. విశ్వాత్మ అగ్ని అంటాడు జోరోస్టర్. అగ్ని అంశకు చెందిన పరమాణువులు విశ్వమంతటా వ్యాపించి ఉన్నాయి. ఇవే ఆకాశంలో సంచారం చేస్తూ ఒకదానిబాటలో మరొకటి కలుసుకున్నప్పుడు కాంతి జనిస్తోంది; భూమిపై కలుసుకున్నప్పుడు హిరణ్యం జనిస్తోంది. కాంతి, హిరణ్యం ఒకటేనని అతడి అభిప్రాయం! బాగుంది! అగ్నిలోనుంచి బంగారాన్నెలా తయారుచెయ్యడం? సూర్యకాంతిని ఒక పాత్రలో బంధించా

అన్నమాట! కార్డోవా మసీదులో ఒక స్తంభంకింద అలా బంధించి దాచారట. కాని ఎనిమిదివేల ఏళ్ళవరకూ అది తియ్యకూడదు. అబ్బ!"

"అబ్బా! ఒక్క కాసుకోసం ఎనిమిదివేల సంవత్సరాలే!" అనుకున్నాడు జెహాన్. క్లాడ్ ఫ్రాలో తన ధోరణిలోనే మాట్లాడుకు పోతున్నాడు.

"బంగారం ఎలా తయారుచెయ్యడం? మెజిస్ట్రి ఏమన్నాడు? కొందరు స్త్రీల పేర్లలో మంత్రశక్తి ఉంటుందిట. స్త్రీలను ఆదరిస్తే దేవుడు సంతోషిస్తాడట. వారి కాదరణలేని చోట దేవుణ్ని ప్రార్థించినా ప్రయోజనం శూన్యం. స్త్రీల పేర్లకు చివర దీర్ఘస్వరాలుండాలి. అవును అలావుంటే మధురంగా వుంటాయి. ఏమరాల్డా...అబ్బబ్బ! ఎప్పుడూ అదే ఆలోచన! ఎంత మరిచిపోవాలన్నా, రాకమానడంలేదే!" కోపంతో విసురుగా పుస్తకం మూసేశాడు. ముఖం ముడుచుకున్నాడు. తరవాత ఒక సుత్తీ మేకూ తీసుకున్నాడు: "కొన్ని రోజులనించి నా ప్రయోగాలన్నీ వ్యర్థమవుతున్నాయి. ఆమే మాటమాటికీ కళ్లకు కట్టినట్లుంటోంది. ఎన్ని మంత్రాలు ప్రయోగాలు తెలిస్తే ఏం ప్రయోజనం? అసలు మంత్రమే తెలియడంలేదు. మంత్రించబడిన ఈ సుత్తితో ఈ మేకుని కొట్టినట్లయితే శత్రువు తక్షణం నశించాలి, ఫీబస్! ఫీబస్! చచ్చిపో! నరకానికి పో" అంటూ మేకు పక్కగోడకానించి సుత్తితో కొట్టాడు. "సీలప్పురంగు నెరుసులొస్తే మంత్రం పారిందన్న మాటే" అనుకుంటూ సుత్తిదెబ్బలు కొట్టాడు. నెరుసులు రాలేదు. "ఛీ" అని సుత్తిని నేలకు విసిరికొట్టాడు. నిస్పృహతో కుర్చీలో కూలబడ్డాడు. కూలబడి మేజాపై గ్రంథం తీసి తేరి పారచూశాడు. హఠాత్తుగా ఏదో మాటదొరికింది. గబగబా గొణుక్కుంటూ లేచి సుత్తి, మేకు అందుకుని కొట్టసాగాడు.

"అయ్యయ్యో! అన్నకి వెర్రెత్తినట్టుంది!" అనుకున్నాడు జెహాన్.

క్లాడ్ ఫ్రాలో తిరిగివచ్చి కుర్చీలో కూలబడ్డాడు. రెండు చేతులలో తలపట్టుకుని కూర్చున్నాడు. మనస్సుకి కళ్లెంవెయ్య నవసరంలేక, స్వేచ్ఛావృత్తి కలవాటుపడిన తమ్ముడికి, బలవంతాన అణగద్రొక్కబడిన వాంఛలు బలీయమైనప్పుడు సంభవించే భీభత్సం

ఎలావుంటుందో తెలియదు. అన్న హృదయంలో అగ్నిపర్వతాలు బ్రద్దలౌతున్నట్లు అతనికి తెలియదు.

ఈ పరిస్థితిలో అన్నను చూడ్డం భావ్యం కాదని జెహాన్ భావించాడు. మెల్లిగా తలుపు మూసి చప్పుడుకాకుండా ఎత్తెత్తి అడుగులు వేస్తూ కొద్దిదూరం వెళ్లాడు. తరవాత గట్టిగా అడుగులు చప్పుడు చేసుకుంటూ తలుపువద్దకు వచ్చాడు. ఇది విని క్లాడ్ ఫ్రాలో పిలిచాడు "రండి! లోపలికి రండి! మీకోసమే చూస్తున్నాను, మాస్టర్ జాక్."

జెహాన్ లోపలి కడుగుపెట్టాడు. అతన్ని చూసి క్లాడ్ ఉలిక్కిపడ్డాడు. "నువ్వా జెహాన్!" అన్నాడు.

"జెహాన్ అయితేం, జాక్ అయితేం? అంతా ఒకటే పేరులో కొద్దితేడా. అంతే"

"ఎందుకొచ్చి నట్టిక్కడికి?"

తమ్ముని ముఖంలో వినయం, విధేయత, పశ్చాత్తాపం ఉట్టిపడుతున్నాయి.

"నిన్ను ఒక విషయం అడగాలని..."

"ఏమిటది?"

"ఏం లేదు...సలహా..." డబ్బు కావాలని అనలేకపోయాడు జెహాన్.

"నువ్వంటే నాకు అసహ్యం కలుగుతోంది."

తమ్ముడు నిట్టూర్పు విడిచాడు.

క్లాడ్ ద్వారంవైపుకు తిరిగి తమ్మునివంక తీక్షణంగా చూశాడు. "నీతో మాట్లాడాలి" అన్నాడు.

దీని అర్థం తమ్మునికి తెలుసు. రాగలదానికి సిద్ధపడి నిలబడ్డాడు.

"రోజు రోజుకీ నీ దుష్ప్రవర్తనగురించి నాకు ఫిర్యాదులు వస్తున్నాయి. ఎవరినో కొట్టావుట గా? ఎందుకు?"

"ఓ! అదా! అధికారి కొడుకునని ధీమాతో వాడు గుర్ర మెక్కి బురదలో పరిగెత్తించి అందరిపైనా బురద చిమ్ముతున్నాడు."

"పౌరుషం ఉంది కాని చదువు అంటలేదు."

"అన్నయ్యా! ఫీబస్ అంటే ఎవరు?"

క్లాడ్ స్తంభించిపోయాడు. తరవాత ఆలోచనలో పడ్డాడు. అతని ముఖం పాలిపోయింది. డబ్బు పెగడానికి ఇదే చక్కని అదను అనుకున్నాడు జెహాన్. అతి వినయంతో మృదువుగా ఇలా అన్నాడు. "ఏవో ఎవరో తెచ్చి. ఫిర్యాదులికి నామైన కోసం తెచ్చుకుంటావా అన్నా? వాళ్ళు దుంపెగులు. వాళ్లతో తలపడటం ఎలా వీలౌతుంది నాకు?"

క్లాడ్ ముఖం ముడితలు పడింది" ఏం కావాలో అడిగే సెయ్యరాదూ?" అన్నాడు.

"ఏముంది?" అన్నాడు జెహాన్. అతని కీమాటు ధైర్యం వచ్చింది "కొంచెం డబ్బు కావాలి"

"మన ఎస్టేట్లమీదా, ఇళ్ళమీదా రాబడి సగం తగ్గిందని తెలుసా?"

"కొంచెం డబ్బు కావాలి."

"మనం చెల్లించవలసిన పన్నులు హెచ్చించారు."

"కొంచెం కావాలి."

"ఏం చేస్తావు, డబ్బు తీసుకుని?"

జెహాన్‌కి ఆశ కలిగింది. "పాడుచెయ్యడానికి కాదు; సద్వినియోగంకోసమే. నా స్నేహితులిద్దరున్నారు. వాళ్లొక పేదసంసారంలో చంటిపిల్లకి వస్త్రదానం చేస్తున్నారు. నేనూ దానం చెయ్యాలని కోరిక కలిగింది."

"నమ్మదగిన్లే ఉంది నీ కథ! సిగ్గులేదూ అబద్ధాలు చెప్పడానికి?"

"ఫీబస్..."

క్లాడ్ నిశ్చేష్టుడైనాడు. ఈమాటతో అతనికి కోపం కూడా వచ్చింది.

"ఛీ! ఫో నాముందునించి" అని అరిచాడు.

"పోనీ తిండికేనా కొద్దిగా ఇయ్యి."

"ధర్మశాస్త్రం ఎంతవరకూ కంఠోపాఠం చేశావు?"

"వ్రాసినంతమటుకు కాగితాలు పోయినాయి."

"లాటిన్ సారస్వత సంగ్రహం?"

"పుస్తకం ఎవరో దొంగిలించారు."

"తత్వశాస్త్రం?"

"మతాన్ని అధిక్షేపించే తత్వశాస్త్రం నాకు నచ్చదు."

"బలుపైవంచి పని చెయ్యాని వాడికి తిండి లేదు"

జెహాన్ క్షణం ఆలోచించాడు. తరవాత చేతులలో ముఖం కప్పుకుని ఏడుస్తున్నట్లు నటించాడు.

"అదేమిటి? నీ నటన ఇంక చాలించు"

జెహాన్ చేతులు తీసేసి అన్నవంక జాలిగా చూశాడు. "పోనీ నా దుస్తులవంక చూడు. చిరిగిపోడానికి సిద్ధంగా ఉన్నాయి."

"దుస్తులు మంచివి కుట్టిస్తాను, కాని డబ్బివ్వను."

"పోనీ ఆ క్కట్టే అక్కర్లేదు. కొద్దిగానే ఇయ్యి. నువ్వు చదవ మన్నవన్నీ చదువుతాను. నేనాకలితో చచ్చిపోతే చూస్తూ ఊరు కుంటావా?"

క్లాడ్ మాట్లాడలేదు. జెహాన్ ఈమాటు తెగించాడు.

"పోనీలే. ఇంక జూదానికే వెళతాను. తాగుతాను."

"జెహాన్! చెడిపోతున్నావు సుమా! చివరికి కొరతెక్కు తావు."

"పోనీ, అదీ మంచిదే."

"చివరికి నీకు ఉరికూడా తప్పదు."

"ఉరి అంటే—ఒక చివరమనిషీ, మరొక చివరలోకం.— మనిషిగా చావడం మేలు."

"నరకం పాలౌతావు."

ఇంతలో ఎవరివో అడుగుల చప్పుడు వినవచ్చింది.

"ఆగు. మాస్టర్ జాక్ వస్తున్నాడు. ఆ కొలిమిచాటుని దాక్కో. ఇక్కడ వినేదీ చూసేదీ ఎవ్వరిదగ్గరా చెప్పకూడదు సుమా!"

జెహాన్ కొలిమిచాటున దాక్కున్నాడు. వెంటనే అతని కొక ఉపాయం తట్టింది. "నేను ఊపిరైనా విడవకుండా నిశ్శబ్దంగా ఉండాలంటే, ఒక్క కాసియ్యి" అన్నాడు.

"అలాగే ఇస్తాను, కూచో."

"ఇప్పుడే ఇవ్వాలి."

"తీసుకో" అంటూ కోపంతో విసిరాడు క్లాడ్. అది అందుకుని కొలిమిచాటున దాగాడు జెహాన్.

కొత్తగావచ్చిన ఆగంతుకుడు నిలువెల్లా నల్లని దుస్తులు ధరించాడు. జెహాన్ కొలిమిచాటునుండి అతన్ని కనిపెట్టిచూశాడు.

అతని వయస్సు 60 దాపుల్లో ఉంటుంది. కనుబొమలు కూడా నెరిసిపోయాయి. పెద్ద పెద్ద చేతులున్నాయి. క్లాడ్ ద్వారంవద్ద ఒక ముక్కాలిపీట చూపి కూర్చోమన్నాడు. కొంతసేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

"ఏమైంది? నీ ప్రయోగం ఫలించిందా జాక్ ?"

"విసంలేదు. ఊది ఊది శోషవచ్చింది. అంతా బూడిదే కాని అణువంత బంగారం రాలేదు."

క్లాడ్ కలవరపడ్డాడు: "అది కాదు నే నడుగుతున్నది. ఆ గారడీవాడిసంగతి. ఏమైనా చెప్పాడా? నేరం ఒప్పుకున్నాడా?"

"లేదండి. చితక పొడిచేశాం, కాని ఒక్క మాట చెప్పలేదు. వాడి కీళ్లన్నీ స్వాధీనం తప్పాయి. అయినా ఇంకా మా ప్రయత్నం మానలేదు. గట్టివాడు. ఆశ్చర్యంగానే ఉంది!"

"వాడి ఇంట్లో ఏం దొరకలేదా?"

"ఇదుగో, ఇదొక పత్రం దొరికింది. ఇందులో ఏదో రాసివుంది కాని మాకు తెలియలేదు."

"ఇలా తే" అని క్లాడ్ పత్రం అందుకుని విప్పిచూశాడు. "పిచ్చికుక్క కరిస్తే చదవవలసిన మంత్రాలివి."

"ఇదుగో ఇంకోటి దొరికింది" అంటూ జాక్ ఒక పాత్ర అందించాడు.

"ఆ! ఇదీ మూస!"

"దీనితోకూడా ప్రయత్నంచేసి చూశానండి. కాని ఏం లాభంచలేదు."

"లాభం లేదు. వాడు మోసకారి. వాడు బంగారం తయారు చెయ్యలేడు. జాక్! నువ్వు నగరంలో ఒక అధికారివి.. వాణ్ని శిక్షించడం నీవిధి."

"తప్పకుండా. అయితే ఆ జిప్సీని ఎప్పుడు పట్టుకోమంటారో చెప్పండి. మరిచిపోయాను."

"జిప్సీ ఎవరు?"

"రోజూ పారిస్‌లో నృత్యంచేస్తూ వీధుల్లో తిరుగుతుంది. కూడా ఒక మేక ఉంటుంది. అది మంత్రకత్తె అని నిరూపించడానికి సాక్ష్యం సేకరిస్తున్నాం. కాని అంత చక్కనిదాన్నింత వరకూ నాకళ్ళతో చూడలేదండి. ఎప్పుడు పట్టుకోమంటారు?"

క్లాడ్ ముఖం పాలిపోయింది. "సమయం వచ్చినప్పుడు చెప్తాను. ఇప్పుడు కాదు."

క్లాడ్ చూపులు కొలిమి ప్రక్క సాలెగూడుపై ఉన్నట్లు జాక్ గమనించాడు. జాక్ అటువంక చూశాడు. అప్పుడే ఒక ఈగ సాలెగూడులో చిక్కుకుంది. గూడు కదలగానే పెద్ద సాలె పురుగు మేలుకుంది ఒక్క దుముకుతో ఈగ పైబడింది. తొండంతో తల పొడుస్తూ, ముందు రెండు కాళ్ళ మధ్య తన దారంతో చుట్టివెయ్యడం మొదలుపెట్టింది. జాక్ ఇది చూసి ఒక్క ఉదుటున లేచాడు. సాలెగూడువైపు చెయ్యి చాపాడు.

"ఆగు జాక్! ఆగు! విధివిహితమైనదానికి అడ్డుపడకు" అన్నాడు క్లాడ్. జాక్ తెల్లబోయి మతాధికారివంక చూశాడు. క్లాడ్ దృష్టి సాలెగూడుపై కేంద్రీకరించాడు.

"ప్రస్తుత పరిస్థితి కిది సంకేతమనిపిస్తోంది. ఉల్లాసంతో ఎగిరెగిరి గాలి వెలుగులకోసం వెతికివచ్చింది ఈగ. స్వేచ్ఛకోసం వచ్చి ఈ మృత్యుగహ్వరంలో చిక్కుకుంది. పాపం! ఎమరాల్డా! విధికి అడ్డుపడకూడదు జాక్! సాలెపురుగు నేం చెయ్యకు, వొదిలి పెట్టు."

"అది పోనివ్వండి. బంగారం తయారుచెయ్యడానికి మీ సహాయం కావాలి, నా ప్రయత్నాలన్నీ వ్యర్థమైనాయి."

ఇంతలో కొలిమి ప్రక్క సద్దువినవచ్చింది. "అదేమిటి?" అన్నాడు జాక్ భయంతో.

"ఏమీ లేదు. పిల్లి. మనం కిందిగదిలోకి వెళ్ళి అక్కడ గ్రంథం చూద్దాం. నడవండి" అంటూ క్లాడ్ లేచాడు. ఇద్దరూ మెట్లు దిగి వెళ్ళారు. వెళ్ళగానే జెహాన్ కొలిమి చాటునుంచి ఇవతలకి వచ్చి దుస్తులు దులుపుకున్నాడు, "అబ్బ! పీడ విరగడైంది" అంటూనే తుమ్ము లారంభించాడు. "పిచ్చికుక్కలు. ఇంక చాలు" అంటూ గదినుంచి వెలువడ్డాడు. ఒకసారి ద్వారంవంక చూసి తలుపులు వెయ్యకుండా అలాగే ఉంచి "అంతే కావాలి, శాస్తి" అనుకున్నాడు. ఈలపాట పాడుకుంటూ వీధిలోకి వచ్చాడు. చర్చిముందు ద్వారంవద్ద క్లాడ్ తన మిత్రునితో కలిసి ఒక శిల్పం పరిశీలిస్తున్నాడు. జెహాన్ ఒకసారి వారివంక నిర్లక్ష్యంగా చూసి రెండడుగులు వేశాడు. వెనుకనుంచి పిలుపు వినవచ్చింది; చూశాడు. "అరె! ఫీబస్" అన్నాడు.

"జెహాన్! ఉండు" అన్నాడు ఫీబస్.

ఫీబస్ పేరు వినేసరికి క్లాడ్ తలతిప్పి చూశాడు. ఫీబస్ వంక తదేకదృష్టితో కొంతసేపు చూశాడు.

"జెహాన్! ఎక్కడికి?"

జెహాన్ ఈలవేశాడు. దాని అర్థం ఫీబస్‌కి తెలుసు.

"నా జేబు ఖాళీ" అన్నాడు ఫీబస్.

"నా దగ్గరుందిలే" అన్నాడు జెహాన్.

క్లాడ్ కొద్ది ముందుకువచ్చి ఫీబస్‌ని పరికించి చూశాడు.

"నమ్మకంలేదు" అన్నాడు ఫీబస్. "నీ జేబులో డబ్బుంటే, నీటితొట్టిలో చంద్రుడున్నమాట. నీ జేబులో డబ్బుండదు; గులకరాళ్ళుంటాయి. పందెం వేస్తాను."

జెహాన్ జేబులోనుంచి కాసుతీసి చూపించాడు.

"అరె! కాసు! కళ్ళు చెదిరిపోతున్నాయి" అన్నాడు ఫీబస్. "ఎవరిజేబు కత్తిరించావు రాత్రి?"

జెహాన్ తలెగరవేశాడు. "అన్న మూర్ఖుడు కావటం అదృష్టంలే" అన్నాడు.

"పద. పొట్టపట్టినంత తాగాలివాళ" అని దారితీశాడు ఫీబస్.

క్లాడ్‌కి ఈమాటలు వినపడుతూనే ఉన్నాయి. అతన్ని యువకులిద్దరూ గమనించలేదు. క్లాడ్ కొద్దిదూరంలో ఆ యిద్దరినీ అనుసరించాడు.

వీధిమలుపు తిరిగేచోట తంబుర వినపడింది.

"పద! గబగబా నడు!" అని ఫీబస్ తొందరపెట్టాడు.

"ఎందుకు?" అన్నాడు జెహాన్.

"ఆమె చూడకుండా తప్పించుకోవాలి!"

"ఎవరు?"

"జిప్సీ. మేకని వెంటబెట్టుకు తిరుగుతుంది, ఆమె."

"ఎమరాల్డాయేనా?"

"అవునవును, ఎప్పుడూ ఆమె పేరు మర్చిపోతూనే ఉంటాను. వీధిలో ఆమెతో మాట్లాడ్డం మంచిదికాదు."

"ఆమె నీకు బాగా తెలుసా?"

క్లాడ్ అతని ముఖవైఖరి గమనించాడు. ఫీబస్ చిరునవ్వు

నవ్వుతూ జెహాన్ చెవిలో ఏదో ఊదాడు. ఊది పకపక నవ్వడం మొదలు పెట్టాడు.

"నిజం?" అన్నాడు జెహాన్.

"నిజం!"

"ఈరాత్రే?"

"ఈ రాత్రే."

"ఆమె వస్తుందని నీకు నమ్మకమే?"

"తప్పకుండా వస్తుంది."

"కెప్టెన్ ఫీబస్! నీ అంతటి అదృష్టవంతుడు పారిస్‌లో లేడోయ్."

క్లాడ్ ఫ్రోలో ఈ సంభాషణలో ప్రతిఒక్క మాటా శ్రద్ధగా విన్నాడు. పళ్ళు పటపట కొరికాడు. అతని శరీరమంతా కంపించిపోయింది. ఒళ్లు తిరిగినట్లయింది. ఒకచోట ఒక స్తంభానికి చేరబడి నిలబడ్డాడు. కొంతసేపటిలో తేరుకుని మళ్ళీ యువకు లిద్దరినీ అనుసరించాడు.

## 22

యువకు లిద్దరూ కలిసి ఒక పానశాల ప్రవేశించారు. అప్పటికే దీపాలు పెట్టారు. పానశాలలో సందడి అధికమౌతోంది. త్రాగుబోతుల సోమరిపాటలు, గ్లాసులగలగలు వింటూ క్లాడ్ ఫ్రోలో ఆ యింటిముందు పచార్లు చెయ్యసాగాడు. నిలువెల్లా నల్లనికోటుంది. జేబులోనుంచి నల్లనిగుడ్డ ఒకటితీసి ముఖం కప్పుకుని వెనుక ముడి వేసుకున్నాడు. కళ్ళు కనపడ్డానికి ముందు రెండు రంధ్రాలున్నాయి. అప్పుడు ఆగి కిటికీలోనుంచి తొంగిచూస్తున్నాడు.

కొంతసేపటికి తలుపులు తెరుచుకున్నాయి, యువకులిద్దరూ తాగి తూలుతూ వీధిలోకి వచ్చారు. క్లాడ్ ఫ్రోలో ప్రక్కకు తప్పుకున్నాడు.

"ఏడుగంట లయిందోయ్! ఇంక వెళ్ళాలి నేను." అన్నాడు ఫీబస్.

"ఏమిటది? మా యిల్లా? నాకో యిల్లేమిటి?" అంటూ తడబడ్డాడు జెహాన్.

"అబ్బ! నామాట వినిపించుకోవేం? అంత తప్పు తాగావా?"

"ఏమిటి? ప్లాటో ఏమన్నాడు? వాడి మొహం వేటకుక్క మొహంలా ఉండేదిట!"

"అబ్బ. ఇహ విడికి నామాట వినపడదు." అని విసుక్కున్నాడు. ఇద్దరూ ఒకరికొకరు ఆనుకుని నడుస్తున్నారు. క్లాడ్ అలాగే వారు చూడకుండా వెంబడించాడు.

"అరె! నే నింక పోవాలి. నన్నొదలవోయ్. ఏడు కొట్టింది" అంటున్నాడు ఫీబస్.

"పో! నిన్నెవ్వడు పట్టుకున్నాడు?" అంటూ ఫీబస్ చేతిని గట్టిగా పట్టుకున్నాడు జెహాన్. "నా కళ్ళముందు తారకలు మెరుస్తున్నాయి..."

"అన్నట్టు, నీదగ్గర డబ్బేమైనా కొద్దిగా మిగిలిందా? అబ్బ! కొంచెం తెలివి తెచ్చుకోవోయ్" అంటూ గట్టిగా గుంజాడు ఫీబస్. జెహాన్ తూలి గోడపక్కకు పడిపోయాడు. ఫీబస్ అతన్ని జబ్బలు పట్టుకుని కొద్దిదూరంలో నాపరాయివద్దకు ఈడ్చుకుపోయాడు. అక్కడే అలా పడుకుని గుర్రుపెట్టడం మొదలుపెట్టాడు జెహాన్. విసుగుచెంది అతన్ని అక్కడే విడిచిపెట్టి ఫీబస్ నడక సాగించాడు.

క్లాడ్ ఫ్రొలో తమ్ముని వద్దకు వచ్చి చూశాడు. ఒక్క నిట్టూర్పు విడిచి తమ్ముని వంక చూసి, తిరిగి ఫీబస్ ని వెంబడించాడు.

కొంతదూరం వెళ్ళాక తన నెవరో అనుసరిస్తున్నట్లు ఫీబస్ కి అనుమానం కలిగింది. ఆగి వెనక్కి చూశాడు. వెనక నీడవలె అనుసరిస్తున్న క్లాడ్ ఫ్రొలో ఆగాడు. ఫీబస్ నడిచాడు. వెనుక నీడ కూడా నడిచింది. ఫీబస్ వెనుతిరిగి చూశాడు. నీడ కనపడింది. ఇంక లక్ష్యపెట్టకుండా నడవ నారంభించాడు. "నాదగ్గ రేముంది? దారికొట్టడానికి—చిల్లిగవ్వ లేదు" అనుకున్నాడు.

నాలుగు రోడ్లు కలిసే కూడలివద్ద ఆగాడు ఫీబస్. ఈమాటు క్లాడ్ ఫ్రొలో ఆగలేదు. మెల్లిగా అడుగులు వేసుకుంటూ ఫీబస్ ని సమీపించాడు.

కర్రలూ కత్తులతో దొంగలు వచ్చినా భయపడని ఫీబస్ కి, ఈ ఆకారం చూడగానే కొంచెం భయం కలిగింది. దయ్య

మొకటి క్రైస్తవమఠాచార్యుని వేషంలో తిరుగుతోందని వ్యాపించిన వదంతులు ఫీబస్ అదివరకే వినిఉన్నాడు. నిలబడిన చోటనుండి కదలలేకపోయాడు. క్లాడ్ అతనివద్దకు వచ్చి నిలిచాడు.

"ఎవరు నువ్వు?" అన్నాడు ఫీబస్ కంపిస్తున్న స్వరంతో. "ఎవరు? దొంగవా? నా దగ్గిర చిల్లిగవ్వ లేదు. ఇంకొకణ్ణి చూసుకోడం మంచిది."

క్లాడ్ ఫ్రోలో చెయ్యిజాపి ఫీబస్ భుజం పట్టుకున్నాడు. "కెప్టెన్ ఫీబస్" అన్నాడు.

"నా పేరుకూడా తెలుసునా?"

"నీ పేరేకాదు; ఇప్పుడు నువ్వెందు కెక్కడికి వెడుతున్నావో కూడా తెలుసు."

"తెలుసా?"

"ఏడుగంటల కొక యువతిని కలుసుకోడానికి వెడుతున్నావు."

"అవును."

"ఆమె పేరు?"

"ఎమరాల్డా" అన్నాడు ఫీబస్.

"అబద్ధం" అన్నాడు క్లాడ్ కోపంతో. ఫీబస్కి ఇంక భయం పోయింది. కత్తిమీదికి చెయ్యి పోనిచ్చాడు.

"అబద్ధం నా జన్మలో ఎరగను" అంటూ ఫీబస్ పళ్లు పటపట కొరికాడు. "తియ్యి నీ కత్తి. ఇక్కడే తేల్చుకుందాం" అంటూ కత్తి తీశాడు.

క్లాడ్ చలించలేదు. "కెప్టెన్ ఫీబస్. ఏడుగంటలయింది. ఇప్పుడే. నీపని మరిచిపోతున్నావు" అన్నాడు.

వెంటనే కత్తిదించేశాడు ఫీబస్.

క్లాడ్ ఇలా అన్నాడు "సరే ఇప్పటికి వెళ్లు. తరవాత నీతో కత్తియుద్ధానికి ఎప్పుడైనా సరే నేను సిద్ధమే—వెళ్ళు."

"సరే. సిద్ధంగానే ఉంటా. నీదగ్గిర డబ్బేమైనా ఉందేమో ముందు చూడు. నాదగ్గిర బొత్తిగా ఏంలేదు."

"ఇదిగో తీసుకో" అని క్లాడ్ డబ్బుతీసి ఇచ్చాడు. "ఒక షరతుమీద ఇస్తున్నాను. నువ్వు అబద్ధమాడ్డంలేదని నిరూపించుకో.

నువ్వు కలుసుకోబోతున్నది ఎమరాల్డా అవునో కాదో నేను తెలుసు కోవాలి?"

"ఏం చెయ్యమంటావు?"

"నువ్వామెను కలుసుకునేచోట నన్ను ఒక మూల దాచు."

"అదెంత పని!"

"అయితే నడు."

"నడు. నువ్వు దయ్యమో, మనిషో నాకు తెలియదు. ఎవరైనా నాకు పనిలేదు; ఈపూటకి మనిద్దరం స్నేహంగా ఉందాం. రేపు నీబాకీ నీకు తీర్చి, అప్పుడు కత్తియుద్ధానికి వస్తాను."

ఇద్దరూ త్వరత్వరగా నడిచారు. కొంతదూరం వెళ్లేసరికి నదీ ప్రవాహం గలగలమని వినవచ్చింది. నది వంతెనపైనే కొన్ని ఇళ్ళుకూడా ఉన్నాయి. అక్కడ ఫీబస్ ఆగాడు, "ముందు నేను చూసివస్తాను. నువ్విక్కడే ఉండు" అన్నాడు. ఫీబస్ కొద్ది ముందుకు వెళ్ళి ఒక యింటిముందాగాడు. దబదబ తలుపుబాదాడు

"ఎవరు?" అని లోపలినుండి వినవచ్చింది. తరవాత తలుపు తెరుచుకుంది. గుడ్డిదీపం చేత పట్టుకొని వొంగిపోయిన వృద్ధురాలొకామె వచ్చింది. ఆమె దుస్తులు బొత్తిగా చినిగిఉన్నాయి. తల వొణుకుతోంది. పళ్ళు లేవు.

లోపలి వసారా బూజు, దుమ్ముతో నిండిఉంది. వసారా వెనుక నిచ్చెనవంటి కర్రమెట్లున్నాయి. మెట్లెక్కితే మిద్దె వస్తుంది. ఫీబస్ వసారాలోకి వచ్చి మెట్లెక్కాడు, క్లాడ్ అతనిననుసరించాడు. ఫీబస్ వృద్ధ స్త్రీ చేతిలో ఒక నాణెం ఉంచాడు. ఆమె అది ఒకసారి చూసుకుని గోడప్రక్కనున్న మేజా అర లాగి అందులో పడేసి అర మూసింది. ఆమెకూడా మెట్లెక్కడం చూసి గది మధ్యలో ఆడుతున్న బాలు డొకడు మేజా అరలోని నాణెం సంగ్రహించి ఎండిన ఆకొకటి అందులో ఉంచి అర మూశాడు.

ముగ్గురూ మిద్దెమీదికి వెళ్ళారు. ఆమె మిద్దె వసారాలో దీపం ఉంచింది. ఫబస్ వసారా వెనుక ద్వారం తెరిచాడు. అదొక చీకటి గది. ఫీబస్ అదిచూపి "అక్కడుండు నువ్వు" అని క్లాడ్‌కి సంజ్ఞచేసి చెప్పాడు. ఫీబస్ తలుపులు మూసి గడియవేశాడు. తిరిగి మెట్లుదిగి వృద్ధస్త్రీతో కలిసి కింది సారాలోకి వచ్చాడు.

క్లాడ్ ఫ్రాలో చీకటిగదిలో కొంతసేపు తచ్చాడి చూశాడు. కోణాకారంలో ఉన్న ఆ గది కప్పు అతడి తలకు తగులుతోంది. ఆ చీకటిలో అక్కడే దుమ్ములో కూలబడ్డాడు. అతని మెదడులో అనేక ఊహాలు పొడగట్టనారంభించాయి. ఎమరాల్డా, ఫీబస్‌ల రూపాలు అతని మనోనేత్రంలో గోచరించాయి. అతనికి శరీర మంతా దహించ నారంభించింది.

పావుగంటసేపు అలా ఉన్నాడు. పావుగంట ఒక యుగంలా ఉందతనికి. ఉన్నట్లుండి మెట్లు కిర్రుమన్న శబ్దం వినవచ్చింది. మిద్దెతలుపు తెరుచుకుంది. గుడ్డివెలుగు వచ్చింది. చీకటి తలుపుల సందునుంచి వెలుగు క్లాడ్‌కి కనపడింది. మిద్దెపై వసారాలో ఏం జరుగుతున్నదీ అతనికి స్పష్టంగా కనపడుతోంది. ముందు వృద్ధు రాలు కనపడింది. ఆమె వెనుక ఫీబస్ వచ్చాడు. ఆ వెనుక ఎమ రాల్డా! ఆ దివ్యసుందర విగ్రహాన్ని చూడగానే క్లాడ్ కంపించి పోయాడు. కన్నులకు చీకట్లు కమ్మాయి. గుండె దడదడ లాడింది, తల తిరిగింది. స్పృహతప్పింది.

తిరిగి మెలకువ వచ్చేసరికి ముందు వసారాలో ఫీబస్, ఎమ రాల్డా ఇద్దరే కనిపించారు. దీపం ప్రక్క కొయ్యబెంచీ పైన ఇద్దరూ కూర్చున్నారు. ఇద్దరిపైనా వెలుగు పడుతోంది. వసారాకి రెండు ప్రక్కలా రెండు కిటికీలున్నాయి. ఒక కిటికీలోనుంచి ఆకాశం, చంద్రుడు, నక్షత్రాలు కనపడుతున్నాయి.

"ఎమరాల్డా ముఖం సిగ్గుతో కందిపోయింది. ఆమె కాళ్లవద్ద మేక పడుకునివుంది. ఆమె ఆనందం అణుచుకోలేకపోతున్నట్లు ముఖమే చెపోంది. చూపులు నేలపై ఉన్నాయి. వేలితో ఊరికే బల్లపైన రాస్తోంది.

క్లాడ్ చెవులు రిక్కించి విన్నాడు.

ఎమరాల్డా తలవంచుకునే అంది "నేను చేస్తున్నది తప్పని తెలుసు. కాని నన్ను చూసి అసహ్యించుకోకండి."

"అసహ్యించుకోడమా? అబ్బెబ్బే! ఎప్పుడూ లేదు" అన్నాడు ఫీబస్, ప్రీతినటిస్తూ. "అయినా అసహ్యం ఎందుకు?"

"మీతో కలిసి ఇలా వచ్చినందుకు."

"అయితే నిన్ను చూస్తే కోపం కూడా వస్తోంది"

"కోపమా?" అంది హడలిపోతూ.

"అవును. నా కింత తేలిగ్గా చనువిచ్చినందుకు."

"ఓ! అదా!" అంది ఎమరాల్డా ఊపిరి తీసుకుని. "నాకూ తెలుసు, నేను పెట్టుకున్న ఒట్టు తప్పుతున్నానని. ఇంక నాతల్లి దండ్రుల్ని చూసే ఆశ పోతుందనీ తెలుసును. తాయెత్తులో మహత్తు పోతుంది. కాని పరవాలేదని మీకోసం వచ్చేశాను. ఇంక నాకు తల్లీ తండ్రీ అక్కరలేదనుకున్నాను. మీకోసం......" అంటూ ఆమె తలెత్తి ఫీబస్ ముఖంలోకి చూసింది.

"నువ్వు చెప్తున్నదేమిటో నాకర్థంకావటంలేదు."

ఎమరాల్డా కొంతసేపు మౌనంగా ఊరుకుంది. ఆమె కనుకొలకుల్లో నీరు నిలిచింది. దీర్ఘనిశ్వాసం విడిచింది.

"మీకోసం ఏదైనా వొదులుకుంటాను. మీకు నా హృదయం అర్పిస్తున్నాను."

ఆమె వర్చస్సులోనే పవిత్రశీలం ఉట్టిపడుతూ వుంటుంది. శీలమంటే ఏమిటో ఎరగని ఫీబస్‌కి ఆమె సమక్షంలో జంకు పుట్టింది. ఆమె ఈ మాటలు వినగానే అతనికి కొంచెం ధైర్యం చిక్కింది. మెల్లిగా ఆమెపై చెయ్యివేసి "అయితే! నన్ను నువ్వు ప్రేమిస్తున్నాననన్నమాట!"

మెల్లిగా అతని చెయ్యి తొలగిస్తూ ఎమరాల్డా ఇలా అంది. "ఫీబస్! మీరు ఎంతో మంచివారు. చాల చక్కనివారు. నన్ను రక్షించారు. దిక్కులేనిదాన్ని నేను. మిమ్మల్ని గురించి ఎన్నెన్నో కలలు కన్నాను. మీవంటి వీరునిగురించే కలలు కన్నాను. ఏది మీ కత్తి? చూపండి."

"చిత్రమైనదానవు" అంటూ ఫీబస్ ఒరలోనుంచి కత్తి తీశాడు. ఆమె కత్తి పిడి పరిశీలించింది. కత్తి పదును చూసింది. మెల్లిగా కత్తి ఎత్తి ముద్దుపెట్టుకుంది. ఆమె తలవంచిన అవకాశం చూసుకుని అతడామె తెల్లని మెడపై మృదువుగా చుంబించాడు. ఆమె ఉలిక్కిపడింది ముఖం ఎర్రబడింది. చీకటిలో క్లాడ్ పళ్లు పటపట కొరికాడు.

"కెప్టెన్ ఫీబస్! నామాట ఒకసారి వినండి." ఫీబస్ తమకం అణుచుకోలేకున్నాడు. మరింత దగ్గరకు జరిగాడు. అతని పెదిమలపై ఆమె వేలుంచి వారించింది. "ఆగండి. నిజం చెప్పండి. నిజంగా నన్ను ప్రేమిస్తున్నారా?"

"ప్రేమిస్తున్నావా అని అడుగుతున్నావా?" అన్నాడు, ఫీబస్ లేచి ఆమె ముందు మోకరించాడు. "నిన్ను తప్ప ఇంకెవ రినీ ఇంతవరకూ ప్రేమించనేలేదు" అన్నాడు.

అతని నోటివెంట ఈ మాటలు సులువుగా వచ్చాయి. ఈ మాటలు చాలమందివద్ద అన్నాడు. అభ్యాసంవల్ల మాటలు తడబడ కుండా స్పష్టంగా వచ్చాయి.

ఎమరాల్డా ఆనందంతో పరవశురాలయింది. తళతళలాడు తున్న కన్ను లెత్తి కిటికీలోనుంచి చంద్రునివంక చూసింది.

"అబ్బ! ఇంత ఆనందంలో ప్రాణం ఒక్కసారి అంతరించి పోతే ఎంత బాగుండును!" అంది. అదే అదననుకున్నాడు ఫీబస్. మరోకసారి ఆమెను ముంబించాడు. చీకటిగదిలో క్లాడ్ క్రోధావే శంతో కంపించిపోతున్నాడు.

"ప్రాణం పోవడమా!" అన్నాడు కెప్టెన్ ఫీబస్. "ఏమిటి మాట్లాడుతున్నావు? బ్రతికి సౌఖ్యం చవిచూడవలసిన సమయంలో చావు గురించి ఆలోచిస్తున్నావా? అబ్బెబ్బే! అలా కాదు. నా మాట విను...అరె! నీ పేరు ఎంత ప్రయత్నించినా నోరుపట్ట కుండా ఉంది. విచిత్రమైన పేరు."

"ఎంతో చక్కని పేరనుకున్నాను. కాని మీ కిష్టం లేక పోతే మీరే చెప్పండి, ఏ పేరు పెట్టుకోమంటారో. ఏదైనా సరే మీ కిష్టమైనదే నా కిష్టం."

"అబ్బే! అవి అంత ముఖ్యమైన విషయాలు కావులే. ఆ పేరే అలవాటౌతుంది. ఫరవాలేదు. నిజం చెప్తున్నాను. నువ్వు నా కంటికి ఒక దేవతవు; అప్సరసవు. నిన్నెంత గాఢంగా ప్రేమిస్తు న్నానో ముందు ముందు నీకే తెలుస్తుంది. నిన్ను అందల మెక్కి స్తాను. నాకింద ఉండే సైనికులందర్నీ నీకు సేవకులుగా నియోగి స్తాను. వాళ్లందరికీ చక్కని గుర్రాలున్నాయి. గుర్రాలమీద వచ్చి వాళ్లు నీకు వందనంచేస్తారు. యేడాది కొకసారి జాతీయ సైన్యా లన్నీ మైదానంలో చేరి రాజుగారిపట్ల భక్తి ప్రకటిస్తాయి. అప్పు డా సైనికవిన్యాసా లెంత అద్భుతంగా ఉంటాయో తెలుసా? అక్కడ అధికారులందరిముధ్యా నిన్ను కూర్చోబెడతాను. నువ్వే స్వయంగా చూద్దువుగాని."

కెప్టెన్ ప్రగల్భాలన్నిటినీ ఆమె చెవులొగ్గి వింది. ఆమె ఏ ఊహాప్రపంచంలో విహరిస్తోందో తెలియదు; ఆమె కన్నులలో స్వప్నప్రపంచాలు మెరుస్తున్నాయి.

"నువ్వు మహారాణికంటె ఎక్కువ వైభవంతో వెలిగిపోతావు తెలుసునా?" అంటూ ఆమె భుజాలు పట్టుకుని దగ్గరకు లాక్కోబోయాడు. ఆమె కలలనుంచి ఉలిక్కిపడి మేలుకుంది. దూరంగా జరిగింది.

"అబ్బే! ఏం లేదు. ఈ దుస్తులు బొత్తిగా బాగుండలేదు. నాగరికుల దుస్తులు వేసుకుంటే ఇంకెంత అందంగా ఉంటానో ఊహిస్తున్నాను. అంతే!" అన్నాడు కెప్టెన్.

"అప్పుడే కాదు. ఫీబస్! నాకు మీ మతం నేర్పుతారా?"

"మతమా? నా మతంతో నీకేం పని?"

"మనం పెళ్ళి చేసుకోవద్దా?"

ఫీబస్ ఆశ్చర్యపడ్డాడు. అతని ముఖంలో కొంత నిరసన కూడా తోచకపోలేదు. ఆమెవంక ఒకసారి చూసి అన్నాడు.

"మనకి పెళ్ళి కూడా ఎందుకు?"

ఈ మాట వినేసరికి ఎమరాల్డా ముఖం పాలిపోయింది. పెదవులు వణికాయి. తల వంచుకుంది.

ఫీబస్ అనునయిస్తూ ఇలా అన్నాడు: "నిజంగా మనకి పెళ్ళెందుకో నువ్వే చెప్పు. చర్చిలో ఫాదరీముందు నిలబడి అర్థం తెలియని లాటిన్ మాటలేవో బడబడా వాగేస్తే, అదొక పెళ్ళా? అటువంటి పెళ్ళి జరిగితేం, జరక్కపోతేం; మనకేం లోటు?"

క్లాడ్ ఫ్రాలో అంతా అతి జాగ్రత్తగా గమనిస్తున్నాడు. వారి సంభాషణ ఒక్క మాటైనా పొల్లుపోకుండా వింటున్నాడు. విని క్రోధంతో వొణికిపోతున్నాడు. ఆ పరిస్థితిలో అతన్ని చూస్తే, బోనులో బంధించబడిన బెబ్బులి లేడిని చూసిన దృశ్యం గుర్తుకు వస్తుంది. అతని కళ్ళు మంటలూదుతున్నాయి.

ఉన్నట్టుండి ఫీబస్ యువతి పైఉత్తరీయం లాగివేశాడు. ఆమె ఒక్క ఉదుటున లేచి నిలబడింది. అతనివంక భీతితో చూసి వెనక్కు ఒకడుగు వేసింది. ఈమారు స్ఫటికంవలె మెరుస్తున్న ఆమె భుజాలవంక తమకంతో చూశాడు ఫీబస్. ఆమె తన భుజాలను చేతులతో కప్పుకుంది. నోటమాటలేక సిగ్గుతో శిరస్సు

వాల్చి ఉన్న యువతి లజ్జనూ శోభించినట్లుంది. ఆమె కంఠంలో తావీజూ, సంచీ బయటపడినాయి.

"అదేమిటి?" అని అడుగుతూ, అది సాకుగా ఆమెను సమీపించాడు ఫీబస్

"ఆ! ఆ! అది ముట్టుకోవద్దు" అని ఆమె దీనంగా బతిమాలుకుంది. "అది నా శీలం చెడకుండా ఉంటే, అదే నన్ను నా తల్లిదండ్రుల దగ్గరకు చేర్చుతుంది. కెప్టెన్, నన్ను విడిచిపెట్టండి. మిమ్మల్ని పాదాలంటి ప్రార్థిస్తున్నాను. పాపం! మా అమ్మ! నా కోసం ఎంత తపించి పోతోందో! ఫీబస్! నా పైటను ఇచ్చెయ్యండి. నన్ను రక్షించండి" అని దీనంగా ప్రార్థించింది.

ఫీబస్ కి విసుగుపుట్టింది. నిస్పృహతో వెనక్కి గెంతు వేశాడు. "నీకు నా పైన ప్రేమలేదు. తెలుస్తోనే వుంది" అన్నాడు.

"ప్రేమలేదా!" అందామె. భయపడుతూ భయపడుతూ అతన్ని సమీపించి, అతని రెండు చేతులూ పట్టుకుని బల్లపైన కూర్చోబెట్టింది. "ఫీబస్! ఎంతమాటన్నారు! పోనివ్వండి; నా కెప్పుడు తల్లితో పనేమిటి? నాకు మీరే తల్లీ తండ్రీ అనుకుంటాను. ఫీబస్! నా వంక చూడండి. నేను నా సర్వస్వం మీ కర్పిస్తాను. నా ప్రాణాలు, నా మానం మీ అధీనం. మీకు నన్ను పెళ్ళిచేసుకోడం ఇష్టం లేకపోతే, మీదగ్గర బానిసగా నే ఉంటాను. మాకు జిప్సీలకి ప్రేమకీ, స్వేచ్ఛకీ మించిన వేవీ లేవు" ఇలా అంటూ ఆమె అతని భుజాలపై చేతులుంచింది. నీరు నిండి తొణికిసలాడుతున్న కన్నులతో, చిరునవ్వుతో అతని నాహ్వానించింది. అతను పట్టరాని ఉద్రేకంతో ఆమెను గాఢ పరిష్వంగంలో బంధించి వేశాడు.

అకస్మాత్తుగా ప్రియుని శిరస్సుకు పైన మరొక ముఖం ఆమె కంటబడింది. ఆ ముఖం అతి వికృతంగా భయంకరంగా కనపడింది. తళుక్కున కత్తి మెరిసింది.

క్లాడ్ ఫ్రాలో ఆవేశం అణుచుకోలేక కొయ్యతలుపులు ఎత్తి తీసివేశాడు తీసి నిశ్శబ్దంగా వచ్చి వారిద్దరి వెనుక నిలబడ్డాడు. యువతి నోటివెంట మాటరాలేదు. గొంతెత్తి అరవాలనుకుంది; కాని ఆమెకు సాధ్యం కాలేదు. కత్తి యువకుని శిరస్సుపై పడింది. క్లాడ్ బలంగా కొట్టాడు. కెప్టెన్ ఒక్కసారి అరిచి కూలి

పోయాడు. ఎమరాల్డా స్మృతితప్పి పడిపోయింది. స్మృతి తప్పి పోతున్న సమయంలో, తన పెదవులపై నిప్పులా కాలిపోతున్న పెదవులు చుంబించడం మాత్రం ఆమెకు తెలుసు.

ఆతరువాత ఆమెకు స్పృహ రాగానే చుట్టూ సిపాయిలు మూగి ఉన్నారు. క్లాడ్ లేడు. నదివైపు కిటికీ తలుపులు తెరిచి ఉన్నాయి. రక్తం దారినంట కారుతూండగా ఫీబస్‌ని సిపాయిలు మోసుకుపోతున్నారు.

"మాయలమారి! కెప్టెన్ ఫీబస్‌ని మాయపన్ని తీసుకొచ్చి కత్తితో పొడిచేసింది" అంటున్నారు సిపాయిలు.

# 23

నెల రోజులకు పైగా ఎమరాల్డా కనపడ్డం లేదు. బికారుల నిలయంలో కలవరం బయలుదేరింది. ఎమరాల్డా ఏమయిందో ఎవరికీ తెలియదు. మేక కూడా మాయమయింది. నగరం నలుమూలలా గాలించారు. ఆమె జాడ తెలియలేదు. ఆఖరు పర్యాయం నెల్ల క్రిందట ఆమె ఒక సైనికాధికారితో కలిసి ఎక్కడికో పోతున్నట్లు మాత్రం అందరికీ తెలిసింది. ఎమరాల్డా భర్త అయిన గ్రింగైర్ వేదాంతి. అతనికంత చింత లేదు. ఆత్మరక్షణలో భార్యకు సహాయం అవసరంలేదని అతనికి తెలుసును. ఆమె మెడలోని తాయత్తు ప్రభావం, ఆమె కత్తిపదును అతనికి చక్కగా తెలుసును. అయితే ఇంత ఆత్మరక్షణపరాయణురాలైన ఆమె ఎలా మాయమయిందో అని అతను కూడా కలవరపాటు చెందాడు. తన కవిత్వరచన కూడా మానుకుని ఆమెకోసం అన్వేషిస్తున్నాడు.

ఒకరోజు గ్రింగైర్ న్యాయస్థాన భవనం పక్కనుంచి నడిచి పోతూ, అక్కడొక గుంపు చేరడం గమనించాడు. సభామందిరంలోనుంచి వస్తున్న ఒక యువకుని అడిగాడు. "అక్కడేమిటి ఈవాళ విశేషం?"

"ఏమో! ఒక యువతి సైనికాధికారి నొకణ్ని హత్యచేసిందట. ఆమెకు మంత్ర తంత్రాలుకూడా వచ్చేమో! అందరూ ఉన్నారక్కడ. మా అన్న క్లాడ్ ఫ్రాలోని డబ్బడగాలని వెడితే, ఆయనకి నాకేసి చూసే తీరికేనా లేదు. మీరేమైనా అప్పివ్వగలరా?"

"అప్పివ్వగల సమర్థతే ఉంటే ఇంక లేనిదేముంది? నా జేబులు చిలులు."

క్లాడ్ ఫ్రోలో తనకు తెలుసునన్న విషయం చెప్పడానికి జంకాడు గ్రింగైర్. క్లాడ్‌ని చూసి చాలా గాబరైపోయింది. ఆయనకి ఆగ్రహం వచ్చివుంటుందనుకున్నాడు.

గ్రింగైర్ న్యాయసభామందిరం ప్రవేశించాడు. అంతటా నిశ్శబ్దం అలుముకునివుంది. మెల్లిగా జనం మధ్యనుంచి దారిచేసుకుంటూ ముందుకు నడిచాడు. లోపల వెలుగు తక్కువగా ఉంది. హాలు విశాలమైనది. సగంవరకూ జనం కిటకిటలాడుతున్నారు. తర్వాత న్యాయవాదులు కూర్చునివున్నారు. ఆపైన ఎత్తైన వేదికపైన న్యాయమూర్తులు కూర్చునివున్నారు. ఆ మసక వెలుతురులో అందరూ గ్రింగైర్ కళ్ళకి గొర్రెలు, ఎలుగుగొడ్లు, మొసళ్ళు, తాబేళ్ళు, అడవిపిల్లులవలె కనపడుతున్నారు.

"దోషి ఎవరో?" అన్నాడు ప్రక్కనొకనిని చూసి.

"అదుగో! ఆమే. అటు తిరిగి నిలబడింది; నల్లని దుస్తులు ధరించింది."

గ్రింగైర్ మడమలెత్తి చూశాడు. స్పష్టంగా కనపడలేదు.

"ఆమె పేరు?"

"తెలియదు ఆమెకి మంత్ర తంత్రాలు వచ్చుట."

అందరూ నిశ్శబ్దంగా వింటున్నారు. ఒక వృద్ధవనిత సాక్ష్యమిస్తోంది.

"నేను నా యింట్లో నలభైయేళ్ళనించి ఉంటున్నాను. నే నెప్పుడూ పన్నులూ అద్దెలూ నాగా పెట్టలేదు. ఒకరోజు రాత్రి నేను నూలు వడుక్కుంటూ వుంటేగా తలుపుతట్టిన చప్పుడు వినపడింది. ఎవరువారని కేకేసి తలుపుతీశాను. ఒక సైనికాధికారీ, నిలువెల్లా నల్లని దుస్తులు ధరించిన ఒక పెద్దమనిషీ లోపలికి వచ్చారు. రెండో పెద్దమనిషి ముఖంకూడా కప్పుకొని వున్నాడు; కళ్ళుమాత్రం కనపడ్డాయి. ఆయన కళ్లు చింతనిప్పుల్లా వున్నాయి. నా మిద్దెగది ఆ రాత్రికి కావాలన్నారు. చేతిలో ఒక కాసు పెట్టారు. అది మర్నాడు వాడుకోవచ్చుగదా అని నా మేజా అరలో దాచుకున్నాను. నేను ముందు మెట్లెక్కి మిద్దెగది చూపించాను. వెనక్కి చూసేసరికి ఎప్పుడు మాయమయ్యాడో ఆ రెండో పెద్దమనిషి కనపడలేదు. నాకు కొంచెం కంగారుపుట్టిన మాట

నిజం. సైనికాధికారి యువకుడు; అందగాడు. మిద్దెగది చూసి మళ్ళీ నాతో క్రిందికి దిగివచ్చి వెళ్ళిపోయాడు. నేను మళ్ళీ గొట్టం దగ్గర కూచున్నానో లేదో, ఇంతలోనే ఆయన తిరిగివచ్చాడు. ఈ మాటు ఆయనవెంట ఒక చక్కని యువతికూడా వచ్చింది. ఆమె ఎంత అందంగావుందో మాటల్లో చెప్పలేను. నా కళ్ళు చెదిరి పోయాయి. అయితే ఆమె దుస్తులే బాగుండలేదు. ఆమెవెంట ఒక మేకకూడా వచ్చింది ఆ మేక నల్లటిదో తెల్లటిదో ఇప్పుడు నాకు జ్ఞాపకంలేదు. మేకకి గిట్టలూ కొమ్ములూ వున్నాయి. అచ్చంగా మనిషిలాగే గెడ్డంకూడా వుంది. ఇంట్లో ఏదో ఇంద్రజాలం ఉందని అప్పుడే అనుమానించాను. అయినా నేనేమీ అనలేదు; నా కాసు నాకు ముట్టింది కాబట్టి. సరే యిద్దరినీ మిద్దెగదిలోనికి తీసుకెళ్ళాను. వాళ్ళనక్కడ విడిచిపెట్టి నేను క్రిందికి వచ్చేశాను. మేకకూడా వాళ్ళతోనే వుండిపోయింది. మిద్దెగదికి రెండు కిటికీలున్నాయి. ఒకటి నదివైపునుంది. క్రింద నేను కూచున్న గదికీకూడా నదివైపు ఒక కిటికీ ఉంది. నేను మళ్ళీ నా గొట్టందగ్గర కూచున్నాను. కాని నా మనస్సు మనస్సులో లేదు. ముందొచ్చిన క్రైస్తవసన్యాసి ఏమైనాడు? ఆ తరవాత వచ్చిన మేక అచ్చంగా మనిషిలా చూస్తుంది! ఆ అందమైన యువతి దుస్తులు వింతగా ఉన్నాయి.

“అలా ఎంతసేపాలోచించానో తెలియదు ఇంతలోనే పైనించి వెర్రికేక ఒకటి వినపడింది. దబ్బున నేలమీద ఏదో పడినట్టు చప్పుడయింది. కిటికీ తలుపులు తెరుచుకున్న చప్పుడయింది. క్రింద నాగదిలో నదివైపు కిటికీదగ్గరికి పరిగెత్తుకెళ్ళి చూశాను. నల్లటి ఒక ఆకారం నేను చూస్తూఉండగనే నీళ్ళలో పడింది. అప్పుడు వెన్నెల్లో స్పష్టంగా చూశాను. క్రైస్తవ సన్యాసి వేషంలో ఉందా ఆకారం. గబగబా నదిలో ఆ గట్టుకి ఈదుకు పోయింది. నాకు భయంపుట్టి వీధిలోకి వెళ్ళి పోలీసుల్ని పిలిచాను. వాళ్ళువచ్చి మిద్దెగదిలో చూశారు. చూసి ఏమనుకున్నారో, నన్ను కొట్టడం మొదలెట్టారు. నేను బతిమాలుకుని వాళ్ళకి జరిగిందంతా చెప్పాను. నన్నుకూడా మిద్దెమీదకి తీసుకెళ్ళి చూపించారు. గదంతా రక్తం మడుగైవుంది. సైనికాధికారి వెన్నులో ఒక కత్తి గుచ్చుకునివుంది. నేలమీద నిలువునా పడుకుని వున్నాడు. యువతి చచ్చిపోయినట్లు నటించింది. మేక మాయమైపోయింది. అయ్యామోయ్యా అని తల మొత్తుకున్నాను. మళ్ళీ ఆ గది బాగయ్యే

వరికి తెల్లార్లు పట్టుకుంది! సైనికాధికారిని మోసుకుపోయారు. ఆమెనీ తీసుకుపోయారు. ఆమె భుజంమీద గుడ్డలేదు! ఇంతే కాదు. అసలు చిత్రం మరోటి జరిగింది. మర్నాడు చూస్తే మేజాలో కాసు కనపడలేదు. దానిచోట్లో ఎండిపోయిన ఆకొకటి ఉంది!"

హాలంతా జనం ఆశ్చర్యపోయారు. "క్రైస్తవ సన్యాసి రూపంలో దెయ్యం, మేక—అంతా చూస్తే గారడీలా వుంది" అన్నాడు గ్రింగైర్

"ఎండుటాకో?" అన్నాడొకడు. "అదంతా అతణ్ని దోచుకోడానికి మంత్రకతె పన్నిన ఉచ్చు."

గ్రింగైర్ దృష్టికి మొసలిలా కనపడిన ఒక పెద్దమనిషి లేచాడు: "దోషివద్ద కత్తి ఒకటి దొరికింది" అని వృద్ధురాలి వంక తిరిగి అడిగాడు "ఎండుటాకు తెచ్చావా?"

"తెచ్చానండి ఇదిగో!"

ఒకడు ఎండుటాకు అందుకుని 'మొసలి' కిచ్చాడు. మొసలి ఆకు కేసి చూసి తల పంకించాడు; పంకించి అది 'ఎలుగుబంటి' కిచ్చాడు. అది అలా అలా అన్ని చేతులూ మారింది.

ఒక న్యాయవాది లేచి సాక్షిని ప్రశ్నించాడు: "మీయింట్లో మిద్దెగదిమీది కిద్దరూ వెళ్ళాక నువ్వు ఒక డున్నట్టుండి అంతర్థానమైనాడన్నావు తరవాత అతడే నదిలో ఈదుకుపోతూ కనపడ్డాడన్నావు. నీకు కాసు ఇచ్చినదెవరు? సైనికాధికారా, రెండోవాడా?"

వృద్ధురాలొక క్షణం ఆలోచించింది. "సైనికాధికారే ఇచ్చాడు". అంది.

హాల్లో గుసగుసలు బయలుదేరాయి "కేసు పిల్లి మొగ్గలేస్తోంది" అన్నాడు గ్రింగైర్.

ప్రభుత్వంతరఫున ఒక న్యాయవాది లేచి న్యాయమూర్తులతో ఇలా అన్నాడు: "నేను తమకొక విషయం జ్ఞప్తికి తేవాలి. కెప్టెన్ గారు స్పృహవచ్చినతరవాత ఇచ్చిన వాఙ్మూలంలో ఒక విషయం చెప్పాడు. క్రైస్తవ మతాచార్యుని వేషంలో వచ్చిన దెయ్యం తన్ని బలవంతపెట్టి ఆమెను తప్పకుండా కలుసుకోవాలని ఒత్తిడి చేసినట్లు చెప్పాడు. తనదగ్గర డబ్బు లేదంటే దెయ్యం డబ్బుకూడా ఇచ్చిందని చెప్పాడు. ఆ కాసే కెప్టెన్

వృద్ధురాలికి ఇచ్చాడు. అందువల్ల ఆ కాసు మంత్రించిన దేనని నా వాదం. కెప్టెన్ ఫీబస్ వాఙ్మూలాన్ని పరిశీలించవచ్చు."

ఈ పేరు వినగానే దోషి లేచి నిలబడింది. నిలబడగానే ఎస్మరాల్డాను గుర్తుపట్టి గ్రింగైర్ నిశ్చేష్టుడైనాడు.

ఎస్మరాల్డా ముఖం పాలిపోయింది. నిండుగా జడలల్లి ఉండవలసిన ఆమె కేశరాశి చిందరవందరగా ఉంది. ఆమె పెదవులు కూడా పాలిపోయాయి. కన్నులు గుంటలు పడ్డాయి. ఆమెలో కనపడిన ఈ మార్పుకి గ్రింగైర్ వ్యథ చెందాడు.

"ఫీబస్!" అన్నది వొణికిపోతూ, "ఎక్కడున్నా రాయన? ఆయన బతికేవున్నారా?"

"అదంతా నీకనవసరం" అన్నాడు ప్రధాన న్యాయమూర్తి.

"నామీద దయచూపండి. ఆయన బతికున్నారో లేదో చెప్పండి." అంటూ ఆమె బతిమాలింది. చేతులెత్తి మొక్కింది. ఆమె చేతులకు సంకెళ్లున్నాయి.

"మరణావస్థలో ఉన్నాడు. అది చాలా నీకు? ఇప్పుడు తృప్తిగా వుందా?" అన్నాడు న్యాయవాది.

ఆమె దుఃఖభారంతో కూర్చుండి పోయింది.

ప్రధాన న్యాయమూర్తి ముందున్న గుమాస్తా చెవిలో ఏదో చెప్పాడు. అతడు లేచి "రెండో ఖైదీని ప్రవేశ పెట్టండి" అన్నాడు బిగ్గరగా. అందరూ ఆత్రుతతో చూశారు. ఒక ప్రక్క నుంచి మేక-డాలీ-తీసుకురాబడింది. డాలీ మొహం చాచి ముందుకు చూసింది. తరవాత వెనకడుగు వేసింది. పోలీసులు దాన్ని పట్టుకు ముందుకు నెట్టారు. డాలీ పక్కకు చూసింది. ఎస్మరాల్డా కనపడగానే చెంగున గంతు వేసింది. మేజా పైకి ఒక అంగ, ఒక గుమాస్తా తలపైన మరో అంగ వేసి ఎస్మరాల్డా వద్దకు దూకింది. ప్రీతితో ఆమె శరీరాన్ని మూతితోనూ ముందు కాళ్లతోనూ రాయడం మొదలెట్టింది. కాని ఎస్మరాల్డా చలించలేదు.

వృద్ధురాలు మేకవంక చూపుతూ "అదేనండి మేక! అదే" అని అరిచింది.

న్యాయవాది లేచాడు! "రెండో ఖైదీని విచారించాలిక" అన్నాడు.

రెండో ఖైదీ అంటే డాలీ! ఆరోజుల్లో మంత్రాలు నేర్చాయనే నేరానికి జంతువుల్ని శిక్షించడం పెద్ద వింత కాదు.

ఒక మతాధికారి లేచి నిలబడ్డాడు. మేకవంక తీక్షణంగా చూస్తూ ఇలా అన్నాడు: "ఈ మేకని ఆవహించిన దయ్యాన్ని కోర్టువారు హెచ్చరిస్తున్నారు—దాన్ని వొదలి పోకపోతే ఉరి శిక్ష తప్పదు."

గ్రింగైర్ కి ముచ్చెమటలు పట్టాయి. అతడికి ఎమురాల్డా పైన కంటె మేక పైన ప్రీతి అధికం.

న్యాయవాది తంబుర తీసి పట్టుకున్నాడు. మేకవంక చూపుతూ తంబుర మీటి "ఇప్పుడెన్ని గంటలైంది?" అన్నాడు.

మేక నేల చూపుల్లో న్యాయవాదిని చూసి, ముంగాలొక్క ఎత్తి ఏడుసార్లు నేలపైన కొట్టింది. అప్పుడు నిజంగానే ఏడు గంటలయింది జనంలో కలకలం బయలుదేరింది. గ్రింగైర్ ఇది చూసి భరించలేకుండా ఉన్నాడు. "అయ్యబాబోయ్! సర్వనాశనం! ఇంక దానికి చావు తప్పదు" అని గొణిగాడు.

"ష్! అందరూ నిశ్శబ్దంగా ఉండాలి" అన్నాడు ఒక పోలీసు బిగ్గరగా.

న్యాయవాది తంబుర రకరకాలుగా పట్టుకుని మేక చేత రకరకాల ఆట లాడించాడు. తేది, నెల, సంవత్సరం చెప్పించాడు. వీధుల్లో మేక ఆట చూసి ఆనందించి చప్పట్లు కొట్టిన వాళ్ళే, ఇక్కడ అదే చూసి భయభ్రాంతులైనారు.

న్యాయవాది సంచీ ఒకటి తీశాడు. అది ఎమురాల్డా మెడలో ఉండేది. సంచి మూతి తెరిచి డాలీముందు బోర్లించాడు. డాలీ రెండు కాళ్ళతో అక్షరాలు కలిపి "ఫీబస్" అనే మాట పేర్చింది. దానితో ఎమురాల్డా మంత్రికత్తె అని జనమంతా నిర్ధారణ చేసుకున్నారు.

ఇంత జరుగుతున్నా ఎమురాల్డా కదలనైనా లేదు డాలీ ముద్దు చేష్టలకుగాని, న్యాయమూర్తులు న్యాయవాదుల బెదిరింపులకు గాని ఆమె చలించలేదు. ఒక సార్జెంటు ఆమెను సమీపించి భుజం పట్టి గట్టిగా కుదిపాడు. ప్రధాన న్యాయమూర్తి ఆమెనుద్దేశించి బిగ్గరగా అన్నాడు: "ఎమురాల్డా! నువ్వు జిప్సీజాతికి చెందినదానవు. మంత్రాలు ప్రయోగించి ఈ మేక సహాయంతో మార్చి 29 వ తేదీ రాత్రి కెప్టెన్ ఫీబస్ ని పొడిచిచంపావు. ఏం సమాధానం చెప్తావు? నేరం చెయ్యలేదంటావా?"

ఎస్మరాల్డా చేతులతో ముఖం కప్పుకుని ఏడ్వ నారంభించింది
"అయ్యో! ఇదెక్కడి పాపం ఫీబస్!"
"ఏమిటి నీ సమాధానం?"
"నా సమాధానమా? నేను చంపుతానా నా ఫీబస్ ని?"
"అయితే నీ చర్యల్ని ఎలా సమర్థించుకుంటావు?"
తడబడుతూ ఆమె చెప్పింది "ఇదివరకే చెప్పాను. నాకేం తెలియదు. చేసింది మతాధికారి. అయానెవరో నాకు తెలియదు. నన్ను పిశాచంలా వెంటాడించాడు."
"అదేఅదే! మతాధికారి అనకు; పిశాచం"
"నన్ను కరుణించండి. నే నేపాపం ఎరగను. నేను పేదరాలిని.."
ప్రభుత్వ న్యాయవాది పేరు జాక్. మెల్లిగా లేచి క్లాడ్ ఫ్రాలో వంక చూశాడు. క్లాడ్ ఫ్రాలో చురుగ్గా చూశాడు. సంకేతం అందుకుని న్యాయవాద అన్నాడు! "ఖైది నేరం ఒప్పుకోవటంలేదు కాబట్టి హింసించి నిజం చెప్పించాలని కోరుతున్నాను."
"ఒప్పుకున్నాం" అన్నాడు ప్రధాన న్యాయమూర్తి.
ఎస్మరాల్డా నిలువెల్లా కంపించిపోయింది. సార్జెంటు ఆజ్ఞ విని లేచి నిలబడింది. ప్రభుత్వ న్యాయవాది దారితీశాడు. హాలు కొక మూల దిగువగా ఉన్న ఒక చిన్న తలుపు తెరుచుకుంది. పోలీసుల సహాయంతో న్యాయవాది ఎస్మరాలాను లోనికి తీసుకువెళ్ళాడు. వెంటనే తలుపులు మూసుకున్నాయి. మేక అరిచింది. సభ అంతా ఒకసారి ఉలిక్కి పడ్డారు.
ఒక న్యాయమూర్తి మెల్లిగా తనలో అనుకున్నాడు: "అబ్బబ్బ! ఈ శవి(?)గ్రహం ఎక్కువ దాపురించింది! అప్పుడే భోజనాలవేళయింది; కోరి ఇప్పుడు హింస తెచ్చి పెట్టుకుంది."
ఎస్మరాల్డా చీకటితో వకుండా నడిచింది. గుండ్రని చిన్న గదిలోకి అందరూ చేరారు. ఈ గదికి కిటికీలు లేవు. గాలి వెలుగులు వచ్చే మార్గంలేదు, చిన్న ద్వారం ఒక్కటి తప్ప. ఒక మూలమాత్రం పెద్ద సెగడు వెలుగుతోంది. ఆ మంట వెలుగులే గది అంతటా వ్యాపించాయి. గదిలో రకరకాల పరికరాలున్నాయి. మధ్యలో ఒక తోలుపరుపు పరిచిఉంది. పరుపుపైన కూర్చుని ముగ్గురు కబుర్లు చెప్పుకుంటున్నారు. నేరస్థులను హింసించి నిజ

చెప్పించడానికి ప్రభుత్వం నియోగించింది వారిని. ప్రభుత్వ న్యాయవాది రాగానే వాళ్లు లేచి నిలబడ్డారు. వారిని చూసేసరికి ఎస్మరాల్డా భయంతో కంపించిపోయింది. ఆమె కొకపక్క పోలీసులు, మరో ప్రక్క వారితో వచ్చిన మతాధికారులు నిలబడ్డారు. గదిలో ఒక మూల ఒక గుమాస్తా కూర్చున్నాడు. అతడి మేజాపైన సిరా, కలం, కాగితం ఉన్నాయి.

ప్రభుత్వ న్యాయవాది జాక్ ఎస్మరాల్డాను సమీపించాడు. దయాభావంతో ఆమె నడిగాడు! "అమ్మాయి! ఇప్పుడైనా నిజం చెప్పు. నేరం చెయ్యలేదా?"

"చెయ్యలేదు".

"అయితే నిన్ను కఠినంగా ప్రశ్నించవలసి ఉంటుంది. ఈ పక్క మీద కూర్చో."

ఎస్మరాల్డా కూర్చోలేదు. ఆ పక్క చూసేసరికి ఆమెకు నవనాడులూ కుంగిపోయినట్టయింది. జాక్ సంజ్ఞ అందుకుని ఇద్దరామెను జబ్బలు పట్టుకుని పక్కపైన కూర్చోబెట్టారు. ఆమె భీతితో నలుమూలలా చూసింది. మానవుల్ని హింసించే పరికరాలు ఆమెవంక వికటాట్టహాసంతో చూస్తున్నట్లున్నాయి. అవన్నీ వచ్చి తన శరీరాన్ని ముక్కలు ముక్కలుగా కొరుక్కు తింటాయన్నట్లు ఆమెకు తోచింది.

"డాక్టరెక్కడ?" అన్నాడు జాక్.

"ఇక్కడ" అంటూ నల్లని దుస్తులు ధరించిన ఒకవ్యక్తి ముందుకు వచ్చాడు.

జాక్ తిరిగి ప్రశ్నించాడు: "ఇప్పుడైనా నేరం అంగీకరిస్తావా?"

ఈమాటు ఆమె నోటంట మాట రాలేదు. లేదన్నట్లు తల ఊపింది.

"అయితే నాపని నేను పూర్తిచెయ్యాలి" అంటూ జాక్ సంజ్ఞ చేశాడు.

ఎస్మరాల్డా కుంగిపోయింది. మనుష్యులే కాక దైవంకూడా తనను విడనాడినట్లు భావించింది. జీవంలేనట్లు ఆమె తల వేలాడింది. గదిలో ఇనపయంత్రాలు కంగుకంగుమంటున్నాయి. ఎస్మరాల్డా గజగజ వణికిపోతోంది. "ఫీబస్! నా ఫీబస్! అయ్యో"

అంటూ సన్నగా ఏడ్వనారంభించింది. కాని ఈమెను చూస్తే అక్కడివా రెవరికీ కరుణ కలగలేదు. జంపాలు, కప్పీలు, చక్రాలు ఆమెకోసం సిద్ధపరచబడుతున్నాయి. ఒకడామె కుచ్చిళ్ళు మోకాళ్ల వరకు పైకి తొలగించాడు. పారిస్ నగరవాసులంతా చూసి అబ్బురపడిన ఆ పాదాల అందం వారికంటికి కనపడలేదు. పాదాలకు ఇనపతొడుగులు తగిలించారు. ఆమె పెనగులాడింది. కాని ఆమెను కదలకుండా గట్టిగా పట్టుకున్నారిద్దరు. కప్పునుంచి వేలాడుతున్న పెద్ద ఇనపకొక్కాన్ని ఆమె నడుముకు బిగించారు. చేతులకు సంకెళ్లు మరింత గట్టిగా బిగించారు.

"ఆఖరుసారి అడుగుతున్నాను చెప్పు. నేరం ఒప్పుకుంటావా?"

"నే నేపాపం ఎరగను."

"అక్కడ జరిగిన కాండకి కారణమేం చెపుతావు?"

"నాకేమీ తెలియదు."

"సరే కానివ్వండి" అన్నాడు జాక్. కప్పీ లేచింది. ఆమె నడుము ఇనపకొక్కెంతో బిగిసింది. మరొకవైపున పాదం సాగిపోతోంది. ఎముకల్లో బాధ సహించలేక బిగ్గరగా అరిచింది; హత్య చెయ్యబడుతున్న పశువువలె అరిచింది.

"ఇప్పుడైనా నేరం ఒప్పుకుంటావా?"

"ఒప్పుకుంటాను. అంతా ఒప్పుకుంటాను."

"ఒప్పుకుంటున్నావా? అయితే ఇంకోటి చెప్తున్నా విను. ఒప్పుకున్నావంటే నీకు మరణశిక్ష తప్పదు."

"మరణశిక్షే కావాలి నాకు. ఈ హింస వద్దు."

"రాసుకోవోయ్" అని జాక్ గుమాస్తాకి చెప్పాడు.

"నీకు మంత్రతంత్రాలు వచ్చునని ఒప్పుకుంటున్నావా?"

"ఒప్పుకుంటున్నాను."

"సైతాన్ సహాయంతో అకృత్యాలు చేసినట్లు ఒప్పుకుంటున్నావా?"

"ఒప్పుకుంటున్నాను."

"కపెస్ ఫీబస్‌ని వంచించి హత్యచేసినట్లు ఒప్పుకుంటున్నావా?"

ఆమె కళ్లు పెద్దవి చేసి తేరిపార చూసింది. నేరం అంగీకరించింది.

"ఆమెని విడిచిపెట్టండింక" అని ఆజ్ఞఇచ్చాడు జాక్. "కోర్టులోకి తీసుకురండి."

హింసా పరికరాలనుండి విడదీసేగానే ఆమె పక్కపైన వాలిపోయింది. వైద్యుడొచ్చి ఆమె పాదం పరిశీలించాడు: "పరవాలేదు. ఎముక విరగలే!" అన్నాడు.

అందరూ తిరిగి న్యాయసభా మందిరంలోకి వచ్చారు. నాటకంలో ఆఖరు రంగం సమీపించినప్పుడు ప్రేక్షకులు ఊపిరితీసుకున్నట్టు, సభలో అందరూ ఊపిరితీసుకున్నారు. న్యాయమూర్తులు లేచిపోడానికి సిద్ధపడుతున్నారు. డాలీ సంతోషంతో అరిచింది. మళ్ళీ దూకాలని ప్రయత్నించింది; కాని ఈ మాటు మేకని అక్కడ కట్టివేశారు.

ప్రభుత్వ న్యాయవాది వచ్చి ఒకసారి తన ఆసనంలో కూర్చుని ఇంతలోనే లేచి "ముద్దాయి నేరం అంగీకరించింది" అని చెప్పి మళ్ళీ కూర్చున్నాడు.

ప్రధాన న్యాయమూర్తి ముద్దాయివంక చూసి అన్నాడు: "అంటే ఇంద్రజాలం, వ్యభిచారం, హత్య నేరాలకి నువ్వు అంగీకరిస్తున్నావా?"

ఎస్మెరాల్డా తలవంచుకుని వెక్కి వెక్కి ఏడుస్తూ చెప్పింది: "మీరేది చెప్పినా ఒప్పుకుంటాను. నన్ను మాత్రం వెంటనే చంపి వెయ్యండి."

ప్రధాన న్యాయమూర్తి జాక్ వంక చూశాడు.

జాక్ లేచి పొడుగైన కాగితాలకట్ట ఒకటి విప్పి గబగబ చదివాడు. చదవడం ముగించేసరికి పావుగంట పట్టింది. చదివి డాలీవంక చూశాడు. డాలీ న్యాయవాది ప్రతి అంగచలనాన్నీ, విన్యాసాన్నీ అనుకరిస్తోంది. రోషంతో న్యాయమూర్తుల వంక తిరిగి ఇలా అన్నాడు: "అదుగో అటు చూడండి. ఆ మేకని ఆవహించిన సైతాన్ మన న్యాయ నిర్వహణాన్ని అధిక్షేపిస్తోంది." గబగబా ఇద్దరు పోలీసులు వచ్చి మేక ముందుకాళ్ళు రెండూ తాడుతో కట్టివేశారు. ప్రభుత్వ న్యాయవాది ముద్దాయికి కఠిన శిక్ష విధించాలని వాదించాడు. జరిమానా విధించాలనీ, కొన్ని రోజులు నాటర్ డామ్ చర్చివద్ద ఆమె ప్రాయశ్చిత్తం చేసుకోవాలనీ, ప్రాయశ్చిత్తం అనంతరం ముద్దాయినీ, మేకనీ గ్రీవ్ చౌకులో ఉరితియ్యాలనీ కోరాడు. తరవాత టోపీ పెట్టుకుని కుర్చీలో

కూలబడ్డాడు. ముద్దాయి తరఫు న్యాయవాది తన వాదం వినిపించ డానికి లేచి నిలబడ్డాడు. "కాలాతీతమయింది. మీ వాదం రెండు ముక్కల్లో ముగించండి" అన్నారు ప్రధాన న్యాయమూర్తి. ముద్దాయి నేరం అంగీకరించినందువల్ల జరిమానా విధిస్తే చాలునని న్యాయవాది ఒక్క ముక్కలో తేల్చేశాడు. న్యాయమూర్తులు సంప్రదించుకున్నారు. ఎమరాల్డా వారివంక చూసింది కాని ఆమె చూపుల్లో జీవం లేదు. ప్రభుత్వ న్యాయవాది కోరినట్లు శిక్ష విధించడానికి న్యాయమూర్తులు నిర్ణయించి లేచిపోయారు. ముద్దాయిని పోలీసులు తీసుకుపోయారు.

## 24

మధ్య యుగాలలో నిర్మించబడిన పెద్దపెద్ద కట్టడాలలో భూమిపైన ఎంత కట్టడం ఉండేదో భూమిలోపల దాదాపు అంతా ఉండేది. పెద్ద చర్చిలకు దిగువ ప్రార్థనామందిరాలలో, ప్రాయశ్చిత్త మందిరాలలో, గోరీల అడుగుల్లో ఉండేవి. రాజభవనాలు, కారాగారాల క్రింద కారాగారాలలో, గోరీలలో ఉండేవి. అదేరీతిగా పారిస్ న్యాయసభా భవనం క్రింద కారాగారాలు అంతస్థులు అంతస్థులుగా ఉన్నాయి. ఈ భూగృహాలలో గాలీ వెలుతురూ కరువు. గుడ్డిదీపాలతో బిక్కుబిక్కుమంటూ ఉంటాయి. ఇక్కడికి చేరిన బందీలు ఇంక శాశ్వతంగా గాలికీ వెలుగుకీ, సకల జీవితాశలకూ తిలోదకాలిచ్చి వదలవలసిందే. ఇక్కడ ఒకసారి చిక్కినవారి కొక్కటే మార్గం — ఉరికంబం.

ఎమరాల్డా ఈ కారాగారాలలో ఒక గదిలో నిర్బంధించబడింది. న్యాయసభా భవనమంతా ఆమె శిరస్సుకు పైనుంది. అంత అల్పప్రాణియైన సుకుమారిని ఇంతటి కఠోర శిలా సముదాయం మధ్య నిర్బంధించడం అనవసరమే. అయినా ఈ ఖైదీ తప్పించుకుపోతుందనే శంకతో ఇక్కడ నిర్బంధించారు.

గోరీలా ఉన్న ఆ చీకటిగదిలో ఆమెను చూస్తే ఎవరికైనా కరుణ జనించక మానదు. ఎండలో తళతళలాడుతూ నృత్యం చేస్తూ పాడుతూ దుఃఖం పోలికలైనా ఎరుగని ఆ యువతి ప్రస్తుత స్థితి హృదయవిదారకంగా ఉంది. ఇప్పుడామె శరీరానికి గాలిసోకదు; మనుష్యుల కంఠస్వరం వినపడదు; కన్నులలో వెలుగు

వింటదు. ఇనపగొలుసుల భారంతో కుంగిపోయి, వొంగిపోయి కూర్చునివుంది. ఆమె పక్క ఒక మట్టికూజాతో నీరు, ఒక రొట్టె ముక్క ఉన్నాయి. తేమ నేలపై కొంతమేర గడ్డి పరచబడివుంది. గది పైకప్పునుంచి టపటప నీటిచుక్కలు రాలుతున్నాయి. ఆమె కన్నులముందు గతమంతా దృశ్యచిత్రాలు కడుతోంది. థీబ్స్, పారిస్ నగరవీధులు, గ్రాంగ్దుకెంటె, తన నృత్యవినోదం, జనుల హర్షధ్వానాలు, మేక, ఫీబస్ ప్రీతివాక్కులు, మతాధికారి, కత్తి, నెత్తురు, న్యాయసభ, హింస, ఉరిస్తంభం అన్నీ కళ్లముందు కట్టాయి. ఒక్కొక్కప్పుడు బంగారుకలల్లా, ఒక్కొక్కప్పుడు పీడకలల్లా అన్నీ మనోగోచరమౌతున్నాయి. ఆ అన్నిటి మధ్యా తన జీవనం, తన సంఘర్షణ ఆమెకు జ్ఞప్తికి వచ్చాయి. చీకటి తెరలపై లీలగా కనపడుతున్నట్లున్న ఈ దృశ్యాలతో పాటు తన గీతాలు, ఎక్కడో ఏ ఆకాశంలోనో తేలిపోతున్న తన పాటలు సన్నసన్నగా ఆమె చెవులలో వినవచ్చాయి. ఆ గదిలో చేరినది మొదలు ఆమె నిద్రపోనూ లేదు; పూర్తిగా మేలుకొనివుండనూ లేదు. సుషుప్తికీ, జాగృతికీ మధ్య ఒకానొక అవస్థలో ఆమె స్మృతి లీనమయింది. ఆ దుర్భర గాఢాంధకారంలో నిద్రకూ మెలకువకూ, యథార్థానికీ కలకూ, పగటికీ రాత్రికీ మధ్య వ్యత్యాసం అంతరించింది. అట్టి శూన్యావస్థలో ప్రాణి అస్తిత్వభావమే మారిపోతుంది.

ఆ స్థితిలో గది తలుపు ఎప్పుడు తెరుచుకుంటుందో ఆమె వినదు. గది తెరుచుకున్నా కొవ్వొత్తి వెలుగైనా కనపడదు. ఆమె వద్దకొక రొట్టెముక్క వచ్చిపడుతుంది. జైలర్ పరిమిత వ్యవధిలో రావటం తప్ప ఆ గదిలో చలనమే లేదు. పైనుంచి పడే చినుకుల టపటపలు వింటున్నట్లు కూచుంటుంది. కాని ఆ శబ్దం ఆమె చెవులకు సోకదు.

అలా ఆమె ఎంతసేపున్నదో తెలియదు. ఎవరికో మరణశిక్ష విధించినట్లు లీలగా ఆమెకు గుర్తుంది. తరవాత ఆమెను మోసుకుపోవటం గుర్తుంది. మేలుకొనేసరికి చుట్టూ అంధకారం ఆవరించివుంది. లేచి ప్రాకబోయింది; కాలిమడమలను బంధించిన ఇనపగొలుసులు నిరోధించాయి. చుట్టూ తడిమిచూసింది రాతిగోడలు తెలియవచ్చాయి. పక్కన ఎండుగడ్డి చేతికి తగిలింది. మరొకపక్క తేమ తగిలింది. కొంతసేపు గడ్డిపైన కూర్చుంది. తరవాత ద్వారంవద్ద కింద రాతిమెట్టుపైన కూర్చుంది. కొంతసేపు నీటిచుక్కల్ని లెక్క

పెట్టింది. లెక్క అంతలోనే విస్మృతిలో పడిపోయింది. తరవాత చైతన్యం కొడిగట్టింది.

ఒకరోజు రాత్రో, పగలో—రాత్రి పగళ్ళు ఆమె కిప్పుడు తెలియవు—తలుపుదగ్గర సవ్వడి వినవచ్చింది. జైలర్ వచ్చినప్పుడు మామూలుగా అంత సవ్వడి కాదు. ఆమె తలయెత్తి చూసింది. తలుపు సందులోనుంచి ఎర్రని వెలుగువచ్చింది. ఇనపగడియ తీసినచప్పుడయింది. దీపం పట్టుకున్న చెయ్యొకటి ఓరగా తీసిన తలుపు సందులోనుంచి ముందు వచ్చింది. తరవాత ఆ వెలుగులో రెండు ఆకారాలు కనపడ్డాయి. వెలుగు అలవాటుతప్పిన ఆమె కళ్ళు చటుక్కున మూసుకున్నాయి. తిరిగి ఆమె కన్నులు తెరిచేసరికి ద్వారం బంధించబడింది. ఒక మెట్టుపైన దీపం ఉంచబడింది. ఆమెముందొక మానవాకారం నిలబడిఉంది. ఆ మానవాకృతి ముఖం నల్లనిగుడ్డతో కప్పబడిఉంది. శరీరమంతా నల్లనిగుడ్డల చాటున దాగిఉంది. చేతులైనా కనపడ్డంలేదు. ఆమె ఆ ఆకారం వంక కొంతసేపు కన్నార్పక చూసింది. ఇద్దరూ మాట్లాడలేదు. ఇద్దరూ శిలా ప్రతిమలవలె ఒకరివంక ఒకరు దృష్టినిలిపి చూస్తూ ఉండిపోయారు. చినుకులశబ్దం, దీపశిఖ రెపరెపలు తప్ప గదిలో చలనంలేదు.

చిట్టచివరికి బందీయే ముందు పలికింది: "ఎవరు మీరు?"

"మఠాధికారిని."

ఆమాట పలికినరీతి, కంఠస్వరం వినేసరికి ఆమె గజగజలాడిపోయింది.

"సిద్ధంగా ఉన్నావా?" అన్నాడు మఠాధికారి.

"దేనికి?"

"చచ్చిపోడానికి"

"ఓ! ఎప్పుడు? ఇంకా ఎన్నాళ్ళకి?"

"రేపే."

ఆశతో ఎత్తిన ఆమె తల మళ్ళీ దించుకుపోయింది.

"అబ్బ! ఇంకా ఒకరోజా!" అంది. "ఇవాళే ఎందుకు చంపకూడదు? ఎప్పుడైనా మీ కొకటే గా!"

"అంత బాధపడుతున్నావా?"

"అప్పుడే నాలో జీవం వచ్చింది. చలికోరలు నన్ను సగం చంపివేశాయి..." అంటూ ఆమె కూర్చుంది. కూర్చుని కాళ్ళు దగ్గరకు పెట్టుకుని గజగజ వణకసాగింది

మఠాధికారి గది కలయచూశాడు: "వెలుగులేదు. వెచ్చని మంటలేదు, అంతా తేము. అబ్బ" అన్నాడు.

"అవును అందరికీ వెలుగుంది; ఎండ ఉంది. నన్నెందుకీ చీకటిలో, చలిలో పడేశారు?"

మఠాధికారి క్షణం ఆగి ఆలోచించాడు. తరవాత అన్నాడు: "నీకు తెలుసునా? ఇక్కడెందుకు పడ్డావో?"

"తెలుసు ననుకుంటాను" అంది కారణంకోసం తడుము కుంటున్నట్లు నుదురు తడుముకుంది. "కాని నిజంగా తెలియదు" అంది మెల్లిగా. ఉన్నట్టుండి చప్పున అనేసింది: "అబ్బా! ఇక్కడి నించి వెళ్ళిపోవాలనుంది. చలి నన్ను పీకేస్తోంది. ఏవేవో నా ఒంటినిండా పాకుతున్నాయి."

"అయితే నాతోరా." అంటూ అతడామె చెయ్యి పుచ్చుకున్నాడు. ఆ చెయ్యి ఆమెకు మంచులా తగిలింది.

"అబ్బ! మృత్యుదేవత చెయ్యిలా ఎంత చల్లగావుంది! అయితే మీరెవరు?"

మఠాధికారిముఖంపై ఆచ్ఛాదనం తొలగించాడు. ఆమె అతని ముఖం చూసింది. రాత్రింబగళ్ళు ఆమెను వెంటాడిన ముఖం అది. ఫీబస్ తలవనుక కనపడి కత్తినెత్తి పొడిచిన వ్యక్తి! కత్తితో సమానంగా మెరిసినవి ఆకళ్ళే!

తనకష్టాలకు, తనసర్వనాశనానికి హేతువైన ఆముఖం చూడగానే ఆమెకు చైతన్యం వచ్చింది. ఆమె స్మృతిపై ఇంతవరకూ కప్పబడిన తెర తొలగిపోయింది. జరిగినదంతా ఆమె కళ్ళకు కట్టింది. ఆమెగుండెలో మంట చెలరేగింది. చేతులతో కళ్ళు కప్పుకుంది. "ఎవరు? మఠాధికారా?" అంటూ కూలబడిపోయింది. కూర్చుని భయంతో వణికిపోయింది. ఆమెలో సత్తువ హరించి పోయింది. పావురాన్ని చూసిన గ్రద్దలా మఠాధికారి ఆమెవంక చూస్తున్నాడు.

"అమ్మో! ఆఖరయింది. ఇది ఆఖరుసారి కాబోలు! ఆఖరు దెబ్బ కొట్టండి. చంపండి నన్ను. ఇంక భరించలేను." అంటూ మూలిగింది. కసాయిముందు మేకలా తలవంచి మెడ చూపింది.

మఠాధికారి నిర్ఘాంతపోయాడు. చివరికి అడిగాడు: "నన్ను చూస్తే నీకు భయమా?"

ఆమె జవాబివ్వలేదు.

మళ్ళీ అడిగాడు, అదే ప్రశ్న.

ఆమె పెదవులు కదుపుకుంది. "అవును" అంది. "ఉరితీసే వాడికి నా మనస్సు నాశ్యంతో చెలగాటం. నన్ను కసాయి పీనుగలా వెంటాడాడు. అతను, ఆ కసాయివాడే లేకపోతే ఎంత బాగుండేది! ఎంత సుఖంగా ఉండేదాన్ని! వాడే నన్ను నరకంలోకి తోశాడు. వాడే ఫీబస్‌ని చంపాడు" వెక్కి వెక్కి ఏడుస్తూ తలెత్తి అతనివంక చూసింది. "ఎవరు నువ్వు? నేను నీకేం అపకారం చేశాను? నేనంటే నీకెందుకంత పగ?"

"నువ్వంటే నాకు ప్రీతి."

ఆమె కన్నులు తుడుచుకుంది. అతనివంక తదేకంగా చూసింది. ఆమెముందతను మోకరించాడు. ఆమెవంక తీరని తమకంతో చూశాడు. అతని కళ్ళు నిప్పులగూడలిగా ఉన్నాయి. "నామాట వింటున్నావా? నీమీద నాకు ప్రీతి."

"అహా! ఎంతచక్కని ప్రీతి!"

"అవును. సర్వనాశనమైనవాడు చూపే ప్రేమ!"

ఇద్దరూ కొంతసేపు మౌనంగా ఉండిపోయారు. అంతకంతకు అతని దేహం కామాగ్నిలో దహించుకుపోతోంది. ఆమె శరీరం మరింత చల్లబడింది.

"ఇటు విను" అన్నాడు మఠాధికారి నిగ్రహించుకుని. "నీకంతా చెప్పేస్తాను. నా మనస్సులో నేను చెప్పుకోడానిక్కూడా ఇంతవరకూ జరగని సంగతి చెప్తాను, నిన్ను చూసేంతవరకూ నేను సుఖంగానే ఉన్నాను."

"నేనుకూడా" అంది ఎస్మరాల్డా గాఢనిశ్వాసం విడిచి.

"నామాటకు అడ్డురాకు. అవును నేను సుఖంగానే ఉన్నానంతవరకూ. నేనొక్క పాపం చెయ్యలేదు. నన్నెగలవాడెవరని అంతవరకూ తలెత్తుకుని గర్వంతో తిరిగాను. అంతా నన్ను గురుభావంతో గౌరవించారు. అందరికీ నేనంటే భయమే. విజ్ఞానమే నా సర్వస్వం అనుకున్నాను. అప్పటివరకూ విజ్ఞానమే నాకు ప్రియసోదరి. కాని నేను జయించానని గర్వపడిన నా ప్రకృతి అప్పుడప్పుడు నన్ను భయపెట్టక మానలేదు. ఉపవాసాలవల్ల,

దైవప్రార్థనలు, శాస్త్రాధ్యయనం వల్ల అంతశ్శత్రువుల్ని జయించాను. స్త్రీవాసన తగలనియ్యలేదు. గ్రంథం తెరవగానే అపవిత్రమైన ఆలోచనలన్నీ పటాపంచలయ్యేవి. నా శాంతి, నా దాంతి నాకు తిరిగి లభించేవి. అప్పుడప్పుడు కొందరు కొందరు స్త్రీల ఆకారాలలో సైతాన్ నన్ను లోబరుచుకోడానికి ప్రయత్నించేవాడు. కాని సులువుగా సైతాన్‌ని జయించాను. కాని ఆ విజయం, ఆ నిగ్రహం నన్నిపుడు విడిచిపోయినాయంటే, దైవాన్నే నిందించాలి.

"ఒక రోజున నా గదిలో కిటికీవద్ద కూర్చుని చదువుకుంటున్నాను. అప్పుడు నా చెవులకు తంబుర వినపడింది. ధ్యానభంగమైనందుకు విసుగు పుట్టింది. వీధిలోకి చూశాను. అప్పుడా రోజున నా కళ్ళబడిన దృశ్యం మానవమాత్రులకు సాధారణంగా గోచరమయేది కాదు. మధ్యాహ్నవేళ ఆ ఎండలో అతిలోకసుందరి ఒక యువతి నృత్యం చేస్తోంది. ఆమె నాకళ్ళ కప్పుడు దివ్యలోకం నుంచి దిగివచ్చిన దేవతలా కనపడింది. ఆమె సుందర నేత్రాలలో ప్రకృతిశక్తి తాండవిస్తోంది. ఆమె మెడలోని పూసలు ఎండలో తళతళలాడాయి. ఆ ఆకారాన్ని భగవంతుడే మలిచినట్లుంది ఆ సౌందర్యాధిదేవతను చూడగానే నా కర్మ పరిపక్వం చెందింది. నా శరీరం, నా మనస్సు నావశం తప్పాయి. ఆమె మానవాంగన కాదని తోచింది. ఆమెపక్క మేక ఒకటి కనపడింది. అది చూడగానే అది మంత్రాలకు లోబడినదని తోచింది. ఆ మేక నన్ను చూసి నవ్వింది. నవ్వింది మేక కాదు, సైతాన్ అని నాకు తెలుసును. అప్పుడు నాకు బోధపడింది, నువ్వు మనిషివి కాదని. నన్ను నరకం పాలు చెయ్యడానికి సైతాన్ పంపిన జ్వాలవని తెలుసుకున్నాను. ఇప్పుడూ అదే నా నమ్మకం. నా పైన నీ రూపం అమోఘంగా పని చేసింది. నిన్ను చూడగానే చిరునవ్వుతో నరకానికి పోవచ్చనుకున్నాను. తరవాత నీ పాటలో లీనమైపోయాను. ఏం చెయ్యను? అక్కడనుంచి పారిపోలేను. నువ్వు వెళ్ళిపోయేవరకూ అక్కడే స్తంభించిపోయాను. నా కాళ్లు మంచులా చల్లబడిపోయాయి; నా తలలో జ్వాలలు మిన్నుముట్టాయి అది మొదలు ఆ అపూర్వ దృశ్యం తప్ప నా కంటికింకొకటి కనిపించడం లేదు. ఆగీతం తప్ప మరేది వినిపించడం లేదు. నేను పతితుడనైనాను.

"ఆరోజు మొదలు నాకు తెలియని విచిత్ర శక్తి ఏదో నన్ను ఆవహించింది. ఈ శక్తిప్రభావంనుంచి తప్పించుకోవాలని అనేక మార్గాలాలోచించి, అనుసరించాను. కాని నా కృషిఅంతా వ్యర్థమయింది. పుస్తకం తెరిస్తే నువ్వు ప్రత్యక్షం. ఎవరు కనపడినా నువ్వే నా కన్నులముందు సాక్షాత్కరించావు. ఎవరే పలుకు పలికినా నీ కంఠమే నా చెవులలో గింగురుమంది. నేను నీలో లీనమైపోయాను. నిన్ను చూడాలని, నీ కంఠం వినాలని, నిన్ను తాకాలని— ఈ కోర్కెలు తప్ప నాకు మరొక ఊహ, ఆలోచనే లేదు. నీకోసం నగరమంతా చూశాను. నిన్ను అనేకమార్లు చూశాను. చూసినకొద్దీ తృష్ణ ఎక్కువయింది. నువ్వెవరో తెలుసుకున్నాను. జిప్సీవని తెలిసింది. ఇంక నువ్వు మంత్రకత్తెవనే స్థిరపరుచుకున్నాను. నీ మంత్రశక్తి భేదించాలని అనేక యత్నాలు చేశాను.

"ఒకరోజున ఒక ఆలోచన కలిగింది. నిన్ను ఎత్తుకుపోవాలని తోచింది. ఒకరోజు రాత్రి అలా ప్రయత్నించాను. నా కూడా మరొకడు వచ్చాడు. నువ్వు చిక్కావు. ఎత్తుకుని పోతుంటేగా దరిద్రుడు ఆ కెప్టెన్ అడ్డువచ్చి పసిగట్టాడు. దాంతో అతనికీ నీకూ నాకూ తిప్పలు ప్రారంభమైనాయి. నిన్నుగురించి అధికారులకి తెలియపరిచాను. ఆ విధంగానైనా నువ్వు నాకు చిక్కుతావని ఆశపడ్డాను. కారాగారంలో నిన్ను పొందవచ్చును. అక్కడ నువ్వు నన్ను తప్పించుకుపోలేవు. ఒక ఘోర దుష్కృత్యం తలపెట్టిన తరవాత, అది సగంలో ఆగిపోదు. దుర్మార్గం భీభత్స స్థితిలో ముగిసింది.

"ఆ తరవాత నన్ను నేనింక నిగ్రహించుకోలేక పోయాను. మనిషికంటె విధి బలవత్తరమైనదని తెలిసివచ్చింది. ఆ దుష్టవిధే నిన్ను కారాగారంలో పడవేసింది.

"తరవాత కొన్నిరోజులకి ఒకరోజు ఒకడు కనపడ్డాడు. నీ పేరుచెప్పి పకపక నవ్వుతున్నాడు. అతణ్ణి సంభాషించాను..."

"ఓ! ఎవరు? ఫీబస్!"

హఠాత్తుగా ఆమె చెయ్యి పట్టుకున్నాడు మతాధికారి. "ఆ పేరుమాత్రం చెప్పకు. నీ నోటితో అనకు. అది విని నేను భరించలేను. ఆ పేరే మనకీ దుర్గతి తెచ్చిపెట్టింది. నువ్వు బాధలు పడుతున్నావు. నాకు తెలుసును. ఈ బందిఖానాలో నువ్వు చలితో బిగుసుకుపోతున్నావు. ఈ చీకటిలో నీ కళ్లలో తేజస్సు

నశించింది. ఈ శాపం నిన్ను పాదిచిపట్టుకుంది. అయినా ఆ నీచుడి పట్ల అమాయకపు ప్రేమ నిలుపుకున్నందువల్ల, నీలో లోలోపల ఎక్కడో కొద్ది కాంతి ఇంకా మిగిలివుంది. కాని నా హృదయమే ఒక అంధకారకూపమైపోయింది. నే నెంత బాధపడ్డానో నీకు తెలుసా? నిన్ను విచారించే సమయంలో నేను న్యాయసభలో నే ఉన్నాను. నే నక్కడే ఉండి అంతా చూస్తూ నరకయాతనలకు గురైనాను. ఆ పశువు నిన్ను ఈడ్చుకుపోవడం కళ్ళారా చూశాను. అక్కడ ముసలాలికే నీపాదాన్ని పట్టి లాగడం చూశాను. నీ అరుపు విని బాధ భరించలేకపోయాను. కత్తితో రొమ్ములో పొడుచుకున్నాను. ఇదిగో చూడు; ఇంకా గాయం నెత్తురు చిందుతూనే ఉంది."

క్లాడ్ ఫ్రాలో దుస్తులు తొలగించి ఛాతీ చూపాడు. పులి గోరుతో చీల్చినట్లు గాయం స్పష్టంగా కనపడింది. ఆమె భయంతో వెనక్కు జరిగింది.

"నిన్ను ప్రతిమాలుతున్నాను. నాపైన కరుణ చూపు. నువ్వు యాతన అనుభవిస్తున్నా ననుకుంటున్నావు. కాని యాతనంటే నిజంగా ఎలా ఉంటుందో నీకు తెలియదు. మతాధికారినైకూడా ఒక స్త్రీని ప్రేమించి, ఆమె ద్వేషానికి గురైన నా సంగతి ఆలోచించు. నీ ఒక్క చిరునవ్వుకోసం రక్తం ధారపోయ్యడానికి వెనుదియ్యను. నీకోసం సర్వస్వం త్యజించగలను. నీ పరిష్వంగం కోసం ప్రాణమైనా త్యజించగలను. అయినా నువ్వు ఆ నీచ యువకునికోసం తపించడం, నన్ను చూసి భయంతో, ద్వేషంతో దూరంగా తొలగిపోవడం ఇంతకంటె మించిన యాతన ఈలోకంలో ఉందా? ఇంతకంటె నన్ను రంపంతో కోసినా బాధపడను. నన్ను కరుణించు. ఒక చేత్తో హింసించినా, ఒక చేత్తో నన్ను ఆదరించు. అది చాలు నాకు."

క్లాడ్ ఆవేశంతో నేలపై తలకొట్టుకొని తేమలో దొర్లనారంభించాడు. యువతి అలా అతన్ని చూస్తూ కూర్చుంది. అతడి ఆత్మవేదనఅంతా విని "ఫీబస్! ఫీబస్!" అని మననం చేసింది.

క్లాడ్ మోకాళ్ళపై ప్రాకుతూ ఆమెను సమీపించాడు. "నిన్ను ప్రార్థిస్తున్నాను. నన్ను నిరాకరించకు. నిన్ను నా ప్రాణంగా ప్రేమిస్తున్నాను. నరక వేదన అనుభవిస్తున్నాను. నువ్వా పేరు పలికితే నన్ను ద్వేషజ్వాలలు దహించివేస్తున్నాయి. నా మొర

విను. నన్ను అంగీకరించు. నన్ను అంగీకరిస్తే మనం ఎంత ఆనందంగా ఉండగలమో మాటలతో చెప్పలేను. మనం పారిపోదాం. నిన్ను ఖైదునుంచి విడిపిస్తాను."

ఎమరాల్డా నవ్వింది. "చూడండి; మీ వేళ్ళకి రక్తం." అంది.

క్లాడ్ దిగ్భ్రాంతుడైనాడు. తన వేళ్ళవంక చూసుకున్నాడు. "అవును నన్ను చూసి నవ్వు, హేళన చెయ్యి. కాని నా వెంట రా. మనమింక కాలం వ్యర్థపుచ్చకూడదు. రేపే, రేపే పారిపోదాం. లేకపోతే రేపే నిన్ను ఉరితీస్తారు. అది నేను భరించలేను. నిన్ను బండిపైన కట్టి వీధుల్లో లాక్కుపోతారు. అయ్యో! నిన్ను నేనెంత ప్రేమిస్తున్నానో నువ్వు తెలుసుకోలేవు. నాతో వచ్చెయ్యి. ఆ తరవాత నువ్వే ఆలోచించి ఒక నిశ్చయానికి రావచ్చు నన్ను నువ్వు ద్వేషించినా నేను బాధపడను. నాతో మాత్రం రా. రేపు ఉరినుంచి తప్పించుకో."

ఉన్మత్తునివలె క్లాడ్ ఆమె చెయ్యి పట్టుకున్నాడు. ఆ ఉద్రేకంలో ఆమెను కారాగారంనుంచి నడిపించుకు వెళ్ళిపోయేవాడే. కాని ఆమె అతనివంక తీక్షణంగా చూసింది. "నా ఫీబస్ ఏమైనాడు?" అని అడిగింది.

"అయ్యో!" అన్నాడు క్లాడ్. ఆమె చెయ్యి విడిచిపెట్టేశాడు. అతని సత్తువ ఉడిగిపోయింది. "నీకు నామీద జాలి లేదా?" అన్నాడు నిస్పృహతో.

"ఫీబస్ ఏమైనాడో చెప్పండి" అంది.

"చచ్చిపోయాడు" అన్నాడు క్లాడ్.

"చచ్చిపోయాడా! అయితే నన్నింక బ్రతకమనెందుకు చెప్పడం?"

అతని కా మాటలు వినపడలేదు. పిచ్చివాడైపోయాడు. తనలో తను మాట్లాడుకుంటున్నట్లు అన్నాడు: "అవును. చచ్చిపోయే ఉండాలి. చచ్చే దెబ్బ పొడిచాను. కత్తి గుండెల్లో దూసుకుపోయేగా పొడిచాను"

ఆడుపులిగా ఆమె అతనిపైబడింది. మెట్లమీదికి అతన్ని గెంటివేసింది "పో! రాక్షసుడా! నాముందునుంచి పో. నన్ను చచ్చిపోనీ. నీతో నాకెన్నడూ పొత్తు కుదరదు. ఛీ. పో ఇక్కడనుంచి" అని అరిచింది.

క్లాడ్ మెట్లపై కూలిపడ్డాడు. మెల్లిగా లేచి దీపం అందుకు న్నాడు. మెట్లెక్కి తలుపు తెరిచాడు. ఆమె అతనివంక తదేకంగా చూసింది. ద్వారం దాటాడు. తిరిగి లోపలికి తొంగిచూశాడు. ఉబికివస్తున్న కోపం అణుచుకుంటూ "నే చెప్తున్నా విను. వాడు చచ్చాడు"

ఆమె బోరగిల పడిపోయింది. తరువాత గది అంతా నిశ్శబ్దం, చీకటి ఆవరించాయి.

# 25

మే నెలలో ఒక నాటి ఉదయం గ్రీవ్ చౌకులో గుర్రాల డెక్కల చప్పుళ్లు, బండ్ల చక్రాల కిరకిరలు, ఇనుప గొలుసుల ఖణఖణలు వినవచ్చాయి. చౌకు కెదురుగా గోలండ్స్ టవర్ లో సిస్టర్ గ్వర్లా ఈ ధ్వనులు విని చెవులు మూసుకుంది. ఆమె ధ్యానం మూలనున్న ముద్దైన బుల్లి పాదరక్షపై కేంద్రీకరించబడింది. పదహేనేళ్ళ నాడు తప్పిపోయిన బిడ్డకోసం ఎలా అంగలార్చిందో, ఈనాడూ ఆతల్లి అంతే పరితాపంతో కృశించిపోతోంది బిడ్డను గురించిన స్మృతిస్వప్నాలు భంగపడ్డం ఇష్టంలేక ఆమె చెవులు మూసుకుంది. బిడ్డను గురించీ, దుర్విధిని గురించీ తనలో తాను మాట్లాడుకుంటున్న సమయంలో, పసిపిల్లల మృదుమధుర కంఠస్వనాలు వినవచ్చాయి అవి వినగానే కిటికీవద్దకువచ్చి చూడ్డం ఆమెకి అలవాటు. ఆమె కిటికీవద్దకు వచ్చే సరికే పిల్లలు కనుచూపు మేర దాటిపోయారు. అక్కడ మాత్రం ఆర్చిబిషప్ క్లాడ్ ఫ్రాలో నిలబడి ఉన్నాడు. ఆమె గ్రీవ్ చౌకు వంక చూసింది.

"ఫాదర్! అక్కడెవరి నురిదీస్తున్నారు?" అని అడిగింది.

క్లాడ్ జవాబివ్వకుండా ఆమెవంక చూశాడు.

తిరిగి ఆమె ప్రశ్నించింది.

"నాకు తెలియదు" అని జవాబిచ్చాడు ఈమారు.

"పిల్లలెవరో ఈదారిని వెడుతూ అనుకుంటే విన్నాను, జిప్సీని ఉరిదీస్తున్నారని. నిజమేనా?"

"నిజమే అనుకుంటాను."

గ్వర్లా వెర్రిగా నవ్వడం మొదలు పెట్టింది.

"సిస్టర్! జిప్సీలంటే నీకంత కోపమా?" అని అడిగాడు క్లాడ్.

"కోపమా! వాళ్లు మంత్రగాళ్ళు, మంత్రకత్తెలు. పిల్లల్ని అపహరించే దుష్టులు. నా చంటిబిడ్డని పొట్టనపెట్టుకున్నారు, నా ఒక్కగానొక్క ముద్దుబిడ్డని అపహరించారు."

క్లాడ్ ఆమెవంక పరీక్షతో చూశాడు.

ఆమె మళ్ళీ చెప్పింది: "అందులో ముఖ్యంగా ఒకామె ఉంది. నాబిడ్డ బ్రతికిఉంటే సరిగ్గా ఆమె వయసే ఉండేది. ఆమె కంటబడితే నా నెత్తురుడికిపోతుంది."

"ఆమెకోసమే ఈ ప్రయత్నాలన్నీ. నీకళ్ళు చల్లగా ఇక్కడినించి నువ్వు అంతా చూడవచ్చు" అంటూ క్లాడ్ ఫ్రొలో తలవంచుకుని వెళ్ళిపోయాడు. ఆమె విజయోత్సాహంతో చప్పట్లు చరిచింది "చివరికి దానిగతి అంతేనని ఎప్పుడో చెప్పాను" అంటూ అరిచింది.

* * * *

ఫీబస్ చనిపోలేదు. ఫీబస్‌వంటి వ్యక్తులు అంత సులువుగా చచ్చిపోరు. "కెప్టెన్ ఫీబస్ చచ్చిపోనున్నాడు" అని కోర్టులో ప్రభుత్వన్యాయవాది ఎమరాల్డాతో చెప్పాడు. ఆ న్యాయవాదికి నిజం తెలిసైనా ఉండదు; లేదా అతడు పరిహసించి ఉండాలి. క్లాడ్ ఫ్రొలో ఆమెతో "ఫీబస్ చచ్చాడు" అని చెప్పినప్పుడు, చచ్చిపోయుంటాడని, లేదా చచ్చిపోడం మేలని అతని అభిప్రాయమై ఉంటుంది.

ఫీబస్‌కి తగిలినగాయం చిన్నదికాదు; కాని చంపేటంత పెద్దదీకాదు. నారంరోజులు వైద్యులు పరిశ్రమించి చికిత్స చేశారు. వైద్యులు ఆశ విడిచిపెట్టినా యువకుని సహజశక్తి రక్షించింది. వైద్యులవద్ద మంచంపైన ఉండగా ఫీబస్‌వద్ద ప్రభుత్వాధికారులు వాఙ్మూలం తీసుకున్నారు. అధికారుల ప్రశ్నపరంపరలు సహించలేక సత్తువరాగానే అతడు ఎవరికీ చెప్పకుండా పారిపోయాడు. అతడు పారిపోయినందువల్ల ఎమరాల్డాపై కేసు కుంటుపడలేదు. ఫీబస్ చనిపోయినట్లే భావించి కేసు నిర్ణయించారు.

ఫీబస్ పారిస్‌లో ఉండకుండా పారిపోయి, దగ్గరలో నేఉన్న తన సైనిక శిబిరం చేరాడు. తనవిషయంలో కేసు జరుగుతున్నట్లు అతనికి తెలుసు. అయినా అక్కడుంటే తను ఎటువంటి ప్రశ్నలకు

జవాబు ఇవ్వవలసి ఉంటుందో, తన గుట్టుమిు బయటపడుతుందో అని అతని భయం. అసలు జరిగినదానినిగురించి ఏమని భావించాలో అతనికి తెలియలేదు. జిప్సీయువతి మంత్రకత్తె అని అనుమానించాడు. జరిగిన పరాభవానికి సిగ్గుపడిపోయాడు. తనకు కాడ లేకపోతే తన పేరు బయటపడదని ఊహించాడు. అయితే జిప్సీయువతిపై మోహం అంతరించగానే హృదయంలో ఏర్పడిన శూన్యభావం అతడికి దుర్భరమయింది. కొద్దిరోజులతనంతరం పారిస్ తిరిగి వచ్చాడు. నాటర్ డామ్ చర్చి ఎదురుగా భవనం, వితంతువు, తనకు నిర్ణయింపబడిన వధువు అతనికి జ్ఞప్తికి వచ్చారు. రెండుమాసాలు గడిచినందువల్ల జిప్సీయువతివల్ల జరిగిన అల్లరి మణిగిపోయుంటుందని భావించి ఆభవనానికి వచ్చాడు.

అక్కడ వధువు, తల్లిమాత్రమే ఉన్నారు. వధువు ఆనాడు జరిగిన సంఘటన పూర్తిగా మరిచిపోలేదు. ఫీబస్ కనబడకుండా పోవడం ఆమెకు బాధ కలిగించింది. చివరికతడు రాగానే ఆమె కోపం మరిచిపోయింది ఫీబస్‌కళ్ళకీమాదు వధువు అప్సరసలా కనపడింది. తల్లి సోఫాలో కూర్చునివుంది. వధువు కిటికీవద్ద కూచుని తెరగుడ్డపైన కుట్టుతూవుంది ఫీబస్ ఆమెవద్ద నిలబడ్డాడు.

"ఈ రెండునెలూ ఏం చేస్తున్నావోయ్?"

ఈ ప్రశ్న అతడికి రుచించలేదు. "అబ్బ! నువ్వెంత చక్కనిదానవు!" అన్నాడు.

"చక్కదనమా! చక్కదనం కాదు నేనడుగుతున్నది! అడిగినదానికి జవాబు చెప్పు."

"సైనిక శిబిరానికి వెళ్ళమని ఆజ్ఞవచ్చింది."

"వెళ్తేనుండైనా నాకు చెప్పలేదే"

"ఏముంది. నా కర్తవ్యం. అదీగాక నాకు జబ్బుచేసింది"

"జబ్బా!" అంది వధువు ఆరాటంతో.

"అవును. గాయం తగిలింది"

"గాయమా?" ఆమె నిశ్చేష్టురాలైంది.

"అబ్బే! భయమేంలేదు."

"పోనీలే. క్షేమంగా తిరిగివచ్చావు. అదేచాలు."

ఫీబస్ వీధివంక చూశాడు. "అదేమిటక్కడ? అబ్బ! ఎంతమంది జనం మూగారో!" అన్నాడు.

"అవును. ఎవరో మంత్రకత్తెని ఉరితీస్తారట."

"ఆమె యెవరో?"

"తెలియదు"

వితంతువు అదేదో చూడాలని బాల్కనీలోకి వెళ్ళింది. తరుణం గమనించి ఫీబస్ వధువుకు మరింత సన్నిహితంగా వచ్చి నిలబడ్డాడు. ఆమె కంఠరేఖలు చూసి ముగ్ధుడైనాడు. ఆమె అతడి చెవిలో చెప్పినట్లు మెల్లిగా చెప్పింది:

"ఫీబస్! మన పెళ్ళి యింక మూడుమాసాల్లో జరుగుతుందిట. నీ కిష్టమేనా!"

"ఇష్టమా అని అడుగుతున్నావా? నువ్వే నా పరదైవతం. నిన్ను తప్ప ఇంకెవరినీ ఎన్నడూ ప్రేమించలేదు." మోహావేశంలో అతని ముఖం ఎర్రబడింది. ఆమె అది గమనించింది. "అబ్బ! ఇక్కడ ఎంత వేడిగా ఉంది!" అంది.

"అయితే! కిటికీల తెరలు దించి వస్తాను"

"వద్దువద్దు. ఉక్కబోస్తూంది, గాలి కావాలి, బాల్కనీలోకి పోదాం నడు" అంటూ అతడి సమాధానం వినకుండానే లేచి దారి తీసింది. ఫీబస్ భంగపడి ఆమె ననుసరించాడు.

అప్పటికి చౌకు కిటకిటలాడిపోతోంది. అన్ని తరగతుల ప్రజలూ వచ్చారు. నగరమంతా వచ్చి అక్కడే ఉన్నారా అన్నట్లుంది.

"పాపం ఎవరో ఆమె!" అంది వధువు. ఫీబస్ జనాన్ని తెల్లగా మెరిసిపోతున్న ఆమె మెడవంక చూస్తున్నాడు.

నాటర్ డామ్ చర్చిలో గడియారం పన్నెండు కొట్టింది. "అదిగో ఆమె వస్తోంది" అని కేకలు మిన్నుముట్టాయి. వధువు చూడలేక కళ్ళుమూసుకుంది.

"లోపలికి రా, నువ్వు చూడలేవు" అన్నాడు ఫీబస్.

"ఫరవాలేదు" అంది వధువు. చూడాలనే ఆసక్తి ఆమె కళ్ళకప్పై చేతులు తీసివేసింది.

చుట్టూ గుర్రాలపై భటులు రాగా ఒక బండి చౌకులోకి వచ్చింది. జనం దారియిచ్చారు. ఎస్మరాల్డా బండిపై కూలబడిఉంది. ఆమె చేతులు వెనక్కి విరిచికట్టి ఉన్నాయి. జుట్టు విరియబోసి

ఉంది. ఆమె మెడకొక తాడుకట్టబడి ఉంది. దానికి క్రిందుగా పూసలహారం ఎండలో మెరుస్తోంది. పై గుడ్డ లాల్చి వేయగా లోగుడ్డలలో ఆమె శరీరచ్ఛాయ మెరిసిపోతోంది. లోగుడ్డలు పొట్టి వైనందువల్ల ఆమె చేతులు, భుజాలు, కంఠం, మెడ, కాళ్లు కనపడుతున్నాయి తుది దశలో కూడా వీడని స్త్రీ సహజమైన లజ్జవల్ల కాబోలు కాళ్లు ముడుచుకుని కనపడకుండా ఉంచడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తోంది.

సుకుమారమైన ఆమె పాదాలవద్ద డాలీ కూర్చుని వుంది. రొమ్ములపై జారిపోతున్న లోగౌను అంచుల్ని ఆమె పళ్ళతో పట్టుకుని మానం కాపాడుకుంటోంది. ఇంతటి అపూర్వసుందరి కిదా శిక్ష అనిపిస్తున్న దందరికీ

"అదె చూడు చూడూ!" అంది వసువు. "ఆ రోజు మేకతో వచ్చిన జిప్సీ ఆమె" అని ఫబస్ వంక చూసింది.—ఫీబస్ ఆమె మాటలు వినలేదు. అతనిదృష్టి బండిపైనే ఉంది. అతనిముఖం పాలిపోయింది.

తడబడుతూ అన్నాడు: "ఎవరు? ఎవరు?"

"ఎవరో గుర్తుకి రాలేదా?"

"నువ్వంటున్న దేమిటో నాకు తెలియడం లేదు."

ఫీబస్ వనక్కు అడుగువేసి లోనికి వెళ్లిపోబోయాడు. వసువుకు ఆనాటి అసూయ గుర్తుకు వచ్చింది. తిరిగి ఆ అసూయ తలెత్తింది. తనను అప్పుడామెకు లీలగా జ్ఞప్తికి వచ్చింది—ఈ కేసులో ఒక కెప్టెన్ ఎవరో ఉన్నాడని.

"అదేమిటలా ఉన్నావు" అంది ఫీబస్ ముఖం పరికించి.

"అబ్బే! యేమీ లేదు" అన్నాడు తడబడుతూ.

"అయితే ఇక్కడే ఉండు, చివరివరకూ అంతా చూదాం."

పాపం కెప్టెన్ ఫీబస్ అక్కడ నిలవక తప్పలేదు. జిప్సీ తలెత్తి తనను చూడలేదని గమనించి కొంత తేరుకున్నాడు. ఆమె వతడు స్పష్టంగా గుర్తుపట్టాడు. ఇంతటి దుస్థితిలో, ఘోర పరాభవంలో కూడా ఆమెమహత్తర రూపసౌందర్యం తరిగి పోలేదు, ఆమె లావణ్యాం శెన్ను తరగలేదు. నల్లని కళ్లు మరింత ప్రకాశమానమై కనపడుతున్నాయి. ప్రశస్తమైన ఆమె లలాటంపైన దేవతలు నాట్యంచేస్తున్నట్లుంది. ఆమె మతి చెదరి స్తంభించిపోయినట్లు

శూన్యంలోకి చూస్తూ ఉంది. చైతన్యంలేని జడవస్తువువలె బండి ఊపుకి ఆమె ఊగిసలాడుతోంది. ఆమె చూపులో వెలుగు లేదు. కన్ను కొసలలో నీటిబిందువులు నిలిచి మిలమిల మెరుస్తున్నాయి.

సమీపంలో జనులు నిశ్చేష్టులై చూస్తుంటే, దూరానున్న జనులు రణగొణధ్వని చేస్తున్నారు. బండి నాటర్ డామ్ చర్చి ప్రాంగణంలో నిలిచింది. జనమంతా ఒక్కసారి సద్దుమణిగి తిలకించారు. కుడిప్రక్క ఒక పెద్దద్వారం తెరుచుకుంది. ద్వారంలో వెండితో చేయబడిన పెద్ద సిలువ ఒకటి ఉంది. సిలువప్రక్క మతాచార్యులు నిలబడిఉన్నారు. ద్వారకవాటాలు తెరుచుకోనగానే మతాచార్యుల మంత్రోచ్చారణ వినవచ్చింది. యువతి పాపాలకు ప్రాయశ్చిత్తం చేసి కాపాడవలసిందని వారు దైవాన్ని ప్రార్థించారు.

యువతి బెదిరి సిలువవంక చూసింది. తరువాత ఆమె దృష్టి సిలువప్రక్క చీకటిలో లగ్నమైంది. కొందరామె బంధాలు విప్పారు. కొందరామెను సిలువవద్దకు నడిపించుకు వెళ్లారు. ఆమె పెదవులు మంత్రోచ్చారణలోవలె కదలాడినాయి. దగరలో ఉన్న వారికి కొద్దిమందికిమాత్రం ఆమె మాటలు వినవచ్చాయి. "ఫీబస్! ఫీబస్!" అని మననం చేస్తున్నదామె. డాలీ ఆమె వెంట వచ్చింది. జిప్సి సిలువవద్దకు చేరగానే మతాచార్యుల మంత్రోచ్చారణ నిలిచిపోయింది. కొందరు భటులామెను లోనికి తీసుకువెళ్ళారు. అక్కడొక వరుసలో నిలబడిన మతాధికారుల ముఖాలవంక చూసింది. ఒకని ముఖం చూసి ఆమె భయంతో వణికిపోయింది.

"మళ్ళీ! మీరా!" అని గొణిగింది. క్లాడ్ ఫ్రోలో మంత్రోచ్చారణ ప్రారంభిస్తూ ముందుకు ఆమెవద్దకు వచ్చాడు. అతను సంజ్ఞ ఇచ్చి భటులను దూరానికి పంపేశాడు. ఆమెను తల వేడెక్కింది. నెత్తురుడికింది. మంత్రోచ్చారణ ఆపి ఆమెతో అన్నాడు "నీ పాపాలను బాపవలసిందని భగవంతుని ప్రార్థించావా?" తరువాత అతి మెల్లిగా ఆమెకు మాత్రమే వినపడేలా అన్నాడు: "ఇప్పుడైనా చెప్పు, నన్నంగీకరిస్తే నిన్ను రక్షించగలను."

ఆమె అతనివంక రోషంతో చూసింది. "ఛీ" అంది. "అందరికీ చెప్పేస్తాను" అని బెదిరించింది.

"నీమాట యేవరూ నమ్మరు. చెప్పు చప్పున చెప్పు."

"నా ఫీబస్‌ని ఏంచేశావు?"

"చచ్చిపోయాడు——" అని కసిగా అంటూ క్లాడ్ ఫ్రాలో తలెత్తి చూశాడు. ఎదురుగా భవనంలో ఫీబస్ కనపడ్డాడు. క్లాడ్ ముఖం పాలిపోయింది. "సరే అయితే చావు" అన్నాడు. "నీ కెవరూ దక్కకుండా చేస్తాను చూడు." తిరిగి క్లాడ్ ఫ్రాలో మంత్రోచ్చారణ ప్రారంభించి వెనక్కి వెళ్ళిపోయాడు.

కొంతసేపటికి ప్రాయశ్చిత్తం ముగిసింది మతాచార్యులందరూ చర్చిలోకి వెళ్ళిపోయారు. తిరిగి ఆమె చేతులు వెనక్కి విరిచికట్టారు. మెల్లిగా నడిపించుకుని తీసుకెళుతున్నారు. దుర్భర వేదనతో ఆమె ఆకాశానికి ముఖమెత్తి దైవాన్ని ప్రార్థించింది. అంతలోనే ఆనందాతిరేకంతో "ఫీబస్, ఫీబస్" అని అరిచింది. భవనంవైపు చేతులు చాచలేకపోయినా ప్రార్థనాపూర్వకంగా చూసింది. ఫీబస్ కనుబొమలు ముడుచుకోనడం ఆమె చూసింది. అతనిప్రక్కనే ఒక యువతి అతనివంక అలుకతో చూడ్డం గమనించింది. ఫీబస్ ఆమెతో ఏదో చెప్పినట్లు పెదవులు కదిలాయి. అంతలోనే యిద్దరూ బాల్కనీ విడిచి లోనికి వెళ్ళిపోయారు.

"ఫీబస్" అని బిగ్గరగా అరిచింది ఎస్మరాల్డా. "నువ్వుకూడా నన్ను నమ్మవా?" అని దీనంగావిలపించింది. అకస్మాత్తుగా ఆమెకు జ్ఞప్తికి వచ్చింది——కెప్టెన్ ఫీబస్‌ను హత్య చేసినందుకే ఆమెకీ శిక్ష! ఆమె తల గిర్రున తిరిగిపోయింది. స్పృహతప్పిపడిపోయింది. భటులామెను పట్టుకుని బండివద్దకు దారితీశారు.

అప్పటికి ఇంతమంది జనంలో ఒక్కరూ చర్చి పైభాగంలో శిల్పసముదాయంవంక చూడనేలేదు. అక్కడ కూర్చుని జరిగినదంతా విభ్రాంతుడై చూస్తున్న వ్యక్తి నెవరూ గమనించలేదు. చిరుగాలికి రెపరెలాడుతున్న అతని దుస్తుల అంచులుతప్ప, అతడు కూడ వికృతిశిల్పాలలో ఒక శిల్పంవలె నిశ్చలంగా కన్నార్పక చూస్తున్నాడు. ఉదయంనుంచీ అక్కడిదృశ్యాన్ని తదేకంగా అతడు గమనిస్తున్నాడు. ఎవ్వరూ కనిపెట్టకుండాముందే అక్కడ తగిన ఏర్పాట్లు చేసుకున్నాడు. పైన ఒక రాతిస్తంభానికి పొడుగాటి పగ్గ మొకటి గట్టిగా ముడివేసి నేలమీదికి వేలాడవేశాడు.

ఆ స్తంభంవద్దనే కూర్చుని జాగ్రత్తగా వీధిలో జరుగుతున్నదంతా గమనిస్తున్నాడు.

భటులు జిప్సీయువతిని బండివద్దకు ఈడ్చుకుపోతున్న సమయంలో క్వాసిమోడో చరచర తాడు పట్టుకుని దిగజారిడు. భటులపైకి లంఘించి రెండు పిడికిళ్ళతో మోది ఇద్దరినీ పడగొట్టాడు. ఒక చేతితో జిప్సీ యువతిని ఒక్క ఉదుటున రౌతు భుజంపై వేసుకున్నాడు. చర్చిలోపలి కొక్క దూకులో ప్రవేశించాడు. లోమందిరంలోనించి యువతిని బొమ్మనెత్తినట్లు రెండుచేతులతో తలపైకెత్తి పట్టుకుని "శరణు, భగవంతుని శరణు" అంటూ బిగ్గరగా అరవ నారంభించాడు. మందిరమంతా అతని భయంకర గర్జనలను ప్రతిధ్వనించింది.

అంతా త్రుటిలో జరిగిపోయింది.

ప్రజలందరూ ప్రతిధ్వానం చేశారు: "శరణివ్వాలి, శరణు" అని ఒక్క పెట్టున అరిచారు. ప్రజల సానుభూతికి క్వాసిమోడో ఒక్కకన్నూ ఆనందంతో తళతళలాడింది. ఈసంకులానికి ఎస్మెరాల్డాకి స్పృహ వచ్చింది. ఆమె కన్నులు తెరిచి చూసింది. క్వాసిమోడో కళ్ళబడగానే భీతితో తిరిగి కన్నులు మూసుకుంది.

ప్రభుత్వ న్యాయాధిపతి చర్చి ప్రాంగణంలో నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. భటులు స్తంభితులైనారు. నాటర్ డామ్ చర్చి లోపల ఉన్నంతవరకూ యువతికి భయంలేదు. ఆమె నెవ్వరూ అక్కడ తాకలేరు. దేవాలయం ప్రవేశించే అధికారం ప్రభుత్వాధికారులకు లేదు.

క్వాసిమోడో మందిరం మధ్యలో నిలబడ్డాడు. రాతి స్తంభాల వలె కాళ్ళని నిలిచాడు. అతని పెద్దతలపై చెదరిన రాగిజుట్టు మృగరాజు కేసరాలు విదల్చినట్లుంది. నిలువల్ల కంపించిపోతున్న యువతిని ఒక చేతిపై కండువా వేసుకున్నట్లు మోస్తున్నాడు.

అయితే తన చేతిలోనున్నది గాజుపూస కాబోలన్నట్లు అతిపదిలంగా చేయి జారకుండా మృదువుగా పట్టుకున్నాడు. తనశ్వాస సోకితే ఆమె శరీరం కందిపోతుందని భయపడుతున్నట్లామెను అతిజాగ్రత్తతో కాపాడుతున్నాడు. ఉన్నట్టుండి ఒకొక్కప్పుడు తన ప్రాణంతో సమానమైన నిక్షేపంవలె ఆమె శరీరాన్ని భుజాని కదుముకుంటున్నాడు. ఒకొక్కప్పుడు పసిబిడ్డను తల్లి పొదివి పట్టుకున్నట్లు ఆమెను అక్కున జేర్చుకుంటు

న్నాడు. తన ఒక్క కన్నుతో ఆమెపై ఆర్ద్రమైన అనురాగం ప్రసరింపచేస్తున్నాడు. ఆ చూపులో అనురాగంతోపాటు అపారమైన కరుణ, విషాదం గోచరిస్తున్నాయి. ఆమెను చూస్తున్న కొద్దీ అతని కన్నులలో తటిల్లతలు మెరుస్తున్నాయి. నిజంగా ఆక్షణంలో అంతటి వికృతరూపి ముఖంలో సౌందర్యమే గోచరించింది. మహా బలసంపన్నుడైన అతనిముఖంలో తేజస్సుకూడా ద్యోతకమయింది. మాతాపితృవిహీనుడై, కురూపియై, సమాజంనుంచి తిరస్కృతుడై, అందరి అవమానానికీ గురైన క్వాసిమోడో, ఆ ఒక్క క్షణంలో అతని జీవితమంతటినీ ధన్యమొనర్చగల మహత్తర విజయం లభింపచేసుకున్నట్లున్నాడు. మానవులలోకెల్ల అధమాధముడైనవాడొక్కడు మహారాజు రాజ్యప్రాభవాన్ని తిరస్కరించి మానవ సమాజాన్ని ధిక్కరించి,మానవులేర్పరచుకున్న న్యాయశాసనాల్ని, న్యాయనిర్వహణాధికారుల్ని పెడద్రోసి జయించినమహత్తర ఘట్టం అది. అతడికా బలమిచ్చినది దైవం!

అంతటి వికృతరూపియైనవాడు, అంతటి సౌందర్యరాసిని మృత్యువునుంచి తప్పించిన ఆ ఘట్టంచూసి అక్కడి ప్రజలంతా విభ్రాంతులైనారు. ప్రకృతీ సంఘమూ కలిసి ప్రభవింపచేసిన ఈ విపరీత వ్యక్తులు పరస్పరం సహాయపడ్డం విధివైచిత్ర్యం!

కొంతసేపు తన దిగ్విజయాన్ని ప్రకటించి క్వాసిమోడో చర్చి అంతర్భాగంలోనికి ఆమెను మోసుకుని వెళ్ళిపోయాడు. ఇటువంటి వీరకృత్యాలకు ముగ్ధులయ్యే ప్రజలు హర్షధ్వానాలు చేశారు. అంతలోనే క్వాసిమోడో చర్చి పైభాగంలో శిల్పరాశి మధ్య కనపడ్డాడు. ఆశిలలమధ్య ఉన్మత్తునివలె పరుగెత్తాడు. "శరణు శరణు" అంటూ దిక్కులదిరేటట్లు గర్జిస్తూ పరుగెత్తుతున్నాడు. చర్చి గోపురంకొసకు చేరి అంతరిక్షంలో నిలిచి గర్జించ నారంభించాడు. జనుల హర్షధ్వానాలు నగరమంతా మారుమ్రోగాయి. క్వాసిమోడో గంభీరగర్జనలకు ఆకాశం మారుపలికింది.

## 26

పెంపుడు కొడుకు జిప్సీ యువతిని ఉరితాడునుంచి రక్షించిన సమయంలో పెంపుడు తండ్రి అయిన క్లాడ్ ఫ్రొలో నాటర్ డామ్ చర్చి పరిసరాలలో లేడు. జిప్సీ యువతిని ఆఖరు

సారి అడిగి నిరాశ చెంది లోమందిరంలోకి వెళ్లిపోయాడు. తన గది ప్రవేశించి టోపీ, పై అంగరఖా, విసిరి వేశాడు. వెనక ద్వారం గుండా చర్చినుండి బైటపడ్డాడు. సీన్ నదిలో ఒక్క బోటు పిలిచి ఆవలిఒడ్డుకి చేరాడు. యూనివర్సిటీ వీధులగుండా చరచర నడిచాడు. దారిలో గుంపులు గుంపులుగా పోతున్న జనం కనపడ్డారు. జిప్సీ యువతిని ఉరితీస్తుంటే సంబరం చూడాలని వారు వెడుతున్నారు. క్లాడ్ ఫ్రోలో మరింత వేగంగా నడిచాడు. అతని ముఖం తెల్లగా పాలిపోయివుంది. ముఖాన వార్ధక్యరేఖలు మరింత గుంపుజేరినట్లున్నాయి. జుట్టు రేగి కనుగుడ్లు వెళ్ళబెట్టుకుని పిచ్చివానివలె ఉన్నాడు. అతని హృదయం ఛిద్రమయింది. అంధునివలె దారీ తెన్నూ కానక వడివడిగా నడిచిపోతున్నాడు. నడుస్తున్నాడో పరుగెత్తుతున్నాడో చెప్పటం కష్టం. గ్రీవ్ చౌకుకు దూరంగా, అతి కైనంతదూరం పారిపోవాలని దొరికిన దారిని బడి పోతున్నాడు. క్రమంగా గుట్టలు, కొండలు దగ్గరైనాయి. ఒకచోట నిలిచి వెనక్కు చూశాడు. పారిస్ కొండల మాటున పడిపోయింది. అక్కడాగి ఒక్కసారి ఊపిరి పీల్చుకున్నాడు.

అప్పుడతనికి ఒక్క పెట్టున అనేక యోచనలు ముసురుకు వచ్చాయి. అంతరంగాన్ని ఒకసారి పరిశీలించుకొని గజగజ వణికి పోయాడు. తనను సర్వనాశనం చేసిన యువతిని తలపుకు తెచ్చుకున్నాడు. తానామెకు సర్వనాశనం తెచ్చిపెట్టాడు. ఇద్దరి ప్రారబ్ధమూ ఏ వంకరదారులవెంట ఇద్దరినీ నడిపించిందో నెమరు వేసుకున్నాడు. తన మతం, తన దీక్ష, తన సంయమనం అన్నీ ఒక్కక్షణంలో కర్పూరంవలె హరించిపోవటం తెలుసుకున్నాడు. ఇంత సర్వనాశనమైన తరువాత ఇంక చెడుగది అనే యోచన అతిక్షుద్ర విషయాలను మనసులో రూపొందించుకో నారంభించాడు. లోలోన నిగ్రహించబడిన నీచోద్రేకాలు పెల్లుబికి అతణ్ణి లోబరుచుకున్నాయి. అసూయాద్వేషాలు తలమున్కలై పొంగాయి. దీనికంతటికీ విఫలప్రేమయే హేతువని అతడెరుగును. మానవుని గుణశీలాలకు, అభ్యున్నతికి మూలహేతువైన ప్రేమయే నిస్సంగి కావలసిన మతాచార్యునికి పతనహేతువౌతుంది. క్లాడ్ ఫ్రోలో భయంకరంగా నవ్వాడు. అంతలోనే అతని వికటాట్టహాసం ఆగి పోయింది. ముఖం మరింత పాలిపోయింది. దురితమైన అతడి అనురాగం అతణ్ణి నరకానికి, ఆమెను ఉరికంబానికి పాలుచేసింది.

ఫీబస్ చచ్చిపోలేదని అతడికి గుర్తు వచ్చింది. జిప్సీ యువతి కాక మరొక ప్రియురాలతని కుంది. తరువాత తన వివేకాన్ని, హృదయాన్ని హరించి పిచ్చివానిగా చేసిన సుందరి పారిస్ నగర వాసులందరి సమక్షంలో అవమానింపబడుతున్నదని జ్ఞప్తికి వచ్చింది. మల్లెపువ్వులాంటి సుందరి ఉచ్చులో పడి నలిగిపోతున్న దృశ్యం అతని కళ్ళకు కట్టినటయింది. తన నిస్సహాయత, భంగపాటు, నిస్సత్తువ మరింత అనుభవమైనాయి.

ఫీబస్ అనేవాడు లేకపోతే, తాను మతాచార్యుడే కాకపోతే, ఆ సుందరిని పొంది అనుభవించగల ఆనందం ఊహించుకొన్నాడు. తన ప్రస్తుత స్థితికి చింతించాడు. ఉన్మత్తునివలె జుట్టు పీక్కోవడం మొదలుపెట్టాడు. ఉన్నట్టుండి మొట్టమొదటిసారి ఆ సుందరిని చూసిన దృశ్యం మనోగోచరమైంది. తరువాత ఆమె ఉచ్చులో విగతజీవిగానె తామరపూవలె వ్రేలాడుతున్నట్లు పొడగట్టింది.

ఈ రీతిగా వేయి తలపులలో ఉన్మత్తుడై తిరిగి పరుగెత్త నారంభించాడు. ప్రకృతికి, జీవితానికి, మనుష్యులకు, భగవంతునికి దూరమై పారిపోవాలని పరుగెత్తాడు.

సాయంకాలమయింది. అతనిలో పెనుతుపాను భీభత్సమై చెలరేగింది. చివరికి హతబుద్ధియైన అతనికి రెండే రెండు చిత్రాలు — జిప్సీ సుందరి నృత్యం, ఉరికంబంలో సుందరి — ఇవే మనోగోచరమౌతున్నాయి అయితే ఇంత దుర్భర వేదనలో ఆత్మహత్య చేసుకోవాలనే తలపు అతనికి కలగలేదు. అతనికి జీవితంపై మక్కువ అధికం. మరణానంతరం నరకం తనకోసం సిద్ధంగా ఉంటుందని అతనికి తెలుసు.

చీకటి పడింది. పారిస్ నగరానికి అతిదూరంలో ఉన్నట్లు భావించాడు. కాని ఒకసారి జాగ్రత్తగా పరిసరాలను గమనించగా యూనివర్సిటి ప్రాంతంలోనే ఇంతవరకూ తిరుగాడినట్లు తెలిసివచ్చింది. దగ్గరలోనే పరిచయమైన గోపురాలు కనిపించాయి.

వెనక్కు తిరిగి నగరాభిముఖమై నడిచాడు. నగరవీధుల వెంబడి నడుస్తూ ఎరిగినవారి కంటబడకుండా తల వంచుకుని నడిచాడు. ఒక బోటులో సీన్ నది దాటాడు. జలప్రవాహధ్వని వినేసరికి అతని మనస్సు కొంత కలత చేరినట్లయింది. బోటు దిగి పరిచయ

మార్గమంతటా నడిచాడు. బుద్ధి భ్రమించిన అతని కళ్ళకు చీకటిలో ఆ భవనాలు, గోపురాలు, మధ్య మధ్య కిటికీలలోని దీపాలవెలుగులు అన్నీ నరకలోక దృశ్యాలవలె కనపడుతున్నాయి. మధ్యమధ్య చిన్న చిన్న ఇళ్ళలోనుంచి, భవనాలలోనుంచి ఆక్రందన ధ్వనులు, హాస్యోల్లాస ప్రసంగాలు వినవస్తున్నాయి. చెవులు మూసుకుని పరుగెత్త నారంభించాడు. వంతెనవద్దకు వచ్చేసరికి అతనికి వృద్ధురాలి గృహం జ్ఞప్తికివచ్చింది. అక్కడే ఎస్మరాల్డా ఫీబస్‌ను కలుసుకున్నది. అక్కడే ఫీబస్‌ని అతను కత్తితో పొడిచినది. ఇల్లు సమీపించి తలుపుల సందులోనుంచి తొంగిచూశాడు. చూసి నిర్ఘాంతపోయాడు. అతని తమ్ముడు జెహాన్ ఒక యువతి ప్రక్క కూర్చుని సరసమాడుతున్నాడు. గ్లాసెత్తి మద్యం తాగాడు. తరువాత జేబులు తడుముకున్నాడు. ఖాళీజేబు చూసుకుని విసుగుచెందాడు. "ఇంక నాదగ్గర డబ్బు లేదు. మళ్ళీ అన్న దగ్గరకు పోవాలి అన్న అదృష్టవంతుడు. జేబులో నిత్యం డబ్బు ఉంటుంది" అంటూ లేచాడు. క్లాడ్ తొందరగా రెండడుగులు వేసి బాటప్రక్కగా బోరగిల పడుకున్నాడు. జెహాన్ తలుపులు తెరుచుకు వచ్చాడు. బాటప్రక్క పడివున్న మనిషి ఆకారం గమనించి సమీపించాడు. క్లాడ్ కదలలేదు; శ్వాసైనా విడువలేదు. జెహాన్ కాలితో అన్నతలను ఒక్క తాపు తన్నాడు. క్లాడ్ కదలలేదు. "తెగ తాగాడు ఎవడో. ఒంటిమీద స్పృహ లేదు. అదృష్టవంతుడు" అనుకుంటూ జెహాన్ తనదారిని తూలుతూ వెళ్ళిపోయాడు.

తమ్ముడు కనుచూపుమేర దాటగానే క్లాడ్ ఫ్రాలో లేచి నాటర్ డామ్ చర్చివైపుకు శక్తికొద్దీ పరుగెత్తాడు. చౌకు మొగలో ఆగాడు. కాని ఉరి స్తంభంవంక కన్నెత్తిచూసే ధైర్యం లేకపోయింది

"ఇవాళ — ఈ ఉదయమే ఇక్కడ అటువంటిఘోరం జరిగి ఉంటుందా!" అని విభ్రాంతి చెందాడు.

మెల్లిగా తలెత్తి చర్చివంక చూశాడు. గుడ్డివెన్నెలలో చర్చి ప్రశాంతంగా కనపడింది. గోపుర శిఖరంపై చంద్రవంక కనపడింది. చర్చి ద్వారాలన్నీ బంధింపబడి ఉన్నాయి. గోపుర ద్వారపు తాళపుచెవి నిత్యం అతనివద్దనే ఉంటుంది. ఆ ద్వారం తెరుచుకుని వెనుకగా తలుపుమూసి లోనికి ప్రవేశించాడు. ప్రవే

శించి చుట్టూ కలయచూశాడు. చుట్టూ శిల్పాకృతులు ప్రాణం పోసుకుని తన విన్యాసాలను గమనించినవని భ్రమించాడు. మందిర మంతా చైతన్యవంతమై తనవంక పరీక్షగా చూస్తున్నట్లు ఊహించాడు. వికృతాకారులు తన్ను తేరి చూస్తున్నట్లు భావించి, అపరిమితమైన భీతితో గోపురం సోపానాలవంకకు పరుగుతీశాడు. మతి భ్రమించిన అతని దృష్టిలో భ్రమకీ యధార్థానికీ మధ్య వ్యత్యాసం నశించింది. కన్నులకు కనపడినది భ్రమ అనీ, భ్రమించినది వాస్తవమనీ పొరపడి నిజానిజాలు తెలియలేని స్థితిలో పడ్డాడు: మిద్దెఎక్కి చూసేసరికి గోపురంలో వెలుగు కనపడింది. పవిత్ర గ్రంథంవద్ద నిత్యం వెలిగే దీపమది. పరుగెత్తి అక్కడకు వెళ్లి ఆగాడు. తెరిచిఉన్న బైబిల్ గ్రంథంవంక చూశాడు. అందులో ఒక వాక్యం అతనికంట పడింది "నా కన్నులయెదుట ఒక ఆకారం గాలిలో తేలి వెళుతోంది. అప్పుడు భీతివల్ల నా తలపై జుట్టు మొనలపై నిలబడింది."

చదవగానే క్లాడ్ భీతితో కన్నులు మూసుకున్నాడు. కాళ్లు వణికాయి. సత్తువ వీగిపోయింది. నేలపై కూలబడిపోయాడు.

అలా అత నెంతసేపున్నాడో అతనికే తెలియదు. కొంత సేపటికి లేచి నిలబడ్డాడు. విశ్వాసపాత్రుడైన తన పెంపుడు కొడుకు సమీపంలో ఆశ్రయం తీసుకోవాలనుకున్నాడు. పాప మనియైనా తలచక బైబిల్‌వద్ద వెలుగుతున్న దీపం చేతిలోకి తీసుకున్నాడు. తడబడుతున్న అడుగులతో తిరిగి మెట్లెక్కాడు. శిఖరం సమీపించే సమయానికి అతని ముఖంపై చల్లని గాలి సోకింది. గోపురంలో చిట్టచివరి అంతస్థు గదిదగ్గరకు చేరాడు. ఆకాశం చాలవరకు ,మేఘావృతమైఉంది. చంద్రవంక మధ్యమధ్య కనపడుతూ మబ్బులచాటున దాగుతోంది. ఒకసారి నగరంవంక చూశాడు. టవర్ గడియారం పన్నెండుగంటలు కొట్టింది. అర్థ రాత్రయింది. మధ్యాహ్నం పన్నెండుగంటల సంగతి అతనికి జ్ఞప్తికి వచ్చింది. "ఇప్పటి కామె శవం మిగిలిఉంటుంది" అనుకున్నాడు.

ఒక గాలి తెరవచ్చి అతని చేతిలోని దీపం ఆర్పివేసింది. అదే క్షణంలో గదిముందు ఒక స్త్రీ ఆకారం అతని కళ్ళబడింది. క్లాడ్ గజగజ వణికిపోయాడు. ఆ స్త్రీప్రక్క మేకఆకారం కన

పడింది. ఆమెను చూసి చేష్టలు దక్కి నిలబడిపోయాడు. యువతి ముఖం పాలిపోయింది. ఆమె ముఖంలో విషాదం గూడుకట్టుకుంది. ఆమె శిరోజాలు భుజాలపై విస్తరించాయి. ఆమె మెడకు ఉరి తాడు మాత్రం లేదు. చేతులు బంధించబడలేదు. ఆమె తెల్లని దుస్తులు ధరించింది. ఆమె తలపై తెల్లనివలువ కప్పిఉంది.

ఆమె మెల్లిగా అతని వంకకు నడిచివస్తోంది. ఆమెచూపులు ఆకాశంవంక తిరిగిఉన్నాయి. క్లాడ్ పారిపోవాలనుకున్నాడు; కాని కాళ్ళాడలేదు. అతని ఒంటిలో నెత్తురు గడ్డ కట్టినట్లయింది. ఆమె అతన్ని చూడనేలేదు. ప్రక్కగా నడిచివెళ్ళిపోయింది. మేకకూడా ఆమె వెంటనే వెళ్ళింది. ఆమె పగలు చూసినప్పటి కంటె పొడుగెదిగినట్లు అతనికి కనపడింది. సుద్దివన్నెలలో ఆమె తెల్లని దుస్తులు అతని మతిని భ్రమింపచేశాయి.

ఆమె వెళ్ళిపోగానే అతని కాళ్లు కదిలాయి. ప్రతిమాపు లతో ఒక్కొక్కటే మెట్లు దిగాడు. ఆరిపోయిన దీపం చేతి లోనే ఉంది. బైబిల్‌లోని వాక్యం అతని చెవులలో ప్రతిధ్వ నించింది.

# 27

మధ్య యుగాలలో ప్రతి పట్టణంలోనూ శరణార్థులకు ఆశ్రయమిచ్చే గృహాలుండేవి. న్యాయశాసనప్రకారం శిక్ష పొందినవారు అక్కడికి చేరి తలదాచుకొనేవారు. ఇటువంటి ఆశ్రయాలలోనికి అధికారులు ప్రవేశించకూడదని నిషేధముండేది. ఒకవంక శిక్షాశాసనం అపమార్గాలలో ప్రవర్తిల్లుతుంటే, దోషులు శిక్ష తప్పించుకొనే విధానం ప్రజలలో అలవడింది. మహారాజుల భవనాలు, రాజవంశస్థుల నివాసాలు, క్రైస్తవ మందిరాలు శర ణార్థులకు ఆశ్రయాలు.

ఈ ఆశ్రయాలలో చేరిన శరణార్థులను అధికారులు తాక లేరు. అయితే అప్పుడప్పుడు పార్లమెంటు ప్రత్యేక శాసనం చేసి కొన్ని కొన్ని ఆశ్రయాలలో శరణుపొందిన దోషుల్ని పట్టించడం కద్దు. అయితే అటువంటిది అరుదు. ఈ ఆశ్రయాలలో తలదాచు కొన్నవారు ఆశ్రయం దాటి ఒక్క అడుగు బయటకు వస్తే చాలు పట్టుకోడానికి భటులు సిద్ధంగా ఉండేవారు. అందువల్ల శరణార్థు లకు ఆ ఆశ్రయాలే బందిఖానాలయేవి. కొందరు కొందరు అలా జీవి

తాంతం గడిపినవారున్నారు. ప్రతి ఆశ్రయంలోనూ శరణార్థుల కొక గదో కూపమో ప్రత్యేకించబడేది. నాటర్ డామ్ చర్చిలో గోపురంపైన ఒక గది అటువంటిదే ఉంది. క్వాసిమోడో ఎస్మరాల్డాను తీసుకువచ్చి ఆ గదిలోనే విడిచిపెట్టాడు.

అక్కడ విడిచిపెట్టిన కొంతసేపటికిగాని ఆమెకు స్పృహ రాలేదు. స్పృహ తప్పిపోయినప్పుడు ఆమె తన మెడకు ఉచ్చు తగిలి చచ్చిపోతున్నట్లు ఊహించుకుంది. ఆమెకు స్పృహరాగానే ఎదుట క్వాసిమోడో కనపడ్డాడు. బెదిరి చుట్టూ చూసింది. ఆమె చర్చిలో ఉన్నట్లు తెలుసుకుంది. అప్పుడామెకు జ్ఞప్తివచ్చింది. భటులవద్దనుంచి క్వాసిమోడో తన నెత్తుకుపోయినట్లు, ఫీబస్ బ్రతికే ఉన్నట్లు, అతడికి తనపైన ప్రేమ లేనట్లు గుర్తుకు వచ్చింది.

క్వాసిమోడో ఆమెప్రక్కనే నిలబడ్డాడు. ఆమె అతని ముఖంవంక చూసింది.

"నన్నెందుకు రక్షించావు?" అని అతణ్ని ప్రశ్నించింది.

అతడామెవంక ఆందోళనతో చూశాడు. ఆమె చెప్తున్న దేమిటో గ్రహించడానికి ప్రయత్నించాడు. ఆమె మళ్ళీ అలాగే ప్రశ్నించింది. అతడామెవంక అతిదీనంగా చూసి తల దించుకున్నాడు. తరువాత మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్లిపోయాడు. ఆమె ఆశ్చర్యపడింది.

అతడు తిరిగివచ్చి ఒక బంగీ తెచ్చి ఆమె పాదాలవద్ద ఉంచాడు. ధర్మపరు లెవరో ఆమెకోసం ఆ దుస్తులు చర్చిముంగిట ఉంచారు ఎస్మరాల్డా ఒకసారి తనవంక చూసుకొంది. లోదుస్తులు తప్ప మర్యాదైన ఆచ్ఛాదనం తన ఒంటిపైలేదని అప్పుడు గ్రహించింది. ఆమె చెక్కిలు లజ్జవల్ల ఎర్రబడినాయి. అప్పటి కామె ముఖంలో తిరిగి జీవం ప్రకాశించినట్లయింది. క్వాసిమోడో ఆమె లజ్జ కనిపెట్టాడు. ఒక చేతితో తన ముఖం మూసుకుని వెనుతిరిగి వెళ్ళిపోయాడు.

ఎస్మరాల్డా బంగీ విప్పింది. అవి తెల్లని దుస్తులు. తల కప్పుకునే తెల్లని వలువ ఒకటుంది. గబగబ ఆమె ఆ దుస్తులు ధరించింది. ధరించినంతలోనే క్వాసిమోడో తిరిగి వచ్చాడు. ఒక చేత్తో బుట్ట ఒకటి, మరొక చేత్తో చాప పట్టుకువచ్చాడు. బుట్టలో రొట్టె, పళ్ళు, ఒక సీసా ఉన్నాయి. బుట్ట కిందపెట్టి "తిను"

అన్నాడు. చాప నేలపై పరిచి "ఇక్కడ పడుకో" అన్నాడు. తన ఆహారం, తన పడక ఆమె కిచ్చాడు.

యువతి తన కృతజ్ఞత తెలపాలని తలెత్తిచూసింది. కాని అతని వికృతాకారం ఆమెకు విపరీతమైన భయం కలిగించింది. చూడలేక తలవంచుకుంది.

"ఓ!" అన్నాడు క్వాసిమోడో. "నన్ను చూస్తే మీకు భయం వేస్తోందనుకుంటాను. ఏం చెయ్యను! దేవుడిలా చేశాడు. నావంక మీరు చూడకండి. నామాటలు వింటూఉంటే చాలు. పగటివేళ మీరిక్కడే ఉండండి. ఎక్కడికి వెళ్ళవద్దు. రాత్రి వేళ చర్చిలో అంతటా మీరు తిరగవచ్చు. అయితే రాత్రికాని పగలుకాని ఎప్పుడూ మీరు చర్చిదాటి ఒక్క అడుగుకూడా వెళ్ళకూడదు. వెడితే మిమ్మల్ని పట్టుకుంటారు. పట్టుకుని ప్రాణాలు తీసేస్తారు. మీరు చనిపోతే నేను బ్రతకలేను."

ఈ మాటల కామె కరిగిపోయింది. జవాబివ్వాలని తలెత్తి చూసింది. అతడక్కడ లేడు; అప్పుడే వెళ్ళిపోయాడు. ఆగదిలో ఒంటరిగా ఉండి అతని మాటలను ఆమె తలుచుకోనారంభించింది. గొంతుక బొంగురైనా, అతని మాటలలోని మార్దవం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది.

తరవాత కొంతసేపటికి ఆమె కదిలి గది పరిశీలించింది. గది చాలా చిన్నది. మొత్తం నేల అటూ ఇటూ అరకుగులుంటుంది. ఒకపక్క కిటికీవంటి చిన్నరంధ్రం ఉంది. ద్వారం తెరిస్తే ఇటుకలు పేర్చిన మిద్దెమీదికి దారి. వాన నీరు ప్రవహించే గొట్టాలు వికృత శిల్పాకారాలలోనుంచి వచ్చి ఈ మిద్దెపైకి వంగి ఉన్నాయి. రంధ్రంలోనుంచి చూస్తే శిల్పాకృతిలో క్రూర జంతువులు ఆమెవంకకే చూస్తున్నట్లు కనపడ్డాయి. మిద్దెమీద నిలబడి చూస్తే పారిస్ నగరంలోని పొగగొట్టాలలోనుంచి పైకి వచ్చే పొగలు కనపడతాయి.

ఆమెకా గదిలో ఒంటరితనం ఇనుమడించినట్లు తోచింది. ఆమె తన దీనస్థితిని గురించి తలపోస్తున్న సమయంలో చేతి కేదో తగిలింది. ఉలిక్కిపడి చూసింది. డాలీ! ఆమె ఆ క్షణంలో ప్రతి చిన్న విషయానికీ హడలిపోతోంది. క్వాసిమోడో ఎమురాల్డాను ప్రతుటిలో తప్పించి చర్చిలోకి తీసుకువచ్చినప్పుడు డాలీ

దుముకుతూ వెంట వచ్చింది. అంతవరకూ ఆమెకు డాలీమాటే గుర్తుకురాలేదు. "అయ్యో నా డాలీ! నిన్ను మరిచేపోయాను. నీకైనా నామీద ప్రేమపోలేదు నయం." అంటూ ఆమె మేకను ముద్దుపెట్టుకుంది. తరవాత మేకను కౌగలించుకుని తన దుస్థితి తలుచుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. చెంపలు కన్నీటితో మలినమైనాయి. కొంతసేపటికి తేరుకుని చూసింది. చీకటిపడింది. గుడ్డి వెన్నెలలో ఆకాశం అప్పుడామెకు మనోహరంగా కనపడింది. మెల్లిగా లేచి మిద్దెమీదకు వచ్చింది అంతటా ప్రశాంతత ఆవరించి ఉంది. అప్పటికామె సేద దేరింది

మరునాడుదయం మెలకువ వచ్చేవరకూ ఆమెకు తాను నిద్రపోయినట్లే తెలియాదు. ఆమె అంత సుఖంగా నిద్రించి చాలరోజులయింది. కిటికీలోనుంచి సూర్యరశ్మివచ్చి ఆమె ముఖంపైన పడుతోంది. కాని సూర్యబింబం ప్రక్కనే క్వాసిమోడో వికృతముఖం కనపడింది. ఆమె వెంటనే కళ్ళుమూసుకుంది. కాని కళ్ళుమూసుకున్నా అతనిముఖం కన్నులకు కట్టినట్లుంది. ఆమె కళ్లు తెరవలేదు. ఈ మాటలుమాత్రం వినపడ్డాయి. "భయపడకండి. నేను మీ మేలుకోరే స్నేహితుణ్ని. మీరు నిద్రపోతుంటే చూడాలని వచ్చాను. మీరు కళ్లుమూసుకుని నిద్రపోతున్నప్పుడు నేను చూస్తే భయంలేదుకదా. సరే. నేను తప్పుకుంటున్నాను—ఇక్కడ గోడకక్కనే ఉన్నానిప్పుడు. ఇప్పుడు మీరు కళ్లు తెరవండి"

ఈమారు అతనిమాటలలో మరింత మార్దవం, అనునయం వినవచ్చాయి. ఎమరాల్డాకి జాలికలిగింది. కన్నులు తెరిచిచూసింది. నిజంగా నే అతడు కిటికీవద్దలేడు. కిటికీవద్దకు వెళ్లింది. అందులోనుంచి తలవొంచి కిందికిచూసింది. గూనివాడు గోడపక్క ఒదిగొదిగి నిలబడి ఉన్నాడు. అతనిముఖంలో విషాదం, నిస్పృహ స్పష్టంగా కనపడుతున్నాయి. ఆమె భయమూ, జుగుప్సా జయించాలని ప్రయత్నించింది. "రా ఇక్కడికి" అందామె. ఆమాటలలో దాక్షిణ్యం ఉట్టిపడుతోంది. ఆమె పెదవుల కదలికచూసి వెళ్లిపొమ్మన్నదని భావించాడు క్వాసిమోడో. తల మరింత వొంచుకొని మెల్లి మెల్లిగా అడుగులు వేసుకుంటూ కదిలిపోయాడు. అతని కిమాటు ఆమెవంక చూసే ధైర్యంలేకపోయింది. "ఇక్కడికి ఇలారా"అని ఆమె మళ్ళీ పిలిచింది. కాని అతడదే దిక్కుగా పోతున్నాడు. ఆమె తటాలున గది

దాటివచ్చింది. అతనివద్దకు పరుగెత్తి అతని చేయి పుచ్చుకుంది. ఆ స్పర్శతో క్వాసిమోడో నిలువెల్లా చలించిపోయాడు. అతిదీనంగా ముఖమెత్తి ఆమెవంక చూశాడు. ఆమె అతన్ని చెయ్యిపట్టుకుని దగ్గరకు లాగి నిలబెట్టింది. అతని ముఖంలో శిసుసహజమైన ఆనందం వెల్లివిరిసింది. ఆమె తన గదివైపు కతన్ని లాక్కురాబో యింది. కాని అతడు వినలేదు. "వొద్దు వొద్దు" అన్నాడు. "కోకిల గూటిలోకి గుడ్లగూబ రావచ్చునా?" అన్నాడు. ఆమె బలవంతపరిచింది. గది గుమ్మంవరకూ వెళ్లి అక్కడే నిలబడి పోయాడు. లోపలికి అడుగుపెట్టలేదు. ఆమె వెళ్ళి చాపపైన కూర్చుంది.

ఇద్దరూ కొంతసేపు మౌనంగా ఉండిపోయారు. అతడా అపారసౌందర్యాన్ని, ఆమె ఆ ఘోర వికృతాకారాన్ని పరిశీ లిస్తూ ఉండిపోయారు. క్షణక్షణానికీ ఆమె కతనిలో కొత్తకొత్త అంగవైకల్యాలు కనపడుతున్నాయి. ముడి మోకాళ్ళనుంచి గూని వరకూ, గూనివద్దనుంచి ఒంటికన్ను ముఖంవరకూ దృష్టి సారించి చూసింది. మనిషి ఇంత వికృతంగా ఎలా ఉండగలడని ఆశ్చర్య పడింది. అతని ముఖంలో అంతకంతకి విషాదభావం, నిస్సహాయత, దైన్యం ప్రస్ఫుటమౌతున్నాయి. చివరి కామె ఆముఖం చూడ్డాని కలవాటు పడింది.

"మీరు నన్ను వెనక్కి పిలిచారా?" అని అడిగాడు క్వాసి మోడో.

అవునన్నట్లామె తలూపింది. అది అర్థం చేసుకున్నాడు.

చెప్పలేక చెప్పలేక చెప్పాడు: "మీకు తెలియదేమో! నాకు చెవుడు."

"పాపం!" అన్నదామె జాలితో.

జాలిగా చిరునవ్వు నవ్వాడు. "నాకింక లేని వైకల్యా లేమున్నవనుకుంటున్నారు కాదూ! అవును. నేను చెవిటివాణ్ని. ఎంతఅన్యాయమో చూడండి. మరి మీరెంత చక్కగా ఉన్నారు!"

ఆమె హృదయం ద్రవించింది. కాని మాట్లాడలేదు. మాట్లా డినా అతనికి వినపడదు.

క్వాసిమోడో నిట్టూర్పువిడిచి అన్నాడు: "ఈనాటివరకూ నే నెంత వికృతంగా ఉన్నానో నాకే తెలియలేదు. మీతో నన్ను

పోల్చుకుంటే నా కెంతో బాధ కలుగుతోంది. మీకళ్ళకి నేనొక మృగంలా కనపడుతున్నా ననుకుంటాను. మీరో నా కళ్ళకి సూర్యకాంతిలా, తుషార బిందువులా, కోకిల పాటలా కనపడు తున్నారు. నేను మనిషినీకాను, మృగాన్నీ కాను. నాది ఒక ఆకారమని చెప్పలేను. దేవుడు నన్ను ముద్దగాపిండి కుమ్మి ఈ విధంగా చేశాడు."

అతనికి నవ్వు వచ్చింది. నవ్వు ఇంత హృదయవిదారకంగా ఉంటుందని చూసి ఆమె చకితురాలైంది.

తరవాత ఇలా చెప్పాడు. "నాకు చెవుడు. కాని మీరు సంజ్ఞలతో నాకు చెప్పండి. నాతో అలా మాట్లాడే యజమాని ఒక రున్నారు. మీ సంజ్ఞలవల్ల, పెదవుల కదలికవల్ల, మీ చూపువల్ల నేను మీ అభిప్రాయం గ్రహించగలను."

"అయితే ఇది చెప్పు" అందామె. "నువ్వు నన్నెందుకు రక్షించావు?"

ఆమె మాట్లాడుతున్నప్పుడు ఆమె ముఖంలోకి అతి జాగ్రత్తగా చూశాడు.

"తెలిసింది. మిమ్మల్ని ఎందుకు రక్షించానని అడుగుతు న్నారు. ఒకనాటి రాత్రి మిమ్మల్ని ఎత్తుకుపోవాలని ప్రయత్నిం చిన వాణ్ని మీరు మరిచిపోయారు. ఆ మరునాడే వాడు కొరత మీదుండగా దాహంతీర్చి ఉపకారం చేశారు. ఆ సమయంలో లభిం చిన ఒక్క నీటిచుక్క, ఒక్క జాలిచూపు—వానికోసం నా జీవి తాన్ని త్యాగంచేసినా ఋణం తీర్చుకోలేను. వాడి అపకారాన్ని మీరు మరిచిపోయారు. కాని వాడు మీ ఉపకారాన్ని ఆజన్మాంతం మరిచిపోడు."

ఆ మాటలు వినేసరికి ఆమె కనుకొలకులలో నీరు నిలిచింది. అతని ఒక కంటిలో చివర—ఒక నీటిబిందువు నిలిచింది. కాని అది జారిపడలేదు. హృదయసంతాపాన్ని అతడు అణుచుకున్నాడు.

"ఇటు వినండి. ఇక్కడ చాల ఎత్తైన గోపురాలున్నాయి. అక్కడనుంచి కిందికి పడ్డవాడెవడూ బతకడు. వెంటనే ఒళ్లు ముద్దయి చచ్చిపోతాడు. నన్ను వొదిలించుకోవాలని మీకు తోచినప్పుడు, నాతో చెప్పండి ఆమాట. అక్కడనుంచి కింది కురి

చేస్తాను. మీ నోటిమాట ఒక్కటి చాలు; ఒక్కమారైనా చాలు, మీ ఆజ్ఞ వెంటనే పాలిస్తాను."

క్వాసిమోడో వెళ్ళిపోడాని సిద్ధమయ్యాడు. అతడిపట్ల ఆమెకి అపారమైన కరుణ కలిగింది. అక్కడే ఉండమని సంజ్ఞ చేసింది.

"కాదు కాదు" అన్నాడు క్వాసిమోడో. "నే నాట్టే సేపుండకూడదు. నే నుండలేను. నామీద జాలివల్ల నే మీరు ముఖం పక్కకి తిప్పుకోడం లేదని నాకు తెలుసు. మీ కంటపడకుండా నేను మిమ్మల్ని నిత్యం చూస్తూ ఉండగలచోటు చూసుకుంటాను. అదే మంచిది" అంటూ జేబులోనుంచి ఒక ఈలతీసి గుమ్మంలో ఉంచాడు. "ఇది తీసుకోండి. నన్ను పిలవాలనుకున్నప్పుడు ఇది ఊదండి. ఈ ఈల నాకు వినపడుతుంది" అని చెప్పి వెళ్ళిపోయాడు.

# 28

కాలం గడుస్తోంది. క్రమక్రమంగా ఎమరాల్డా మనస్సులో శాంతి నెలకొంటున్నది. అమిత ఆనందంవలె నే అమిత దుఃఖంకూడా ఒక్క పెట్టున వచ్చి అంతలోనే అంతరించడం సహజం. మితిలేనిది దేనినీ మానవహృదయం భరించలేదు. జిప్సీ యువతి ఇటీవల అనుభవించిన అపారదుఃఖంవల్ల, ఆమె మనస్సులో అన్నిభావాలూ నశించాయి; ఆశ్చర్యం ఒక్కటిమాత్రం మిగిలిపోయింది.

ఆశ్రయం, సంరక్షణ లభించగానే క్రమంగా ఆమెలో తిరిగి ఆశ మొలకెత్తింది. ఆమె ఇప్పుడు సమాజానికీ, నగరజీవితానికీ దూరమైపోయినా, తిరిగి ప్రవేశించడం అసాధ్యం కాదని ఆమెకు తోచనారంభించింది. గోరీలో బంధించబడినా తప్పించుకోగల సాధనం చేతిలోనే ఉన్నట్లుంది.

పీడకలలవలె ఆమెను పట్టుకుని పీడిస్తున్న గత సంఘటనలు మెల్లిమెల్లిగా విస్మృతిపథంలో పడిపోతున్నాయి. చివరకు క్లాడ్ ఫ్రొలోనికూడా మరిచిపోయింది. కాని ఫీబస్‌నిమాత్రం ఆమె మరిచిపోలేదు. ఫీబస్ బతికిఉన్నాడని ఆమెకు దృఢమైన నమ్మక

కలిగింది. ఆమె అతన్ని స్వాగతంగా చూసింది. ఆ యువకుడే ఆమె జీవితానికి సర్వస్వం. జరిగినదుర్ఘటనలవల్ల ఆమెలో అన్ని భావాలూ నశించినా ఫీబస్‌పట్ల ప్రేమమాత్రం వసివాడలేదు. ప్రేమ అనేది చెట్టువంటిది. దానికదే బీజమై మొలిచి పెద్దదౌతుంది. మనలో లోతుగా వ్రేళ్లు పాతుకుంటుంది. శిథిల హృదయంలో కూడా ఆ పచ్చదనం వాడదు. మోహం ఎంత గుడ్డిగా వృద్ధయితే అంత బలంగా పాతుకుంటుంది. ఔచిత్యమెరగని మోహం మరింత బలీయమై కన్నూమిన్నూ కాననిదౌతుంది; అటువంటిది సమసి పోవడం అరుదు.

ఫీబస్‌ని గురించి తెలుసుకున్నప్పుడు ఎస్మరాల్డాకి బాధ కలగక పోదు. అతనుకూడా అనుమానించడం ఆమెకు హృదయశల్యంగా ఉంది. అతనికోసమై ప్రాణాలనైనా బలియివ్వడానికి వెనుదియ్యని యువతి అతన్ని కత్తితో పొడుస్తుందని అనుమానించడం ఘోరమే. అయినా ఆమె కతనిపైన కోపంరాలేదు. ఆమె మాత్రం నేరం ఒప్పుకోలేదా? అధికారులు హింసిస్తే లొంగిపోలేదా? దోషమంతా తనదే ననుకుందామె. అటుకంటె నేరానికి అంగీకరించడం కంటె అధికారుల హింసలు సహించి ప్రాణత్యాగం చేసివుండవలసింది. ఒక్కసారి, ఒక్కక్షణంపాటు మాట్లాడ్డానికి వీలుచిక్కితే చాలు, ఫీబస్ అనుమానాలన్నీ పటాపంచలౌతాయని ఆమె నమ్మకం.

అయితే ఆమె కింకా అర్థంకాని సంగతులు కొన్ని ఉన్నాయి. చర్చిముందు ప్రాయశ్చిత్తం జరిపే సమయంలో ఫీబస్ ఒక యువతితో కలిసి మేడపైనుంచి చూస్తూ నిలబడ్డాడు. అతని ప్రక్కనున్న ఆ యువతి ఎవరో? అతని చెల్లెలై ఉండవచ్చు. ఏమో! అలా అనుకోడానికి మనస్సు సరిపడదు. అయినా అలా సరిపెట్టుకోకపోతే, ఫీబస్ ఇంకా తననే ప్రేమిస్తున్నాడని భావించకపోతే ఎస్మరాల్డా బ్రతకడం కష్టం. తనను తప్ప ఇంకెవరినీ ప్రేమించ లేదని ఫీబస్ ప్రమాణం చేసి చెప్పాడు! ఇంకంతకంటె ఆమె కేమి కావాలి? తరవాత జరిగిన దానికి అతని దోషం లేదు. అతని అనుమానానికి సరిపడినట్లే అంతా జరిగింది. అతను అనుమానించడంలో తప్పులేదు. అందువల్ల ఎస్మరాల్డా ఇంకా ఆశ నిలుపుకుంది.

అంతేకాదు. ఆమెను రక్షించి ఆశ్రయమిచ్చిన చర్చి ఆమెకు కొంత బాధ నివారించింది. అక్కడి శిల్పాకృతులు, బ్రహ్మాండ

మైన ఆ నిర్మాణం, మతంపట్ల దైవంపట్ల భక్తిని ఇనుమడింపచేసే ఆ వాతావరణం ఆమెకు తెలియకుండానే ఆమెకు చిత్తస్థైర్యాన్నిచ్చాయి. గోపురంలో ఎత్తుగా నివసిస్తున్న ఆమెకు నగరం నలుమూలలనుండి వినవచ్చే ఘంటల నినాదాలు, అప్పుడప్పుడు దూరంనుంచి వినవచ్చే ప్రార్థన గీతాలు గాయపడిన ఆమె హృదయానికి చికిత్స చేశాయి. పగటి నగరఘోష, రాత్రి ప్రశాంతత ఆమె బాధల నపనయించి, స్మృతిని జోకొట్టాయి. ప్రతి ఉదయం నాటర్ డామ్ చర్చి గంటలధ్వనులకు ఆమె మనశ్శాంతి సుస్థిరమౌతోంది. హృదయంలోని గాయాలు మానుతున్నకొద్దీ ఆమె సహజసౌందర్యం ఆమెకు తిరిగిరా నారంభించింది. ఈమారు ఆ సౌందర్యములో హర్షోల్లాసాలకంటె శాంతి మూర్తీభవిస్తోంది.

ఉదయమే తనగదిలో ఒక మూల దుస్తులు మార్చుకుంటుంది. నిత్యమూ ఫీబస్‌ను గురించి తలపోస్తూ కాలం గడుపుతుంది ఫీబస్‌ను గురించిన ఆలోచనలలో తెరిపియిచ్చినప్పుడు క్వాసిమోడోని గురించి ఆలోచిస్తుంది. మనుష్యులకూ ఆమెకూ మధ్య మిగిలిన సంబంధం అతడొక్కడే. ఈ వింతమిత్రుని గురించి ఏమి భావించాలో ఆమెకే తెలియలేదు. అతనికి తగిన కృతజ్ఞత చూపలేక పోతున్నందు కామె తనను తాను నిందించుకుంటుంది. అయినా అతని వికృతాకారానికి అలవడలేకపోతోంది.

క్వాసిమోడో ఇచ్చిన ఈల నేలపైనే ఉంటుంది. అతడు లోపలికి తొంగిచూస్తూ ఉండేవాడు. అతడాహారం తీసుకు వచ్చేటప్పుడు అతనిపట్ల ఎంతగా ప్రీతి కనపర్చాలని ప్రయత్నించినా ఆమెకు సాధ్యపడలేదు. అతడుమాత్రం తలవంచుకుని వెళ్లి పోయేవాడు.

ఒకనాడు క్వాసిమోడో వచ్చేసరికి ఎస్మిరాల్డా డాలీని బుజ్జగిస్తోంది. క్షణంసేపు అతడు చూస్తూ నిలబడిపోయాడు. విచారంతో తలూపి అన్నాడు: "నేను మనిషినైపుట్టడం నా దురదృష్టం. ఆ మేకనై పుట్టినా బాగుండును."

ఎస్మిరాల్డా ఆశ్చర్యపడి అతనివంక చూసింది. అతడు తల వంచుకుని వెళ్ళిపోయాడు.

మరొకనాడు అతడు గుమ్మంవద్ద నిలిచి చూశాడు. ఆమె ఒక పాట సన్నగా పాడుకుంటోంది. జిప్సీలు ఆమె చిన్నతనంలో

ఆమెను నిద్రపుచ్చడానికి పాడినపాట అది. అతన్ని చూసి ఉలిక్కి పడి ఆమె పాటఆపివేసింది. ఆమెఉలికిపాటు గమనించాడు. గుమ్మం వద్దనే అతడు మోకరించాడు. రూపం చెడిన రెండుచేతులూ మోడ్చి ప్రార్థనాపూర్వకంగా అన్నాడు: "అయ్యయ్యో! ఆగి పోకండి. నన్ను తగిమి నయ్యకండి" ఆమె మెల్లిగా వణుకుతున్న కంఠంతో తిరిగి పాట పాడింది. క్రమంగా అతని ఉనికికి ఆమె అలవాటు పడింది. వణుకుతగ్గి తనపాటలో మనస్సు లగ్నం చేసింది. క్వాసిమోడో ఆమె నేత్రపద్మాలపైనే చూడ్కులు నిగిడ్చి అలాగే మోకరిల్లి ఉండిపోయాడు. బధిరుడైన అత డామెపాటను కన్ను లతో వింటున్నట్లున్నాడు.

ఇంకొకరోజున అతడు సిగ్గుపడుతూ వచ్చి తడబడుతున్న మాటలతో ఆమెతో ఇలా అన్నాడు: "మీతో ఒక సంగతి చెప్పాలి. వింటారా?"

ఎమరాల్డా చెప్పమన్నట్లు సంజ్ఞ చేసింది. క్వాసిమోడో గాఢంగా నిట్టూర్చాడు. మాట్లాడ్డాని కుపక్రమించి ఆమె ముఖం వంక చూశాడు. చూసి తల అడ్డంగా తిప్పాడు. తల వంచుకుని మాట్లాడకుండా నే వెళ్ళిపోయాడు. ఎమరాల్డా చకితురాలైంది.

ఆమె గది కెదురుగా ఒక శిల్పం ఉంది. అదేదో మృగానికి చెందిన తల ఆకృతిలో చెక్కబడింది. ఆ శిల్పంవంక చూసి క్వాసి మోడో అప్పుడప్పు డేదో గొణగడం ఎమరాల్డా చూసేది. "అయ్యో! నేనుకూడా నీమాదిరిగా రాయినైనా కాకపోయాను!" అని ఒకరోజుఅనుకుంటూ అతడు నిట్టూర్పు విడవడం గమనించింది.

ఒక రోజున ఎమరాల్డా గోపురం క్రింది మిద్దెమీదికివెళ్లి పిట్ట గోడవద్ద నిలబడి వీధిలోకి చూసింది. క్వాసిమోడో ఆమె వెనుక నే నిలబడ్డాడు. ఉన్నట్టుండి ఎమరాల్డా కంపించిపోయింది. ఆమె ముఖంలో ఆనందం వెల్లివిరిసింది. మోకాళ్లపై కూర్చుని ఎదురుగా నున్న భవనంవైపు ప్రార్థనాపూర్వకంగా చేతులు చాపింది. "ఫీబస్! ఒక్కసారి రా! ఒక్కమాట చెప్పాలి నీకు. ఒక్కసారి రా. ఫీబస్! ఫీబస్!" అని బిగ్గరగా పిలువ నారంభించింది. ఆమె కంఠం, ఆమె ముఖం, వైఖరి, శరీరవిన్యాసం గమనిస్తే ఓడవిరిగి సముద్రమధ్యంలోనుంచి ప్రాణరక్షణకోసం ప్రార్థిస్తున్నదా అన్నట్లుంది.

క్వాసిమోడో ముందుకువంగి ఆమెదృష్టి ఎక్కడున్నదో చూశాడు. వీధిలో భవనంముందునుంచి గుర్రంపై స్వారీచేస్తూ భవనంపై బాల్కనీలో నిలబడిన ఒక యువతికి అభివాదం చేస్తున్న ఒక కెప్టెన్ కనపడ్డాడు. కాని ఎమరాల్డా పిలుపు వినలేనంత దూరంలో ఉన్నాడు కెప్టెన్.

క్వాసిమోడోకి అది అర్థమయింది. గాఢనిశ్వాసం విడిచి వెనక్కి తిరిగాడు. అతని కన్ను వెంట నీరు ధారగా కారనారంభించింది. రెండు చేతుల పిడికిళ్ళు బిగించి తల మోదుకున్నాడు. జుట్టు పీక్కున్నాడు. ఎమరాల్డా అతన్ని గమనించలేదు. "దరిద్రుడా! ఉంటే అలా ఉండాలి పై ఆకారం అంత అందంగా ఉంటే చాలు. ఇంకేమీ అక్కర్లేదు" అని తనను తాను నిందించుకున్నాడు క్వాసిమోడో.

ఎమరాల్డా దృష్టి ఫీబస్ పైనే ఉంది "అదుగో! గుర్రం దిగుతున్నాడు. ఆ యింట్లోకి వెడుతున్నాడు. ఫీబస్! ఫీబస్! అయ్యో! నా పిలుపు వినిపించుకోవటంలేదు. నేను పిలుస్తున్నప్పుడే అది ఆయనతో మాట్లాడాలా! అయ్యో! ఫీబస్! ఫీబస్!" అంటూ ఆమె పొగిలిపడుతోంది.

క్వాసిమోడో ఆమెస్థితి గమనించాడు. కన్నుల నిండిన నీరు అణచుకుని ఆమెవద్దకు వచ్చాడు. మెల్లిగా ఆమె దుస్తులు పట్టుకులాగి పిలిచాడు. ఆమె వెనక్కి తిరిగిచూసింది. "నేను వెళ్లి అతన్ని తీసుకురానా?" అన్నాడు.

ఆమె ఆనందానికి అంతులేదు. "నిజం? వెళ్ళు వెళ్ళు! పరుగెత్తు! త్వరగా! ఆ కెప్టెన్! అయన్నిక్కడికి తీసుకురా! నీ మేలు ఎప్పుడూ మరిచిపోను. నిన్ను ఆదరిస్తాను. వెళ్లు" అంటూ ఉద్రేకంలో ఆమె అతని మోకాళ్ళను పట్టుకుంది. విచారంతో అతడు తలూపాడు.

"నేను వెళ్ళి అతన్ని తీసుకొస్తాను" అన్నాడు మెల్లిగా. తరవాత వెనక్కి తిరిగి పొంగివస్తున్న ఏడుపు ఆపుకుంటూ గబగబా మెట్లు దిగాడు.

క్వాసిమోడో వీధిలోకి వెళ్లేసరికి అక్కడ భవనంముందు గుర్రం తప్ప మరేమీ కనపడలేదు. అక్కడ నిలబడి అతడు చర్చి వంక చూశాడు. అక్కడే అదేవిధంగా మోకాళ్ళపై వంగి

చూస్తున్న ఎమరాల్డా కనపడింది. ఆమెవంక చూస్తూ క్వాసిమోడో తల అడ్డంగా తిప్పి "ప్రయోజనం లేద"న్నట్లు సంజ్ఞచేశాడు. అక్కడే ఒక స్తంభానికి చేరబడి నిలబడ్డాడు.

ఆ భవనంలో వివాహానికి ముందు జరిగే విందే అప్పుడు జరుగుతోంది. భవనంలోకి చాలామంది వెళుతున్నారే కాని ఎవరూ తిరిగి రావటంలేదు. భవనద్వారంవంకా చర్చిపైన ఎమరాల్డావంకా చూస్తూ నిలబడ్డాడు క్వాసిమోడో. ఒక పరిచారకుడు వచ్చి గుర్రాన్ని విప్పి శాలకు తీసుకు పోయాడు. స్తంభంవదనుంచి క్వాసిమోడో కదల్లేదు. చర్చిమీదపై పిట్టగోడవద్దనుంచి ఎమరాల్డా కదల్లేదు. రోజంతా ఈవిధంగా గడిచింది.

రాత్రయింది. వెన్నెలలేని చీకటిరాత్రి. క్వాసిమోడో ఎమరాల్డాపైనే దృష్టినిగిడ్చి స్తంభానికానుకుని నిలబడే ఉన్నాడు. చీకటిలో ఛాయామాత్రంగా ఆమె తెల్లని దుస్తులు కనపడుతున్నాయి. భవనంపై కిటికీలలో దీపాలు వెలిగాయి. రాత్రి చాల సేపు గడిచిన తరవాత ఆ దీపాలు క్రమంగా ఆరిపోయాయి. అయినా కెప్టెన్ రాలేదు. అంతటా చిమ్మచీకటి వ్యాపించింది. భవనంపై ఒక్క కిటికీలోమాత్రం దీపం అర్థరాత్రి దాటినా వెలుగుతూనే ఉంది. రంగురంగుల అద్దాల తలుపులవెనుక నాట్యమాడుతున్న నీడల్ని గమనిస్తున్నాడు క్వాసిమోడో. నగరం సద్దుమణిగిన కొద్దీ భవనంలోనుంచి విందుసంరంభం, హర్షధ్వానాలు వినవస్తూనే ఉన్నాయి. కాని అతడికి వేవీ వినపడవు.

ఒంటిగంట వేళకు విందు ముగిసింది. క్వాసిమోడో చీకటిలో నిలబడి అతిథులందరూ వెళ్ళిపోవటం గమనించాడు. కాని కెప్టెన్ మాత్రం రాలేదు. క్వాసిమోడోకి చింత కలిగింది. ఆకసంవంక తరుచుచూడ నారంభించాడు. బూజులల్లినట్లు మబ్బులు అక్కడక్కడ నక్షత్రాలను మరుగుపరుస్తున్నాయి.

బాల్కనీపైన తలుపులు తెరుచుకొన్నాయి. ఇద్దరు వ్యక్తులు బాల్కనీలోకి వచ్చి వెనుక తలుపులు మూసివేశారు. చీకటిలో కన్నులు పొడుచుకుని చూశాడు క్వాసిమోడో. వచ్చిన ఇద్దరిలో ఒకరు కెప్టెన్ అనీ రెండవ వ్యక్తి యువతి అనీ పోల్చాడు. ఉదయం ఫీబస్‌ని ఆహ్వానించిన యువతి ఈమేనని గ్రహించాడు. బాల్క-

నీలో వెలుగులేదు. వారేది మాట్లాడినా అతడికి వినపడదు. అయినా నీడలవలె మసలుతున్న ఆ యిద్దరినీ గమనించాడు. ఎంత వికృతాకారుడైనా ప్రకృతి సహజమైన భావాలు, ఉద్రేకాలు అతనిలో మృగ్యమైపోలేదు. అతనికీ దృశ్యం దుస్సహమైంది. తన దుర దృష్టాన్ని గుర్తుకు తెచ్చుకున్నాడు. వనిత, మోహం, ప్రేమ అనే వస్తువు లతనికి ప్రాప్తించేవి కావు. వానిని దూరంనుంచి గమనించడం మాత్రమే అతనికి మిగిలింది. ఇంతేకాదు. దూరాన చర్చిపై నుండి గమనిస్తున్న ఎస్మరాల్డా కిక్కడి దృశ్యం ఎంత వ్యధ కలిగిస్తుందో ఊహించుకుని విచారించాడు.

ఉన్నట్లుండి బాల్కనీ తలుపులు తెరుచుకున్నాయి. ప్రియుల పైన వెలుగుపడింది. లోపలినుంచి వయసు మళ్లిన ఒక స్త్రీ వచ్చింది. యువతి కంగారుపడింది. ముగ్గురూ లోపలికి వెళ్లారు.

తరువాత క్షణంలో భవనద్వారంవద్ద గుర్రపు సకిలింపు విన వచ్చింది. కెప్టెన్ గబగబవచ్చి గుర్రం ఎక్కాడు. గుర్రం అడుగు వెయ్యకముందే క్వాసిమోడో వెంబడించాడు. "కెప్టెన్! కెప్టెన్!" అంటూ పిలిచాడు.

కెప్టెన్ గుర్రాన్ని ఆపి చీకటిలో వెనక్కు చూశాడు. క్వాసిమోడోని గుర్తుపట్టాడు! "నాతో నీకేంపనిరా!" అన్నాడు.

క్వాసిమోడో దగ్గరికి వచ్చి గుర్రం మెడపట్టి పట్టుకున్నాడు. "నాతో రండి కెప్టెన్. ఒకరు మీతో మాట్లాడాలంటున్నారు. రండి."

"వొదులు. గుర్రాన్ని వొదులు ముందు." అన్నాడు కోపంతో "ఏమిటి నీ ఉద్దేశం? ఇదేం కొరతకొయ్యనుకుంటున్నావా? వొదులు"

క్వాసిమోడో గుర్రాన్ని వొదిలిపెట్టలేదుసరికదా పక్కకి తిప్పి నడిపించాలని చూశాడు. "రండి కెప్టెన్! ఆమె మీకోసం చూస్తోంది. మిమ్మల్ని ప్రేమించింది." అన్నాడు.

"అయితే! నన్ను ప్రేమించే ఆడవాళ్లందరిదగ్గరకీ వెళ్లాలనా నీ ఉద్దేశం? ఆవిడెవరు? నీలాగే ఉంటుందా గుడ్లగూబలాగ?

ఆవిడతో చెప్పు. నేను పెళ్ళిచేసుకుంటున్నాను, దిక్కున్నచోట చెప్పుకోమను."

"నామాట వినండి కెప్టెన్! ఆమె జిప్సీ. మీకామె తెలుసు."

"ఎవరు? జిప్సీ?" అంటూ ఫీబస్ తటాలున కత్తిపైన చెయ్యి వేశాడు. ఫీబస్ భయంతో కంపించిపోయాడు. ఎసురాల్డాకు ప్రాయశ్చిత్తం చేస్తున్న సమయంలో ఆమెను చూడలేక ఫీబస్ బాల్కనీనుంచి లోపలికి వెళ్ళిపోయాడు. ఆమెను క్వాసిమోడో తప్పించినట్లు వదంతి చూసిందికాని ఆసంగతి ఫీబస్‌తో చెప్పడం అనవసరం అనుకుంది. అందువల్ల జిప్సీసుందరి చనిపోయిందనే ఫీబస్ భావించాడు. అప్పటినుంచీ చర్చి ప్రాంగణంవంక చూడ్డం అతనికి భయం. ఇప్పుడీ చీకటిలో వికృతరూపుడయినవాడు వచ్చి జిప్సీసంగతి చెప్పగానే ఫీబస్‌కి నిజంగానే భయం కలిగింది. భూతాన్ని చూస్తున్నట్లు జంకిపోయాడు.

"రండి! త్వరగా రండి" అన్నాడు క్వాసిమోడో. "ఈ దారిని రండి".

ఫీబస్ కొరడాతీసి అతని చేతిమీద ఛెళ్ళున కొట్టాడు. క్వాసిమోడో కన్నుల్లో మంట లెగశాయి. కెప్టెన్ పైకి ఉరకడానికి సిద్ధమైనాడు. కాని అంతలోనే నిగ్రహించుకున్నాడు. మిమ్మల్ని ప్రేమించడానికి ఇంకొకరున్నారుకదా! అదృష్టవంతులు సరే వెళ్లండి." అంటూ గుర్రాన్ని విడిచిపెట్టాడు.

ఫీబస్ గుర్రాన్ని అదిలించి క్షణంలో మాయమైనాడు. క్వాసిమోడో నిలబడి అతనివంక విచారంతో చూశాడు. "అహా! ఈ చిన్న పనికూడా చెయ్యలేరు!" అనుకున్నాడు.

క్వాసిమోడో చర్చికి తిరిగి వచ్చాడు. తన దీపం వెలిగించి గోపురం ఎక్కాడు. ఎసురాల్డా అక్కడే పిట్టగోడవద్దనే ఉంది. అతన్ని చూడగానే ఒక్క పరుగున అతన్ని చేరుకుంది. చూసి నిరుత్సాహపడి "ఒంటరిగానే వచ్చావా?" అంది. ఆశాభంగం కలిగిందామెకు.

"అతన్ని కలుసుకోలేకపోయాను"అన్నాడు క్వాసిమోడో.

"రాత్రంతా అతనికోసం కాసుకుని ఉండవలసింది" అంది ఎసురాల్డా. ఆమె అసంతృప్తిని ఆమె ముఖంలో చూశాడు క్వాసిమోడో. ఆమె అభిప్రాయం గ్రహించాడు.

"ఈమాటు జాగ్రత్తగా కనిపెట్టి చూస్తాను" అంటూ తల వంచుకున్నాడు.

"పో! వెళ్ళిపో!" అని అరిచిందామె.

అతడు వెళ్ళిపోయాడు. ఆమెకు అసంతృప్తి కలిగిందని తెలుసుకున్నాడు. తన నామె అవమానించినా భరించగలడు కాని ఆమె బాధపడితే అతడు ఓర్వలేడు.

ఆరోజు మొదలు క్వాసిమోడో ఆమెను చూడ్డం మాని వేశాడు. ఎక్కడో దూరంగా గోపురంపైన కూర్చుని తన గదివంక చూడ్డం మాత్రం ఎమరాల్డా గమనించేది. ఆమె తన ఉనికి కని పెట్టిందని తెలియగానే అక్కడనుంచి తప్పుకునేవాడు.

క్వాసిమోడో తన దృష్టిని పక్కకుండా తప్పించుకుంటు న్నందుకు ఆమెకు నిజానికి చింతకలగలేదు. లోలోపల ఆమెకు సంతోషమే కలిగింది. క్వాసిమోడో ఇది స్పష్టంగా గ్రహిం చాడు; ఈ విషయమై క్వాసిమోడో భ్రమపడలేదు.

ఆమె అతణ్ని చూడకపోయినా అతడి ఉనికి ఆమెకి తెలియు వస్తూనే ఉంది. ఎవరో ఒక పుణ్యపురుషుడు అనునిత్యం తనను కాపాడుతున్నట్లు తోచిందామెకు. ఆమె నిద్రలేవకముందే ఆమె వద్దకు ఆహారం వచ్చి ఉండేది. ఒకరోజు ఉదయం ఆమె లేచేసరికి కిటికీలో పక్షులున్న పంజరం ఒకటి కనబడింది. కిటికీలోనుంచి చూసినప్పుడెల్లా అక్కడున్న ఒక శిల్పాకృతి చూసి ఆమె భయ పడేది. ఒకనాడుదయం ఆమె కిటికీలోనుంచి చూసేసరికి ఆ శిల్పం అక్కడ లేదు. అంత ఎత్తైక్క ఆ రాతివిగ్రహాన్ని పగల గొట్టాలంటే అక్కడనుంచి జారి కిందపడిపోవచ్చనే భయం కలుగు తుంది. ప్రాణభయం విడిచిపెట్టి క్వాసిమోడో ఆ విగ్రహాన్ని పగలకొట్టాడు.

ఒక్కొక్కరోజు సాయంకాలం క్రింద భాగంనుంచి విచార కరమైన పాట వినవచ్చేది. బొంగురు గొంతుతో పాడినదైనా ఆ పాటలో దుఃఖం విషాదం ఉట్టిపడుతుండేవి. చెవిటివాని పాటలు యమకంలేని సరళపదాలు.

ఒకరోజు ప్రొద్దున్న కిటికీలో పూవులుంచిన రెండు కూజాలు కనపడ్డాయి. అందులో ఒక కూజా అందంగా ఉంది;

కాని బీటవారిఉంది. అందులో నీరు కారిపోయింది. పువ్వులు కొంత వాడిఉన్నాయి. రెండోది మట్టికూజా. దాని నిండా నీరుంది. పువ్వులు కళకళలాడుతున్నాయి. ఎస్మెరాల్డా అందమైన కూజాలో వాడిఉన్న పువ్వులు పట్టి చేతతీసుకుని రోజంతా వాసన చూస్తూ గడిపింది. రెండో కూజాలోని పువ్వుల లాగే ఉండిపోయాయి అదిమొదలు ఆమెకు గోపురం పైనుంచి విషాదగీతాలు వినపడలేదు. అయినా ఆమెకు చింతకలగలేదు. డాలీని గారంచేస్తూ ఎదుటఉన్న భవనద్వారం వైపే చూస్తూ, ఫీబస్‌ని గురించి తనలో తాను మాట్లాడుకుంటూ ఆమె రోజులు గడుపుతోంది.

ఆమె క్వాసిమోడోని చూసి చాలరోజులయింది. అతడు పర్చివిడిచి వెళ్ళిపోయినట్టూ అనిపించింది. ఒకరోజు రాత్రి ఆమెకు ఫీబస్‌ను గురించిన తలపులతో నిద్ర రాలేదు. గదిప్రక్క గాఢ నిశ్వాసం విని ఉలిక్కిపడింది. లేచి చూసింది. వెన్నెలలో మెట్ల వద్ద ద్వారాని కష్టంగా ఆకారంలేని ఒక పెద్ద ముద్ద కనపడింది. క్వాసిమోడో కటికిరాళ్ళపైన పడుకుని నిద్రపోతున్నాడు.

# 29

జిప్సీ యువతి ఉరి బారినుంచి ఎలా తప్పించబడిందీ క్రమేణా క్లాడ్ ఫ్రాలో విని తెలుసుకున్నాడు. అంతవరకూ ఆమె చనిపోయిందనే భావంతోనే ఉన్నాడు. ఆమె చనిపోయినందుకు అతడు పడిన వ్యథ ఇంతింతకాదు. కాని ఆపైన ఆమె చనిపోలేదనీ, ఫీబస్ కూడా బ్రతికేఉన్నాడనీ తెలిసేసరికి అతని యాతన మరింత దుర్భరమయింది. క్లాడ్ తలుపులు వేసుకొని తన గదిలోనే కాలం గడుపుతున్నాడు. కొందరతడికి జబ్బుచేసిందనుకున్నారు. వాస్తవాని కది మానసిక వ్యాధి. అతని తమ్ముడు జెహాన్ అనేకసార్లు వచ్చి తలుపుకొట్టి పిలిచాడు, తలుపులు బద్దలుకొట్టినంత పని చేశాడు; గొంతు చించుకున్నాడు; కాని తలుపులు తెరుచుకోలేదు.

రోజులకొద్దీ కిటికీవద్ద నిలబడి గడిపాడు అక్కడినుంచి ఎస్మెరాల్డా గది కనపడుతుంది. ఎస్మెరాల్డాని చాలసార్లు చూశాడు. మేకనికూడా చూశాడు. క్వాసిమోడో ఆమెతో మాట్లాడ్డం చూశాడు.

ఆమెపట్ల క్వాసిమోడో చూపుతున్న అనురాగం, శ్రద్ధ గమనించాడు. ఆమెను తప్పించడంలో క్వాసిమోడో అభిప్రాయ మేమై ఉంటుందని ఆలోచించాడు. వా రిద్దరి సంభాషణ క్రమమూ, ఇద్దరి ముఖాలలోని భావాలనూ అనేకసార్లు దూరంనించి గమనించాడు. క్లాడ్ హృదయంలో ఎక్కడో క్వాసిమోడో పట్ల అసూయ జనించింది. అసూయ జనించినట్లు తెలిసిరాగానే క్లాడ్ సిగ్గుపడిపోయాడు. కెప్టెన్ పట్ల ఈర్ష్య వహించడంలో వింతలేదు; క్వాసిమోడో పట్లనో! అది తలపుకు వచ్చేసరికి క్లాడ్ కి పిచ్చెత్తినట్లయింది.

రాత్రులు అతనికి దుస్సహంగా ఉన్నాయి. జిప్సీసుందరి అతని మనోనేత్రం ముందు నృత్యం చేస్తోంది. వివిధనృత్యాలు కళ్ళకు కట్టినట్లయి అతని నెత్తురు ఉడికిపోతోంది.

ఒకనాటి రాత్రి బాధ భరించలేక నిలువెల్లా కంపించిపోతూ లేచాడు. దీపం ఒకటి చేతపట్టుకుని గదినుంచి బైట పడ్డాడు. అతని కళ్ళలో నిప్పులు కురుస్తున్నాయి. ఎస్మెరాల్డా ఉన్న గది ముందు గోపురసోపానాల ద్వారపు తాళంచెవి క్లాడ్ వద్దనే ఉంది.

ఆ రాత్రి ఎస్మెరాల్డా సుఖంగా నిద్రపోతోంది. గతాన్ని మరిచి భవిష్యత్తునుగురించి తిరిగి ఆశలు పెంచుకొని సుఖస్వప్నాలు కంటూ నిద్రపోతోంది. ఫీబస్ సన్నిధిలో ఉన్నట్లు కలకంటున్న సమయంలో ఆమెకు సమీపంలో సవ్వడి వినవచ్చింది. మేలుకొని కళ్ళు తెరిచి చూసింది. చుట్టూ చీకటి దట్టంగా ఆవరించి ఉన్నప్పటికీ కిటికీవద్ద ముఖం స్పష్టంగా ఆమెకు కనపడింది. ఆ ముఖంపైన దీపపు వెలుగు పడుతోంది. ఆమె చూసినట్లు తెలియగానే క్లాడ్ దీపం ఊదివేశాడు. ఎస్మెరాల్డా భీతితో కళ్ళు మూసుకుంది. "అమ్మో! సైతాను" అని అరవబోయింది. కాని గొంతు పెగిలి రాలేదు.

క్షణంలో పూర్వపు దుర్ఘటనలన్నీ ఆమె స్మృతిపథంలో మెరుపువలె మెరిశాయి. భీతిచేతస్కురాలై పక్కపై వాలిపోయింది. కొంతసేపటికి ఆమె నెవరో తాకినట్లయింది. ఆమె అదిరిపడింది. ఒక్క ఉదుటున లేచి కూర్చుంది. క్లాడ్ ఆమెను అమాంతంగా తన హస్తాలలో బంధించాడు. ఆమె బిగ్గరగా అరవ

పోయింది; కాని అరవలేకపోయింది. "ఫో! నన్ను చంపకు, ఆ! ఆ! సైతాన్!" అని హీనస్వరంతో అనగలిగింది.

"నా మాట విను. నన్ను కనికరించు!" అంటూ ఆమె భుజాలు చుంబించాడు.

ఎస్మిరాల్డా విడివడ్డానికి పెనుగులాడింది. కాని సాధ్యపడలేదు. రెండు చేతులతోను-అతని బట్టతల చివర మిగిలిన కొద్ది జుట్టూ గట్టిగా పట్టుకుని తలవెనక్కి వంచి అతని ముద్దులు వారించింది. క్లాడ్ ఆమె నొడిసి పట్టడానికి ప్రయత్నిస్తూ అన్నాడు "నా ప్రేమ ఎటువంటిదో నీకు తెలియదు. అది నిప్పు. నాలో భగ భగ మండి నన్ను కాల్చివేస్తోంది." క్లాడ్ మరింత సత్తువ తెచ్చుకుని ఆమె చేతులు రెండూ గట్టిగా పట్టుకున్నాడు.

"నన్నొదులు. ఛీ! లేకపోతే నీ మొహంమీద ఉమ్మేస్తాను. విడిచిపెట్టు నన్ను!" అంది యువతి.

క్లాడ్ కొంచెం పట్టుసడలించి అన్నాడు: "ఉమ్మెయ్యి! నన్ను కొట్టు! నా రక్తం కళ్ళజూడు! నీ యిష్టంవచ్చినట్టు చెయ్యి! కాని నన్ను నిరాకరించకు." అని బ్రతిమాలాడాడు.

కొద్ది పట్టు సడలగానే ఆమె చెయ్యొకటి అతని ముఖంమీద ఫెళ్ళున కొట్టింది. "ఫో సైతాన్" అంటూ అతని ముఖం రక్కడానికి వేళ్ళు నిగిడ్చి చేతులుచాచింది. ఆమె చేతులు బలంగా పట్టుకుని తిరిగి భుజాలపైనా చేతులపైనా ముద్దులు కురిపించ నారంభించాడు. పెనుగులాటలో యువతి అలసిపోయింది. తిరిగి ఓపిక తెచ్చుకుని ఆర్తనాదం చేసింది. ఎవ్వరూ రాలేదు. మేకమాత్రం మేలుకొని అరవడం మొదలు పెట్టింది.

"అరవకు" అని క్లాడ్ ఆమె నోరు నొక్కాడు. శక్తి నశించి ఆమె పక్కపై ఒరిగిపోయింది. ఒరిగినప్పుడామె చేతికేదో చల్లగా తగిలింది. వెంటనే ఆమెకెక్కడలేని శక్తి వచ్చింది. అందిన ఈల తీసుకుని బిగ్గరగా ఊదింది.

"అదేమిటి?" అన్నాడు క్లాడ్. అంటున్నంతలోనే ఉక్కువంటి చెయ్యొకటి అతని భుజాన్ని ఒడిసి పట్టుకుంది. భయపడి క్లాడ్ యువతిని వదిలేశాడు. చూస్తే చీకటిలో ఎవరో తెలియలేదు. పళ్ళు కొరుకుతున్నట్టు పటపట శబ్దం స్పష్టంగా వినపడింది.

చీకటిలో కత్తి ఒకటే ఛాయామాత్రంగా కనపడింది. లీలగా క్వాసిమోడో ఆకారంకూడా అతనికి కనపడింది. ఇంకెవరూ అక్కడికి రారు. బయట ద్వారంవద్ద కాలికేదో మెత్తగా తగిలిన గుర్తు కూడా వచ్చింది అతనికి. కాని వచ్చినవాడొక్కమాటైనా పలక్కపోవటంవల్ల ఏంచేయాలో తోచలేదు. కత్తి చూపుతున్న చేతిని క్లాడ్ గట్టిగా పట్టుకున్నాడు. "క్వాసిమోడో—ఆగు" అన్నాడు కొంచెం బిగ్గరగా. అతడు చెవిటివాడని ఆ క్షణంలో మరిచిపోయాడు!

త్రుటిలో క్లాడ్‌ని నేలపై పడవేసి ఛాతీపైన మోకాన్ని నొక్కిపట్టాడు క్వాసిమోడో. మోకాటి వంకరనుబట్టి అతను క్వాసిమోడో అని గుర్తించాడు క్లాడ్. కాని ఏం చెయ్యడం. తానెవరో అతనికెలా తెలియచెయ్యడం? ఇంక తనకు చావు తప్పదనుకున్నాడు.

క్వాసిమోడో కత్తితో పొడవబోయి ఆగిపోయాడు. "ఊహూ, తప్పు! ఆమెకీ పాపం అంటుకూడదు" అని గొణిగాడు. కంఠస్వరాన్ని గుర్తుపట్టి అతను క్వాసిమోడో అని రూఢిపరుచుకున్నాడు క్లాడ్. క్వాసిమోడో లేచి క్లాడ్‌ని ఒక కాలుపట్టుకుని బయటికి బరబర ఈడ్చుకుపోయాడు. అవతల చంపాలని అతడి ఉద్దేశం. కాని అదృష్టవశాత్తు అప్పుడే వెన్నెల వచ్చింది. వెన్నెలలో క్లాడ్ ముఖాన్ని గుర్తుపట్టి క్వాసిమోడో గజగజ వణికిపోయాడు. క్లాడ్ కాలు వదిలేశాడు. క్లాడ్ ఒక్క ఉదుటున లేచి రోషంతో రొప్పడం మొదలుపెట్టాడు. క్వాసిమోడో చేతులు నులుముకుంటూ దీనంగా నిలబడిపోయాడు. గుమ్మంలోకి వచ్చి నిలబడిన ఎమరాల్డా ఈమార్పు చూసి ఆశ్చర్యపడింది. క్లాడ్ సంజ్ఞలలో తన రోషాన్ని వ్యక్తపరుస్తున్నాడు. కొంతసేపు క్వాసిమోడో తల వంచుకుని నిలబడ్డాడు. తరువాత [illegible] కష్టంగా మోకరిల్లి ఇలా ప్రార్థించాడు: "ముందు నన్ను చంపి తరవాత మీ యిష్టం వచ్చినట్టు చెయ్యండి" ఇలా అంటూ కత్తి క్లాడ్‌కి అందించాడు. క్లాడ్ కోపంతో అది అందిపుచ్చుకోబోయేటంతలో ఎమరాల్డా చటుక్కుని లాక్కుంది. "ఇప్పుడు రా!" అంటూ క్లాడ్ వంక కత్తి ఝళిపించింది. క్లాడ్ వెనుకంజ వేశాడు. "ఇప్పుడు రా దగ్గిరికి. పిరికిపందా!" అని అరిచింది. క్లాడ్ ఈర్ష్యను గుర్తించిన ఎమరాల్డా

ఈ అవకాశాన్ని విడిచిపెట్టలేను. "నాకు తెలుసులే. ఫీబస్ బ్రతికే ఉన్నాడు" అంది.

క్లాడ్ భరించలేకపోయాడు. క్వాసిమోడో పట్టని కోపంలో ఉడికిపోతూ గోపురసోపానాలవైపు చకచక నడిచిపోయాడు.

క్లాడ్ వెళ్ళిపోగానే క్వాసిమోడో ఈలతీశాడు. అది యువతి కందిస్తూ: "తుప్పుపట్టిపోతోంది" అన్నాడు. మెల్లిగా అక్కడి నుంచి నడిచి వెళ్ళిపోయాడు.

ఎమురాల్డా పక్కవైపుకి విస్వసాగింది. తిరిగి ఆమెకు ఫని వ్యక్తి అంతా కౌరమయమైనట్లు కనపడింది.

క్లాడ్ తన గదిలో తలుపులు గడియవేసుకుని కూర్చున్నాడు. అతనికి క్వాసిమోడో పట్ల ఈర్ష్య వెల్లువికి వచ్చింది. పళ్ళు పటపట కొరుకుతూ "ఆమె నెవ్వరూ పొందడానికి వీల్లేదు" అనుకొంటున్నాడు.

# 30

జిప్సీయువతి నాటర్‌డామ్ చర్చిలో ప్రాయశ్చిత్తం చేసుకుంటున్న సమయంలో, ఇంక ఆమెకు ఎలాగూ ఉరితప్పదనే భావంతో గ్రింగైర్ గ్రీవ్ చాకునుంచి తప్పుకున్నాడు. విధి విలాసంతో జోక్యం చేసుకోవడం వృథా అనుకున్నాడు. ఆమె నాటర్ డామ్ చర్చిలో ఆశ్రయం తీసుకున్నట్లు కొన్నాళ్ళకి బికారుల నిలయంలో విని అతడు సంతోషించాడు. అతడికి డాలీ అంటే ప్రాణం. ఆపైన నిశ్చింతగా బికారుల నిలయంలోనే రాత్రులు గడుపుతూ, పగటివేళ మొగ్గలు వేసి ఫీట్లు చేసి పొట్ట పోషించుకుంటూ హాయిగా కాలం గడుపుతున్నాడు. రాత్రివేళ రెండు మహత్తర కావ్యాల రచనలో కృషిచేస్తున్నాడు. ఇదిగాక తంత్రశాస్త్రం అభ్యసించి కొన్నాళ్ళకు శిల్పశాస్త్రాభ్యాసంలో పడ్డాడు. శిల్పశాస్త్రాభ్యాసం ఎంతవరకూ వచ్చిందో తెలియదు కాని అతడు ప్రతిభవనం ముందూ, ప్రతి చర్చిలోనూ నిలబడి శిల్పాలను తదేకంగా చూస్తూండడం మొదలుపెట్టాడు. కల్పనపట్ల ప్రీతి, రూప కల్పనపట్ల ప్రీతిగా మారింది.

ఒకరోజున అలా ఒక చర్చివద్ద నిలబడి తలెత్తి అతను శిల్పాలను దీక్షగా పరిశీలిస్తూ పరమానందం అనుభవిస్తున్న సమయంలో అతని భుజంపైన ఎవరో తట్టినట్లయింది. ఉలికిపడి చూడగా క్లాడ్ ఫ్రోలో కనపడ్డాడు. గ్రింగైర్ నిశ్చేష్టుడైనాడు. అతను క్లాడ్‌ని చూసి చాల రోజులయింది. సంశయాత్ముడైన తత్వవేత్త గ్రింగైర్, క్రీస్తుమతంపట్ల దృఢవిశ్వాసి అయిన క్లాడ్‌ని చూస్తే ఎప్పుడూ అతని మనస్సు వికలమైపోతుంది.

క్లాడ్ కొంతసేపు మౌనంగా ఉన్నాడు. క్లాడ్ ముఖంలో మార్పు గమనించాడు గ్రింగైర్. తరువాత క్లాడ్ అడిగాడు "ఏం ఎలా వున్నావు?"

"ఏమిటి? నా ఆరోగ్యమా? ఆ! ఉందండి, అలాగే. మొత్తం మీద బాగానే ఉన్నానులెండి. దేనికీ నేనంతగా లక్ష్యపెట్టనండి. సంతోషం సగం బలం అన్నారండి."

"అయితే నీకే బాధలూ కష్టాలూ లేవా?"

"అబ్బెబ్బే! నా కసలు అలాటివేం లేవండి."

"ఇప్పుడేం చేస్తున్నావు?"

"శిల్పాలు పరీక్షిస్తున్నాను. అబ్బ! ఎంత అద్భుతంగా ఉన్నాయి!"

క్లాడ్ ముఖంలో చిరునవ్వు తోచింది.

"ఇవి చూసి ఆనందిస్తున్నావా?" అన్నాడు.

"ఆనందమా! ఇది స్వర్గం." అంటూ శిల్పాలవంక దృష్టి మరల్చాడు. "చూడండి. ఈ శిల్పాలు ఎంత అద్భుతంగా ఉన్నాయో ఆ వొంపులు, ఆ సౌకుమార్యం..."

"అయితే నువ్వు సుఖంగానే గడుపుతున్నావన్నమాట!"

"అవునవును. మొట్టమొదట కాంతలంటే ఆసక్తి ఉండేది. తరవాత ఆ ఆసక్తి మేకవంటిమృగాలపైకీ, ఆపైన రాళ్ళమీదికీ మారింది. ఆడవాళ్లవల్లా మృగాలవల్ల భంగపడతాం. రాళ్లు మోసం చెయ్యవు. చూడండి ఆరాళ్లు ఎంత చక్కగా చెక్కబడ్డాయో!..."

"ఇంక నీకే జీవితంలో వేరే సుఖం అక్కర్లేదా?"

"అక్కర్లేదు"

"ఏ విచారమూ లేదా?"

"ఏదీ కోరికలూ లేవు. నా బ్రతుకుపద్ధతి నేను ఏర్పాటు చేసుకున్నాను."

"మనిషి చేసే ఏర్పాట్లు పరిస్థితులవల్ల తల్లక్రిందులౌతాయి."

"నా కా భయం లేదు. నా బుద్ధి స్థిరంగా కాపాడుకుంటాను"

"నీ జీవనోపాధి?"

"మామూలే. కావ్యాలు రచిస్తున్నాను. కాని దానివల్ల సంపాదనేం లేదు. మీరు చూశారుగా! దవడబలం చూపించి కుర్చీలు అవీ నిలబెట్టి మొగ్గలు వేసి డబ్బు సంపాదిస్తున్నాను."

"కవికి ఇదేం దిక్కుమాలిన వృత్తి?"

"అదిమాత్రం తక్కువనా? దానికీ స్థిరచిత్తం, కౌశలం అవసరం."

"అయితే దరిద్రం ఇంకా వదల్లేదన్నమాట"

"నిజమే కావచ్చు కాని నాకు దుఃఖము లేదు. అదిచాలు."

ఇంతలో గుర్రాల డెక్కలచప్పుళ్లు వినవచ్చాయి. మహారాజుగారి అశ్వికదళం అదారినే వెళ్ళింది. ఆవంక చూస్తూ ఇద్దరూ కొంచెంసేపు మౌనంగా ఉన్నారు.

"కెప్టెన్ వంక అలా చూస్తున్నారేమిటి?" అన్నాడు గ్రింగైర్.

"అతన్ని బాగా చూసిన గుర్తు నాకు" అన్నాడు క్లాడ్.

"పేరు?"

"పేరు కెప్టెన్ ఫీబస్ అనుకుంటాను"

"ఫీబస్! చిత్రమైన పేరు. ఒకమ్మాయి ఫీబస్ పేరుచెప్తే కాని రెండోమాట మాటాడేది కాదు."

"ఇటురా! నీతో కొంత మాట్లాడాలి" అంటూ క్లాడ్ కొంచెం పక్కకు నడిచాడు. గ్రింగైర్ వెంటవెళ్లాడు.

"నీకంటె, నాకంటె అతనిపనే బాగుంది."

"అది నాకు తెలియదు కాని, నామట్టుకు నాకు ఏలోటూ కనపడంలేదు."

"నీకంటె అదృష్టవంతులైన వాళ్ళని చూస్తే నీకు ఎన్నడూ ఈర్ష్య పుట్టదా?"

"ఈర్ష్యా? ఎందుకు?"

"అటువంటి అధికారం, దర్పం చూస్తే?"

"వద్దు! స్వర్గంలో బానిసగా ఉండడంకంటె నరకంలో రాజుగా ఉంటాను."

"చిత్రమే!" అన్నాడు క్లాడ్ ఫ్రోలో. కొంతసేపు ఆలోచించి ఇలా అన్నాడు: "జిప్సీయువతి సంగతేమి టంటావ్?"

"అరె! ఆమె సంగతెందు కొచ్చిం దిప్పుడు?"

"ఆమె నీ భార్య కాదా?"

"ఒకవిధంగా అవుననుకోండి. ఓటికూజా ఒకటి బద్దలుకొడితే ఆ పెళ్ళయిపోయింది. ఒక టడుగుతాను చెప్పండి. మీరు నిత్యం ఆమెగురించే ఆలోచిస్తున్నా రేం?"

"నువ్వు ఆలోచించావా?"

"ఊహూ. అస లాలోచించను. ఆలోచించడానికి నాకు తీరిక లేదు."

"ఆమె నీ ప్రాణాలు కాపాడలేదా?"

"నిజమే కాపాడింది"

"ఆమె ఏమయింది?"

"ఏమో నాకు తెలియదు. ఆమెని ఉరితీశారనుకుంటాను."

"అనుకుంటున్నావా?"

"అవును. ఉరితీస్తారని తెలిసి ముందే అక్కడినించి వెళ్ళిపోయాను."

"నీకు తెలిసిం దింతేనా?"

"ఆగండి. ఆమె నాటర్ డామ్ చర్చిలో ఆశ్రయం తీసుకుందని విన్నాను. మేకకూడా అక్కడుందేమో తెలియదు. నాకు తెలిసిందింతే."

"అయితే నే చెప్తాను విను. ఆమె అక్కడున్నమాట నిజమే. కాని మూడురోజుల్లో పార్లమెంటు డిక్రీ ఇస్తుంది. డిక్రీ ఇవ్వ

గానే అధికారులు చర్చి ప్రవేశించి ఆమెను పట్టుకుని తీసుకువెళ్ళి ఉరితీస్తారు."

"అయ్యో! పాపం." అని చప్పరించేశాడు గ్రింగైర్. క్లాడ్ మాట్లాడలేదు. గ్రింగైర్ మళ్ళీ అన్నాడు. "పాపం ఆమె ఆ గోపురంలో పిచ్చుకగూళ్ళమధ్య కూర్చుంటే పార్లమెంటు చేత డిక్రీ ఇప్పించాలనే పాపపుబుద్ధి ఎవరికి పుట్టిందో?"

"రాక్షసులున్నారు."

"లోకం మహా చెడ్డది."

కొంతసేపుండి హఠాత్తుగా అడిగాడు క్లాడ్: "ఆమె నిన్ను రక్షించిందని ఒప్పుకుంటావా?"

"తప్పకుండా ఒప్పుకుంటున్నాను. నా మెడకి ఉచ్చు బిగిసే సమయంలో వచ్చి రక్షించింది."

"అయితే ఆమెని నువ్వు రక్షించాలా వద్దా?"

"తప్పకుండా. నా కంఠకంటె కావలసిందిలేదు. కాని నేను ఉచ్చులో పడతానేమో?"

క్లాడ్ తల కొట్టుకున్నాడు. "ఆమెని రక్షించడం ఎల్లాగ?"

"భగవంతుడే ఉన్నాడు."

"కాదు. మనమే రక్షించాలి. ఎల్లాగ?"

"ఆగండి నే చెప్తాను. మహారాజుగారిని క్షమించమని ప్రార్థిస్తే?"

"లాభంలేదు. పులినోట్లో మాంసంముక్క లాక్కోవచ్చు గాని ఆయన క్షమించడం జరగదు."

గ్రింగైర్ ఆలోచించాడు: "ఒకపని చేద్దాం. ఆమె గర్భిణి అని చెప్పేద్దాం."

క్లాడ్ ఉలిక్కిపడ్డాడు. ముఖంలో కోపం ఉట్టిపడింది, "గర్భిణీయా? అదేదో నీకు నిజంగా తెలుసునట్లుందే!"

"నేనా! అబ్బెబ్బే! కాదుకాదు. అసలు మాది బలవంతపు పెళ్ళి. పైగా ఆమె నన్నెన్నడూ దగ్గర చేరనివ్వలేదు. ఏమయితేం, అలా చెప్తే కొంత వ్యవధి చిక్కుతుంది. ఆ తరవాత ఆలోచించ

వచ్చు. ఆస్పత్రి మంత్రసానుల కేదో ముట్టచెప్పితే చాలు; పనయి పోతుంది. వాళ్లు బీదవాళ్లు."

క్లాడ్ ఇతని మాటలు వినిపించుకోవటం మానేశాడు. తనలో అనుకున్నాడు: "మాయదారి ముసల్దాని ఆమె నక్కణ్ణించి తప్పించాలి. డ్రికీమాట ఎలావున్నా క్వాసిమోడో అన్నాడు. ఛీ. వాడెల్లా నచ్చాడో ఆమెకి. ఆడవాళ్ళ చపలబుద్ధులు గ్రింగైర్! నాకొక్కటే ఉపాయం తోచింది. దానికి నువ్వొప్పుకోవాలి."

"ఏమిటది?"

"నీ ప్రాణం రక్షించినందుకు నువ్వామెకు ఋణపడి ఉన్నావు. ఆ ఋణం తీర్చుకోవాలంటే ఇదొక్కటే పద్ధతి."

"ఏమిటంటావది?"

"రాత్రీ పగలూ చర్చిచుట్టూ కాపలా ఉంటోంది. చావడి లోపలికి వెళ్లనిచ్చినవాళ్ళనే తిరిగి ఇవతలకి రానిస్తున్నారు. నిన్ను తేలిగ్గా లోపలికి వెళ్ళనిస్తారు. నువ్వెళ్ళి ఆమెతో గుడ్డలు మార్చుకుని ఆమెని పంపించు."

"మరి నామాట?"

"నిన్ను విడిచిపెట్టవచ్చు. లేదా ఉరితీయవచ్చు. కాని ఆమె తప్పించుకుంటుంది."

గ్రింగైర్ బుర్ర గోక్కున్నాడు. అంతవరకూ కళకళలాడుతున్న అతడి ముఖం విన్నబోయింది.

"ఏమంటావు?"

"నన్ను ఉరితీస్తే?"

"నువ్వు ఒప్పుకోవాలి! ఆమె నిన్ను రక్షించింది. ఆ ఋణం నువ్వు తీర్చుకోవాలి."

"ఓస్! నేను తీర్చని ఋణాలు చాలానే ఉన్నాయిలెండి."

"అలా కాదు గ్రింగైర్. నువ్వొప్పుకోవాలి."

"అంటే? నేను చచ్చిపోవాలన్నమాట! చచ్చిపోవటం అంటే చాల అద్భుతమైన విషయం! ఉరిలో చావటం అంటే? మామూలుగా చచ్చిపోతే ఎంతో అంతే! అయినా తేడా ఉంది. ఉరిలో చచ్చిపోవటం అంటే, గాలిలో ఊగులాడాలి—బ్రతుకులో మను

షులు సుఖదుఃఖాలమధ్య, ఆశ నిరాశలమధ్య ఊగిసలాడినట్లు ఊగిసలాడ్డం. చచ్చిపోయేముందు ఉరిలో ఎలావుంటుంది? చావుకీ బతుక్కీ మధ్య ఘట్టాన్ని స్వయంగా అనుభవించి చూడవచ్చు. బ్రతికి, బ్రతుకు చూస్తున్నంత స్పష్టంగా, చావబోతూ చావు బ్రతుకుల్ని స్పష్టంగా చూడవచ్చు. బలే! అద్భుతం! చాలా బాగుంది."

"అయితే నువ్వు ఒప్పుకున్నట్లేనా? భేష్!"

"అయినా చావంటే ఏమిటి? ఒక్క క్షణం బాధగా ఉంటుంది. అంతేకదా! ఉన్నదనుకున్న ఈ కాస్త లేనిదై శూన్యమైపోతుంది. చచ్చిపోవడం ఇష్టమేనా అని అడిగితే ఒక కవి అన్నాట్ట: 'ఏం ఎందుకు ఇష్టం ఉండకూడదు? చచ్చిపోయిన తరవాత మహామహులైనవారందరినీ, మరోలోకంలో చూడవచ్చు."

"అయితే నువ్వొప్పుకున్నట్టేనన్నమాట. రేపే వస్తావా?"

గ్రింగైర్ ఆలోచనలోనుంచి బైటపడ్డాడు. "ఏమిటన్నారు? రేపా? ఎందుకు? ఉరితీయించుకోడానికా. ఛ! అదేంమాట. అదెల్లా కుదురుతుంది? మహామంచిమాట చెప్పారు. నన్ను క్షమించండి."

క్లాడ్ పళ్లు పటపట కొరికాడు. "అయితే పో! మూర్ఖుడా!" అంటూ వెళ్ళిపోబోయాడు.

"ఆగండి. ఒక్క మాట వినండి" అని పిలిచాడు గ్రింగైర్. "నా భార్యకోసం మీరింత తాపత్రయపడుతున్నారు బాగానే ఉంది. ఆమెని తప్పించడానికి ఉపాయం చెప్పారు. అది నాకు నచ్చలేదు. కాని నా కింకో మంచిఉపాయం తట్టింది. వింటారా? లేకపోతే నేను చచ్చిపోతేగాని మీకు తృప్తి ఉండదా? ఏదో చెప్పండి."

"ఏమిటో ఆ ఉపాయం చెప్పరాదూ?"

గ్రింగైర్ కొంతసేపు ఆలోచించాడు. ముక్కుపైన వేలు తాటించి "అదీ! అలాగ!" అన్నాడు. "పారిస్‌లో బికారులందరికీ ఆమె పరదేవత. వాళ్ళని రెచ్చగొట్టడం ఎంతోసేపుపట్టదు; క్షణం. వాళ్లు ఒక్క పెట్టున దాడిచేసివచ్చి ఆమె నెత్తుకుపోవచ్చు. ఆ పని వాళ్ళు తప్పకుండా చేస్తారు. రేపురాత్రి చేయిస్తే సరి."

"ఏమిటది? మళ్లీ చెప్పు"

"ఆగండి. నన్ను ఆలోచించుకోనివ్వండి. ఆలోచనకి అడ్డు పడకూడదు." గ్రింగైర్ కొంతసేపు ఆలోచించాడు. "భలే! మంచి ఉపాయం. దీంతో పని నెరవేరిపోతుంది" అని బిగ్గరగా అరిచాడు.

"అదెల్లాగో చెప్పు."

"ఇలా రండి. చెప్తాను. మంచి ఉపాయం తట్టింది. నాబుర్ర కూడా తక్కువకాదే! అయితే ఒకమాట చెప్పండి. మేకకూడా ఆమెదగ్గరుందా?"

"ఉంది."

"మేకనికూడా ఉరితియ్యాలనుకున్నారు కాదూ?"

"అదంతా నాకెందుకు?"

"అవును. దానినికూడా ఉరితీద్దామనుకున్నారు. పాపం!"

"నీ ధోరణి మానేసి నీ ఉపాయమేదో ముందు చెప్పవోయ్"

"ఆగండి. మెల్లిగా. అన్నీ జాగ్రత్తగా సమకూర్చుకురావాలి."

గ్రింగైర్ క్లాడ్ చెవిలో చెప్పాడు. "సరే అయితే రేపు" అన్నాడు క్లాడ్.

"రేపు" అన్నాడు గ్రింగైర్.

తరువాత ఇద్దరూ చెరొక దారీ పుచ్చుకున్నారు.

క్లాడ్ నాటర్ డామ్ చర్చివద్దకు వెళ్ళేసరికి అక్కడ అతని తమ్ముడు జెహాన్ నిరీక్షిస్తున్నాడు. ఏమీ తోచక జెహాన్ గోడమైన బొగ్గుతో అన్నగారి రేఖాచిత్రం చిత్రించాడు. అయితే చిత్రంలో అన్నగారి ముక్కు పొడుగ్గా గీశాడు.

క్లాడ్ తీవ్రమైన ఆలోచనల్లో పడి తమ్ముణ్ణి గమనించలేదు.

జెహాన్ అన్నను పిలిచాడు: "నిన్ను మాట్లాడంకోసం వచ్చాను" అన్నాడు.

"ఏం పని?"

"అన్నా! నన్ను చాలా ఆపేక్షతో చూస్తున్నావు. నిన్ను విడిచిపెట్టి నే నెక్కడికీ వెళ్ళిపోకుండా ఏదేనా ఉపాయం చెప్పు."

"ఊ. తరవాత?"

"నావల్ల దోషం ఉన్నందువల్లే నువ్వు నన్ను నిందించినా ఏమీ అనుకోను. 'ఇలా ప్రవర్తించమకో, అలా చెయ్యి' అని నన్ను ఆజ్ఞాపించు."

"ఊఁ"

"అన్నా! నేను పాపిష్ఠిని. నా పాపాలకి ఫలంకూడా లభిస్తోంది. చేతిలో డబ్బున్నంతవరకూ విచ్చలవిడిగా తిరిగాను. ఇప్పుడు నా చేతిలో చిల్లిగవ్వ లేదు. ఇప్పుడా స్వేచ్ఛ, ఆసక్తి, వ్యసనాలు పోయినాయి. నేను పశ్చాత్తాప పడుతున్నాను."

"ఓహో!"

"నేను నా జీవితం మార్చుకుంటాను. నా దోషాలు ఒప్పుకుని మంచిగా ఉంటాను. మళ్ళీ చదువుకోవాలని బుద్ధిపుట్టింది. కాని నాదగ్గర పుస్తకాలులేవు, కలంలేదు, సిరాలేదు. అన్నీ కొనాలి. కొంచెం డబ్బు కావాలి."

"అంతేనా?"

"అంతే! కొద్దిడబ్బు."

"నా దగ్గిరేంలేదు."

"ఇంక నాకు దారేముంది? చదువులేకపోతే బికారిలా తిరగవలసిందే."

"బికారిలాగే పో."

జెహాన్ ముఖం మారిపోయింది.

"సరే. బికారినే అవుతాను."

"తప్పకుండా."

జెహాన్ గిరుక్కున వెనక్కి తిరిగాడు. క్లాడ్ ఒక పర్సుతీసి తమ్ముని మీదికి విసిరాడు. "ఇదే ఆఖరు. ఇంకెన్నడూ నాదగ్గరికి డబ్బుకోసం రాకు. పో" అన్నాడు.

జెహాన్ పర్సు అందిపుచ్చుకుని చరచర వెళ్ళిపోయాడు.

# 31

బికారులనివాసంలో పాడుపడిన కోట ఒకటుంది. శిథిలమై పోగా మిగిలిన కట్టడంలో క్రింద ఒక పానశాల ఉంది. మిద్దెపైన కొందరు బికారులు నివాసం ఏర్పరచుకున్నారు. ఈ ప్రాంతంలో రాత్రిం బగళ్లు, సందడి ఉంటుంది. గుమ్మంపైన 'ఇతరులు లోనికి రాకూడదు' అని వ్రాసి ఉంది!

పానశాలలో మద్యసేవ, జూదం జోరుగా సాగుతున్నాయి. అందరూ మామూలుకంటె ఎక్కువ హుషారుగా ఉన్నారు. ప్రతి ఒక్కరిదగ్గరా పలుగో, కర్రో, ఇనపముక్కో, అంపకోలో ఏదో ఒక ఆయుధం ఉంది.

గది విశాలమైనది. అయినా జనంతో కిటకిటలాడిపోతోంది; అక్కడె కర్రబల్లలమీద కొవ్వొత్తిదీపాలు వెలుగుతున్నాయి. ఒక్రపక్క నెగడు తీవ్రంగా మండుతోంది. జిప్సీరాజు తుప్పు పట్టిన డబ్బా ఒకటి కిరీటంగా ధరించి పెద్ద పీపాపైన ఠీవిగా కాలు మీద కాలు వేసుకుని కూర్చున్నాడు. కూర్చుని బికారులు తెచ్చిన ఆయుధాలు పరిశీలిస్తున్నాడు. పక్కనే పెద్ద ఆయుధాల గుట్టొకటి ఉంది. ఎవరికితోచిన ఆయుధం వాళ్ళు అందుకుంటున్నారు.

ఒక్రపక్క ఒకడు నిలువెల్లా ఇనపముక్కల కవచం అతుకులు పెట్టుకుంటున్నాడు. ఆ కవచంలోనుంచి అతడి కన్నులు, ముక్కు, కొద్దిజుట్టు, పెదవులుమాత్రం కనపడుతున్నాయి. ప్రక్క పొడుగాటి తుప్పుకత్తి ఒకటి వ్రేలాడుతోంది. బెల్టునిండా బోలెడు చిన్నకత్తులున్నాయి. ముంపోక కూజానిండా సారాయి ఉంది. అతనిచుట్టూ కొందరు చేరి గేలిచేస్తున్నారు.

ఒకమూల గ్రింగైర్ పరధ్యానంలో పడి కూర్చున్నాడు. క్లోపిన్ అతణ్ణి పిలిచాడు: "ఊఁ! లెమ్ములు. త్వరగా లే. అందరం సిద్ధంగా ఉండాలి. ఇంక బయలుదేరాలి."

నిలువెల్లా కవచం ధరించిన యువకుడు ఇలా అన్నాడు. "మిత్రులారా! నే నెవరో గుర్తుపట్టగలరా? నేను జెహాన్ ఫ్రొలోని: మనం ఇప్పుడొక అపూర్వమైన దండయాత్రకి బయలుదేరబో తున్నాం. మనంకూడా చాలా గొప్పవాళ్ళం. నడవండి. చర్చిని

ముట్టడిద్దాం. తలుపులు బద్దలుకొట్టి లోపలికి పోదాం. మన జిప్సీ సుందరిని రక్షించుకుందాం. న్యాయమూర్తులబారినుంచి, మతాచార్యులబారినుంచి చర్చిగోపాలముఖ్యనుంచి ఆమెను కాపాడుదాం. చర్చిని ధ్వంసం చేద్దాం. బిషప్ కనపడితే వాణ్ణి ఆ మంటల్లో పారేసి హతమార్చుదాం. అంతా చూస్తున్నంతసేపు పట్టదు. మనం న్యాయంకోసం పోరాడుతున్నాం. న్యాయంకోసం నాటర్ డామ్ చర్చిని దోచుకుందాం. క్వాసిమోడోని ఉరితీసేద్దాం. క్వాసిమోడో అంటే ఎవరో తెలుసా మీకు? సైతాన్ అపరావతారం......"

ప్రేక్షకుల హర్షధ్వానాల్లో, రణగొణధ్వనిలో అతడు పైన చెప్పినది ఎవరికీ వినరాలేదు. గ్రింగైర్ "షేష్! షేష్!" అంటూ లేచి బిగ్గరగా అరిచాడు. ఆనంద తన్మయంలో అతడి కళ్ళు తేలిఆడుతున్నాయి. జిప్సీరాజు లేచి దేశదేశాల విశేషాలు, ఘాతాల ఆకార వికారాంతర విషయాలు ఏకధాటిగా ఉపన్యసించ నారంభించాడు.

ఒక పెద్దాయన: "పాపం ఎస్మెరాల్దా! అది మన చెల్లెలు. మనం విడిపించాలి."

"ఆమె ఇంకా నాటర్ డామ్ చర్చిలోనే ఉందా?"

"ఏమో. పాపం!"

"పదండి చర్చికి" అని అందరూ కేక పెట్టారు.

"చర్చిలో బొమ్మలకూడా బంగారుతొడుగు లుంటాయి" అన్నాడొకడు.

"మనం పండుగ చేసుకోవచ్చు" అన్నాడింకొకడు.

ఈరీతిగా అక్కడ ప్రసంగాలు కేకలు, అరుపులు చెలరేగుతున్నాయి. అందరూ ఉత్సాహంతో యాత్రకి సన్నాహమౌతున్నారు. స్త్రీలు పురుషులు, పిల్లలు వృద్ధులు అందరూ ఉత్సాహంతో ఉరుకలెత్తిపోతున్నారు.

జిప్సీలరాజు ఆయుధాలు పంచడం ముగించి, నెగడువద్ద కూర్చున్న గ్రింగైర్ వద్దకు వెళ్ళాడు: "ఏం కవీ! ఏమిటాలోచిస్తున్నావు?"

"మంటదగ్గర కూర్చున్నాను—మంట కాగడంకోసం, పులుసు కాచడంకోసం కాదు—మంటల్లో ఎగురుతున్న నెరుసులు చూసు

న్నాను. అవి అలా ఎగురుతూవుంటే ఎంతసేపైనా చూడవచ్చు. ఆ నెరుసులు చిమ్నీగొట్టందాకా ఎగురుతున్నాయి చూడు. అక్కడి నక్షత్రాలమాదిరి, మరో లోకాలలా ప్రకాశిస్తున్నాయి..."

"ఏదో ధోరణిలో మొదలెడతావు. అదేం నాకు తుదా మొదలూ తెలియదు. అది సరే, ఇప్పుడు వేళెంతయిందో తెలుసా?"

"ఏమో తెలియదు."

"ఉ! లేవండి! అందరూ బయలుదేరండి. మహారాజు పారిస్‌లోనే ఉన్నాట్ట."

"అందుకే ఆమెని వెంటనే విడిపించాలి" అన్నాడొకడు.

"అక్కడ మనకేం భయంలేదు. చర్చి తేలిగ్గా మన చేతుల్లో పడుతుంది. ఫిరంగులు పాపం ఏపాపం ఎరగవు. కళ్ళుమూసుకూర్చుంటాయి. మనదే అక్కడ బలం. రేపు పోలీసులు చర్చిలోకి వెళ్ళి వెతుక్కుంటారు. ఆమె కనపడకపోతే వట్టిమొహాలు వేసుకు వెళ్ళిపోవాలి. ఆమె నురితియ్యడానికి వీల్లేదు. మనమే కాపాడాలి." అన్నాడు క్లోపిన్.

గ్రింగైర్ మెల్లిగా లేచి చుట్టూ సందడి చూశాడు.

"బయలుదేరండి" అని పొలికేక ఒకటి వినపడింది.

అప్పటికి మబ్బులుకమ్మి వెన్నెల మందగించింది. బికారులు బిలబిలా వీధిలోకి వచ్చిపడ్డారు. అక్కడక్కడ కొందరు నాయకులు అందరినీ ఒక క్రమంలో సర్ది నడిపించడానికి ప్రయత్నిస్తున్నారు.

అందరూ చకచకా నడుస్తున్నారు. భుజాలపైన పలుగులు, ఊంపాలు, గొడ్డళ్ళు, బండకర్రలు, ఆకారంలేని ఇనపముక్కలు నిలబెట్టుకొని దూకుడుగా నడుస్తున్నారు. వీధులు గడిచి నడుస్తున్నారు. వందలాదిగా వస్తున్న ఈ బికారిమూకను చూసి ఆ వీధుల్లో గస్తీ పోలీసులు పారిపోతున్నారు.

బికారిమూక చౌకువద్దకు వచ్చింది.

"ఇశ్! ఇకమీద అందరం నిశ్శబ్దంగా నడవాలి. ఈ రాత్రి వేళ ఎవరూ మేలుకోకూడదు. ఒక్కరొక్క మాట పలకకూడదు. కిక్కురుమనకుండా నడవండి" అన్నాడు క్లోపిన్.

చీకటిలో నిశ్శబ్దంగా గబగబా వస్తున్న ఈ మూకని చూసి గుర్రాలపై గస్తీ తిరుగుతున్న పోలీసులకు అదేమిటో బోధపడలేదు.

కారుమేఘం మొకటి నగరంలోకి దిగి వీధుల్లో నడుస్తున్నదా అన్న ట్లుంది.

అప్పటికింకా చర్చిలో క్వాసిమోడో నిద్రపోలేదు. చివరి సారి చర్చిఅంతా తిరిగి తలుపులు బిగించివచ్చాడు. ఒకసారి గంటలవంక చూసి పలకరించి వచ్చాడు. గోపుర మెక్కి చూశాడు. మేఘావృతమైన ఆకాశంక్రింద చీకటిలో పారిస్ నగరం నిద్ర పోతోంది. నల్లని ఈచీకటి మధ్యలో తెల్లని ఛాయలా సీన్ నది మెలి కలు తిరిగి ప్రవహిస్తోంది. దూరాన ఎక్కడో ఒక్కచోటమాత్రం మిణుకు మిణుకు మంటున్న దీపం కనపడుతోంది.

అలా నిలబడి చూస్తూఉంటే అతడి కెందుకో లోలోపల తెలియరాని భీతిఏదో పుట్టింది. కొన్ని రోజులుగా రాత్రివేళ మెలకువగా ఉండి చర్చి పరిసరాలు జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు. ఎవరో కొందరు రాత్రివేళ చర్చిపైనే కళ్ళుంచి ఆ పరిసరాలలో మసలుతున్నట్లు కనపడిం దతనికి. జిప్సీయువతిని అపహరించడాని కేదో భయంకరమైన కుట్ర జరుగుతున్నదని అతడికి అనుమానం కలిగింది. తనపై పగబూనినట్లే లోకమంతా ఆమెపై పగబట్టిందని భావించాడు. అందువల్ల కొన్ని రాత్రులనుంచి అతడు నిద్రమాని గోపురంపై నిలబడి వెయ్యికళ్ళతో చూస్తున్నాడు.

అలా చూస్తుండగా దూరాన ఒకచోట ఏదో నల్లనిముద్ద ఒకటి కదులుతున్నట్లు అతడికి కనపడింది. సీన్‌నదివంక జాగ్రత్తగా చూశాడు. ఏదో నల్లని సమూహం నది దాటింది. కొంతసేపటికి అది ఇళ్ళు, భవనాలవెనుక చాటు పడింది.

మరొకరికైతే కొన్ని వందలమంది నడిచిన కాళ్ల చప్పుళ్లు వినపడవచ్చు'కాని క్వాసిమోడోకి వినపడలేదు. కొంతసేపటి కొకవీధిలో ఆ సమూహం కానవచ్చింది. ఇప్పుడు మనుష్యు లతనికంటికి కనపడ్డారు. అతడికేమిచెయ్యాలో తోచలేదు. ఆమెను లేపాలా? చర్చినుండి ఆమెను తప్పించాలా! ఎక్కడికి? ఎలాగు? వీధుల్లో గస్తీ ఉంది. చర్చి వెనుకవైపున నది ఉంది. అక్కడ బోటైనా లేదు. ఇంక వేరుమార్గంలేదు. గుమ్మంవద్ద అడ్డు నిలబడి ప్రాణాలకు తెగించి తుదివరకు పోరాడక తప్పదు. ఆమెను లేప కూడదు. తను చచ్చినతరువాతకాని ఆమెకు అపకారం జరగ కూడదు.

నిశ్చయానికొచ్చి ఇంక వస్తున్న ఆ సమూహంపైనే దృష్టి నిగిడ్చి చూస్తూ అక్కడే నిలబడ్డాడు.

క్రమక్రమంగా గుంపు పెరుగుతోంది. కాని ప్రక్క ఇళ్లలో కిటికీలు తెరుచుకోవడంలేదు. అందువల్ల అందరూ నిశ్శబ్దంగా వస్తున్నారని క్వాసిమోడో ఊహించాడు.

ఉన్నట్టుండి అకస్మాత్తుగా కాగడాలు కనపడ్డాయి. ఆ కాగడాల వెలుగులో కొందరు బికారుల ముఖాలు కనపడ్డాయి. మూర్ఖాగ్రేసరుని ఊరేగింపు. అప్పుడక్కడ చేరిన మూక అతడికి గుర్తువచ్చింది.

అందరూ చౌకులో చర్చిముందు చేరారు. ఇప్పుడీ దండయాత్ర జిప్సీ యువతిని అపహరించడానికేనని క్వాసిమోడో రూఢిపరుచుకున్నాడు. క్వాసిమోడో దీపం చేత తీసుకుని రెండు గోపురాలమధ్య మిద్దెమీదికి వచ్చి నిలబడ్డాడు.

క్లోపన్ బికారుల్ని చర్చిముట్టడికి సన్నాహంచేశాడు. వెనుక వైపు హఠాత్తుగా పోలీసులు కాని రాజ సైనికులుకాని వస్తే రక్షణకోసం అన్ని వీధుల మొగలలోనూ కొందరు కొందరిని కాపుదల ఉంచి, మిగిలినవారందరినీ చర్చి ప్రవేశించడానికి ఆయత్తం చేశాడు.

మధ్యయుగాలలో నగరాలలో ఇటువంటి దాడులు వింత గావు. ఆనాడు ఇప్పుడున్నట్టు పోలీసుదళా లుండేవికావు. నగరాలు ఏ ఒక్క అధికారి రక్షణలోనూ ఉండేవికావు. రాజరిక వంశస్థులు, సామంతులు ఎవరికి వారు సైన్యాలను రక్షక దళాలను నిర్మించుకునేవారు. ప్రతి నగరంలో అనేకుల రక్షకదళా లుండేవి. ఎవరి ప్రాంతానికి వారు చక్రవర్తులు. నగరమంతటినీ ఈ సామంత రాజులు పంచుకునేవారు. అందరూ నామమాత్రంగా మహారాజు అధికారానికి లోబడినట్టుండేవారు. అవకాశాన్నిబట్టి వారు మహారాజు నెదిరించడమో, బలపరచడమో జరిగేది. ఎవరికివారు కోటలుకట్టుకునే వారు. చర్చిలు మాత్రం ఎవరూ ఆక్రమించరాని విగా, బిషప్ అనుమతి లేనిది ప్రవేశించరానివిగా పరిగణించబడేవి. ఆ కాలంలో ఆవర్గాల కుట్రలవల్లనో, బికారులు, జిప్సీలవల్లనో దోపిళ్లు జరిగేవి. దోపిళ్లు దాడులు జరిగినప్పుడు ఇరుగుపొరుగులు తలుపులుమూసుకుని ఊరుకునేవారు. ధనాఢ్యులు కోటలు కట్టుకుని ఆస్తిపాస్తులు కాపాడుకునేవారు. కొన్ని చర్చిలనుకూడా గుంపు

కోటలు నిర్మించారు. కాని నాటర్ డామ్ చర్చికి అటువంటి రక్షణ లేదు.

బికారులందర్నీ సిద్ధపరిచిన తరువాత క్లోపిన్ తన చేతిలోని కాగడా పైకెత్తి నాటర్ డామ్ చర్చి గోపురంవంక చూస్తూ బిగ్గరగా అరిచాడు: "మా జాతికి చెందిన సోదరిని మా కప్పగించండి. మీ చర్చిలో ఆశ్రయం తీసుకుందని పార్లమెంటు డిక్రీ చెయ్యబోతోంది. ఆమెని వెంటనే మా కప్పగించి మీ చర్చి కాపాడుకోండి. అప్పగించకపోతే మీ చర్చి ధ్వంసం కాక తప్పదు. ఇదిగో మా జండా. ఇక్కడ నిలబెడుతున్నాం."

క్వాసిమోడోకి ఒక్క మాటకూడా వినపడలేదు. ఎర్రటి సన్నపేలిక కట్టిన జండా ఒకటి రోడ్డుమధ్య పాతబడింది.

చర్చిలో సవ్వడైనా వినరాలేదు. క్లోపిన్ చూశాడు. "పదండి ముందుకు" అని బిగ్గరగా అరిచాడు.

ముప్పైనలభైమంది గొడ్డళ్ళతో పలుగులతో చర్చిద్వారం సమీపించారు. అందరూ మెట్లెక్కి తలుపులు నెట్టారు. తలుపులు కదల్లేదు. "అబ్బ! చాలా గట్టిగా ఉన్నాయి" అన్నాడొకడు.

"ఫరవాలేదు తలుపులు పగలకొట్టండి" అన్నాడు క్లోపిన్.

అందరూ ఎగబడి తలుపులు బద్దలుకొట్ట నారంభించారు. ఇద్దరు తాళం బద్దలు కొట్టడం మొదలుపెట్టారు. క్లోపిన్ అందరినీ హెచ్చరిస్తున్నాడు.

ఇంతలో హఠాత్తుగా వెనకవైపునుంచి పెద్దధ్వని వినవచ్చింది. గోపురం కూలిపోయిందని కొందరు భ్రమించారు. కాని అదొక పెద్ద దూలం. పైనుంచి బికారులపైన విరుచుకు పడింది. కొందరు భయంకరంగా ఆర్తనాదం చేశారు. మెట్లపైనున్నవారిలో పదిమంది దూలంకిందపడి నలిగిపోయారు. మిగిలినవారందరూ దూలానికి దూరంగా పారిపోయారు. త్రుటిలో చర్చిప్రాంగణం ఖాళీ అయిపోయింది.

"సరిగ్గా నేనక్కడే ఉన్నాను. వీసంలో తప్పింది. లేకపోతే నేనుకూడా చచ్చిపోదును" అన్నాడు జెహాన్.

బికారులకు పిరికిపుట్టింది. అందరూ నిశ్చేష్టులై కొంతసేపు ఆకాశంవంక, చర్చిగోపురంవంక చూశారు.

"ఇదేదో ఇంద్రజాలంలా ఉంది" అన్నాడు జిప్సీల రాజు.

"చంద్రుడు దేవుడు. మనమీద దూలంపడేశాడు" అన్నాడొక బికారి.

"నీ మొహం. నీకేం తెలుసు? చంద్రుడు మన దేవుడు. మనకి అపకారం చెయ్యడు" అన్నాడింకొకడు.

క్లోపిన్‌కి ఈ దూలం ఎలా వచ్చిపడిందో అర్థంకాలేదు. చర్చి పైన ఒక్క ప్రాణి కనపడలేదు. మెట్లపైన దూలం నిశ్చలంగా పడిఉంది.

"ఊఁ! కానివ్వండి" అన్నాడు క్లోపిన్. అందరూ రాళ్ళు, కర్రలు, ఇనపముక్కలు, బాణాలు చర్చిద్వారంమీద ప్రయోగించారు.

"పదండి ముందుకి" అని అరిచాడు క్లోపిన్. కాని ఎవ్వరూ కదల్లేదు.

ఈమారు ప్రక్క ఇళ్లలో కిటికీలు తెరుచుకున్నాయి. తెరుచుకున్నదే తడవుగా "కాల్చండి తుపాకులు" అని క్లోపిన్ అరిచాడు. వెంటనే కిటికీలు మూసుకున్నాయి. జరుగుతున్నదేమో తెలియక ఇరుగు పొరుగు ప్రజలు భయపడ్డారు. ఆరోజుల్లో ప్రాణహానికీ మానహానికీ పౌరులు భయపడక తప్పలేదు.

"ముందుకు పదండి" అని అరిచాడు క్లోపిన్. చర్చిపైన తుపాకులు మోగాయి.

"ఆగండి." అన్నాడు క్లోపిన్. అందరూ ఆగిపోయారు.

"ఈ దూలంఎత్తి తలుపులు బద్దలుకొట్టండి."

అందరూ సంతోషంతో కేకలు పెట్టారు. రెండువందలమంది దూలం ఎత్తారు.

దూలం దెబ్బకి ఇనప తలుపులు ఖంగున మోగాయి కాని విరిగిపడలేదు. చర్చిమాత్రం కదలాడిపోయింది.

ఉన్నట్టుండి ముందున్న జనంపైన రాళ్ళవర్షం కురిసింది.

"చిత్రంగ ఉందే! చర్చి శిల్పాలు విరిగి మనమీద పడుతున్నాయా?" అన్నాడు జెహాన్.

తరవాత ఒక్కొక్కటిచొప్పున రాళ్లు బలంగావచ్చి బికారులను తగలడం మొదలుపెట్టాయి. తరవాత పెద్దపెద్ద రాళ్లుపడ్డం మొదలుపెట్టాయి. కొందరికి తలలు చితికాయి. కొందరు కాళ్లు

విరిగి, నడుములు విరిగి కూలిపోయి రోదించ నారంభించారు. అప్పటికే చాలమందికి గాయాలు తగిలాయి.

ఇదంతా, క్వాసిమోడో రక్షణకోసం చేస్తున్నదని వేరే చెప్ప నక్కరలేదు. క్వాసిమోడోకి మొదట ఏం చేయాలో తోచలేదు. అటూ ఇటూ కంగారుతో పరుగులెత్తాడు. చర్చిగంటలు మోగించి అందరినీ లేవగొట్టా లనుకున్నాడు. కాని గంటలు మోగేలోపల బికారులు తలుపులు బద్దలుకొట్టవచ్చు. ఆ సమయంలో అతడికి జ్ఞప్తి వచ్చింది—చర్చి మరమ్మత్తుచేయడానికి వస్తువులు కొన్ని సామానులు చర్చిలో దాచిపెట్టారని. ఒక గోపురంలో మిద్దె సమీపంలో దూలాలు, ఇటుకలు, రాళ్ళు ఉంచబడినాయి. వెంటనే క్వాసిమోడో అక్కడికి పరుగెత్తాడు. మిద్దెపక్క పెద్ద గదినిండా సామానుంది. అక్కడే రాళ్ళగుట్టలున్నాయి, సీసంముద్ద లున్నాయి, దూలాలున్నాయి, కంకరగుట్టలున్నాయి. ఇంక జాప్యం చెయ్యడానికి వీల్లేదు. ఉన్నవానిలోకెల్ల పెద్దదైన దూలం ఒక చివర పట్టుకుని బరబర ఈడ్చుకువచ్చాడు. ఆ దూలాన్ని లాగగల సత్తువ ఆ క్షణంలో అతడికెలా వచ్చిందో ఆశ్చర్యకర మైన విషయం. సరిగ్గా మెట్లమీదుగా లాక్కువచ్చి కిందికి గెంటాడు. నూటఅరవై అడుగుల ఎత్తునుంచి అది బ్రహ్మాండమైనశబ్దం చేస్తూ, అడ్డువచ్చిన శిల్పాలను, తూముగొట్టాలను విరగ్గొట్టుతూ వచ్చి బికారులపై పడింది. బికారులు చెదరిపోవడం క్వాసిమోడో పైనుంచి చూశాడు. తరువాత రాళ్ళూ, కంకరరాళ్లూ తీసుకువచ్చి బికారులపై బలంకొద్దీ రువ్వనారంభించాడు. పెద్దపెద్ద బండరాళ్లను దొర్లించాడు. చర్చి కూలిపోతున్నదని బికారులు మొదట భయపడ్డారు. ఆ క్షణంలో క్వాసిమోడోని చూసినట్లయితే బికారుల గుండెలు పగిలి పారిపోయేవారే! మిద్దెపైన తన యెత్తు రాళ్ళగుట్ట పేర్చిఉంచాడు! ఒక్కొక్క రాయి ఒక్కొక్కడికి తగిలి అరుస్తూవుంటే క్వాసిమోడో సంతోషంతో గంతులేస్తున్నాడు.

రాళ్లదెబ్బలను లక్ష్యపెట్టకుండా బికారులు మళ్లీ దూలంతో తలుపులు బద్దలుకొట్టడం మొదలుపెట్టారు. కొంతసేపటికి గడపలు, తలుపులు బీటలు వారసాగాయి. చర్చి అంతా దద్దరిల్లిపోతోంది. ద్వారంపై చెక్కడాలు ముక్కలై ఎగురుతున్నాయి. ఉతకలు సాగి ఊగులాడుతున్నాయి.

ఇంక తలుపులు పగిలిపోక తప్పదని క్వాసిమోడో గ్రహించాడు. శబ్దం వినబడకపోయినా చర్చి చలించిపోవడం అతనికి తెలుస్తూనే వుంది. రాళ్లవర్షంవల్ల బికారులు ఆగడంలేదు. క్వాసిమోడో మెట్లవంక తొంగిచూశాడు. పైనుంచి తూము గొట్టాలు కనపడ్డాయి. మిద్దెమీది వాననీరు ఆ గొట్టాలగుండా మెట్లమీదా, ముందు రోడ్డుపైనా పడుతుంది. క్వాసిమోడోకి ఒక ఉపాయం తట్టింది. గబగబవెళ్ళి లోపలినుంచి పెద్దమోపెడు చితుకులు తీసుకువచ్చి రెండుతూములవద్ద పేర్చాడు. వానిపైన సీసపు ముద్దలు కొన్ని పేర్చి తన దీపం సహాయంతో నిప్పు అంటించాడు. రాళ్ళవర్షం ఆగిపోగానే బికారులు పైకి చూడ్డం మానేసి దృష్టి ద్వారంవైపు కేంద్రీకరించారు. పైన అతడు మంట పెట్టడం ఎవరూ గమనించలేదు. అందరూ తలుపులు ఎప్పుడు విడివడతాయో, లోపలికి దూకి ముందు చేతికిచిక్కినవి దోచుకోవాలనే ఆత్రుతలో ఉన్నారు. తలుపులు కదిలిపోతున్న కొద్దీ అందరికీ ఉత్సాహం ఇనుమడిస్తోంది. చర్చిలో వెలలేని ఆభరణాలు, ధన, వస్తు సంపద ఉన్నట్లు విన్న విషయాలు జ్ఞప్తికి తెచ్చుకొంటున్నారు. యువతిని తప్పించడం అనేది ఒక మిషమాత్రమే. వారందరిదృష్టీ నిజంగా చర్చిలోని సంపదపైనే ఉంది.

ఉన్నట్లుండి దూలం పట్టుకున్న వారిలో కొందరు కెవ్వున అరిచారు. దూలం దభేలున నేలపై పడిపోయింది. అందరూ భయభీతులై చూశారు. రెండు తూములలోనుంచి కరగిన సీసం రెండు ధారలుగా బికారుల గుంపుపైన పడుతోంది. కొందరు సీసం శరీరంపైనపడి స్మృతితప్పి పడిపోయారు. కొందరప్పుడే ప్రాణాలు విడిచారు. మిగిలినవారు ప్రక్కలకు తప్పుకున్నారు. అప్పుడక్కడ రోదనధ్వనులు, మూలుగులు ఘోరమై వ్యాపించాయి. అందరూ చర్చి సమ్ముఖం దాటి ఇవతలకు పారిపోయి వచ్చేశారు. కళ్ళెత్తి పైకి చూశారు. నూటఅరవై అడుగుల ఎత్తున శిల్పాల మధ్య మంట రేగుతోంది. మంటపైన నెరుసులు గాలిలో ఎగురుతున్నాయి. మంటకు దిగువగా రెండు వికృతాకారంలో ఉన్న తూములలోనుంచి వెండివలె తళతళ మెరుస్తున్న ద్రవం ధారగా జారుతోంది. ధారలు మెట్లవద్దపడి బరువుగా మెల్లిగా చుట్టుప్రక్కలకు ప్రవహిస్తోంది. మంటవెలుగులు గోపురంపైన పడుతున్నాయి. ఆ రాత్రి వేళ ఆ దృశ్యంచూసి బికారులు భీతా

ప్రహారులైనారు. చర్చిలోని భయంకర రాక్షసులలోనున్న శిల్పాలు ప్రాణంపోసుకుని నిప్పులు కక్కుతున్నట్లున్నాయి.

బికారుల మూకల్లో ఒక్కరినోట మాటలేదు. నాయకులు మాత్రం దూరంగా ఒకచోటచేరి సంప్రదింపు ప్రారంభించారు. క్లోపిన్ క్రోధం పట్టలేక పిడికిళ్లు బిగించి పళ్లు పటపట కొరికాడు. “చర్చిలోపలికి వెళ్ళడం కష్టం” అని మూలిగాడు.

“చర్చిని సైతాన్ ఆవహించాడు”

“అదుగో అక్కడ చూడండి, అక్కడ తచ్చాడుతున్న రాక్షసుణ్ని చూడండి.”

“అవును! వాడు క్వాసిమోడో. ఒంటికన్ను రాక్షసుడు.”

“కాదు కోటదేవుడు. ఒక్కొక్కప్పుడు సిపాయి దుస్తులు ధరించి సింహంతలకాయతో తిరుగుతాడు. వాడు మనుషుల్ని రాళ్లు గానూ, రాళ్లని మనుషులు గానూ మృగాలు గానూ మార్చేస్తాడు. మనుషుల్ని రాళ్లు గామార్చి గోపురాలు కడతాడు” ఇలా బికారుల మధ్య సంభాషణ సాగుతోంది.

“అయితే ఇప్పుడేం చెయ్యడం?” అన్నాడు జిప్సీరాజు.

“ఏదో చెయ్యాలి, లేకపోతే పిరికిపందల్లా పారిపోతామా? మన సోదరిని అలా విడిచిపెట్టి పోవడమేనా?” అన్నాడు క్లోపిన్.

“విడిచిపెట్టితే ఆమెని రేపు కుక్కలాగ ఉరితీసి పారేస్తారు.”

“చర్చిలో బళ్లకొద్దీ బంగారం ఉందిట” అన్నాడొకడు.

“ఏమో! అక్కడికి వెళ్ళడం కష్టం”

“ఎందుకు వెళ్లలేమో చూడాలి. రండి నా వెంట ధైర్యం ఉన్నవాళ్ళు” అని క్లోపిన్ దారితీశాడు. తరవాత వెనక్కు తిరిగి “జెహాన్ ఏడీ?” అని అడిగాడు.

“చచ్చిపోయుంటాడు” అన్నాడొకడు.

“పాపం! గ్రింగైర్ ఎక్కడ?”

“మనం ఇక్కడికి రాకముందే మధ్యలో జారుకున్నాడు.”

“పిరికిపంద” అని క్లోపిన్ అరిచాడు. “ముందు రెచ్చగొట్టి ఇప్పుడు తప్పుకున్నాడు.”

“అదుగో జెహాన్. ఏదో లాక్కువస్తున్నాడు” అన్నాడొకడు.

జెహాన్ ఒక నిచ్చెన లాక్కువచ్చాడు. అతడు ధరించిన కవచం పెద్ద రణగుణధ్వని చేస్తోంది. “రండి రండి” అంటూ చర్చి గుమ్మంవైపుకు దారితీశాడు.

"ఏమిటది? నిచ్చెనెందుకు?"

"ఇది చర్చి వెనకవైపునుంది ఇప్పుడే జ్ఞాపకంవచ్చింది."

"ఎందుకిది?"

జెహాన్ హేళన భావంతో చూశాడు. తలెగరేశాడు. తలకి కట్టిన ఇనపముక్కలు గలగలమన్నాయి.

"ఎందుకా? అదుగో అటుచూడు" అని చెయ్యెత్తి పైన శిల్పాలవంక చూపాడు. "ఈ నిచ్చెనవేసి అక్కడికెక్కుతాను. ఆవెనకతలుపు ఈవైపుకి గడియవేసి ఉంటుంది. అది తీశానంటే చర్చిలో అన్ని సమాన్లూ తెరిచెయ్యవచ్చు. ధైర్యం ఉంటే నా వెనక రా"

"నీవెనక నేను రావడమేమిటి?"

"మానెయ్యి. నేనెక్కుతాను."

నిచ్చెన గోడకి వెయ్యబడింది. జెహాన్ ఒకచేత్తో నిచ్చెన పట్టుకుంటూ ఇంకోచేత్తో ఇనపముక్కలు సర్దుకుంటూ మెల్లిగా నిచ్చెనెక్కాడు. అతని వెనకనే కొందరు బికారులు నిచ్చెనపై కెగబాకారు.

జెహాన్ ఒకశిల్పం ఆధారంగా మేడమీదికివెళ్లి నిలబడ్డాడు. బికారులు ఉత్సాహంతో పొలికేకలు పెట్టారు. జెహాన్ కూడా హుషారుగా చెయ్యెగరేసి కేక పెట్టాడు. కాని వెనక్కి తిరిగీ తిరగ్గానే కొయ్యబారిపోయాడు. క్వాసిమోడో గోపురం మీదనుంచి ఎప్పుడు దిగివచ్చాడో తెలియదు, నిచ్చెనపైన ఒక శిల్పంవెనుక పొంచి కూచున్నాడు. జెహాన్‌ని చూడగానే తటాలున లేచి నిలబడ్డాడు. అతడి ఒక్క కన్ను నిప్పులా కణకణలాడుతోంది. జెహాన్ రెండుచేతులూ గట్టిగా ఒకచేత్తో పట్టుకున్నాడు. అలా పట్టుకునే ముందుకి వంగి రెండో చేత్తో నిచ్చెన పట్టుకుని ముందుకి బలంగా గెంటేశాడు. నిచ్చెనతోసహా నిచ్చెనపైనున్న బికారులందరూ పోలోమంటూ కూలిపోయారు. పైన జెహాన్ ఒంటరిగా మిగిలిపోయాడు. క్వాసిమోడో కిందికి చూస్తున్న తరుణంలో జెహాన్ చేతులు విడిపించుకుని వెనుకద్వారంవైపు పరుగెత్తాడు. క్వాసిమోడో చర్రున వెనక్కి తిరిగాడు. జెహాన్ ఒక ఈటె తీసి విసిరాడు. అది క్వాసిమోడో జబ్బకు గుచ్చుకుంది. ఈటె బలంగా లాగివేశాడు క్వాసిమోడో. రక్తం జరజర ప్రవహిం

చింది. జెహాన్ రెండో ఈటె అందుకునేలోపలే క్వాసిమోడో లంఘించి అతణ్ని పట్టుకున్నాడు. ఎడం చేత్తో జెహాన్ రెండు చేతులూ పట్టుకున్నాడు. కుడిచేత్తో అతడి ఒంటిపైనున్న ఇనప ముక్కలు వొలిచేశాడు. కత్తులు, ఈటెలు అన్నిటినీ వొలిచి నేలపైన కుప్పగా పోశాడు.

జెహాన్ పెనుగులాడాడు కాని క్వాసిమోడో పట్టునుంచి తప్పించుకోడం సాధ్యం కాలేదు. జెహాన్ కాళ్ళు రెండూ కుడి చేత్తో పట్టుకుని క్వాసిమోడో పైకెత్తాడు. గబగబ మిద్దెమీదికి వెళ్ళాడు. తరవాత చేతులు విడిచిపెట్టి, కాళ్ళు రెండూ పట్టుకుని ఒడిసెలతిప్పినట్లు గిరగిర తిప్పాడు.

చీకటిలో ఎక్కడో దూరంగా ఘోరమైన ఆర్తనాదం వినవచ్చింది. అంతలోనే ఎక్కడో కొబ్బరికాయ బద్దలైనట్లు వినపడింది. ఏదో గోడకుతగిలి క్రిందికి రాలిపడింది. కాని అది నేలమీద పడలేదు. మధ్య కట్టడంలో ఎక్కడో చిక్కుకుంది. జెహాన్ ప్రాణాలు అంతరించాయి.

బికారులు రోషంతో అరిచారు. "పదండి. చర్చి పడగొట్టండి" అన్నారు పగతో. జెహాన్ చావుతో బికారులు కోపంతో ఉడికిపోయారు. చుట్టూ ఇళ్లలో దూరి నిచ్చెనలు తీసుకువచ్చారు. కాగడాలు మరికొన్ని వెలిగాయి.

క్వాసిమోడో చూశాడు. బికారులు నిచ్చెనలపైనుంచి గబగబ ఎగబ్రాకుతున్నారు. కొందరు శిల్పాలకు తాళ్లువేసి ఎక్కుతున్నారు. క్వాసిమోడో ఏమి చేయాలో తెలియక గోపురమెక్కి బోనులో పులిమాదిరి అటుఇటు తిరగనారంభించాడు.

## 32

నోటర్ డామ్ చర్చివద్ద ఈ ముట్టడి జరుగుతున్న సమయంలో పారిస్ నగరం నిద్రపోతోంది. బాస్టిల్‌లో మాత్రం పై అంతస్తులో దీపం వెలుగుతోంది. మహారాజు పదకొండవ లూయీ రెండు రోజులై పారిస్ నగరం వచ్చాడు. రెండు రోజు లెక్కువే ఉండి తిరిగి తన మాంటిల్స్ కోటకి వెళ్ళిపోతాడు.

మహారాజు మాంటిల్స్ కోటలోని బ్రహ్మాండమైన మందిరంలో తానొక నలుసెనవు బా[illegible] బాస్టిల్ కారాగార

భవనం పైభాగం మహారాజు పారిస్ నివాసాని కేర్పాటు చెయ్యబడింది. ఇక్కడి పడకగది, ఆలోచనామందిరం చిన్నవి. అట్టే ఆడంబరమైన అలంకారం లేదు. ఆలోచనామందిరంలో దిండ్లు అమర్చిన ఒక్క పడక కుర్చీ తప్ప మరో కుర్చీగాని, మేజాగాని, బెంచీగాని ఏదీ లేవు.

ఆ రాత్రి ఆ మందిరంలో అయిదుగురున్నారు. స్వర్ణాభరణాలతో ఆడంబరంగా అలంకరించుకున్న ఒక అధికారి ఒక పత్రం చదివి వినిపిస్తుంటే కుర్చీలో కూర్చుని మహారాజు వింటున్నాడు. మహారాజు నిరాడంబరమైన దుస్తులు ధరించాడు. వృద్ధాప్యంవల్ల కొంచెం నడుము వొంగింది.

వెనకవైపున ఫ్లెమిష్ రాయబారులిద్దరు నిలబడి గుసగుస లాడుకుంటున్నారు. మరొకడు కిటికీవద్ద నిలబడి తదేకంగా ఆకాశంవంక చూస్తున్నాడు. అతను సైన్యాధికారి దుస్తులు ధరించి ఉన్నాడు.

ఫ్లెమిష్ రాయబారులిద్దరూ గుసగుసలాడుకుంటున్నారు: "అబ్బబ్బ! కాళ్లు నొప్పులు పుడుతున్నాయి. ఇక్కడ కుర్చీ బెంచీలూ ఏమీ లేవే"

వాడు తల అడ్డంగా తిప్పాడు.

"అబ్బ! చతికిలబడి కూచుందామనుంది."

"అహహా! అంతపని చెయ్యబోకు. ఇక్కడ నిలబడాలి. లేకపోతే మోకరించాలి. అంతే!"

అధికారి పత్రం గబగబ చదువుతున్నాడు. మహారాజు పరివారానికి, వారి ఖర్చులకు తయారైన జాబితా ఏకరువు పెడుతున్నాడు.

"ఆగాగు" అన్నాడు మహారాజు. "ఇంతమందీ నాకోసమే! అంతా ఉత్తది. నన్ను దోచేస్తున్నారు. ఖజానా కొల్లబోతోంది. నాలుగేళ్ళలో ఖర్చు రెట్టింపయిపోయింది. సింహాలూ పులులూ వద్దనను—అందరూ కుక్కలూ పిల్లులూ పెంచుకుంటే నేను సింహాలూ పులులూ పెంచుకోవాలి. కాని ఈ మనుష్యుల్తోనే వస్తుంది. అందరూ నన్ను దోచుకుతిని బలుస్తున్నవాళ్లే నా చుట్టూ ...కానీ ఏంచేస్తాం. కొన్నాళ్ళకి అందరం మళ్ళీ నేలమీద పడి ప్రజల్ని దోచుకుంటాం. ఇంతేగా మనం చేసేపని...అప్పుడుగాని

మహారాజా జోకడున్నాడని ప్రజలకి తెలిసిరాదు. అయితే ఇక్కడ ఖైదీ కింకా డబ్బెందుకు ఖర్చు పెడుతున్నారు? ఎప్పుడో ఉరితియ్యవలసినవాణ్ని. ఎందుకుంచినట్టు? ఇదో ఖర్చా? లాభం లేదు. ఇంక వాడికోసం చిల్లిగవ్వ ఖర్చు పెట్టనివ్వను, వాణ్ని రేపు ప్రొద్దుట ఉరి తీయించవలసిందే. వాడి ఖర్చు కొట్టెయ్య......"

ఇంతలో ఒకడు గబగబ తలుపులు గెంటుకుంటూ వచ్చి మహారాజుముందు మోకరించి ఒగర్చుకుంటూ అన్నాడు: "మహారాజా! నగరంలో తిరుగుబాటు..." అతడి మాటలు ముగియకముందే మహారాజు అతణ్ని కోటుపట్టుకుని గుంజి లేవనెత్తాడు. అతడికే వినపడేలాగ అతి మెల్లిగా అన్నాడు: "ఇశ్: నోరేనా మూసుకో మెల్లిగా నేనా చెప్పు." అతడు మహారాజు చెవిలో చెప్పాడు. అది విని మహారాజు ఒకసారి ఓరకంట క్లైమిష్ రాయబారుల్ని గమనించి తరవాత బిగ్గరగా నవ్వాడు. నవ్వి బిగ్గరగా అన్నాడు: "ఓస్! ఇదా నువ్వు చెప్పేది. చెప్పు గట్టిగా చెప్పు. ఇక్కడ నా మిత్రులుకూడా వింటారు."

"కాని..."

"కాని లేదు గీని లేదు. చెప్పు, ఏమిటి? నగరంలో పకోరులు తిరగబడ్డారా?"

"న్యాయసభా భవనాధికారి పైనండి"

"ఎవరు మారారు?"

"నేనుకూడా మారానండి"

"ఎందుకు?"

"వారి నివాసం న్యాయసభాధికారి అధీనంలో ఉంచండి"

"అతనిమీద వాళ్ళకి కోప మెందుకు?"

"వాళ్ళెప్పుడూ మీ అధికారానికి తప్ప ఇంకెవరి అధికారానికీ లోబడమని చెప్తున్నారండి."

"ఓహో!" అన్నాడు మహారాజు, సన్నగా ఆగంతకుని వైపు కన్నుగిలికి.

"అలా పొగ్గ మెంటుకుకూడా వాళ్ళు పన్ను వించుకున్నారండి."

తృప్తి కలిగింది మహారాజుకు. కొంతసేపు ఆలోచించాడు.

"చాలమంది ఉన్నారా?"

"కనీసం ఆరు వేలమంది ఉంటారండి"

"ఆయుధా లున్నాయా వాళ్లదగ్గర?"

"పలుగులూ పారలూ అవీ రకరకాలున్నాయండి."

మహారాజు ముఖంలో ఆందోళన ఎంతమాత్రం కనపడకపోవడం గమనించి శ్లీమిష్ రాయబారులు ఆశ్చర్యపడ్డారు.

"మహారాజు సహాయం పంపకపోతే న్యాయసభాభవనాధికారి పని మూడిపోతుందండి."

"ఓ! తప్పకుండా పంపుతాను. ఆరు వేలమంది! బికారి వెధవలు! ఎంత సాహసం! కాని ఇక్కడా ఆట్టేమంది లేరిప్పుడు. రేపు ఉదయం చూద్దాం."

"వెంటనే అవసరమండి. లేకపోతే అక్కడి భవనాలన్నీ కొల్లగొట్టేస్తారు."

"రేపు ఉదయం అన్నాను. వినపడిందా? అంతే" అన్నాడు మహారాజు. ఇంక దీనికి సమాధానం లేదు. తరవాత తనలో తాను అనుకుంటున్నట్లు అందరికీ వినపడేలాగ అన్నాడు: "బాగుంది. లేకపోతే ఈ నగరాన్ని, ఈ దేశాన్ని సామంతులూ అధికారులూ పంచుకొంటున్నారు. ఎవడి ప్రాంతానికి వాడు చక్రవర్తి అనుకుంటున్నాడు. తన సైన్యం, తన న్యాయాధిపతులు తన శాసనం అంటూ ఉరిస్తంభాలూ, సైనికదళాలూ నిర్మించుకుని కూచున్నారు. ఇంకది లాభం లేదు. దేశానికంతకీ ఒకే రాజుండాలి, ఒకే శాసనం ఉండాలి, జాతీయసైన్యం ఒకటే ఉండాలి. మంచి పని చేశారు. దోచుకోండి. ఈ రాజులు రాజులు కారు. ప్రజలే ఇకనించి..."

పెదవి కొరుక్కున్నాడు మహారాజు. తలమీద టోపీ తీసి దానివంక ఒకసారి చూశాడు: "నా బుర్రలో ఏముందో తెలుసుకోవా లనుకొన్నావో—జాగ్రత్త. నిన్ను కాల్చి బూడిద చెయ్యగలను" అన్నాడు.

ఒకసారి అందరివంకా చూశాడు.

"అయ్యా! తొందరపాటులో మరిచిపోయాను. తిరుగుబాటు దార్లలో ఇద్దర్ని పోలీసులు పట్టుకుని తీసుకొచ్చారు. వారు ఇక్కడే ఉన్నారు. తమముందు హాజరు పెట్టమంటారా?"

"ఇంకా చూస్తావేం, తీసుకురా త్వరగా."

అతడు గబగబవెళ్ళి ఇద్దరు బికారుల్ని మహారాజు సమక్షంలో నిలబెట్టాడు. ఒకడు బొద్దుగా పొట్టిగా ఉన్నాడు. రెండోవాడు సన్నగా పొడుగ్గా ఉన్నాడు.

మొదటివాణ్ని చూసి అడిగాడు మహారాజు "నువ్వెవరు?"

"ముష్టివాణ్నండి."

"చౌకులో ఏంచేస్తున్నావ్?"

ముష్టివాడు మాట్లాడలేదు.

"తిరుగుబాటుకి కారణం?"

"నాకు తెలియదండి. అందరూ వెళ్లారు, నేనూ వెళ్ళానండి"

"వా డెవడో నీకు తెలుసా?"

"తెలియదండి."

"చాలు వీణ్ని తీసుకుపొండి."

అంతవరకూ కిటికీవద్ద నిశ్చలంగా నిలబడిన సైనికాధికారి వచ్చి ముష్టివాణ్ని తీసుకుపోయాడు.

మహారాజు రెండోవాణ్ని అడిగాడు "నీ పేరు?"

"పీర్ గ్రింగైర్"

"నీ వృత్తి?"

"కవినండి."

"తిరుగుబాటా? ఎంత సాహసం? ఏరా? చెప్పు?"

"అయ్యా! నాకా తిరుగుబాటుతో సంబంధం లేదండి."

"అదేమిటి? నిన్నక్కడే కాదూ పట్టుకున్నది?"

"కాదండి. పొరపాటున నన్నుకూడా పట్టుకున్నారండి. నా మనవి చిత్తగించండి. నేను కవిని. కవులైనవారికి రాత్రివేళ వీధుల్లో తిరగడం అలవాటండి. అదే మాకు మంచి అదను. పొరపాటుపడి పోలీసులు నన్నుకూడా పట్టుకువచ్చారండి. మీ పాదాలంటి ప్రార్థిస్తున్నానండి..."

"నోరుముయ్! సిగ్గులేదూ?"

సైనికాధికారి తిరిగివచ్చాడు. "వీణ్నికూడా తీసుకుపొమ్మంటారా?" అని మహారాజు నడిగాడు.

"ఓ! ఎందుకు తీసుకెళ్ళకూడదు?"

"నే చెప్తానండి" అన్నాడు గ్రింగైర్. మోకరిల్లి మహారాజు ముఖంలోకి దీనంగా చూశాడు. మహారాజు ముఖంలో ఎలాంటి మార్పూ లేదు.

"ప్రభువులు నా ప్రార్థన చిత్తగించండి. నావంటి అల్పుడి పైన మీవంటివారు కోపగిస్తే మేం ఎలా బ్రతగ్గలం?"

నాటకంలోవలె అభినయిస్తూ పెద్ద ఉపన్యాసం మొదలు పెట్టాడు గ్రింగైర్.

"పిల్లిమీద బ్రహ్మాస్త్రం ప్రయోగించకండి ప్రభూ, మహా ప్రభువులకు దాక్షిణ్యమే కిరీటం. తమరు కన్నెర్ర చేస్తే ప్రజలు కటకటలాడిపోతారు. ప్రచండ శీతవాయువులు చెలరేగినప్పుడు మనిషి పైన కప్పుకున్న బలికోటు తియ్యకు సరికదా మరింత బిగించుకుంటాడు. సూర్యభగవానుడు చిరునవ్వుతో ఉదయ కిరణాలను ప్రసరించినప్పుడు స్వయంగా బలికోటు తీసివేస్తాడు. నేను దుష్టివాణ్ని కాను, పోకిరిని కాను, దొంగని కాను. కపటి దోపిడితో పని లేదు. తిరుగుబాటులో చెయ్యి చేసుకోను. రాజభక్తి నా మతం. బిడ్డలకు తండ్రియెడ ఉండే భక్తి ప్రపత్తులు, అపార ప్రేమలే నాకు మీపట్ల ఉన్నవి. నా మాటల్ని బట్టి నన్ను శిక్షించకండి. నేనంత గుణవంతుణ్ని కాదు నిజమే. పేదవాడినైనా నాకు తమ పట్ల భక్తి తప్ప మరొక భావం లేదు. కవులు ధన మార్జించలేరని మీకు తెలుసును. సుగుణాలలోకెల్ల దాక్షిణ్యం శ్రేష్ఠమైనది. నన్ను కనికరించండి కవులను రక్షించేవారు ప్రభువులు. అరిస్టాటిల్‌ని అలెగ్జాండర్ ఉరి తియ్యలేదు. యువరాజు గారి వివాహ ప్రసక్తి గురించి ఒక నాటకం కూడా రచించాను. అలాంటిది వ్రాసినవాడు తిరుగుబాటుదారు కానేరడు..."

మహారాజు వింతగా ఉపన్యాసం వింటూ గ్రింగైర్ వంక చూస్తూనే ఉన్నాడు. చివరికన్నాడు: "అబ్బ! ఏం ఘోరణి. ఛీ! వీణ్ని విడిచిపెట్టు."

గ్రింగైర్ సంతోషానికి మేరలేదు. మహారాజు ముందు సాష్టాంగదండప్రణామం చేసి పాదాలు తాకాడు.

మహారాజు సైనికాధికారివంక తిరిగి అన్నాడు: "అంత ధనం ఖర్చుపెట్టి ఖైదులు తయారుచేయించింది ఇలాంటి పనుల కోసం కాదు. గెంటెయ్యి వీణ్ని ఇక్కణ్నించి."

"ఆహాహా! మహాప్రభువులు" అంటూ లేచాడు గ్రింగ్వార్. మళ్ళీ మహారాజు మనస్సు మార్చుకుంటాడనే భయంతో త్వర త్వరగా వెళ్ళిపోయాడు.

మహారాజు ఉత్సాహంగా ఉన్నాడు. న్యాయసభా భవనం అధికారిపై తిరుగుబాటును గురించి విన్నప్పటినుంచీ మహారాజు ముఖం కళకళలాడుతోంది. ఇంతలో రాజవైద్యుడొచ్చాడు. అతడు వస్తూనే అతి వినయంగా మహారాజు నడిగాడు. "తమ కేదో బాధ... ఎలా వుందండి?"

"ఓ! బాధా! అవును జ్ఞాపకం వచ్చింది. చెవుల్లో రొద... గుండెల్లో మంటలు భగ్గుమంటున్నాయి."

వైద్యుడు మహారాజు చెయ్యి చేతిలోకి తీసుకుని నాడి పరిశీలించాడు. పరిశీలిస్తున్న వైద్యుని ముఖంలో క్రమక్రమంగా ఆందోళన వ్యక్తం కాసాగింది. మహారాజుకూడా కంగారుపడ్డాడు. ఈ వైద్యుని ఘనతకి మహారాజు అనారోగ్యమే ఆధారం. అందువల్ల తన జీవనాధారాన్ని అతిజాగ్రత్తగా సంరక్షించుకుంటూ చెప్పాడు.

"అమ్మమ్మ! ఇది ప్రమాదమే!" అన్నాడు వైద్యుడు.

"నిజం?"

"నాడీ చలనం వేగంగా ఉంది. క్రమం లేదు. ఉండుండి వేగం హెచ్చుతుంది, ఉండుండి తగ్గుతుంది."

"ఓయి దేవుడా!"

"వెంటనే చికిత్స చెయ్యకపోతే మూడునాళ్లలో ముప్పుంది."

"ఆ! ఆ! అయితే చికిత్సేమిటి? చెప్పు? చెప్పు?"

"ఆగండి, ఆలోచించి చెప్తాను."

మహారాజుని నాలుక చాపమన్నాడు. నాలుక చూసి వైద్యుడు బుర్ర అడ్డంగా తిప్పాడు. వైద్యుని ముఖం గంభీరంగా ఉంది.

"అయ్యో! అన్నట్టు ఒకటి అడగాలనుకున్నానండి, మరిచి పోయాను. తమ ఆధీనంలో ఉద్యోగాలు కొన్ని ఖాళీ పడ్డాయండి. నాకో మేనల్లుడున్నాడండి. ఇదివరలో మీకు మనవి చేసే ఉన్నాను."

"నీ మేనల్లుడికో ఉద్యోగం ఇస్తున్నాను. తప్పకుండా ఇస్తున్నాను. కాని చికిత్స ఏమిటో చెప్పు."

"తమరు దయాపరులు. నేను ఇల్లు కట్టుకుంటున్నానండి. కొంచెం ధనసహాయం..."

"ఓ. తప్పకుండా."

"ఇప్పుడున్న పాతఇంటికి పైకప్పు వేయించుకోవాలండి. మేడమీద చిత్రపటా లున్నాయండి......"

"కిరాతకుడవ్. రక్తం పీల్చే జలగవ్. కానీ నీ కంత కావాలోతీసేసుకో. నా నోట్లో ఒక్క పన్ను తియ్యాలంటే, నీ యింట్లో వజ్రాలహారం ఒకటి చేయించుకుంటున్నావు."

"చిత్తం! చిత్తం! చికిత్సావిధానం అంతా రాసిఉంచుతానండి."

దీపం వెలిగించగానే పురుగులు చేరతాయి.

మహారాజు ప్రక్కనే నిలబడి ఖర్చుల జాబితా చదివిన రాజాధికారి అదే మంచి తరుణమనుకున్నాడు. "తమ ఖజానా శాఖలో ఒక ఉద్యోగి ఈమధ్య చనిపోయాడండి."

"అయితే?" అన్నాడు మహారాజు.

"అదే. ఖాళీగా ఉందన్నానండి"

"అబ్బబ్బ! నీ ఆశకి అంతులేదు. ఆరేళ్ళకిందట నువ్వే పరిస్థితిలో ఉన్నావో జ్ఞాపకంఉందా? నిన్నెంత వృద్ధిలోకి తీసుకొచ్చానో గుర్తుంచుకో. అట్టే దురాశకి పోకు, దురాశవల్ల చేటు తప్పదు. గర్వాని కెప్పుడూ నీడలాగా పతనం,అవమానం వెన్నంటి ఉంటాయని మర్చిపోకు."

రాజాధికారి నిరాశతో పక్కకు తప్పుకున్నాడు. అయితే అతడు నిర్లక్ష్యభావం స్పష్టపరుస్తూ "మహారాజు ఆరోగ్యం ఇవాళ అట్టే బాగుండలేదు" అన్నాడు.

మహారాజుకి ఆగ్రహం రాలేదు. వైద్యునివంక తిరిగాడు. "మంత్రులకంటె రాజాధికారులకంటె రాజవైద్యుడే అదృష్టవంతుడు. అంతేనా?" అన్నాడు రాజాధికారివంక చూస్తూ. మహారాజుకు కోపం తెప్పించడం అసాధ్యం అనుకున్నాడు రాజాధికారి.

మహారాజు కిటికీవద్దకు వెళ్ళిచూశాడు. దూరాన మంట కనపడింది. "పెద్దమంటలాగే కనపడుతోంది."

"తిరుగుబాటు అణచడం కష్టమే" అన్నాడు రాజాధికారి.

"ఓహో! అలాగా! కాని నేను తల్చుకుంటే..."

"మీరు తల్చుకు నేలోగానే కార్యం కాస్తా తీరిపోతుంది లెండి."

"నేను తల్చుకుంటే చిటికలో అణిచివెయ్యగలను."

"అంటే ప్రజలకి అదనుదొరికిం దన్నమాటే!"

సైనికాధికారి ఈమాటు ముందుకువచ్చాడు. "మహారాజుతో మాట్లాడుతున్నారని మరిచిపోకండి" అని గద్దించాడు.

"ఫరవాలేదు......మాట్లాడనియ్యి. నిర్భయంగా నాదగ్గర మాట్లాడేవాళ్లు కావాలి. ఆ! ఏమిటోయ్ చెప్పు."

రాజాధికారి తత్తరపడ్డాడు. మహారాజు చనువు ఇస్తున్నాడంటే ఏదో ముప్పుందన్నమాటే.

"నేనే పొరపడి ఉండవచ్చండి..."

"ఫరవాలేదు. చెప్పు. ప్రజలకి అదను వస్తున్నదంటావ్. కానీ, బాస్టిల్ అంత చప్పున ప్రజలచేతుల్లో పడదులే..."

ఇంతలో నగరాధికారి ఒకడు గబగబ వచ్చాడు. "మహారాజా! ముప్పు ముంచుకువచ్చింది"

"ఏమిటది?"

రాజాధికారి వెంటనే అందుకున్నాడు. అందరికీ వినపడేలా అన్నాడు: "బికారుల తిరుగుబాటు తమపై నేనండి."

"ఏమన్నావ్?" అన్నాడు మహారాజు కోపంతో. "జాగ్రత్త. నిజం చెప్పు. లేకపోతే నీతల ఎగిరిపోతుంది"

మహారాజు సాధారణంగా ఎవరినీ ఇలా బెదిరించడు. బెదిరిస్తే ఏదో మూడిందన్నమాట. రాజాధికారి గజగజలాడిపోయాడు. మహారాజుముందు మోకరిల్లి విన్నవించుకున్నాడు: "తమ న్యాయసభాధిపతి ఒక్క మంత్రకత్తెకు ఉరిశిక్ష విధించాడు. ఆమె నాటర్ డామ్ చర్చిలో ఆశ్రయం తీసుకుంది. బికారులందరూ ఆమెను అపహరించడంకోసం ఇప్పుడు చర్చిని ముట్టడిస్తున్నారు. నే చెప్పిన మాటల్లో అబద్ధమేదైనా ఉంటే ఈ నగరాధికారినే అడిగి తెలుసుకోండి"

మహారాజుముఖం ఎఱ్ఱబారింది. కోపంతో వాణికి పోయాడు: "ఓహో! అలాగా! నాటర్ డామ్ చర్చిని ముట్టడించారన్నమాట! సరే ఇంక ఈ మూక అంతుమూస్తాను. నాపైనే తిరుగుబాటు చేశారా!"

తరవాత మహారాజు సైనికాధికారిని పిలిచి వెంటనే ఏ యే సైనికదళాలను ప్రయోగించాలో వివరంగా ఆజ్ఞలిచ్చాడు.

"సంకోచించకు, చర్చిలో ప్రవేశించడానికి జంకనక్కర లేదు."

"మంత్రకత్తె నేం చెయ్యమని ఆజ్ఞ?"

"అసలు దాన్నెందుకు అపహరించాలనుకున్నారు వాళ్లు?"

నగరాధికారి చెప్పాడు: "ఆశ్రయంలో ఉన్న దాన్ని అపహరించాలనుకున్నారు కాబట్టి, వాళ్ళ ఉద్దేశం దాన్ని ఉరితియ్యాలనే అనుకుంటానండి."

మహారాజు కొంచెంసేపు ఆలోచించాడు. "ఆ మూకల్ని హతమార్చి, దాన్ని ఉరితియ్యండి. తీరిపోతుంది."

"చర్చిలోకి ప్రవేశించి దాన్ని పట్టుకుని ఉరితియ్యమంటారా?"

"చర్చి ప్రవేశించండి. ఫరవాలేదు." అంటూ మహారాజు ఒక గోడవద్దనున్న మేరీ ప్రతిమవద్దకు వెళ్ళి అక్కడ మోకరించాడు: "దేవీ. నన్ను క్షమించు. మా చర్చి పవిత్రమైనదే. కాని దేశంకోసం, న్యాయంకోసం అప్పుడప్పుడు మా అధికారులు చర్చి ప్రవేశించక తప్పదు. ఆమంత్రకత్తెని శిక్షించక తప్పదు. ఈమాటుకి క్షమించు. ఇంకెప్పుడూ ఇలా చెయ్యను. మీకొక వెండి ప్రతిరూపం నిర్మింపచేసి చర్చికి బహూకరిస్తాను." దేవికి మొక్కి లేచాడు మహారాజు.

# 33

బాస్టిల్ నుంచి బైటపడి గ్రింగైర్ వీధివెంట గుర్రంలా పరుగెత్తసాగాడు. కొంతదూరం పరుగెత్తి హఠాత్తుగా ఆగిపోయాడు. ఎదురుగా నల్లగా ఒకమనిషి ఆకారం కనపడింది. ఆ మనిషి నిలువెల్లా నల్లనిదుస్తులు ధరించాడు.

"ఎవరు?" అన్నాడు గ్రింగైర్.

"నువ్వా గ్రింగైర్? ఇంత రాత్రివేళ! వీధుల్లో ఏంచేస్తున్నావు?" గ్రింగైర్ గుర్తుపట్టాడు.

"నా తప్పుకాదు." అన్నాడు. "పోలీసులు నన్ను పట్టుకుని మహారాజుదగ్గిరికి తీసుకుపోయారు. కాస్తంతలో తప్పింది ముప్పు.

లేకపోతే ఉరితీసేవాళ్ళే. ఎప్పుడో అది నాకు తప్పదనుకుంటూను లెండి."

"అది నిజమేలే...కాని త్వరగా నడు. చర్చిముందు బికారులు దారికి అడ్డంగాఉన్నారు. గబగబ వెళ్ళాలి మనం. నడు. వాళ్ళతో నీకు స్నేహమేగా!" అన్నాడు క్లాడ్ ఫ్రాలో.

"ఓ! నడవండి. కాని చర్చిలోపలి కెలా వెళ్ళడం?"

"గోపురద్వారం తాళంచెవులు నాదగ్గిరున్నాయిలే"

"తరవాత బయటపడ్డం ఎలాగ?"

"నదిపక్క దారి ఉంది. అక్కడో బోటుకూడా ఉంచాను సిద్ధంగా!"

"అబ్బ! ఎంతలో తప్పిపోయింది ఉరి! నడవండి"

ఇద్దరూ గబగబ నడిచారు.

అక్కడ చర్చివద్ద ఏం చేయాలో తోచక క్వాసిమోడో మిద్దెపైన బోనులో పులిలాగ అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఎమరాల్డాను రక్షించగలనన్న ఆశ అతడికి అంతరించింది. తన క్షేమం గురించి అత డాలోచించనేలేదు. ఆమెను కాపాడ్డమే అతని ఏకైక లక్ష్యం.

చర్చి బికారుల స్వాధీనం కాబోతుందన్న సమయంలో హఠాత్తుగా వెనుక వీధులలో గుర్రాల డెక్కల చప్పుళ్లు వినవచ్చాయి. పెద్ద అశ్వికదళం ఒకటి అతివేగంగా వచ్చి బికారులను చుట్టుముట్టింది. బికారులు భీతితో వెనక్కు చూశారు. కన్ను తెరిచి మూసేటంతలో ఆ చౌకులో బికారులకూ అశ్వికులకూ మధ్య సంకులసమరం ప్రారంభమైంది.

క్వాసిమోడోకి ఘోష వినరాలేదు కాని కత్తుల తళతళలు, కాగడాల వెలుగులలో అశ్వికులు కనపడ్డారు. అశ్వికుల నాయకుడు కెప్టెన్ ఫీబస్‌ని అతడు గుర్తుపట్టాడు. బికారులు పికాపికలై పరుగెత్తడం చూశాడు. అనుకోకుండా వచ్చిన సహాయం చూసేసరికి అతడి కెక్కడలేని ఉత్సాహం, బలం పొంగివచ్చాయి. నిచ్చెన లెక్కి వచ్చినవారిని గబగబ క్రిందికి గెంటివెయ్యనారంభించాడు.

పారిపోగా మిగిలిన బికారులు మూలచిక్కుబడిన పిల్లివలె ప్రాణాలకు తెగించి పోరాడారు. తోడేళ్ళి చీల్చి ముక్కలు చెయ్యాలంటే కుక్కపళ్లతో కరవాలి అనాళి కడు. ఫీబస్ సైన్యం బికారుల్ని చీల్చి చెండాడింది. కొందరు బికారులు అశ్వ

కుల్చి గుర్రాలపైనుంచి పడేలాగ చిత్రవధ చేశారు. చాకు శవాల కుప్పలతో నిండి నెత్తురుమయమై భీభత్సంగా ఉంది.

గంటలో పోరు ముగిసింది. పారిపోగా మిగిలిన బికారులు చిత్రవధ చెయ్యబడ్డారు. చచ్చిపోగా మిగిలిన అశ్వికులు విజయ ఘోష చేసి వెళ్ళిపోయారు.

ముప్పు తీరిపోగానే క్వాసిమోడో విజయోత్సాహంతో ఆకాశంవంక చేతులెత్తి దైవానికి భక్తితో మ్రొక్కాడు. ఆనందంతో పరుగుపరుగున సోపానాలెక్కి ఎమరాల్డా గదివద్దకు వెళ్ళాడు. వెళ్ళి చూసి నిర్ఘాంతపోయాడు. గది ఖాళీగా ఉంది! గదిలో ఎమరాల్డా లేదు!

# 34

బికారులు నాటర్ డామ్ చర్చిని ముట్టడించిన సమయంలో ఎమరాల్డా గాఢనిద్రలో ఉంది. కొంతసేపటికి చర్చిముందు కోలాహలానికి ఆమెకు మెలకువ వచ్చింది. ఎమరాల్డా లేచి కూర్చుని చుట్టూ చూసింది, కోలాహలం వింది. విని ఒక్క ఉదుటున లేచి పరుగునవెళ్ళి గోపుర శిఖరంపైనుండి కిందికి చూసింది. ఆ చీకటిలో కింద చర్చిప్రాంగణంలో కొందరు కప్పలవలె ఎగురుతున్నట్లు ఏదో అయోమయంగా కనపడింది. అక్కడినుండి ఆర్త నాదాలు కూడా వినవస్తున్నాయి. చీకటిలో అక్కడక్కడా కాగడాలు కదలాడుతున్నాయి కాని ఆమె ఎవరినీ పోల్చుకోలేక పోయింది. జిప్సీలమధ్య పెరిగి చిన్నతనంనుంచీ పెంచుకుంటూ వచ్చిన మూఢవిశ్వాసాలనుబట్టి ఆమె అదేదో దయ్యాలపోరాటమని ఊహించింది. తన గదిలోకి పరుగెత్తివెళ్ళి పక్కలో ముఖం దాచుకుని భయం పోగొట్టుకోడానికి ప్రయత్నించింది.

కొంతసేపటికి భయంతగ్గి ఆమె తేరుకొన్నది. అప్పటికీ అదే రీతిగా కోలాహలం వినవస్తోంది. చర్చిముందు పోరాడుతున్నది దయ్యాలు కాదనీ మనుష్యులేననీ ఆమెకు చివరికి నమ్మకం కలిగింది. కాని ఈమాటు ఆమె భీతి మరింత ఎక్కువయింది. ఆమెనా ఆశ్రయంనుంచి ఎత్తుకొనిపోయి ప్రజలు చిత్రవధ చెయ్యడానికి వస్తున్నారని ఆమెకు తోచింది. మళ్ళీ ఆమెకు ప్రాణభయం పుట్టింది. ఆమె ఆశలు మళ్ళీ భగ్నమౌతున్నాయని తోచింది. తన

నిస్సహాయస్థితిని తెలుసుకుంది. మళ్ళీ పక్కపై బోరగిలపడి గుండెదడని అణచుకోడానికి ప్రయత్నించింది. మనస్సులో భగవంతుని పరిపరివిధాల ప్రార్థించింది. చర్చిలో ఉన్నందుకు జిప్సీ దేవతలనే కాక క్రీస్తుదేవునీ, మేరీమాతనీ అతిదీనంగా ప్రార్థించింది. భయంవల్ల ఆమె శరీరంలో రక్తం గడ్డకట్టినట్లయింది. అలా ఆమె ఎంతసేపుందో తెలియదు. కొంతసేపటికామెకు సమీపంలో అడుగుల చప్పుడు వినవచ్చింది. భయంతో కెవ్వన అరిచింది.

"భయం లేదు" అన్నదొక కంఠం. "నేనే."

ఈ కంఠం ఆమెకు తెలుసు. అయినా అడిగింది "ఎవరు?"

"నేను. పీర్ గ్రింగైర్."

పేరు వినగానే ఆమెకు ధైర్యం కలిగింది. కళ్ళెత్తి చూసింది. వచ్చింది అతడే. కాని అతని వెనుక నిలువెల్లా నల్లని దుస్తులు ధరించి ఒక ఆకారం నిలబడి ఉండడంకూడా గమనించింది. ఆమె నోట మాట రాలేదు.

గ్రింగైర్ అధిక్షేపణసూచకంగా అన్నాడు: "నువ్వు కనుక్కోలేకపోయావు. డాలీయే ముందు నన్ను గుర్తుపట్టింది."

అసలు పేరు చెప్పకముందే మేక అతడిదగ్గరచేరి మోకాళ్ళను పెనవేసుకున్నట్లు కాళ్ళెత్తి ప్రీతి ప్రదర్శించింది.

"నీవెనక ఎవరు?" అని ధైర్యంచేసి అడిగింది ఎస్మరాల్డా.

"భయపడవలసిన పనిలేదు. నా స్నేహితుడే" అన్నాడు గ్రింగైర్.

చేతిలో కొవ్వొత్తి దీపం పక్కగా పెట్టి మోకరించి మేకను ముద్దులాడ నారంభించాడు గ్రింగైర్. "ఏదీ నీగుర్తుంచుకుంటేం మరిచిపోలేదుకదా! నగరాధికారిలాగా నటిస్తావో..."

వెనుకవ్యక్తి గ్రింగైర్‌ని భుజంపైన తట్టాడు.

"ఆ! ఆ!" అంటూ లేచాడు గ్రింగైర్. "మరిచేపోయాను. మనం త్వరపడాలి. ఎస్మరాల్డా! ఇప్పుడు నువ్వు పెద్దప్రమాదంలో పడ్డావు, డాలీకికూడా ముప్పు వచ్చింది. నిన్ను రక్షించడంకోసం వచ్చాం. మా వెంటరా" అన్నాడు.

"నిజం?" అందామె ఆందోళనతో.

"అవును. నిజం. అందుకే త్వరగా బయల్దేరు."

"బయల్దేరతాను. కాని నీ మిత్రుడొక్కమాట పలకడేం?"

"ఏముంది?" అంటూ తడబడ్డాడు గ్రింగ్వార్, "వాళ్ళఅమ్మా నాన్నా చిత్రమైన మనుషులు కాబోలు! మౌనం, ముక్తసరిగా మాటాడ్డం నేర్పి ఉంటారు!"

అంతతో తృప్తిపడక తప్పలేదామెకు. గ్రింగ్వార్ ఆమె చెయ్యి పుచ్చుకున్నాడు. అతని మిత్రుడు దీపం అందుకున్నాడు. భయంవల్ల ఆమెబుద్ధి మందగించింది. మారుమాట లేకుండా గ్రింగ్వార్‌కి చెయ్యి అందిచ్చి అతన్ని అనుసరించింది. డాలీ ఉత్సాహంతో చకచక నడిచి వారి ననుసరించింది. ఆనందం పట్టలేక మాటిమాటికీ అతణ్ణి తలతో గెంట నారంభించింది. గ్రింగ్వార్ తూలిపడబోతూ అన్నాడు: "జీవితం అంటే ఇంతే! మనకి మంచిస్నేహితులైన వాళ్ళే అపచారం చేస్తూ వుంటారు."

గబగబ ముగ్గురూ మెట్లుదిగి కిందిభాగం చేరారు. అక్కడికి కోలాహలం భయంకరంగా వినవస్తోంది. చర్చి అంతా దద్దరిల్లి పోతోంది. చర్చి వెనకవైపు నిర్జనంగాఉంది. వెనుకనున్న మిత్రుడు ముందుకువచ్చి ఒక ద్వారం తలుపులు తాళంతీసి తెరిచాడు. చర్చి దాట నదివద్దకు వచ్చారు ముగ్గురూ. కల్లోలం దూరమైంది. నదివద్దున నిలబడి చర్చివంక చూశారు ముగ్గురూ. పైన ఇంకా మంట వెలుగుతూనే వుంది. ఆ మంటలో రెండు గోపురాలూ ఆకాశంలోకి చొచ్చుకున్న రెండు ఈటెల్లా కనపడ్డాయి. నల్లని దుస్తులు ధరించిన మిత్రుడు దీపం పట్టుకుని ముందు దారి తీశాడు. నదిలో చిన్నబోటొకటుంది. ముందు గ్రింగ్వార్, ఎమరాల్డా, మేక, తరువాత అజ్ఞాతవ్యక్తి బోటెక్కారు. పగ్గం విప్పి వదిలేశారు. అజ్ఞాతవ్యక్తి ముందు కూర్చుని తెడ్డు వేశాడు.

ఇక్కడ సీన్‌నది వడి ఎక్కువ. అతి కష్టంతో తెడ్డువేసి బోటు నడుపుతున్నాడు. గ్రింగ్వార్ వెనకవైపు కూర్చుని మేకని ఒళ్ళోకి తీసుకున్నాడు. ఎమరాల్డా భయంతో అతని పక్కనే అతన్ని గట్టిగా పట్టుకుని కూర్చుంది. బోటు కదలి కొంత దూరం పోయిన తరవాత గ్రింగ్వార్ "అమ్మయ్యా! ఇంక బతికాం" అన్నాడు. "కొన్ని కొన్ని మహాత్కార్యాలు అదృష్టదేవత కరుణ వల్ల సమకూడుతాయి; ఒకొక్కప్పుడు మన చాకచక్యంవల్ల సాధ్యమౌతాయి."

బోటు ఆవలిఒడ్డు చేరుతున్నకొద్దీ ఎమరాల్డా ఏదో తెలియరాని భీతితో బితుకుబితుకు మంటోంది. నూతన వ్యక్తి దీపపు

కాంతి తన ముఖంపై పడకుండా నల్లని గుడ్డతో ముఖం కప్పుకున్నాడు. చీకటిలో చేతులు చాచి అతడు తెడ్లు వేస్తున్నప్పుడు చేతులకున్న పొడవైన నల్లచొక్కా చేతులు విస్తరించి, అతడొక పెద్ద గబ్బిలంలాగ కనపడుతున్నాడు. అతడొక్కమాట మాట్లాడలేదు.

"అబ్బ! ఇంత నిశ్శబ్దం భరించలేం. ఎవరో ఒకరు నాతో మాట్లాడకూడదూ?" అన్నాడు గ్రింగైర్. "మనిషి కంఠం మనిషి చెవికి అమృతం పోసుతుంది. ఎమరాల్డా! నీకు అసలు విషయం తెలుసా? రాజాధికారులు చర్చిలో ప్రవేశించి నిన్ను తీసుకుపోడానికి పార్లమెంటుని అనుమతి కోరబోతున్నారు. అరె! మబ్బు విడిపోతోందా? వెన్నెల వచ్చినట్లయితే ప్రమాదమే! మనల్ని ఎవరైనా చూస్తారు. ఈ యువతిని రక్షించి గొప్ప ఉపకారం చేద్దామనుకుంటే, మనల్ని పట్టుకుని ఉరితియ్యరుగదా - నిష్కారణంగా?! ఒకడికి మంచైనది మరొకడికి చెడ్డగా తోచడం లోకంలో పరిపాటేగదా! ఏమిటి? ఎవ్వరూ మాట్లాడ దల్చుకోలేదా? ఇంక నాలో నేనే మాట్లాడుకోవాలన్నమాట! మహారాజుని ఇందాక నే చూశాను నీముకు, నేను రాసిన నాటకానికి డబ్బివ్వనే లేదు. ఇంకా నయం నన్ను ఉరితీయించేవాడు. కాస్తంతలో తప్పింది. ప్రతిభగల వాళ్ళని చూస్తే అతడికి వెర్రెత్తుతుందిట!"

గ్రింగైర్ తనధోరణి ఆపాడు. ఎవరూ మారుపలక లేదు.

"అన్నట్లు అడగడం మరిచిపోయాను. మీరు గమనించారా?" అన్నాడు తెడ్లు వేస్తున్న వ్యక్తిని సంబోధిస్తూ. "మీ క్వాసిమోడో ఎవణ్ణో కాళ్ళు పట్టుకుని విసిరి గోపురానికి వేసి కొట్టాడు. నేను చీకటిలో గుర్తుపట్టలేదు."

ఆ వ్యక్తి జవాబివ్వలేదు కాని చేతిలో తెడ్లు నిలిచిపోయాయి. అతడి తల వాలిపోయింది. గాఢనిశ్వాసం విడిచాడు. తెడ్లు వెయ్యనందువల్ల బోటు ప్రవాహంలో కొట్టుకుపోసాగింది. కొంతసేపటి కావ్యక్తి తేరుకుని మళ్ళీ తెడ్లు వెయ్యడం మొదలు పెట్టాడు.

గ్రింగైర్ మళ్ళీ మొదలు పెట్టాడు. ఎమరాల్డావంక తిరిగి చెప్పాడు: "చరిత్రలో జరిగిన ఒక కథ చెప్తాను వింటావా? మోహం ఎంత దారుణమైన దనుకున్నావ్? అబ్బబ్బ! అక్కడ ఎంత రణగుణధ్వని చేస్తున్నారు?"

అప్పటికి నాటర్ డామ్ చర్చివద్ద కోలాహలం మరింత చెలరేగింది. అప్పటికి అశ్వికదళాలువచ్చి బికారుల్ని చిత్రవధ చేశాయి. సైనికులు పెద్దపెద్ద కాగడాలు తీసుకుని చర్చిఅంతా వెతుకుతున్నారు. నదివడ్డున కాగడాలు కనపడుతున్నాయి. "జిప్సీ పైనుందేమో గాలించండి. పట్టుకోండి" అని కేకలు వినపడుతున్నాయి. ఎమరాల్డా తలవంచుకుంది. కొత్తవ్యక్తి జోరుగా తెడ్లు వేస్తున్నాడు. గ్రింగైర్ ధోరణి మానేసి ఆలోచనలో పడ్డాడు.

గ్రింగైర్‌కి భయం కలిగింది. జిప్సీతో సహా అందరూ దొరికిపోతే తననికూడా ఉరితీసేస్తారు. జిప్సీని తన మిత్రుడే కాపాడుకుంటాడు. తాను మేకను తీసుకుని వెళ్ళిపోవడం మంచిది.

బోటు ఒక్కసారి గట్టిగా కుదిపింది. ఒడ్డు చేరినట్లు గ్రహించారు. నూతనవ్యక్తి లేచి యువతి చెయ్యి అందుకున్నాడు. ఆమె చెయ్యి లాక్కుని గ్రింగైర్‌ని గట్టిగా పట్టుకుంది. గ్రింగైర్ మేకను గట్టిగా పట్టుకుని ఆమెను మెల్లిగా నెట్టాడు. ఇంక చేసేది లేక ఆమె బోటు దిగింది. నిశ్చేష్టురాలై ఒడ్డున నిలబడింది ఆమె దృష్టి నదీప్రవాహంపైనే ఉంది. భీతివల్ల ఆమెకు బుద్ధి పని చెయ్యడంలేదు. చైతన్యంలేక చూస్తూ ఉండిపోయింది. కొంతసేపటికి ఆమె తెలివి తెచ్చుకుని చూసింది. బోటులో ఎవరూ లేదు. నూతనవ్యక్తి ఆమెమాత్రం ఒడ్డున మిగిలి ఉన్నారు. ఆమెస్థితి గమనించి గ్రింగైర్ మేకతో సహా బోటు దిగి దాటేశాడు.

ఎమరాల్డా వొణికిపోయింది. ఏదో మాట్లాడాలనుకుంది కాని నోటివెంట మాటరాలేదు. అతడామె చెయ్యి పట్టుకున్నాడు. ఇంక కర్మను తప్పించడం సాధ్యంకాదనుకుందామె. అతడివెంట నడవనారంభించింది. చుట్టూ చూసింది. ఒక్క మనిషి కనపడలేదు. ఆమె ఏదారిని నడుస్తున్నదో గుర్తించడానికైనా ప్రయత్నించలేదు. ఒకచోట ఒక యింటిలోనుండి వెలుగు కనపడింది. హఠాత్తుగా ఆగి ఆమె ఆర్తనాదం చేసింది. ఆ యింటి కిటికీ తెరుచుకుంది. ఒక వ్యక్తి దీపంతో సహా వచ్చి వీధిలోకి చూశాడు. చూసి తిరిగి కిటికీ మూసుకున్నాడు. ఆమె ఆశ అంతరించింది.

కొత్తవ్యక్తి వేగం మరింత హెచ్చించాడు. ఆయాసపడుతూ అడిగింది "ఎవరు నువ్వు? ఎవరు?"

అతడు జవాబివ్వలేదు. చివరికిద్దరూ ఒక విశాలమైన ప్రదేశానికి చేరుకున్నారు. ఇద్దరూ ఆగారు. ఎమరాల్డా చూసింది.

అది గ్రీవ్ చౌకు. అతడామెవంక తీక్ష్ణంగా చూశాడు. ముఖంపై ఆచ్ఛాదనం తొలగించాడు. "అమ్మో" అంది ఎమరాల్డా. "మొదటే భయపడ్డాను, నువ్వేనని."

అతను క్లాడ్ ఫ్రాలో. అతను ప్రేతాకారంవలె ఆమెకు గోచరించాడు. వెన్నెలలో అతడి ముఖం స్పష్టంగా తెలుస్తోంది.

"ఇటు విను" అన్నాడు క్లాడ్. ఆ కంఠం వినేసరికి ఆమె నిలువెల్లా కంపించిపోయింది. అతను లోని ఆవేగాన్ని అణుచుకుంటూ చెప్పాడు: "ఇది గ్రీవ్ చౌకు. ఇంక ముందుకు పోనక్కరలేదు మనం. విధి మనల్ని ఇద్దరినీ ఒకరినొకరి అధీనంలో విడిచిపెట్టింది. నీ ప్రాణాలిప్పుడు నాచేతిలో ఉన్నాయి. నా ఇహంపరం నీ అధీనంలో ఉన్నాయి. నేను చెప్తున్నది జాగ్రత్తగా విను. కాని నాకు జవాబు చెప్పకు. ఫీబస్ పేరు మాత్రం ఎత్తవద్దని గట్టిగా చెప్తున్నాను."

మాట్లాడుతూ అతను అటు ఇటు పచార్లుచెయ్య నారంభించాడు. కానీ ఆమె చెయ్యి విడిచిపెట్టలేదు. ఆమెనుకూడా తనవెంట గబగబా నడిపించుకొని ఆమె నెక్కడికో తీసుకుపోతున్నాడు. పచార్లు తిప్పుతున్నాడు. "వాడి పేరుమాత్రం నావద్ద ఎత్తకు. ఎత్తావంటే నేను కోపంలో ఏం చేస్తానో నాకే తెలియదు. కాని ఘోరం జరిగిపోతుంది. జాగ్రత్త."

కొంచెంసేపు నిలబడి ఆలోచించాడు. తరవాత అన్నాడు: "నేను చెప్పేది శ్రద్ధగా విను. నవ్వకు. ఇది నవ్వులాట కాదు. పార్లమెంటు డిక్రీ ఇచ్చేసింది—నిన్ను ఉరితియ్యమని. నిన్ను వాళ్ళబారినుంచి ఇప్పుడు రక్షించాను. అక్కడె సైనికులు నీకోసం వెతుకుతున్నారు."

ఆ సమయానికి సిపాయిలు, పోలీసులు వచ్చి చుట్టుప్రక్కల వీధులలో వెదుకుతున్నారు.

"నువ్వే చూడు అటువైపు. నీ కోసం వెదుకుతున్నారు. నే నేమీ మోసం చెయ్యటం లేదు. నిన్ను నేను నా ప్రాణంతో సమానంగా ప్రేమిస్తున్నాను. ఆగు. నువ్వు మాట్లాడకు. నన్ను అసహ్యించుకుంటున్నావని నువ్వు వేరే చెప్పనక్కర్లేదు నాకు. చెప్పవద్దు. నే నామాట నీ నోట వినదలచుకోలేదింక. నిన్ను నేను రక్షించాను. నిన్ను రక్షించగలను. అంతా సిద్ధం చేశాను.

ఇంక నీ అంగీకారం ఒక్కటే మిగిలింది. అంటే చెప్తున్నాను విను...ఆగు."

ఆమెను చౌకులోని ఉరిస్తంభం వద్దకు లాక్కువెళ్ళాడు. చెయ్యెత్తి దాని వంక చూపుతూ అన్నాడు. "నిశ్చయించుకో— నేనే కావాలో నీకు, లేక అదే కావాలో. తేల్చుకో."

ఆమె అతడి గుప్పిటనుండి గుంజుకుని విడిపడింది. ఉరిస్తంభం వద్దకు వెళ్ళి చేతితో తట్టి ఉరి స్తంభాన్నే ఎంచుకున్నట్లు తెలియ పరిచింది.

క్లాడ్ స్తంభితుడై ఆమెవంక చూశాడు. "ఉరిస్తంభంకంటె నువ్వే భయంకరంగా ఉన్నావు" అన్నాడు. "ఈ రాళ్ళకే నోరుంటే, నాకంటే వ్యాకులపొందిన మనిషి ఇంకొకడు లేడని చెప్ప గలవు. నేను నిన్ను అపేక్షించాను" అని ఆగిపోయాడు.

ఎమరాల్డా ఉరిస్తంభం వద్ద మోకరిల్లింది. జవాబివ్వలేదు.

అతడిలా చెప్పాడు: "నీపట్ల ప్రేమ నా హృదయంలో దావాగ్ని రెచ్చగొట్టింది. నీ కటాక్షం కోసం నన్ను ఏం చెయ్యమన్నా చేస్తాను. నీ నిరాకరణవల్ల మాత్రం నా జీవితం అంతా నరకప్రాయమైపోయింది. ఇప్పుడైనా మించిపోలేదు. నన్ను రక్షించు. నేను క్రూరుణ్ని, కఠినుణ్ని అనుకుంటున్నావు. నిజంగా నాదెంత మెత్తని మనస్సో నీకు తెలియదు. నిన్ను నా ప్రాణ సమంగా ఆదరించి ఆరాధిస్తాను. ఒక యువతిని ఒక పురుషుడు ప్రేమించాడంటె అది అతని తప్పుకాదు. తిరస్కరించబడితే అతడు కఠినుడూ, క్రూరుడూ కాక మరేమౌతాడు? నీ హృదయం నిజంగా అతి సున్నితం. నీ శరీరం అతికోమలం. నీ సౌందర్యం అమేయం. కాని నా ఒక్కడిపట్లనే కఠిన పాషాణమైనావు. ఎంత ప్రారబ్ధం" అని లలాటం కొట్టుకున్నాడు. తరవాత చేతులతో ముఖం కప్పుకుని సన్నసన్నగా విలపించాడు.

అతడి నంత దీనావస్థలో చూడ్డం ఎమరాల్డాకి ఇదే మొదటి సారి. కాని ఆమె ఒక్క పలుకు పలకలేదు.

క్లాడ్ కొంతసేపటికి తేరుకుని అన్నాడు: "చెప్పాలంటే నాకు మాటలు రావడంలేదు. నీకు నిష్కర్షగా చెప్పాలనుకున్నది చెప్పలేకపోతున్నాను. అది చెప్పాలంటే ఒళ్లు జలదరిస్తుంది. నన్నేదో మహాశక్తి ఆవహించింది. నామీద నీకు జాలి లేదా? ఎందుకిలా నిన్ను నాశనం చేసుకుంటావు, నన్ను చేస్తావు? నా

సర్వస్వాన్నీ, ఇహాన్నీ పరాన్నీ త్యజించి నీకోసం అర్థిస్తున్నాను. నాకు తెలుసు, ఇంతకంటె నీచం మరొకటుండబోదు. నేను అన్నివిధాలా పతితుడినైనాను. ఇదంతా నీకోసం. అయినా నన్ను తిరస్కరిస్తున్నావు. ఇంకొక విషయం చెప్తున్నాను విను. అదెంత ఘోరమైనదో చెవులారా విను. చిన్నతనంనుంచి సాకి పెంచి పెద్దచేసిన నా తమ్ముణ్ణి రక్షించగలిగి కూడా రక్షించలేకపోయాను. నీవల్లనే సుమా! నేను కళ్ళారా చూస్తుండగా నా తమ్ముణ్ణి నా పెంపుడుకొడుకు విసిరి గోడకేసి కొట్టి చంపేశాడు..."

ఇంక అతడు మాట్లాడలేకపోయాడు. పిచ్చి పిచ్చిచూపులతో ఆమెను చూశాడు. "నీకోసం..." అన్నాడు. ఉన్నట్టుండి అతడిలో క్రోధం పెల్లుబికివచ్చింది. "నాకు పిచ్చెత్తిపోతుంది. నన్ను రాక్షసునిగా మార్చకు సుమ్మీ. నేను సహించలేను. ఒక్క మాట చెప్పు. నా వలపు స్వీకరించినట్లు ఒక్కమాట చాలు."

ఆమె ఏదో చెప్పాలని పెదవులు కదిల్చింది. ఈమారు ఆశతో అతడామెముఖంవంక చూశాడు. ఆమెను సమీపించి ఆమెముందు మోకరిల్లాడు. "నువ్వు హంతకుడవ్" అని ఆమె అన్నమాటలు వినపడ్డాయి. పులి మేకను పట్టుకున్నట్లు అతడామెను ఒడిసి పట్టుకున్నాడు. అట్టహాసంగా పిచ్చినవ్వు నవ్వాడు. "నేను హంతకుణ్ణే. కాని నిన్ను పొంది తీరతాను. నీకు బానిసగా ఉండబోను, యజమానినౌతాను. నాతో నువ్వు రాక తప్పదు. లేదా నిన్ను అప్పగించి తీరతాను. నువ్వు చచ్చిపోక తప్పదు. అప్పుడు తప్పకుండా హంతకుణ్ణి కాకమానను" అంటూ ఆమెను పొదివి పట్టుకుని ఆమె కంఠంపైనా భుజాలపైనా చుంబించ నారంభించాడు. ఆమె పెనగులాడింది "రాక్షసుడా. నన్నొదులు. లేకపోతే నీ ముఖంచీల్చి నెత్తురు చూస్తాను" అంటూ అతడి చెయ్యి పట్టుకుని గట్టిగా కరచింది. అతడామెను వదలిపెట్టాడు. అతణ్ణి జయించాననుకుందామె. "ఫీబస్ తప్ప ఇంకొకడు నాకక్కరలేదు. నీ పీనుగు ముఖమూ నువ్వూ ఫో ఇక్కడనించి."

"అయితే చావు" అని అరిచాడు. క్లాడ్ పళ్లు పటపట కొరుకుతూ ఆమెను పట్టుకున్నాడు. ఆమె నొక్కతోపుతో క్రింద పడగొట్టి ఆమె రెండు చేతులూ పుచ్చుకున్నాడు. రోలండ్స్

టవర్ వైపుకి ఆమెను నేలపైన బరబర ఈడ్చుకు పోయాడు. టవర్ ముందు ఆగాడు.

"ఆఖరుసారి అడుగుతున్నాను. చెప్పు. నన్నంగీకరిస్తావా లేదా?"

"అంగీకరించను."

క్లాడ్ బిగ్గరగా అరిచాడు: "గిద్దాలా! సిస్టర్ గిద్దాలా! ఇదుగో జిప్సీ. నీ పగ తీర్చుకో" క్లాడ్ జిప్సీని లేవదీసి నిలబెట్టాడు. హఠాత్తుగా ఆమె చేతుల్ని ఏవో రెండు ఉక్కు చేతులు పట్టుకున్నట్టయింది. ఎమరాల్డా చూసింది. గోడలో రంధ్రంవంటి ఒక కిటికీలోనుంచి కంకాళంవలెనున్న ఒక వ్యక్తి తన చేతులు పట్టుకున్నట్లు చూసింది.

"గట్టిగా పట్టుకో. ఆ రోజున పారిపోయిన జిప్సీ ఇదే. తప్పించుకు పోనివ్వకు. నేను వెళ్ళి పోలీసుల్ని పిలుచుకువస్తాను. దీన్ని ఉరితీస్తుంటే నువ్వు స్వయంగా చూద్దువుగాని" అన్నాడు క్లాడ్.

ఈ మాటలకు సమాధానంగా అమానుషమైన వికృత హాసం ఒకటి వినవచ్చింది. క్లాడ్ ఆమె నక్కడే విడిచిపెట్టి నాటర్ డామ్ వంతెన వైపుకు పరుగెత్తాడు.

# 35

ఎమరాల్డా కిటికీలోకి చూసింది. గిద్దాలాను గుర్తుపట్టి భయకంపితురాలయింది. ఆమె పట్టునుంచి విడిపించుకోడానికి గట్టిగా పెనుగులాడింది. కాని ఆ వృద్ధురాలి గుప్పిట విడిపించుకోలేక పోయింది. ఎముకలవలెనున్న ఆమె వ్రేళ్లు ఎమరాల్డా మణికట్టులపై ఎర్రనివాతలు పెడుతున్నాయి. గోడే చేతులు చాచి జిప్సీని బంధించినట్లుంది.

కొంతసేపు పెనుగులాడి అలసి ఎమరాల్డా గోడకు చేరబడి పోయింది. మృత్యుభయాం ఆమె నావహించింది. జీవితంలోని మాధుర్యం, ఆనందం, యవ్వనం, సూర్యకాంతి, ప్రేమ, ఫీబస్ అంతా ఆమె మనఃపథంలో గిరగిర తిరగనారంభించింది. తరువాత మతాధికారి, ఉరిస్తంభం, మృత్యువు జ్ఞప్తికి వచ్చాయి.

మళ్లీ వికటాట్టహాసం వినవచ్చింది. యువతికి భీతితో శరీరమంతా గగుర్పొడిచింది. మెల్లిగా తలెత్తి వృద్ధురాలివంక చూసింది. "నేను నీకేమపకారంచేశాను?" అని దీనంగా ప్రార్థించింది.

"జిప్సీ! జిప్సీ" అని మాత్రం వృద్ధురాలు గొణిగింది. తరవాత ఇలా అంది. "ఏమపకారమా? చెప్తా విను. నాకో ముద్దుల కూతురుండేది పసిబిడ్డ. బంగారుబొమ్మ. నా బిడ్డని అపహరించారు. కిరాతకులు నాబిడ్డని చంపి తినేశారు. ఏమపకారమని అడుగుతావేమిటి?"

కట్టు కథలో మేకపిల్ల తోడేలుతో అన్నట్లంది ఎమురాల్డా "అప్పటికి నేను పుట్టనేలేదేమో!"

"పుట్టే వుంటావు" అంది సిస్టర్ గ్వర్లా. "అప్పుడు ఆ గుంపులో నువ్వూ ఉండేఉంటావు. సరిగ్గా నీయీడే ఉంటుంది. పదిహేనేళ్ళయింది అపహరించి. పదిహేనేళ్లనించి నేను క్రుంగిపోతున్నాను. పదిహేనేళ్లుగా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. పదిహేనేళ్లుగా నాతల ఈ గోడలకేసి కొట్టుకుంటున్నాను. నాబిడ్డని అపహరించి చంపి తినేశారు జిప్సీలు. అసలు నీకు హృదయం అనేది ఉందా? నీబిడ్డే అనుకో! ఆలోచించు అదెంతఘోరమో! అప్పుడు నాబిడ్డని చంపుకుతిన్నారు. ఇప్పుడు జిప్సీలబిడ్డని నేను చంపిస్తాను. చచ్చిపోతుంటే కళ్లారా చూస్తాను. పాపం! ఉయ్యాలలో ఆదమరిచి నిద్రపోతోంటే లేపనైనా లేపలేదు. ఎత్తుకుపోయారు. నేనక్కడ లేను. ఇప్పుడు రమ్మను నీ జిప్సీలని. నువ్వు చచ్చినతరవాత నిన్ను వండుకుతినమను." ఆమె వెర్రిగా నవ్వడం మొదలు పెట్టింది.

అప్పటికి తూర్పు తెల్లవారుతోంది. మసకవెలుగులు వ్యాపిస్తున్నాయి.

ఎమురాల్డా ప్రార్థించింది. "అమ్మా! నన్ను దయచూడు. వాళ్లు వస్తున్నారు. నేను నీకెప్పుడూ ఎటువంటి అపకారమూ చెయ్యలేదు. నన్ను వొదిలిపెట్టు."

"నా బిడ్డని నాకియ్యి."

"నన్నొదిలిపెట్టు."

"నా బిడ్డని నాకియ్యి."

ఎమరాల్డాకి ఆశ అంతరించింది. గోడపై తలవాల్చి నిల బడింది.

"ఏం చెయ్యాను? నువ్వు నీబిడ్డకోసం అల్లాడుస్తున్నావు. నేను నా తలిదండ్రుల్ని వెతుక్కుంటున్నాను."

"ఇదిగో ఇటు చూడు" అంది గ్విర్లా. ఎమరాల్డా అటు చూసింది. నేలవంక చూపుతూ గ్విర్లా అంది "ఆ బుల్లి ముఖమల్ చెప్పు నాబిడ్డది. నాకు మిగిలింది అదొక్కటే...దాని జత చెప్పు ఎక్కడుందో తెలుసా? తెలిస్తే చెప్పు. ఎక్కడున్నా సరే వెళ్ళి తెచ్చుకుంటాను."

అప్పటికి వెలుగు తెల్లనయింది. కూపంలో ఒక మూల చెప్పు చూసింది ఎమరాల్డా. ఉలిక్కిపడి మరొకమారు చూసింది. "ఏదీ! చూడనీ" అంది. "ఆగు! ఒక చెయ్యి వొదులు."

గ్విర్లా ఒక చెయ్యి వొదిలింది. ఎమరాల్డా మెడవెనుక వ్రేలాడుతున్న సంచి తీసింది. అందులో రెండో చెప్పు తీసింది.

గ్విర్లా ఆనందాతిరేకంతో అరిచింది. "నా బిడ్డ! ఏగ్నెస్! ఏదీ" అంటూ గ్విర్లా ఒక చేత్తో ఆ చెప్పు అందుకుంది. రెప్ప పాటులో పోల్చిచూసుకుంది. కిటికీ ఊచలలో ముఖం పెట్టి అంది "నా బిడ్డా! ఏదీ నీముఖం చూడనీ" అంది.

"అమ్మా! నువ్వేనా!" అంది ఎమరాల్డా.

"అయ్యో! ఎంత ప్రారబ్ధం. ఇదుగో నాబిడ్డ. కాని నిన్ను నా ఒడిలోకి తీసుకోలేనుకదా!" అని బిగ్గరగా విలపించింది. ఎమ రాల్డా ముందుకు వచ్చింది. ఇద్దరూ కిటికీకి ఇరుప్రక్కలనుండే చేతులతో ఆలింగనం చేసుకున్నారు. తల్లి బిడ్డను నొసటిపై ముద్దు పెట్టుకుంది.

ఉన్నట్టుండి యువతిని విడిచిపెట్టి తల్లి కిటికీఊచలు పట్టు కుని ఊగిసలాడించింది. కాని అవి చలించలేదు. తన కూపం లోప లికి వెళ్ళి విడిఉన్న ఒక నాపరాయి తీసుకువచ్చింది. నాలుగైదు దెబ్బలతో ఊచలు పక్కపక్కలకు వంగాయి. ఎమరాల్డా కిటికీ ఊచలసందునుంచి లోపలికి వెళ్ళింది. తల్లి తన బిడ్డను గాఢ పరి ష్వంగంలో బంధించింది. తరవాత పసిబిడ్డ నెత్తుకున్నట్లు ఆ యువతిని చేతులపై ఎత్తుకుని ముద్దులు పెట్టుకుంటూ ఏడ్వసాగింది. "నా బిడ్డ దొరికింది. ఇదుగో నా బిడ్డ! భగవంతుడు నా ప్రార్థన విన్నాడు. నా బిడ్డని జిప్సీలు తినెయ్యలేదు. జిప్సీలు

నిజంగా దేవతలు..." అంటూ ప్రలాపించసాగింది. కూతురు పాదాలు చేతులు వీపు కన్నులు ఒళ్ళంతా ముద్దులతో నింపివేసింది. యువతి నలిగిపోతున్నా ఆనందంతో "అమ్మా" అంది.

"మళ్ళీ అను. ఆను. మనం ఇక్కడనించి వెళ్ళిపోవాలి. మన వూరు వెళ్ళిపోదాం. మనవూళ్లో ఒక ఇల్లుకట్టుకుని మనిద్దరం ఒకే పక్కలో పడుకుని..." ఈ విధంగా ఊహాలల్లుకుని ప్రలాపించింది. ఈ సమాగమంలో ఇద్దరూ పరిసరాలనే మరిచిపోయారు. ఉన్నట్టుండి గుర్రాల డెక్కల చప్పుళ్లు విని ఇద్దరూ ఉలిక్కిపడ్డారు. అప్పుడు యువతికి తెలివివచ్చింది. "అమ్మా" అంటూ భీతితో తల్లిని కౌగలించుకుంది. "అమ్మా పోలీసు లొస్తున్నారు.".

"అమ్మా! మరిచిపోయాను. నీకోసం వెతుకుతున్నారు. నువ్వు ఏం నేరంచేశావు?"

"నేరమేమిటో తెలియదమ్మా! కాని నాకు ఉరిశిక్ష వేశారు."

"ఉరిశిక్షే!" అంటూ తల్లి స్తంభించిపోయింది.

"అవును. నన్ను పట్టుకుని ఉరితీస్తారు. నన్ను తీసుకుపోడానికి వస్తున్నారు. నన్ను రక్షించమ్మా!"

కొంతిసేపు నిశ్చేష్టురాలై నిలబడిపోయింది. తరవాత తేరుకుంది. "లేదులేదు. పొరపాటు. పదిహేనేళ్లు తపించి తపించి నిన్ను కనుక్కున్నాను. ఇప్పుడు ఒక్కక్షణం నిన్ను విడిచిపెట్టను. దేవుడింత నిర్దయుడు కాడు.—"

గుర్రాల డెక్కల చప్పుళ్లు ఆగాయి. తల్లి కిటికీలోనుంచి చూసి గబుక్కున తల లోపలికి లాక్కుంది. "ఆమూల దాక్కో. వాళ్ళకి కనపడవు. నడు" అంటూ ఎమరాల్డాని ఒక మూల గోడ కొదిగి నిలబెట్టింది. "ఊపిరైనా విడవకు." ఆమె గదిలో అటూ ఇటూ పిచ్చెత్తినట్లు జుట్టు పీక్కుంటూ తిరుగ నారంభించింది.

బైట క్లాడ్ గొంతుక వినవచ్చింది. "ఇటు! ఇక్కడ! ఇలా రండి ఫీబస్" అంటున్నాడు.

ఫీబస్ పేరు వినేసరికి ఎమరాల్డా కదిలింది.

"కదలకు కదలకు" అంది తల్లి.

కిటికీవద్ద మనుష్యుల మాటలు వినవచ్చాయి. తల్లి కిటికీవద్దకు వెళ్ళి అడ్డుగా నిలబడింది. వీధి అంతా అశ్వికులు నిండిఉన్నారు. ఒక సైనికాధికారి ఆమెముందుకు వచ్చి అన్నాడు. "మీ కొక జిప్సీ యువతిని ఒప్పగించారట. ఎక్కడ?"

"మీరు చెప్తున్న దేమిటో తెలియడంలేదు."

"బలే! ఆ ముసిలాడు మన్ని బోల్తా కొట్టించినట్టున్నాడే" అన్నాడొకడు.

"ఏడి?"

"లేడే! జారుకున్నాడు."

"నిజం చెప్పు. నీకో యువతి నెవరో ఒప్పగించారు. నిజమేనా?"

"ఓ! అదా!" అంది తల్లి. "అవును. ఒక యువతిని నన్ను ఎవడో వచ్చి పట్టుకోమన్నాడు. పట్టుకుంటే అది నా చెయ్యి కరిచి పారిపోయింది."

"అబద్ధం చెప్పకు. నేనెవ్వరో తెలుసా?"

"ఎవ్వరైనా నాకేంటే నేను చెప్పింది నిజం."

"అయితే తప్పించుకుందన్నమాట! ఏపక్కకి పారిపోయింది?"

"ఆ వీధిలో వెళ్ళింది."

"నవ్వండి వనక్కి" అన్నాడు ఫీబస్.

"ఆగండి. ఆ ఊచలల్లా ఎందుకు వంగిపోయాయి?"

"అవెప్పుడూ అంతే."

"అరె! దానిముఖం చూడు. కంగారుపడిపోతోంది ఎందుకు?"

అందరూ అనుమానంతో చూశారు. కాని ఫీబస్‌కి విసుగు వచ్చింది. "లాభంలేదు. ఎక్కడికి పోయిందో వెతకండి. నే నింక ఇంటికి వెళుతున్నాను. మీరు వెతకండి."

ఫీబస్ గుర్రమెక్కాడు. అశ్వికులందరూ కుడివైపు వీధిలో సాగిపోయారు. ఫీబస్ ఇద్దరు సైనికాధికారులూ మిగిలారు. ఫీబస్ ఆయిద్దరికీ ఆజ్ఞలిచ్చి బయలుదేరాడు.

అశ్వికులందరూ వెళ్ళిపోయినతర్వాతకూడ ఫీబస్ కంఠం వినపడేసరికి ఎమరాల్డాకి ఆశ కలిగింది. అతడు తనను రక్షించగలడనుకుంది. "ఫీబస్! ఫీబస్!" అంటూ బిగ్గరగా పిలుస్తూ కిటికీవద్దకు వెళ్ళింది. ఫీబస్ అప్పటికే ఎడమచేతివైపు వీధిగుమ్మం దాటి పోతున్నాడు. అతడి కామె పిలుపు వినపడలేదు కాని మిగిలిన సైనికాధికారు లిద్దరూ ఆమెను చూశారు. ఆడుపులి తల్లి ఆమెపై కురికి పోదివి పట్టుకుని గది ఆ చివరకు తీసుకు పోయింది.

"ఆ! చిక్కాయిబోనులో రెండెలుకలు" అన్నాడొకడు.

ఒకడు చప్పట్లు చరిచి బాట కావలివైపున నిలబడి చూస్తున్న వాడి నొకణ్ణి పిలిచాడు. అతడి చేతిలో పెద్దతాడొకటి ఉంది.

"ఇదుగో ఈ బోనులో ఉంది మంత్రకత్తె. తీసుకుపోయి ఉరి తీసెయ్యి" అని ఆజ్ఞ ఇచ్చాడు.

రాతి ఉరిస్తంభంవైపు చూపుతూ "ఇక్కడేనా?" అని అడిగాడు.

"అవును."

అతడు లోపలికి తొంగిచూశాడు.

"ఇద్దర్లో ఎవరండి?"

"ముసల్దికాదు. పడుచుది. ఊ! త్వరగా కానీ."

కూతుర్ని గదిలో ఒకమూల కూర్చోబెట్టి తల్లి కిటికీవద్దకు వచ్చి అడ్డుగా నిలబడింది. ఆమె కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి. వస్త్రీ ఒడిసి పట్టుకోడానికి రెండు చేతులూ కిటికీలోనుంచి చాపి గోళ్లు చూపించింది తల్లి.

ఒకడు ముందుకు వచ్చి ఆమెను చూసి వెనక్కి తగ్గాడు.

"భయపడుతున్నావా దాన్ని చూసి?"

"అహాహాఁ లేదండి"

అతడు దగ్గరికి రావడం గమనించింది తల్లి.

"ఏం కావాలి?"

"నీకోసం కాదు. నీ వెనకాలుంది దానికోసం. దాన్ని మర్యాదగా అప్పగించు."

"ఇక్కడింకెవ్వరూ లేరు."

"ఉంది. నాకు తెలుసు."

"ఉంటే తీసుకెళ్లు" అంటూ ఆమె గోళ్లూ పళ్లూ చూపించింది.

"లోపలికెలా వెళ్లడం?" అన్నాడు ఒక సైనికాధికారిని చూసి.

సైనికాధికారి కిటికీవద్దకు వెళ్ళాడు. "మర్యాదగా ఆమెని విడిచిపెట్టు. నీకెందుకది?"

"అది నా కూతురు"

"నీ కూతురైతే నాకేం? ఇది రాజుగారి ఆజ్ఞ"

"రాజుగారి ఆజ్ఞ అయితే నాకేం?"

"లాభం లేదు. గోడ పడగొట్టండి."

మహాకాయు డొకడు వచ్చి ఉరితాడు అందుకున్నాడు. ఒకడు పలుగు పట్టుకువెళ్ళి కిటికీకింద ఒక్క రాయి విడగొట్టాడు. తల్లి ఇది చూసి గదిలో రోషంతో తిరగనారంభించింది. గదిలో విడిగాఉన్న ఒక నాపరాయి నెత్తి కూలీపైకి విసిరింది. కాని అది కిటికీముందే పడిపోయింది.

అప్పటికి బాగా తెల్లవారింది. రోలండ్స్ టవర్ చుట్టూ చోద్యం చూడ్డానికి గుంపు చేరింది.

తల్లి కూతురు కడ్డంగా చేతులు చాపి కూర్చుంది. కూతురు ఫీబస్ పేరే మననం చేస్తోంది. తల్లి పరిస్థితి గమనించి బిగ్గరగా అరవ నారంభించింది. ఆమె కేకలకు గ్రీవ్ చౌకు దద్దరిల్లిపోతోంది. సైని కాధికారిని చూసి అరవనారంభించింది. "నీకు బిడ్డలు లేరూ? నా బిడ్డ నీకేం హానిచేసింది. నీ బిడ్డని ఉరిదీస్తే నీ కెలా ఉంటుంది? అయినా నా బిడ్డ నెలా తీసుకుపోతావో చూస్తాను. రా. దగ్గరికి రా. నీపని పట్టిస్తాను."

కిటికీకింద రాయి ఊడిపోగానే తల్లి ఒక్క దూకులో వెళ్ళి అక్కడ అడ్డు నిలిచింది. శిధిలమైన కిటికీఅంచున తల కొట్టుకుంటూ బిగ్గరగా ఆర్తనాదం చెయ్యసాగింది.

"ఊం! లోపలికి దూకండి. దాన్ని గెంటెయ్యండి" అన్నాడు సైనికాధికారి.

తల్లి ఆఖరుసారి ప్రయత్నంచేసింది. సైనికాధికారివంక చూస్తూ తన దీన చరిత్ర విన్నవించుకుంది. పదిహేనేళ్లు ఈ కూపంలో మ్రగ్గిమ్రగ్గి చివరికి దొరికిన కూతుర్ని తీసుకుని పారిస్ నుంచి వెళ్ళిపోగలదని చెప్పింది. ఆమె దీనచరిత్ర వినేసరికి అతడి హృదయం కరిగింది. నిట్టూర్పువిడిచి మహాకాయునితో అన్నాడు: "లాభం లేదు. ఇది రాజాజ్ఞ. నీపని నువ్వు పూర్తి చెయ్యి. నేను వెళుతున్నాను" అంటూనే అతడు దారితీశాడు.

సిపాయిలు తల్లిని గెంటి గది ప్రవేశించారు. తల్లి కూతురుపై బడి గాఢంగా కౌగిలించుకుంది. కూతురు "అమ్మా!" అని బిగ్గరగా అరచి స్మృతితప్పి పడిపోయింది. సిపాయిలు తల్లిని బలవంతాన కౌగిలినుండి పెరికి యువతిని పట్టుకుని బయటికి తీసుకు వచ్చారు. మహాకాయుడు స్మృతి తప్పిన యువతిని భుజంపైన 1 వేలవేసుకున్నాడు.

ఆ సమయంలో దూరాన నాటర్ డామ్ చర్చి గోపురాలపై నుండి ఇద్దరు వ్యక్తులీ తతంగాన్ని గమనిస్తున్నారు.

మహాకాయుడామె నొక చేతపట్టుకుని మరొక చేత ఉరి తాడు పట్టుకుని ఉరిస్తంభంవైపు నడిచాడు. అక్కడొకడు స్తంభానికి ఉచ్చుగట్టి వ్రేలాడతీశాడు. స్తంభాని కొక నిచ్చెన వెయ్యబడింది. మహాకాయుడు యువతిని భుజంపైనే వేసుకుని నిచ్చెన మెట్లెక్కుతున్నాడు. రోలండ్స్ టవర్ లోనుంచి భయంకరమైన ఆర్తనాదం వినవచ్చింది. అందరూ తల లటు తిప్పి చూశారు. తల్లి తల గోడకు కొట్టుకొని నెత్తురు ధారలై కారగా స్మృతితప్పి పడిపోయింది. ఒకరిద్దరు ఆమెను సమీపించి చూశారు. ఆమె చచ్చి పడిఉంది.

# 36

కాసిమోడో గదిలో చూసి యువతిని కానక క్రోధోద్రిక్తుడైనాడు. చర్చి అంతటా వెర్రెత్తినట్టు తిరగడం మొదలుపెట్టాడు. చర్చి అదిరిపడేలా అరుస్తున్నాడు. జుట్టు పీక్కుంటున్నాడు. సరిగ్గా అదే సమయానికి సిపాయిలు చర్చి ప్రవేశించారు. సిపాయిలు యువతి సహాయం నిమిత్తం వచ్చారని భ్రమపడి చర్చిఅంతా శోధించడంలో వారి కతడు సహాయపడ్డాడు. చర్చి మూల మూలలా వెతికినా యువతి కనపడలేదు. ఆమె అక్కడుంటే తప్పకుండా సిపాయిల చేతికి అత డొప్పగించవలసి వచ్చేది. సిపాయిలు విసిగి వేసారి వెళ్ళిపోయినతరవాతకూడా కాసిమోడో వెతికిన చోటే వెతుకుతూ చర్చి అంతా నూరుసార్లు కలయతిరిగాడు. చివరికి నిరాశచేసుకున్నాడు. ఆమె అపహరించబడిందని నిర్ధరించుకుని ఒక స్తంభంవద్ద కూలబడ్డాడు. చర్చిలోనూ, చుట్టుప్రక్కలా అప్పటికి ప్రశాంత వాతావరణం ఏర్పడింది.

కొంతసేపటి కతడు లేచి మెల్లిగా గోపురమెక్కాడు. ఆమె నివసించిన గది అంత దూరంలో ఉందనగా అతడికి తిరిగి ఆశ తలెత్తింది. ఏమో! ఆమె అక్కడే క్షేమంగా ఉందేమో! లేక ఏ దేవతో ఆమె నింతవరకూ దాచి ఇప్పుడక్కడకు తిరిగి చేర్చి ఉండకూడదా! నిద్రపోతున్నదేమో! ఆమె సుఖనిద్ర పాడుచెయ్య

కూడదు అనిపించిం దతనికి. కాని తీరా వెళ్ళేసరికి ఆమె గదిలో లేకపోతే, అతడికి ధైర్యం చాలలేదు. ఉన్నచోటే గోడకు చేర బడి నిలబడ్డాడు. కొంతసేపటికి ధైర్యం తెచ్చుకుని అడుగులు వేశాడు. గది ఖాళీగానే ఉంది! తడబడుతున్న అడుగులతో వెళ్ళి పడకయెత్తి కింద చూశాడు. దుఃఖం పెల్లుబికి వచ్చింది. చరాలున లేచివెళ్ళి గోడకు గబగబ తల కొట్టుకున్నాడు. గాయాలు తగిలి నెత్తురు కారింది. స్పృహ తప్పి పడిపోయాడు.

తిరిగి మెలకువవచ్చి చుట్టూ చూశాడు. ఆమె పడుకున్న పడకను, ఆమె తిరిగిన నేలను మాటిమాటికీ ముద్దు పెట్టుకున్నాడు. కొంతసేపటికి చేతులపైనా మోకాళ్ళపైనా ప్రాకుకుంటూ గది దాటి వచ్చాడు. అవతల కూలబడి గదివైపు శూన్యదృక్కులతో చూస్తూ కూర్చున్నాడు.

యువతి నెవరపహరించి ఉంటారని క్వాసిమోడో ఆలోచించాడు. క్లాడ్ ఫ్రోలో జ్ఞప్తికి వచ్చాడు. గోపురద్వారం తాళం చెవి అతడి ఒక్కడిదగ్గరే ఉంది. యువతిని క్లాడ్ బలాత్కరించడం క్వాసిమోడో ప్రత్యక్షంగా చూసినదే. క్లాడ్ ఫ్రోలో ఆమె నపహరించాడని రూఢి పర్చుకున్నాడు. అయితే అతడికి క్లాడ్ పైన అసూయగాని క్రోధంగాని కలగలేదు. ఇద్దరిపట్లా అతడికి జాలి కలిగింది. జరిగినదానికి దుఃఖం కలిగింది.

అప్పటికి తెల్లవారుతోంది. ఆ సమయంలో గోపుర సోపానాలపైన అలికిడయింది. క్వాసిమోడో అటు చూశాడు. క్లాడ్ మెల్లిగా మెట్లెక్కి వస్తున్నాడు. అతడి ముఖం భయంకరంగా ఉంది. ప్రక్కనే నిలబడిన క్వాసిమోడోనికూడా అతడు గమనించలేదు. తిన్నగా మెట్లెక్కి గోపురం మీద్దపై నిలబడ్డాడు.

అతడి ఆకారాన్ని చూసి క్వాసిమోడో కొంతసేపు ప్రాన్పడిపోయాడు. తరవాత మెల్లిగా క్లాడ్ వెళ్ళినదారినే అనుసరించాడు. అతడి హృదయంలో ఏమి జరుగుతుందో అనేభీతి, కోపం ఉబికి వచ్చాయి. మెట్లచివర నిలిచి క్లాడ్ వంక చూశాడు. తరువాత అత డేదిక్కుగా చూస్తున్నాడో గమనించాడు. అడుగులు చప్పుడు కాకుండా వెళ్ళి క్లాడ్ వెనుక నిలబడ్డాడు. క్లాడ్ ఏకాగ్రదృష్టితో ఒకేచోట చూస్తున్నాడు.

వేసవి ఉదయాన గోపురశిఖరంపైనుంచిమాస్తే పారిస్ నగరం అతిరమ్యమై కనపడుతుంది. అప్పుడది జూలైమాసం. ఆకాశం నిర్మ

లంగా ఉంది. పడమటి అంచుపైన తారకలు అప్పుడే వెలుగులో అంతరిస్తున్నాయి. అప్పుడే సూర్యభగవానుడు ఉదయాద్రిపై వెలుగుతున్నాడు. పారిస్ నగరం మేల్కొని ఒళ్లు విరుచుకున్నట్లుంది. మెల్లిగా చల్లనిగాలి వీస్తోంది.

నాటర్ డామ్ చర్చిముందు దూలం పేరుకొన్న సీసపుముద్దలు రక్తం చూసి జనం అక్కడ మూగుతున్నారు. గ్రీవ్ చౌకులో ఉరి స్తంభంవద్ద చాలమంది జనం పోగైనారు. శవాల నప్పుడే సీన్ నదిలో పారవేశారు.

క్లాడ్ దృష్టి ఉరిస్తంభంపైనే లగ్నమైఉంది. యువతి నప హరించి ఏం చేశాడో అడిగి తెలుసుకోవాలని క్వాసిమోడో తహ తహలాడుతున్నాడు. చావుబ్రతుకుల మధ్య ఏదో తేల్చుకోవలసిన సమయం ఆసన్నమైనట్లు క్లాడ్ ప్రాణమంతా కళ్ళలోకి తెచ్చుకుని చూస్తున్నాడు. ఆ చివర మిద్దెపైన ఒక శిల్పంఉంది. ఆ శిల్పంపై ఒక కాలూని నిలబడ్డాడు క్లాడ్. అతడి భంగిమ, ముఖ వికారం చూసి క్వాసిమోడో కంపించిపోయాడు. అతడుకూడా గ్రీవ్ చౌకువంక చూశాడు. అదే సమయానికి ఉరిస్తంభానికి వేయ బడిన నిచ్చెన మెట్లెక్కుతున్నాడు మహాకాయుడు. అతడి భుజంపై తామరతూడువలె ఒక యువతి వ్రేలాడుతోంది. క్వాసి మోడో కన్ను పొడుచుకుచూశాడు. జిప్సీ యువతిని గుర్తించాడు.

యువతి మెడకు ఉచ్చు తగిలించబడింది. క్లాడ్ మరింత ముందుకు వంగిచూశాడు.

మహాకాయుడా యువతిమెడకు ఉచ్చు తగిలించి నిచ్చెన దిగాడు. దిగి వెంటనే నిచ్చెననొక్క తాపు తన్నాడు. ఉచ్చు గిర గిర తిరిగింది. ఉచ్చులో యువతి విలవిల తన్నుకుంది.

క్లాడ్ కనుగ్రుడ్లు గిరగిర తిరిగాయి. అతడి కంఠంనుండి భయంకరాట్టహాసం వినవచ్చింది. అది ఒక రాక్షసుడు నెత్తురు త్రాగి వికటాట్టహాసం చేసినట్లుంది. క్వాసిమోడోకి నవ్వు విన పడలేదు కాని అతడి ముఖభంగిమ గమనించాడు. క్వాసిమోడో కోపంతో గ్రుడ్డివాడైనాడు. ననకొక అడుగువేసి ఆపైన ముందుకు లంఘించి క్లాడ్‌ని ఒక్కతోపు తోశాడు. క్లాడ్ భయంతో ఆర్తనాదం చేశాడు. పడిపోతూ నీరుపోయే గొట్టాన్ని గట్టిగా పట్టుకున్నాడు. పట్టుకుని అరవబోయాడు. పైకి చూసే సరికి క్వాసిమోడో భయంకరాకృతి కనపడింది. క్రిందికి చూశాడు.

అగాధమంత క్రిందున రాజమార్గంలో జనులు అవగింజల్లా కనపడు తున్నారు. మధ్యలో అక్కడక్కడ శిల్పాలు గోడలలోనుంచి మెడలు చాచి కబళించడానికి సిద్ధంగా ఉన్నట్లు కనపడ్డాయి. వాటిపై పడితే తల బ్రద్దలుకాక తప్పదు. అవి తప్పినట్లయితే నేలపై పడి ప్రాణం అంతరించక తప్పదు. మెల్లిగా గొట్టం పట్టుకుని పైకి ప్రాకడానికి క్లాడ్ ప్రయత్నించాడు. కాని చేతులలో సత్తువ చాలలేదు. విలవిలలాడుతున్న అతడి కాళ్లు శిల్పాలకి కొట్టు కుని గాయాలు తగులుతున్నాయి.

క్వాసిమోడో చేయి అందిస్తే క్లాడ్ అందుకోగలిగేవాడే. కాని అతడు చేయి అందివ్వలేదు. క్వాసిమోడో చావులోకి చూశాడు; యువతిని చూశాడు; ఉరిస్తంభం చూశాడు. అతడి దృష్టి అక్కడే నిలిచింది.

క్లాడ్ పట్టు గట్టిగా దొరక్క ప్రయాసపడుతున్నాడు. సీసపు గొట్టం వొంగడం మొదలుపెట్టింది. ఒకసారి కిందికి చూశాడు. తరవాత పైకి చూశాడు. చూడగానే భయంతో కళ్లు మూసు కున్నాడు. మరొక క్రూర శిలావిగ్రహంలా క్వాసిమోడో స్తంభి తుడై శిలావిగ్రహంపైనుండి చూస్తున్నాడు. అతడి కంటినుండి నీరు ధారలు కట్టింది. క్లాడ్ ప్రయత్నించినకొద్దీ గొట్టం వొంగి బీటలువారసాగింది.

క్రింద వీధిలో కొందరు జనం ఆగి నాటర్ డామ్ చర్చి గోపురంపైన ఈ విశేషం అర్థంకాక తేరిపార చూస్తున్నారు.

"అదేమిటది! పొద్దున్నే అదేం సరదా! ముసలాడికి పిచ్చి క్కివట్టుంది. అది పట్టుకు వేళ్లాడుతున్నాడు. చెయ్యిజారిందంటే కిందపడి చావవలసిందే" అనుకుంటున్నారు.

క్లాడ్ బలంగా గొట్టంపట్టుకుని శరీరాన్ని పైకి లేవనెత్తాడు. గొట్టం పుటుక్కున విరిగింది. వెర్రికేకతో పడిపోయాడు క్లాడ్. క్వాసిమోడో చూస్తూ ఊరుకున్నాడు. క్లాడ్ తలక్రిందులుగా పడ్డాడు. వీధిలో మధ్యగా పడ్డాడు. పడి మరి కదలలేదు. క్వాసి మోడో పడినంతవరకూ అతణ్ని చూసి తరువాత తలెత్తి చావులో ఉరిలో నిర్జీవియై వేలాడుతున్న యువతిని చూశాడు. "ఇంక నాకీలోకంలో ఏమీలేదు" అనుకున్నాడు క్వాసిమోడో.

# 37

ఆ రోజే సాయంకాలం మతాధికారులు వచ్చి క్లాడ్ శవాన్ని తీసుకుపోయారు. అప్పుడు క్వాసిమోడో మాత్రం చర్చిలో కనపడలేదు. ఈ విషయమై నగరంలో అనేక ప్రవాదాలు వ్యాపించాయి క్లాడ్ మరణించగానే అతడి ఆత్మ నపహరించి క్వాసిమోడో రూపంలో వేచిఉన్న సైతాన్ అంతర్థానమైనాడని కొందరన్నారు. ఈ కారణంవల్ల బిషప్ క్లాడ్ ఫ్రాలోని సమాధి చెయ్యలేదు.

మహారాజు పదకొండో లూయీ మరుచటి సంవత్సరమే ఆగస్టులో చనిపోయాడు.

గ్రింగైర్ మేకను కాపాడుకుని ప్రసిద్ధ కవీశ్వరుడైన ఖ్యాతి తెచ్చుకున్నాడు. అన్ని విద్యలూ నేర్చి పొట్ట పోషించుకోలేక తిరిగి నాటక రచనలోపడి ఖ్యాతి తెచ్చుకున్న గ్రింగైర్ అది విధి విలాసం అన్నాడు. కెప్టెన్ ఫీబస్ కూడా బలీయమైన విధికి తలొగ్గక తప్పలేదు—అతడు వివాహం చేసుకున్నాడు.

క్లాడ్ చనిపోయినరోజున క్వాసిమోడో నాటర్ డామ్ చర్చిలో కనపడలేదు. ఆతరువాతకూడా అతడు మనిషికంట పడలేదు.

ఎస్మరాల్డాను ఉరితీసిన రోజున, ఆమెను రోజంతా అలాగే ఉంచి రాత్రికి ఆమె శవాన్ని ఆచారంప్రకారం మాంట్ ఫాంసూ ప్రేతభూమికి తీసుకుపోయారు. మాంట్ ఫాంసూ ఆ కాలంలో ప్రసిద్ధిచెందిన ప్రేతభూమి. అక్కడ నిర్మించబడిన కట్టడం విలక్షణమైనది. చిన్న గుట్టపైన కట్టబడినందువల్ల అది నగరంలో చాలా దూరానికి కనపడుతుంది. ఆ గుట్టపైన పదిహేనడుగుల ఎత్తున నలభై అడుగుల పొడవున ముప్పై అడుగుల వెడల్పున చతుర్భుజాకారంలో ఒక పెద్దవేదిక నిర్మించబడింది. దానిపై పదహారు రాతి స్తంభాలపైన పైకప్పు నిర్మించబడింది. పైకప్పునుంచి ఇనపగొలుసులనేకం వేలాడగట్టబడినాయి. ఉరితీయబడిన వారి నీ గొలుసులకు వేలాడదీస్తారు. వేదిక దిగువన రెండు పెద్ద ఉరి స్తంభాలు, ఒక పెద్ద రాతిసిలువ నిర్మించబడినాయి. ఆ కప్పుపై ఎప్పుడూ కాకులు విహారం చేస్తూఉంటాయి.

పదిహేనో శతాబ్దం ఆఖరు దశకే ఈ బ్రహ్మాండమైన వికృత సమాధి శిథిలావస్థకు వచ్చింది. గొలుసులు తుప్పుపట్టాయి. దూలాలు చీకి చెదలుపట్టాయి. వేదికపై గడ్డి మొలిచింది. ప్రేతాలు సంచరించే ప్రదేశమనే భీతివల్ల ప్రజ లీవంక తొంగిచూడరు. వేదికపై ఒకప్రక్క శిథిల కంకాళాలు కొన్ని గుట్టగా పడిఉన్నాయి. ఎందరెందరో ద్రోహులు, క్రూరులు దుష్టులు, అమాయకులు స్త్రీలు పురుషులు తమ అస్థికలని వేదికకు సమర్పించారు.

తన అపూర్వ సౌందర్యంతో పారిస్ నగరవాసులను సమ్మోహపరిచిన యువతి ఎస్మరాల్డా ఉరితియ్యబడిన రెండేళ్ళకు ఈ వేదిక పరిశోధించబడింది. ఆ సమయంలో ఒకే గొలుసుకు వ్రేలాడుతున్న రెండు అస్థిపంజరాలు వింతగొలిపాయి. ఒకటి ఒక స్త్రీది, అక్కడక్కడ చీకిన గుడ్డపేలికలా ఎముకలనుబట్టి వ్రేలాడుతునాయ్ను. మెడలో మాత్రం రంగు రంగుల పూసలహారం వ్రేలాడుతోంది. ఆ అస్థిపంజరాన్ని కౌగలించుకుని మరొక అస్థిపంజరం కనపడింది. అదొక పురుషుని కంకాళం. ఒక కాలు మరొక కాలు కంటె పొట్టి. వెన్నువంగి అతను గూనివాడని తెలుపుతోంది. అతడి మెడ చూస్తే ఉరితియ్యబడలేదని స్పష్టమయింది. అక్కడకు వచ్చి ఆ స్త్రీ పరిష్వంగంలోనే మరణించి ఉంటాడు. ఆ అస్థిపంజరాలను తాకగానే ఎముకలు పొడిపొడైపోయి రూపం అంతరించింది.

(సమాప్తం.)

# విక్టర్ హ్యూగో

విక్టర్ హ్యూగో పంతొమ్మిదవ శతాబ్దానికి చెందిన ప్రసిద్ధ ఫ్రెంచి రచయిత. హ్యూగో నాటకాలూ, నవలలు ఫ్రెంచి సాహిత్యంలో నాటి నూత్న చైతన్యాన్ని ప్రతిబింబింప చేస్తాయి. సాంప్రదాయ స్థితమైన సాహిత్యం అప్పటికి వెనుకబడి రొమాంటిక్ సాహిత్యం ఉత్కృష్ట దశలోకి వచ్చింది లూయీ నెపోలియన్ పరిపాలన నెదిర్చి తిరుగుబాటు చేసిన వీరులలో హ్యూగో ఒకడు. తిరుగుబాటు అనంతరం ఛానెల్ ద్వీపాలలో గడిపిన ప్రవాస కాలం అతనికి రచన కుపయోగపడింది. 1870 సంవత్సరంలో తిరిగి పారిస్ వచ్చాడు జాతీయ శాసనసభకు ఎన్నుకోబడ్డాడు. అప్పటికి హ్యూగో ఖ్యాతి ఖండఖండాంతరాలకు వ్యాపించింది. 1885 మే 22 వ తేదీన హ్యూగో మృతి చెందాడు. అప్పుడు దేశం అతనికి అసమానమైన గౌరవమర్యాదలతో అంత్యక్రియలు జరిపింది.

"ఘంటారావం" అను శీర్షికతో తెనుగు పాఠకలోకానికి సమర్పించబడుతున్న "హంచ్‌బాక్ ఆఫ్ నాట్రడామ్" అను నవలలో విక్టర్ హ్యూగో 15-వ శతాబ్దపు సాంఘిక రాజకీయ వ్యవస్థను కళ్లకు కట్టినట్లు చిత్రిస్తాడు. మానవ ప్రకృతిలోని సహజ సౌందర్యాన్ని ఒకవంక చిత్రిస్తూ, సామాజిక జీవనంలో మూఢ విశ్వాసాలవల్ల ఉత్పత్తిల్లే వికృత పరిణామాలను దుర్ఘటనలను మరొకవంక నిరూపిస్తాడు. ఆనాటి ఫ్రెంచి శిక్షాస్మృతిలోని అమానుషమైన శాసనాలకు లోబడి సామాన్య ప్రజానీకం ఎలా శిక్షింపబడిందో, మనుష్యుల మానుష జీవనానికి ఎంతటి అపకృతి జరిగిందో నిరూపిస్తాడు. క్రైస్తవ మతానుయాయుల అకృత్యాలకు క్రైస్తవాత్మ దేవాలయ ఘంటానినాదంతో శ్రుతిగలిపి ఘోషిల్లుతున్నదని యూరప్ ఖండానికంతటికి చాటాడు హ్యూగో. ఈ నవలను ఆంధ్రదేశానికి అందచేయగలుగుతున్నందుకు ఆనందిస్తున్నాం.

